# పోషకులు

మ. రా. శ్రీ వంశ్రాజు వీర్రాజుగారు, కాకినాడ

మ. రా. శ్రీ కొవ్వూరి వేంకటరెడ్డిసోదరులు, పిట్టలవేమవరం

మ. రా. శ్రీ కర్రి పల్లారెడ్డిగారు, మారుటేరు.

మ. రా. శ్రీ తేతల గంగిరెడ్డి సోదరులు, రంగూన్.

మ. రా. శ్రీ అర్జి పెంటయ్యగారు, నరసాపురము.

మ. రా. శ్రీ టి. యల్ నరసింహారావుగారు, మారుటేరు.

మ. రా. శ్రీ రామదేవు ఆదినారాయణగారు, రంగూన్.

మ. రా. శ్రీ మామిడి ఆదినారాయణగారు, రంగూన్.

మ. రా. శ్రీ కర్రి వేంకటరెడ్డిగారు, రంగూన్.

మ. రా. శ్రీ చిర్ల అమ్మిరెడ్డిగారు, రంగూన్.

మ. రా. శ్రీ చిత్తూరు నారాయణస్వామిగారు, రంగూన్.

మ. రా. శ్రీ సి. హెచ్. వి. సుబ్బారెడ్డిగారు, మారుటేరు.

మ. రా. శ్రీ పులగం వెంకన్నగారు, మారుటేరు.

# ఉపోద్ఘాతము

ఈమాతృమందిరము భౌతికప్రపంచమునం బ్రతిబింబించుచున్న భావనాప్రపంచమునందలి పవిత్రచిత్రమందిరము. ఇందలి ప్రబోధానందస్వామి స్వాభావికస్వరూపముచే సాక్షాత్కరించుచు

## రాజపోషకులు

మ. రా. శ్రీ గుత్తుల నాగయ్యగారు, శానపల్లిలంక.
అమలాపురం తాలూకా, గోదావరి జిల్లా.

ద్దేశముచేతనె మమీ కార్యమునకుం గడంగితిమి. ఆధ్యాత్మా భిమానులగు మాసోదరులందఱును మా కార్యమునందలి మంచిచెడ్డలమాట యెట్లున్నను మా యుద్దేశమాత్రము సమంజసమైనదనినైన గ్రహింపఁగలిగినచో మేము కృతార్థులమగుచున్నారము. ఆయానందమే మమ్మెల్లవిధములఁ గార్యదీక్షాపరతంత్రులం గావించి పురోభిగమనమునకుం బ్రోత్సాహముం గూర్పఁగలదని విశ్వసించుచున్నారము.

# పోషకులు

మ. రా. శ్రీ వంశ్రాజు వీర్రాజుగారు, కాకినాడ

మ. రా. శ్రీ కొవ్వూరి వేంకటరెడ్డిసోదరులు, పిట్టలవేమవరం

మ. రా. శ్రీ కర్రి పల్లారెడ్డిగారు, మారుటేరు.

మ. రా. శ్రీ తేతల గంగిరెడ్డి సోదరులు, రంగూన్.

మ. రా. శ్రీ అర్జి పెంటయ్యగారు, నరసాపురము.

మ. రా. శ్రీ టి. యల్ నరసింహారావుగారు, మారుటేరు.

మ. రా. శ్రీ రామదేవు ఆదినారాయణగారు, రంగూన్.

మ. రా. శ్రీ మామిడి ఆదినారాయణగారు, రంగూన్.

మ. రా. శ్రీ కర్రి వేంకటరెడ్డిగారు, రంగూన్.

మ. రా. శ్రీ చిర్ల అమ్మిరెడ్డిగారు, రంగూన్.

మ. రా. శ్రీ చిత్తూరు నారాయణస్వామిగారు, రంగూన్.

మ. రా. శ్రీ సి. హెచ్. వి. సుబ్బారెడ్డిగారు, మారుటేరు.

మ. రా. శ్రీ పులగం వెంకన్నగారు, మారుటేరు.

# ఉపోద్ఘాతము

ఈమాత్మమందిరము భౌతికప్రపంచమునఁ బ్రతిబింబించుచున్న భావనాప్రపంచమునందలి పవిత్రచిత్రమందిరము. ఇందలి ప్రబోధానందస్వామి స్వాభావికస్వరూపముచే సాక్షాత్కరించుచు

## రాజపోషకులు

మ. రా. శ్రీ గుత్తుల నాగయ్యగారు, శానపల్లిలంక.
అమలాపురం తాలూకా, గోదావరి జిల్లా.

ద్దేశము చెలిన మమి కార్యమునకుఁ గడంగితిమి. దేశభాషా భిమానులగు మాసోదరులందఱును మా కార్యమునందలి మంచిచెడ్డల మాట యెట్లున్నను మాయుద్దేశముమాత్రము సమంజసమైనదనియైన గ్రహింపఁగలిగినచో మేము కృతార్థులమగుచున్నారము. ఆయానందమే మ మ్మెల్లవిధములఁ గార్యదీక్షాపరతంత్రులం గావించి పురోభిగమనమునకుఁ బ్రోత్సాహముం గూర్పఁగలదని విశ్వసించుచున్నారము.

అక్షరరూపవిలసితం బగు నీమాతృమందిరము—మాతృదేశమగు మాతృమందిరము నవనవానందవిలసిత మగుచున్నయిక్కాలమున నవనవోన్మీలితనయనసన్నిధానమునఁ బ్రదర్శింపఁబడినది. ఆంధ్రసోదరు లందఱు నీపరమార్థమును గ్రహించి మాతృదేశము నానందమందిరముగఁ జేసికొనుట కెల్లవిధముల స్వధర్మనిరతులై ప్రయత్నించెదరుగావుతమని నిరంతరము నాకాంక్షించుచున్నారము.

వేంకట పార్వతీశ్వరకవులు.

## సూచిక.

---

ఆంధ్రవిదుషీరత్నములగు మాసోదరీమణులలో నెవ్వరైన నస్వకపోలకల్పితంబులగు సాంఘిక సాంసారిక చారిత్రికాదిపద్ధతుల ననుసరించి రచియించిన నవలలను మాకంపినచో వందనపూర్వకముగ నందుకొని గ్రంథగుణగౌరవముల ననుసరించి బహుమానపురస్సరముగఁ బ్రకటింపఁదలంచియున్నారము.

అ. లక్ష్మణస్వామి,

అధ్యక్షుఁడు.

# విజ్ఞప్తి

ఆంధ్రమహాజనులారా!

దేశభక్తి పూరితమగు నీమాతృమందిరము నాంధ్రపరిచారిణీ గ్రంథనిలయమున కిరువదినాలుగవపుష్పముగఁ బ్రకటించితిమి. దేశభాషాభిమానులసమాదరప్రోత్సాహములచే నింకను నిట్టియుత్పాద్యంబులును, దేశభక్తివిలసితంబులు నగునవలలను గ్రమక్రమముగఁ బ్రకటింపవలయు నని ప్రయత్నించుచున్నారము. ఈగ్రంథనిలయము రాజమహేంద్రవరమునకు మార్పఁబడినది మొదలుగ నీయుద్యమమునందలియభిమానముచే స్వార్థత్యాగబుద్ధితోఁ బాటుపడి పనిచేయుచు నీనిలయమున కైదాఱువందలమంది చందాదారులను గూర్చుటయే కాక యైదుగురు రాజపోషకులను, బదుముగ్గురుపోషకులనుజేర్చి నిరంతరమును నిలయాభివృద్ధినే కాంక్షించుచు మాయుద్యమమున కెల్లవిధములఁ బ్రోత్సాహముం గూర్చుచున్న దేశభాషాభిమానమాననీయులును, సత్కార్యదీక్షాపరాయణులును నగు మ. రా. రా. శ్రీ కాలనాథభట్లలక్ష్మీనారాయణసోమయాజులుగారికి మాకృతజ్ఞతాభివందనము లాచరించుచున్నారము.

ఈగ్రంథనిలయమునకు రాజపోషకు లగుటయేగాక నిలయమునం దభిమానముచే మఱియునురాజపోషకులను బోషకులను జేర్పించి నిలయాభివృద్ధి కెల్లవిధములఁ జేయూఁతనొసంగి దేశభాషాభిమానములఁ గార్యరూపమునఁ బ్రదర్శించుచున్న మన్మిత్రులగు శ్రీయుత కర్రిచినవేంకటరెడ్డిగారికి మేమెల్లవిధములఁ గృతజ్ఞులమైయున్నారము.

రంగూన్ ప్రధానన్యాయస్థానమున భాషాంతరీకరణోద్యోగులుగానుండి ఆంధ్రమహాజనసంఘసభ్యులుగనున్న మ. రా. శ్రీ కే. ముత్యాలశెట్టిగారును, మ. రా. శ్రీయుత మ్. సుబ్రహ్మణ్యముగారును

మాయుద్యమమునకుఁ బ్రోత్సాహకరముగ రంగూను నగరమున నమూల్యమగు సాహాయ్యముం జూపుటయే కాక నిలయాభివృద్ధి శుభకారకముగ నొకనాటకప్రదర్శనమునకు వచ్చునాదాయమునొసంగెదమని తమయుదారప్రేమభావమును వెల్లడించి వాగ్దానముం గావించియున్నారు. ఇట్టి దేశభాషాభిమానమాననీయులగువారికిఁ బరమేశ్వరుఁ డాయురారోగ్యము లొసంగి యింకను నిట్టిసత్కార్యములం గావించు సత్స్వభావము నొసంగుఁగావుతమని సర్వేశ్వరుని బ్రార్థించుచున్నారము.

శ్రీపీఠికాపురాధీశ్వరునియుదారసాహాయ్యమున బొంబాయి చిత్రకళాశాలయందు విద్యాభ్యాసముంగావించుచున్న రాజమహేంద్రనగరనివాసులగు శ్రీయుత చేమకూర భాష్యకారులుగారీమాతృమందిరమునందలిచిత్రపటముల యథానుకూలముగనతిమనోహరముగ వ్రాసియిచ్చి తమమాతృదేశమునందలిచిత్రరచనాలోపమునుదీర్చియున్నారు. ఇట్టిచిత్రలేఖనానిపుణులగువీ రింకనునామహారాజుసాహాయ్యముచే విద్యాభివృద్ధిఁగాంచి యాంధ్రదేశమునందే కాక భారతవర్షమునందంతటను ప్రసిద్ధచిత్రకళావిశారదులుగ వన్నెకెక్కునట్లు జీవదయాపరుఁడగు పరమేశ్వరుఁడు వీరి నాశీర్వదించుఁగాక!

మాయుద్యమమున కెల్లవిధములఁ దోడుపడుచు నిలయమునెడలఁ బరమాదరాభిమానములంజూపుచున్న మారాజపోషకులును, పోషకులును, చందాదారులును, భాషాభిమానులగు నాంధ్రసోదరులందఱును భాషాసేవసేయుచున్న యీగ్రంథనిలయమున కితోధికాభ్యుదయపరంపరలంగూర్చెదరుగాకయని నమ్ముచున్నారము.

వేంకట పార్వతీశ్వరకవులు.



# శ్రీరామచంద్ర.

## అనుస్మరణము

శ్రీనిధానంబు, నిర్మల ♦ ప్రేమధాని,
శాంతిధామంబు, సౌఖ్యవి ♦ శ్రాంతిసీను,
జ్ఞానధనపేటి, నిస్తులా ♦ నందవాటి
మాకు ముమ్మాటికిని మాత్ర ♦ మందిరంబె.

---

నారదబ్రహ్మ దివ్యవీ ♦ ణాముఖమున
నభినవప్రేమరస మొల్క ♦ నట్టిచోటు;
తపసి వాల్మీకి కవితామృ ♦ తస్రవంతి
నాదికావ్యంబుఁ దేలించి ♦ నట్టిచోటు;
మహితవిజ్ఞానధనులైన ♦ మౌను లెల్ల
నాగమాంభోధి మథియించి ♦ నట్టిచోటు,
నరుఁడు తరియింపఁ గరుణించి ♦ పరమపురుషుఁ
డాత్మతత్త్వంబు బోధించి ♦ నట్టిచోటు,
అజ్ఞులకు విజ్ఞులను జూపు ♦ నట్టిచోటు,
అనదలకు నాథ్యులను జూపు ♦ నట్టిచోటు,
అన్నలకుఁ దమ్ములను జూపు ♦ నట్టిచోటు,
అందఱకు నాత్మనిలయమై ♦ నట్టిచోటు,

చనవు గలచోటు, ప్రేమచేఁ ♦ దనరుచోటు
మహితమహిమాన్వితము మాతృ ♦ మందిరంబె.

* * * * *

జనని ! నీసన్నిధియె మాకు ♦ స్వర్గలోక
మమ్మ ! నీమాట మాకు వే ♦ దాక్షరంబు
తల్లి ! నీసేవయే మాకుఁ ♦ దారకంబు
మాత ! నీప్రేమ మాకాత్మ ♦ మంగళంబు—
అడుగుఁదమ్ముల మడుఁగులై ♦ యంబునిధులు
నిన్ను సేవించుచున్నవి ♦ కన్నతల్లి !
అమృతపూర్ణకుంభంబులై ♦ యంబుదములు
నిన్నుఁ దేలించుచున్నవి ♦ కన్నతల్లి!
కేళికాసౌధసీమలై ♦ శైలతతులు
నిన్ను నలరించుచున్నవి ♦ కన్నతల్లి!
తావిక్రొవ్విరిసజ్జలై ♦ తీవగములు
నిన్నుఁ బూజించుచున్నవి ♦ కన్నతల్లి!
దివ్యగంధంబులై కమ్మ ♦ తెమ్మెరలును
నిన్ను మెప్పించుచున్నవి ♦ కన్నతల్లి!
రమ్యదీపంబులై దివ్య ♦ రత్నములును
నిన్ను వెలయించుచున్నవి ♦ కన్నతల్లి!
పక్వఫలభాజనంబులై ♦ పాదపములు
నిన్నుఁ దనియించుచున్నవి ♦ కన్నతల్లి!
భావగీతంబులను సర్వ ♦ జీవతతులు
నిన్నుఁ గీర్తించుచున్నవి ♦ కన్నతల్లి!
అఖిలలోకలోకేశ్వరి ♦ వైననీదు

కొలువు చేరనివా రెందుఁ ♦ గలరు తల్లి!—
జనని! నీసేవ లేక జీ ♦ వనము లేదు;
తల్లి! నీప్రాపు లేక స్వా ♦ స్థ్యంబు లేదు;
అమ్మ! నీపెంపులేక సౌ ♦ ఖ్యమ్ములేదు;
దేవి! నీదయ లేక యే ♦ దియును లేదు—

కష్టదుస్తరగహనమా ♦ ర్గముల నలసి,
కరుణరసవాహినీతరం ♦ గముల నీఁది,
విలులితాశాప్రభంజన ♦ ములను గూలి,
ఘనతరాభిమతాద్రిదు ♦ ర్గములఁ బ్రాఁకి
తిరిగితిమి గాని యుండాఁకఁ ♦ దెలివి దప్పి
నిన్నెఱుఁగఁజాల మైతిమో కన్నతల్లి!
ఇష్టవస్తువు లెల్ల నీ ♦ విచ్చుచుండ
నందికొనఁజాల మైతిమో ♦ యఖిలజనని!
నిష్ఠురనినాదములను సం ♦ గీతరవము
వినఁబడునఁటమ్మ నీచెంత ♦ విశ్వజనని!
తీవ్రకోపాగ్నిలో శాంత ♦ దీపకళిక
కనఁబడునఁటమ్మ నీపొంతఁ ♦ గన్నతల్లి!
అనుపమప్రేమభిక్షంబు ♦ నందఁగోరి
వెడలి వచ్చితి మమ్మ నిన్ ♦ వెదకికొనుచు
నాత్మసంతాన మైన మ ♦ మ్మాదరించి
దేవి! కరుణించి యాశీర్వ ♦ దింపు మమ్మ!—

* * * * *

తల్లి! నిన్నుఁ దలంచి ♦ ధర్మంబుఁ దలఁచి
కష్టంబు సుఖములోఁ ♦ గడపి వచ్చితిమి.

శౌర్యవృత్తిఁ జరింపఁ ♦ జాలఁగాలేక
యాఁకలిఁ దృప్తిలో ♦ నడఁచి వచ్చితిమి
పరుషభాషణములు ♦ పలుకఁగాలేక
క్రోధంబు శాంతిలోఁ ♦ గూల్చి వచ్చితిమి
దయ దప్పి రక్తపా ♦ తము చేయలేక
వైరంబు మైత్రిలో ♦ వదలి వచ్చితిమి
ఆశాపరిలోభాప్తి ♦ నల్లాడలేక
మమతను సమతలో ♦ మడఁచి వచ్చితిమి
జయ సుధామయసూక్తి! ♦ జయదివ్యశక్తి!
జయ సర్వజనయిత్రి! ♦ జయ జగద్ధాత్రి!
ఆదిశక్తివి నీవ ♦ నాదివి నీవు
విద్యానిధివి నీవ ♦ విద్యవు నీవు
వరదాయినివి నీవు ♦ వాంఛవు నీవు
దైవతంబవు నీవు ♦ తల్లివి నీవు
నీవె మాదిక్కని ♦ నెమ్మది నమ్మి
నిన్నుఁ జేరితి మమ్మ ♦ నిత్యకళ్యాణి!—
ఆపగావళులలో ♦ నమృతంబు నించి,
ఫలపుష్పములు వన ♦ స్పతులఁ గల్పించి,
భూరికేదారభూ ♦ ములను బండించి,
సకలదేశంబుల ♦ సర్వస్వ ముంచి,
యాత్మసంతతులలో ♦ నైక్యంబుఁ బెంచి
మాకోర్కు లీడేర్పు ♦ మా! కన్నతల్లి!—
వేయిగన్నులతల్లి ♦ వేల్పులతల్లి
పాడిపంటలతల్లి ♦ బంగారుతల్లి

సింగారములతల్లి ♦ సిరిగలతల్లి
కడుపుచల్లనితల్లి ♦ గారాలతల్లి
మెత్తిపెంచినతల్లి ♦ హితమైనతల్లి
పేరుమోచినతల్లి ♦ ప్రియమైనతల్లి
పలుకుదీయనితల్లి ♦ పాలించుతల్లి
సైరణగలతల్లి ♦ ససిగలతల్లి
సౌభాగ్యములతల్లి ♦ చనవైనతల్లి
సంసారములతల్లి ♦ చల్లనితల్లి
పిల్లలుగలతల్లి ♦ పెద్దలతల్లి
తల్లులఁగనుతల్లి ♦ తండ్రులతల్లి
కనికారములతల్లి ♦ కన్నబిడ్డలము
మమ్ముఁ బాలింపవే ♦ మాకన్నతల్లి !



# అనుబోధము

చివురు దినుము; పాడుము; మఱి
చివురులు వెట్టింపు; మలరఁ జేయుము వనమున్;
నవనవగీతాచాతురి
మివ్వుల మరల మరలఁ బాడుమీ కోకిలమా!

"కోకిల — హారావళి"

---

సాయంసమయమున సంధ్యారాగవిలసితంబగు సహకారతరుపల్లవనేపథ్యమునం దుండి వసంతకోకిల రాగమంజరియై తనకోమలకలకుహూస్వరంబునఁ బ్రేమగీతముల నాలాపించుచుండెను. ఆమధురమోహనకలకంఠగానమున కనుగుణంబుగా రాగరంజితంబులగు గౌతమీపావనసలిలతరంగములు సవిలాసముగ లయనెఱపుచుండెను. వాయుతరంగవాహిని యగు నామోహనగానకళాసరస్వతి భూనభోంతరముల నానందప్రతిధ్వనితములుగఁ జేయుచుండెను. అరుణకిరణప్రసారంబున మఱియునురాగరసరంజితంబు లగు తరుణారుణపల్లవము లామోహనరాగానుభవంబునఁ గరఁగిపోవుచున్నట్లుండెను. అప్పుడు ప్రణయమయి యగు ప్రకృతిమాత ప్రశాంతభావంబున నాత్మావలోకనముం గావించుకొనుచు నానందముగ్ధయై యుండెను.

గోదావరీమంజుల తరంగకంకణ స్వనంబులు మావీనులవిందు సేయుచునే యున్నవి. శీతలజలశీకరసమాకలితంబు లగువాతపోతములు మా మేనులం బులకింపఁజేయుచునే యున్నవి. కోమలసహకారకుసుమసౌరభములు మాఘ్రాణములం దనియించుచునే యున్నవి. స్వభావమధురమోహనవిలాసమూర్తి యగునానందప్రకృతి మా కన్నులయెదుటనే యున్నది. పావనప్రేమకును బరమసౌందర్యమునకును సమ్మేళన మైనది — అస్పష్టముగ — అతిమృదులముగ — అవ్యక్తముగ — అపరూపముగ — సమశ్రుతిసంకలితములై యేకీకృతంబు లగుమాహృదయవీణాతంతువులనుండి మోహనరాగంబునఁ బ్రేమగీతస్వనంబులు వెలువడి యామధురమోహనకలకంఠప్రేమగీతనిస్వనంబుల విలీనంబు లగుచుండెను. అప్పుడు ప్రేమసౌందర్యముల కానందానుభవ మయ్యెను. మేమును నానందమగ్నుల మైయుంటిమి.

సంజకెంజాయ లెప్పుడీయనంతనీలాకాశమున విలీనములై పోయినవో మరల నెప్పుడీగౌతమీతరంగిణి యుదయచంద్రికారాగరంజితయై ప్రకృతికాంతతో వసంతము లాడుకొన్నదో మాకుఁ దెలియనే లేదు — ఆకస్మికముగ మిసిమివెన్నెలలో మెఱపులు మెఱసినట్లయ్యెను. ఉపవనములు మధురగంధవిలసితములైనట్లయ్యెను. మధురకలకంఠపంచమశ్రుతి చతుర్దిశాసంకలిత మైనట్లయ్యెను. అప్పుడు మాయంతరంగము లద్భుతానందరసతరంగితము లయ్యెను.

కన్నులం దెఱచి చూచునప్పటికి సంపూర్ణపూర్ణిమాచంద్రమండలమునుండి సురభికుసుమరజస్సమన్వితం బగుసువర్ణకమలడోలిక నధిరోహించి యొక దివ్యతేజోమూర్తి విలాసఖేలనంబున భూమండలమున కవతరించుచున్నట్లు దృగ్గోచరం బయ్యెను. సహస్రశీర్షయు శతసహస్రబాహుసమన్వితయు, సహస్రసహస్రనేత్రవిరాజితయు,

శతకోటిరవిప్రభాభాసమానయగు నాపిశ్వమూర్తిం బరివేష్టించి, సువర్ణమణిమండితదివ్యవీణాదండపాణులై యసంఖ్యతేజోమయదివ్య పురుషమూర్తులును, తేజోమయదివ్యస్త్రీమూర్తులును, దమదివ్యవల్లకీస్వరంబులతోఁ దమదివ్యకంఠస్వరంబుల నైక్యముచేసి:—

"దేవ్యై నమోస్తు దివిదేవగణార్చితాయై
భూత్యై నమోస్తు భువనార్తివినాశనాయై
ధాత్ర్యై నమోస్తు ధరణీధరవల్లభాయై
పుష్ట్యై నమోస్తు పురుషోత్తమవల్లభాయై
శాంత్యై నమోస్తు శరణాగతరక్షణాయై
కాంత్యై నమోస్తు కమనీయగుణాశ్రయాయై
క్షాంత్యై నమోస్తు దురితక్షయకారకాయై
ధాత్ర్యై నమోస్తు ధనధాన్యసమృద్ధిదాయై
జయతు జయతు రమ్యా రత్నగర్భాంతరస్థా
జయతు జయతు శుద్ధా శుద్ధజాంబూనదాభా
జయతు జయతు కాంతా కాంతిమద్భాసితాంగీ
జయతు జయతు శాంతా శీఘ్రమాగచ్ఛ సౌమ్యే"

అని గానము చేయుచుండిరి. మాహృదయవీణాతంతువులు కూడ నాదివ్యగానము నాలాపించుచుండెను. అదియే ప్రేమగానము ఆనందపరవశులమై యనిమిషనయనములతో మేమట్లే యుంటిమి! ఆపేరిమామృతగానాకర్ణనమునఁ బ్రేమానందమయమూర్తి యగు నాజగన్మాతసుప్రసన్నవదనము మందహాసవిలసిత మయ్యెను. ఆప్రబోధానందచంద్రికాపటలమునుండి యొకదివ్యతేజఃకిరణము మూర్తీభవించినట్లయ్యెను. ఆదివ్యతేజోమూర్తిభూమండలమున కవతరించుటయు నాదివ్యమాతృకామూర్తి సపరివారముగఁ జంద్రమండలమున విలీనమై పోవుటయు నొక్కనిమిషముననే—

అంతలో సంపూర్ణచంద్రమండలము శుభ్రమేఘాచ్ఛన్న మైనట్లయ్యెను. అదికాల్పనికమో, స్వాభావికమో మాకుబోధపడలేదు. భావించి చూచునప్పటికి మాయెట్టయెదుట దివ్యపాదుకావిలసితచరణకమలయుగళుండును, కోమలారుణచంద్రికాకౌశేయవసనాంచితదివ్యవిగ్రహుండును, అక్షమాలికాదండకమండలుస్ఫురత్సవ్యహస్తపంకేరుహుండును, బీజపూరమాలికాలంకృతవిశాలోరస్కుండును, శుభ్రశ్మశ్రుజటాపటలపరిశోభితుండును, సుందరమందస్మితవదనారవిందుండును, నగునొకతేజోమయదివ్యమూర్తిసాక్షాత్కరించి కరుణామృతరసతరంగితంబు లగుకటాక్షవీక్షణంబుల మాపయిం బ్రసరింపఁజేయుచుండెను. ఆనందరసపూరితంబు లగుమాహృదయసరోవరము లప్పుడాకస్మికముగ నమృతభావతరంగితము లయ్యెను.

ఆయమృతమూర్తిం దిలకించి సిద్ధసంకల్పంబున నిశ్చయస్వర్గుండై యానందామృతపానంబున నాత్మసన్యాసముం గావించి పరశివతాదాత్మ్యంబునఁ బరమసిద్ధిం గాంచిన మాజనకుండగు శ్రీపరమహంసపరివ్రాజక శ్రీశ్రీనారాయతీర్థపూజ్యపాదస్వామి యేమో యనియు, కల్యాణగుణసంకలితుండై కర్మసన్యాసియై రామనామామృతగానంబున రాజయోగియై యాత్మారామంబగుపరమధామముం జూరఁగొన్న మాజనకుం డగునచ్యుతరామపుణ్యతీర్థమూర్తియేమో యనియు మేమిరువురము నొక్కసారిగ భావించుకొని పరమానందపారవశ్యంబునఁ బులకీకృతసర్వావయవుల మై యానందబాష్పములతో నిరువుర మైకకంఠ్యముగ :—

,, గురు ర్బ్రహ్మ గురు ర్విష్ణు ర్గురు ర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః
అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా

చక్షు రున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః.

అపారకారుణ్యసుధాతరంగై
రపాంగపాతై రవలోకయంతం
కఠోరసంసారనిదాఘతప్తాన్
మునీ నహం నౌమి గురుం గురూణామ్.

త్వమేవ మాతాచ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ
త్వమేవ సేవ్యశ్చ గురు స్త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ"

అని స్తోత్రముచేయుచు నాసిద్ధపురుషునిదివ్యపాదారవిందములకు సాష్టాంగనమస్కారములఁ గావించితిమి. అప్పు డాదయాసముద్రుం డపాస్తసమస్తపాపనికరంబులగు తనపావనకరంబులచే మమ్మిరువురను లేవనెత్తి పరమాదరంబున నాశీర్వాదము సేయుచు నిరువుర నురఃపంకలఁ గౌఁగిలించుకొనియెను. ఆదివ్యదేహసంస్పర్శంబునం మేము పరవశుల మైపోయితిమి. అంతలో ననుభూతపూర్వంబగు నొకదివ్యతేజము మాహృదయాంతరాళములఁ బ్రవేశించినట్లయ్యెను. తోడనే యమృతమధురగంభీరస్వరంబున:—

"మాతృదేవోభవ! పితృదేవోభవ!"

అనుదివ్యవాక్యములు వెలువడి దశదశలఁ బ్రేమామృతమధురమయంబులుగఁ జేసివైచెను. ఆపవిత్రోపదేశశ్రవణంబునఁ బ్రబోధితులమై ప్రకృతిస్థుల మగునప్పటికి మేమిరువురము నన్యోన్యాభిముఖ్యంబునఁ బరస్పరానుగృహీతకరాంజలినిబద్ధులమై యుంటిమి. మమ్మిరువురనుగౌఁగిలించుకొన్న యాదివ్యపురుషుఁ డింక మాకగపడలేదు. ఇంతవఱకు నాదివ్యమూర్తిపావనకరకమలంబుల

నలంకరించియున్న ప్రేమాతురవిలసితంబగు నాపుస్తకరాజమప్పుడు మాకరముల నలంకరించి యుండెను. అద్భుతానందరసనిమగ్నులమై యాపండువెన్నెలలో నాపవిత్రగ్రంథరాజమును నయనానందకరంబుగఁ దిలకించితిమి. అందలిముఖపత్రముపై నింతకుముందు మాకు సాక్షాత్కరించిన సిద్ధపురుషుని విద్యున్మూర్తి మాకన్నులఁ బడియెను !! ఆ విద్యుత్కాంతిమండలమధ్యమున

## “మాతృమందిరము”

అను తేజోమయవర్ణములు మాకు దృగ్గోచరములయ్యెను. ఆ దివ్యవర్ణములలో వర్ణసమామ్నాయ మంతయు ద్యోతకమగుచుండెను; శబ్దప్రపంచము మూర్తీభవించి యుండెను.

అప్పుడు స్పష్టాస్పష్టమూర్తు లగు బాహ్యభావనాప్రకృతుల యేకీభావపథంబున మాహృదయములు సమ్మిళితము లైనట్లయ్యెను. ఆ ప్రబోధానందగురుకరుణాసంపన్నం బగు నీమాతృమందిరమునం దేమున్నదియో తిలకింపవలయు నని మేము కౌతూహలాక్రాంత హృదయుల మైతిమి. మాతృపూజాపరాయణు లగు మాసోదరులుఁ గూడ మావలెనే వేడుకపడుచుందురు. భ్రాతృవరులారా! పరమానందముతోఁ బత్రములను ద్రిప్పి పరికింతము రండు! భక్తిభావపూరితహృదయములతోఁ బూజింతము రండు !!



# మాతృమందిరము

## ప్రథమభాగము

### మొదటి ప్రకరణము

‘‘అయ్యయ్యో! యిది యేమీ
సొయ్యాపడెన్ దేహ; గుండె కొట్టుకొనదు; నీ
రయ్యెను గోళ్లు; శ్వాసము రా
దయ్యె; నుసురు విడిచి పోయె నా యక టకటా!

కపోతము — హేరాళి.

ఆనాఁడు ఫాల్గునబహుళదశమి. ధర్మగిరిప్రాంతారణ్య మంతయు నంధకారబంధురమై యుండెను. అంధకారము పాపకార్యములకు మూలకందమగుటయే కాక కేవలముఁ బాపస్వరూప మైనది. అంధకారసంయోగమునఁ జల్లనిరజనీరమణికూడఁ గాళరాత్రియై పోవుచున్నది. చక్కనినీలాకాశమున వేలకొలఁదిచుక్కలు మినుకు మినుకుమని మెఱయుచునే యున్నవి. తరులతాంతరాళముల మిణుఁగురుపురుగులు మిలమిలలాడుచునే యున్నవి. అంతమాత్రమున నేమిలాభము! అంధకారము ఘనీభవించుచునేయుండెను. అప్పుడు చుక్కకును మిణుఁగురుపురుగునకును సంవాదము జరిగెను.

మిణు — చూచితివే చుక్కా ! నేనీయంధకారమును నా ఱెక్కలతో నెట్లు విసరివైచుచుంటినో !

చుక్క — ఓసి వెఱ్ఱిదానా ! ఱెక్క ముడుచునప్పటి కంధకారము నిన్ను ముంచివైచుచునేయున్నది కాదా ?

మిణు — ఓహో ! ఇదియా నీయూహ ! నీవుమాత్ర మంధకారమునఁ బడి యుంటివి కాదా ?

చుక్క — అంధకారమునకును నాకు నెంతదూర మున్నదో నీకెట్లు తెలియును ?

మిణు — తెలియ కేమి ! నీచుట్టు నున్ననీలాకాశ మంధకారపూరితము కాదా ?

చుక్క — అంధకారమధ్యమునం దున్ననీవు నన్నట్లు తలంచుట తప్పు కాదు. కాని నిజముగా నాకు సహస్రసహస్రయోజనములదూరమునఁగూడ నంధకారము లేదుసుమా !

మిణు — అలాగా తల్లీ ! నీవు నాయంతటిరూపముననే యగపడుచుండుటచే నావంటిదానవే యనుకొంటిని. నేనును నీవంటిదాన నగుట యెట్లో చెప్పవా !

చుక్క — ఈయున్నతస్థానమునకుఁ జేరఁగలిగిచో నీవును నావంటిదానవే యగుదువు.

మిణు — అక్కా ! నేనంతదూర మెట్లు రాఁగలుగుదును ?

చుక్క — చెల్లెలా ! ఆశక్తి నీయందును గలదే!

మిణు — అంధకారమునఁ బడియున్ననాకాభావము బోధపడుట లేదు.

చుక్క — వెఱ్ఱిదానా ! నీవు నొకప్పుడు ఖద్యోతమవై యీజగమంతయును వెలయించినదానవే కావా ?

మిణు — కేవలనామసామ్యమునుబట్టి నన్నుఁ బరిహసించు చుంటివా పరంజ్యోతీ !

చుక్క — లేదు తల్లీ లేదు ! నీవును బరంజ్యోతిస్వరూపిణివే — తెలిసికొన్నచో నీజగమంతయును బరంజ్యోతిస్వరూపమే. కొలఁదిగొప్పతనములు కేవలభ్రాంతికల్పితములు.

ఇంతలోఁ బూర్వాకాశమునఁ జంద్రోదయరాగప్రభ లలముకొనియెను. క్రమముగా నాచుక్కయంతర్హిత మయ్యెను. మిణుఁగురుపురుగు చెట్లసందుల నట్టే మినుకు మినుకుమనుచుండెను. చుక్క చెప్పినమాట మిణుఁగురుపురుగునకు బోధపడినంత బోధపడినది.

క్రమక్రమముగ నంధకారము పలుచనగుచుండెను. అస్పష్టచంద్రికావకుంఠనమున నస్పష్టప్రకృతిసౌందర్య మపరిణతశిష్యవిజ్ఞానమువలెఁ బ్రతిభాసిత మగుచుండెను. అప్పు డాదుర్గమవనమార్గమునంబడి యిరువురుపురుషులు సంభాషించుకొనుచుఁ బోవుచుండిరి. అందొకఁడు యోగివేషాలంకృతుఁడై ప్రత్యక్షపరశివమూర్తింబోలియుండెను. ఆతనివయ సఱువదియేండ్లకు మించియున్నట్లగపడుచున్నను నమృతసిద్ధుఁ డగుటచేఁగాఁబోలు నవయవదార్ఢ్యమున ముప్పదియేండ్లవానికంటెను మించినసముత్సాహము కలిగియుండెను. ఆమహాత్ముని సుప్రసన్నవదనమండలము ప్రేమానందమయమై పవిత్రతాద్యోతితమై యుండెను. రెండవవాఁడు రమణీయవేషాలంకృతుఁ డగుయువకుఁడు; ప్రత్యక్షమదనసుందరవిగ్రహుఁడు. నూనూఁగుమీసములతోడి యాతనిసుందరవదనమండలము శాంతశృంగారరసమంచితమై యుండెను. ఆయువకునివయ సిరువది రెండేండ్లకు మించి యుండదు. వారిరువురును నడక నాఁగకయే సంభాషించుకొనుచుండిరి.

యువ—మహాత్మా! నన్ను మీపాదదాసునిగ ననుగ్రహింపవలయును. దేవరపవిత్రచరణసాన్నిధ్యము నొక్కనిమిషమైనను విడిచియుండఁజాలను.

యోగి—కుమారా! నీవంటిసచ్చరితులు లగుసత్పుత్రులం గాంచఁగలిగిన భారతమాతకుఁ బదివేల ధన్యవాదములు. స్వధర్మనిర్వాహణముం గావించి తల్లియాజ్ఞను బరిపాలింపుము.

యువ—గురుదేవా! స్వయముగ సముద్రమధ్యమునకుఁ బోయి మునిఁగి తీరమునకీఁదికొని రమ్మని యాజ్ఞాపించుచున్నారు. ఈయల్పప్రాణిపై నింతటిఘనకార్యభారమును మోపుట మీకరుణార్ద్రహృదయమునకుఁ దగదు.

యోగి—నాయనా! నిన్ను నీవెఱుంగఁజాలకున్నావు. నీవల్పప్రాణివి కావు. దివ్యమూర్తివి! ఎంతటిఘనకార్యము నైనను నిర్వహింపఁగలవు!

యువ—తండ్రీ! నాయొడలు కంపించిపోవుచున్నది. నాకంతటిధైర్యశక్తి లేదు.

యో—కుమారా! అవివేకమునఁ బడిపోవుచున్నావు. సర్వశక్తులును నీయందే యున్నవి. సర్వధర్మంబులను నీవు నిర్వహింపఁగలవు.

యువ—దేవరదివ్యబోధామృతపానముచే నెల్లయెడల నిర్భయుఁడనై యుంటినిగాని— యీవిషయమునమాత్రము—

యో—బిడ్డా! నిశ్చలుఁడవై యుండుము! అభయప్రదాయిని యగుమాతృదేవత నిన్నాశీర్వదించినది. రాజరాజేశ్వరి యగు జగజ్జనని యీపవిత్రబోధానందముఖంబున నీకాజ్ఞాపించినది. మాతృవాక్యముం బరిపాలింపుము. మాఱుమాటాడకుము. దుర్గానుగ్రహంబున నీయాత్మసంశయము దూరీభూత మగుఁగాక !!

యువకుఁ డప్రతిభుఁడై మౌనముతో నమ్రవదనుఁడై స్వామి ననుసరించి నడచుచుండెను. అప్పుడు స్వామి మృదుమధురస్వరముతో “కుమారా! మనము ధర్మగిరిని సమీపించుచున్నాము. గిరిగర్భమునందలి సత్యదేవుని సందర్శించి రేపటియుదయముననే నీవు బయలుదేరవచ్చును” అనియెను.

వారట్లు పోవుచుండఁగా ననతిదూరమునుండి యతిమందముగ గుప్తమకుతుకతో మూల్గుచున్న ట్లొకశబ్దము వినవచ్చెను. ఆయార్తస్వరమునాలకించి వారిరువురు నతిత్వరితముగ నావైపునకుఁ బరుగెత్తుకొనిపోయిరి. అంతలోనామూలు గాఁగిపోయెను. అప్పుడు ముందుగ నడచుచున్నయువకుఁ డాచెట్లనందున నేమిచూచెనో గాని యాకస్మికముగ “గురుదేవా!” అని కేక వైచెను. ఇరువురును ససంభ్రములై ముందటికిఁ బోయి చూచునప్పటికి మలినవసనధారిణి యగు నొకస్త్రీమూర్తి చెట్టునకుఁ బోయఁబడిన యురిపగ్గములందగులుకొని వ్రేలాడుచుండెను. తోడనే యాయువకుఁ డతివేగముగ నావృక్షము నధిరోహించి కొమ్మను గ్రిందికి వంచెను. క్రిందనున్నస్వామి “హా తల్లీ!” అని పలుకుచుఁ దన రెండుచేతులతో నాయువతినిబట్టుకొని “కుమారా! ఉరిత్రాటిని మెల్లగ విప్పివేయుము. పడకుండ నేనీమెను బట్టుకొనఁగలను” అనియెను.

యువకుఁ డంతలో నురిత్రాటిని కత్తితోఁ గోసివైచి కొమ్మపైనుండి క్రిందికుఱికి స్వామి బాహుశాఖలపై నిలుపఁబడియున్నయా స్త్రీమూర్తిని మెల్లఁగఁ గ్రిందికి దింపెను; పిమ్మట నామె కాలుసేతులకుఁ గట్టఁబడినబంధములను గోసివైచెను. ప్రబోధానందుఁ డాయువతిని బాగుగఁ బరీక్షించెను. అప్పు డామె యచేతనయై పడియుండెను. ఊపిరి యాడుచున్న లక్షణము లేవియు నగపడలేదు. మొగ



కుమారా! ఉరిత్రాటిని మెల్లగ విప్పివేయుము. పడకుండ నేనీమెను బట్టుకొనఁగలను. పుట. 16.

ముకూడ విక్సిత మైపోయినది. స్వామి యామె నాడులను బరీక్షించి యొక్క ట్టుగా న్పి విడిచెను. అప్పుడు యువకుఁడాతృతతో 'మహా త్మా? మించిపోయినదా?' అనియెను.

స్వామి తనకమండలూదకముల నామె మొగముపైఁ జిలికిం చెను. యువకుఁ డుత్తరీయముతో విసరుచుండెను. అంతఁ గొంతసే పటికిఁ బిగిసికొనిపోయిన యామెకంఠర మించుకసడలిన ట్లయ్యెను. స్వామి మరలఁ బరీక్షించి, కుమారా! అంతరాంతరమున లీలామా త్రముగ జీవతేజస్సంచాలన మగుచున్నట్లు కలుగుచున్నది. జగ న్మాత యనుగ్రహించినది.' అని చెప్పుచుఁ దననిశ్చలదృష్టి నామె వదనమండలమున నిలిపి లీలామాత్రంబగునామెయాంతరికజీవతేజ ము నుత్తేజితముగఁ జేయుచుండెను. అతీవ్రదృష్టులనుండి యాముని నాథు దివ్యతేజ మాయింతిభ్రూమధ్యమునఁ బ్రసరించుచుఁ గ్రమ ముగ సకలాంగకములను బ్రవహించుచుండెను. అంతలో నాయు వతినాసారంధ్రముల నిశ్వాసప్రశ్వాససంచాలనమై నిమిషములో మరల నాఁగిపోయెను. గురుదేవుఁ డట్లే యేకాగ్రదృష్టితోఁ జూచు చుండెను. కొలఁదిసేపటికి కామెనయనయుగళము దరవికసితమై మరల ముకుళిత మైపోయెను. ప్రబోధానందుఁడు దీర్ఘనిశ్వాసమును విడిచి జగన్మాతను ధ్యానించుచుఁ దనదివ్యయోగదండముచే నామె యాయుస్థానములను స్పృశియించుచుండెను.

తదేకధ్యానముకోఁ జేతనోద్దీపకంబులగు నుపచారములం గావించుచున్నయువకుఁ డప్పుడు తత్తరముతో, 'స్వామీ! ఆశ యున్నదా?' అనియెను.

స్వామి—జగన్మాత కరుణింపవచ్చును. కంఠనాళములు బల వంతముగ బిగిసికొని పోవుటచే నీమెప్రాణములు కడ లంటి యున్న

వి. బలవంతముగ నెవ్వరో పాప మీమె కిట్టిదుర్దశం గల్పించియున్నారు. చూడఁగా నీమె యింతలోఁ దేరుకొను నట్లు తోఁచుట లేదు ఇంతలో, నాకూరులందఱును మరల నిచ్చటకు వచ్చుట సంభవించునేని మనప్రయత్నమునకు భంగము కలుగునేమో యని కూడ సంశయము కలుగుచున్నది. ఇయ్యరణ్యమున సురాపానదీక్షితు లగు చోరులెందఱో సంచరించుచుందురు.

యువ — (నిట్టూర్పు విడిచి) గురుదేవా! ఈయరణ్యమే యన నేమి? అజ్ఞాను లగునాతతాయులచే నీదేశ మంతయు నరణ్యముగనే యున్నది. ఇప్పుడు మనకుఁ గర్తవ్య మేమో దివ్యచిత్తంబున నిశ్చయించితిరా?

స్వామి — ధర్మశైల మిచ్చటికి యెంతయో దూరము లేదు. మం మిరువురము నీమె నచ్చటకు నిరపాయముగఁ జేర్పఁగలిగినచో నాగర్భాలయంబున నిరంతరాయముగ ననంతరకర్తవ్యములం దీర్చుకొనవచ్చును. నీవించుక సాయము చేయఁగలవా?

యువకుఁడు వినయవినమితశిరస్కుఁడై యానందస్వరంబున "మహాప్రసాదము స్వామీ!" అనియెను.

అనంతరము మృతప్రాయయై పడియున్న యాయువతీమూర్తి నతిభద్రముగ నయ్యిరువురును దమయంజలి బంధములం జేర్చి పక్షః పార్శ్వంబుల నానించిపట్టుకొని మెల్లమెల్లగ ధర్మశైలాభిముఖులై వెడలిపోయిరి.



# మాతృమందిరము.

## రెండవప్రకరణము.

ప్రజలజీవితత. లసుకా ♦ వ్యంబులందు
వరుస సర్గలవంటి వీ ♦ వత్సరములు
జరగిపోయినవత్సర ♦ సమితి వల్లఁ
జదివివైచిన సర్గల ♦ జాడ విడచి
నవ్యసర్గము నేకథ ♦ పట్టు గలదొ
చల్లగాఁ బత్రికాలఁ దిప్పి ♦ చదువుకొనుఁడు!

సంవత్సరాది - హారావళి.

" సోదరులారా! కష్టసుఖమిశ్రితం బగుప్రపంచమునఁ గేవల సుఖేచ్ఛాపరాయణు లగుజీవులకుఁ దత్తత్కాలసన్నిహితంబు లగు కష్టంబులుకూడ నవశ్యానుభోక్తవ్యంబులు గావున నట్టికష్టములను గూడ నిర్భయముగ ననుభవించుటకై యీవిధముగ నలవాటు చేసికొనుఁడు " అని యార్యులగుమన పెద్దలు సయుక్తికముగ బోధించిరేమో యనునట్లు మనకు మంచినోటను జేదుమేయ నియమించిన పవిత్రదిన మీదినమే—చాంద్రమానప్రచారకుల మగు మనకందఱకును సంవత్సరాది—

సాయంకాలము నాలుగుగంట లైనది. గోస్తనీపుణ్యనదీతీరమునం గలతారకాపురంబున (తణుకు) శ్రీ కేశవస్వామివారి దివ్యాలయమునం బ్రవేశించి పురజను లెల్లరును బంచాంగశ్రవణము గావించుచుండిరి. అనేకు లనేకవిషయములం గూర్చి యాలకించుటకుఁ గుతూహలపడుచుండిరి.

సంసారులు పంట లెన్నివీసములు ఫలియించునో తెలిసికొనుచుండిరి. వర్తకులు సరకులవెల లెట్లుండునో వినుచుండిరి. కృషి

కులు వర్షప్రమాణమును గూర్చియుఁ బైరుపంటలంగూర్చియుఁ బశుక్షేమముంగూర్చి మునాలకించుచుండిరి. వైద్యులుమాఁగీజ్వరమశూచికాదిరోగములంగూర్చియు, సామాన్యగ్రామయాచకులు జననమరణములంగూర్చియు. జోశాదులు రాజవిద్వర ప్రజావిప్లవాదులంగూర్చియు నీవిధముగా నందఱును దమతమయావశ్యకవిషయములంగూర్చి మనసుంచి యాకర్ణించుచుండిరి. జన్మనామనక్షత్రములంబట్టి యందఱును దమతమ రాజపూజ్యావమానములను నిశ్చయించుకొనుటయైనది. ఆదాయవ్యయములను గణియించుటయు నైనది. తుదకుఁ గందాయములయందలి శూన్యాంకములను బూర్ణాంకములుగ మార్పించుకొనుటకై పాదపూజలు సల్పించుటయు నందుకొనుటయుఁ గూడ నైనది. ఈవిధముగాఁ బంచాంగశ్రవణము స్వస్తిమంత్రములతో సమాప్తమైనది. శ్రీకేశవస్వామివారిని దర్శించి క్రమముగ నెవరియిండ్లకు వారు పోవుచుండిరి.

గౌరీపతిశాస్త్రి యాగ్రామమునకు సభాపతి; సత్స్వభావము గలశాస్త్రపండితుఁడు; సనాతనధర్మావలంబి; సంపన్నగృహస్థుఁడు. అతఁడు దేవాలయమునుండి బయలుదేరి గోస్తనీతీరమునకుఁ బోయి సంధ్యావందనాదికము దీర్చికొని యింటికిఁ బోవునప్పటి కొక బ్రాహ్మణుఁడు వీథియఱుఁగుపైఁ గూర్చుండియుండెను. గౌరీపతిశాస్త్రి యాతనిం జూచి ‟అయ్యా! మీదేయూరు” అని ప్రశ్నించెను.

బ్రాహ్మ — ఆకువీడు.

గౌరీ — మీనామధేయము ?

బ్రాహ్మ — రామశాస్త్రియందురు.

గౌరీ — (సత్కృతినభినయించి) ఓహో! కేరళశాస్త్రపండితులు మీరేనా ?

బాల—ఏదియో కొలఁదిగ నభ్యసించితిని.

గౌరీ—మీప్రసిద్ధి నిదివఱకే విని యుంటిని. కాని మీదర్శనభాగ్యము లభియింపలేదు. నేఁడు సుదినము. రండు! లోనికి దయచేయుఁడు.

ఇరువురును మందిరమునఁ బ్రవేశించి లోపలిసావడిలోనిబల్లపైఁ గూర్చుండి లోకవృత్తాంతములంగూర్చి కొంతసేపటివఱకును సంభాషించుకొనుచుండిరి. ఇంతలో గృహిణియగు నన్నపూర్ణాదేవి జలకలశములతోఁ బాదోదకములను సిద్ధముచేసి యుంచెను. ఇరువురును బాదప్రక్షాళనము గావించుకొని భోజనాగారమునం బ్రవేశించిరి. భోజనానంతరమున మరల నిరువురును వచ్చి యాబల్లమీఁదనే కూర్చుండి యుండఁగాఁ బదునాలేండ్లయీడుగల బాలిక తముల పాకులపళ్ళెరమును దెచ్చి యచ్చట నుంచెను.

అప్పుడు రామశాస్త్రి యాబాలికామూర్తి నవలోకించి యించుక సేపాలోచించి గౌరీపతిశాస్త్రింజూచి "ఆర్యా! ఈబాలిక మీకుమార్తెయా?" అని యడిగెను.

గౌరీ—అవును.

రామశాస్త్రి—ఈమెకంటెముందుగ మీకుఁ బుత్రసంతానము కలిగినదికాదా?

గౌరీపతిశాస్త్రి యప్రతిభుఁడై యేమియును మాటాడఁజాలక పోయెను. కేరళశాస్త్రపారంగతుఁ డగురామశాస్త్రి తనకుఁ బ్రబోధము కలిగినప్పుడితరు లడుగకుండఁగనే భూతభవిష్యద్వర్తమానములం దెలుపుస్వభావము కలవాఁడు. అతఁడు మరల గౌరీపతిశాస్త్రిం జూచి "ఏమి? యట్లున్నారు? నామాట యసత్యమైనదా యేమి?" అని యడిగెను.

గౌరీ—కాలేదు.

రామ—ఆసంతానము మీకుపయోగపడలేదు కాదా ?

గౌరీ—[గద్గదస్వరము] దైవప్రసాదము లభియించినది. కాని—మూడేండ్లునిండకుండఁగనే—

రామ—ఇఁకఁ జెప్పనక్కఱలేదు. ఫలానుభవము లేకుండఁ బోయినది—

గౌరి—అట్లే యైనది.

రామ—ఈబాలికపే రేమి ?

గౌరీ—సరస్వతి.

బాలిక యగుసరస్వతి సమీపస్తంభమునొద్దనే నిలువఁబడి వారిసంభాషణము నాలకించుచుండెను.

రామ—సరస్వతియా? సరస్వతివిద్యావతియే కాక గుణవతి.

గౌరీ—మీయాశీర్వాదము.

రామ—ఈమెయదృష్టము గణనీయమైనది. ఈమె విశేష విఖ్యాతిని సంపాదించుసచ్చరిత్రయగును; అనేకకుటుంబము లీమెచే నుద్ధరింపఁబడును. ఈమెచూపులతో నాజ్ఞాశక్తి ప్రతిభాసిత మగుచున్నది. ముఖమండలము దేవీదుర్లభంబగు నానందకళావిలసితమై యున్నది. ఈమెహృదయము దయామయ మైనది; శాంతిమయమైనది. సుస్థిరభావసమన్వితమైనది. ఈమెజీవితమునఁ గష్టము లేదు. విచారము లేదు—కాని—

గౌరీ—అది యేమి ?

రామ—(ఆలోచించి) ఈమెకుభర్తృసుఖమున్నట్లగపడదు.

గౌరీ—(ఆతురముతో) అది యేమి ? సౌభాగ్యము—

అర్ధోక్తియందే రామశాస్త్రి "సంశయము లేదు. ఈబాలిక చిరసౌభాగ్యవతి." అనియెను.

గౌరీ — ఆయుర్విషయము?

రామ — (నవ్వుచు) ఈమె చిరాయుష్మంతురాలై యుండఁ గలదు.

గౌరీ — (ఇంచుక యోచించి) ఆర్యా! భర్త యీమెను ప్రేమింపఁగలదా?

రామ — నలుఁడు దమయంతిని ప్రేమించుటకంటె, హరిశ్చంద్రుఁడు చంద్రమతిని ప్రేమించుటకంటె, శ్రీరామచంద్రుఁడు సీతామహాదేవిని ప్రేమించుటకంటె నధికముగ నాతఁ డీమెను ప్రేమించియుండును.

గౌరీ — ఈబాలికలోప మేమైననుండునా?

రామ — ఒక్కనాఁటి కట్లుండదు — ఈమె తనభర్తను దన ప్రాణములకంటెను, బ్రాణదాత యగుపరమేశ్వరునికంటెను నధికముగఁ బ్రేమించును.

ఈమాట విన్నతోడనే సరస్వతి చల్లచల్లగ లోపలికి వెడలిపోయెను. ఆలోచనానిమగ్నమానసులైయున్నవారి రిరువురును గ్రహింపలేదేమో గాని యట్లు పోవునప్పుడు సరస్వతి యొక్క దీర్ఘశ్వాసమును విడిచి యుండు నని మేమనుమానించుచున్నాము.

గౌరీపతిశాస్త్రి నిట్టూర్పు విడిచి "యీమాటలకుఁ బరస్పర సంబంధము కుదురుట లేదు" అనియెను.

రామ — అట్లే కావచ్చును. శాస్త్రముబట్టి నాకు గోచరించిన దింతవఱకే.

గౌరీ — శాస్త్ర మసత్య మనఁజాలను.

రామ — ఇఁకననుభవమునుబట్టి చూచుకొనవలసియుండును, ఇఁక నాకు సెలవిండు,

గౌరి—అది యేమి? ఇంతరాత్రివేళ నెచ్చటి కేగెదరు?

రామ—ఫలముచెప్పినయింట నేను బరుండెదను. ఇది నానియమము సత్రమునకుఁ బోయి పరుండెదను.

గత్యంతరము లేక గౌరీపతిశాస్త్రి మాఱుమాట చెప్పలేదు. రామశాస్త్రి వెడలిపోయెను. మాటలసందడిని రామశాస్త్రి తాంబూలము వైచుకొనుటయే మఱచిపోయెను. వెడలిపోవునప్పుడైన నాతనికిఁ దాంబూలమీయవలయునని గౌరీపతిశాస్త్రికిని దోఁచలేదు. తమలపాకులపళ్లెర మచ్చటనే యున్నది. రామశాస్త్రి చెప్పిన యపూర్వకేరళఫలంబులంగూర్చి తర్కవితర్కములం జేసికొనుచు గౌరీపతిశాస్త్రి యట్లే నిదురించెను.

---

## మూ ఁ డ వ ప్ర క ర ణ ము.

---

"ఎట్టులుండునో నాభాగ ◆ మెల్లియనుచుఁ
గాంచ నెంచుట నాపని ◆ కాదు కాదు
నేను వను దాఁటిపోలేదు ◆ నేఁడటంచు
సవగతం బగుచుండె నా ◆ కదియెచాలు"

భాగ్యము—హారావళి.

సరస్వతి చాలవిద్యావతి; రూపవతి; గుణవతి. ఆమె సంస్కృతమునఁ బంచకావ్యములను నాటకములను దండ్రియొద్దఁ జదువుకొన్నది; ఆంధ్రభాషను జక్కఁగఁ గవిత్వము చెప్పఁగలుగునంతటి పాండిత్యమును సంపాదించినది. తల్లిదండ్రుల కేకపుత్రిక యగు నామె యల్లారుముద్దుగఁ బెంపఁబడుచున్నది. అన్నపూర్ణాగౌరీపతు

లయినా జీవితముల కామెయొక్కతెయే ప్రేమైకస్వరూపిణియై యుండెను. చిన్నతనమునుండియు సరస్వతి యంతగా నాటపాటల కలవాటుపడిన బాలిక కాదు. ఆమె యెప్పుడును గ్రంథములతోడనే కాలక్షేపము చేసికొనుచుండును. బ్రహ్మసూత్రభాష్యము, గీతాభాష్యము, విద్యారణ్యభాష్యము, మొదలగు వేదాంతగ్రంథములను తండ్రిశిష్యులకు బోధించుచున్నప్పుడు సరస్వతి మిక్కిలి యాసక్తితో నాలకించుచు నందలిపరమార్థరహస్యములను గ్రహించుచు గ్రమముగ దానే యాగ్రంథమును జదివి తెలిసికొనుసంతటి ప్రౌఢపాండిత్యమును సంపాదింపగలిగెను.

సరస్వతి నేటి యుదయమునుండియును దనశయనమందిరమునందే యొంటిగ గూర్చుండి యేమేమియో యాలోచించుకొనుచుండెను. ఆమెసుందరవదన ముదయారుణచంద్రమండలమును బోలి యెఱ్ఱనై చిఱుచెమ్మటలు గ్రమ్మి యుండెను. నడుమనడుమ నేడ్చినట్లాశ్వాసలు వెలువడి యామెకోమలారుణాధరపల్లవమును వివర్ణముగ జేయుచుండెను. అప్పుడప్పుడు వాతాహతిం జలించు వసంతనవకుసుమవల్లికం బోలి యామెసుకుమారసుందరతనువంత ప్రకంపితమగుచుండెను. నేడామెమనోభావములు విశృంఖలములై విపరీతములగుచుండెను. ఆదుర్దమనీయభావవేగోపశాంతికై యామె మహాభారతమునందలి శాంతిపర్వమును జదువుకొనవలయు నని తీసెను. అది యామెమనసునకు బట్టినది కాదు. తరువాత శృంగారశాకుంతలము నందుకొని చదువ దలంచెను గాని యదియు నామె భావపరివర్తనమునకు సాయపడినది కాదు. ఆగ్రంథమును యథాస్థానమునం దుంచి మేఘసందేశమును గైకొని యొకటిరెండుపుటలను దిరుగవైచెను. అందలిభావము లామెహృదయమునకు మఱింత

యావేగముం గల్పించెను గాఁబోలును! ఆపుస్తకమును గట్టిపెట్టి * యేకాంతసేవావలోకనముచే మనసు కుదుటుపఱచుకొనఁ బ్రయత్నించెను.

విరహ కాతర యగువిశ్వసుందరి విరాణ్మూర్తిని వెదకికొనుచున్నది. వియోగదుఃఖార్త యగుప్రేమైకమూర్తి భువనకల్యాణస్వరూపుఁడగు పురుషోత్తము నన్వేషించుచున్నది. ప్రవాసభర్తృక యగుపరమసుందర బాలికామూర్తి ప్రాణప్రియుని భావనాప్రపంచమునం గాంచి వేడుకొనుచున్నది. సరస్వతిహృదయము మఱింత చలించిపోయెను. చూచుచుండఁగనే యామెనయనకమలము లశ్రుజలపూరితము లై పోయెను. సరస్వతికోమలకరపల్లవమునందలిపుస్తకము క్రిందఁబడిపోయెను. పాప మాబాలిక యేమి చేయఁగలదు? అట్లే భావనాప్రపంచమునం బడి యల్లాడుచుండెను.

గృహకృత్యము లయందు నిమగ్న యైయున్న యన్నపూర్ణాదేవికి సరస్వతి యొక్క సారియైనను గంటఁ బడకుండుటచే నేమియుం దోఁచుట లేదు—అన్నపూర్ణాగారి పతులజీవితల తాకుసుమము—నయనానందచంద్రిక—ప్రేమానందైకస్వరూపము—ఇహజీవన సర్వస్వము—సరస్వతి కాక మఱి యెవ్వరు? అప్పుడన్నపూర్ణ పుత్రికాదర్శనలాలసయై సరస్వతిగదిగుమ్మమునొద్దకువచ్చి "అమ్మా! ఏమిచేయుచున్నావు?" అనియెను.

సరస్వతి యులికిపడి లేచి కన్నులఁ దుడుచుకొని "ఏమియు నులేదమ్మా!" అనియెను.

ముద్దుబిడ్డ యగుసరస్వతికనుగొలుకుల నశ్రుచిహ్నములం గాంచి యన్నపూర్ణహృదయము కళుక్కుమనియెను. అప్పు డామె

* ఏకాంతసేవ—భక్తిభావోద్దీపకమగు పద్యకావ్యము.

విరసభావసూచకం బగుముఖభంగముతో "అమ్మా! నీకు మతి పోవుచున్నదా యేమి?" అనియెను.

సరస్వతి మొగ మింత చేసికొని యేమియుమాటాడఁజాలక పోయెను.

అన్న—ఆపిచ్చివానిమాటలకు భయపడుచుంటివా? ఆ మాటల కర్థ మేమున్నది తల్లీ!

సర—లేకేమి? కనఁబడుచునే యున్నది కాదా?

అన్న—పరబ్రహ్మము రాలేదనియేనా?

సరస్వతి తల వంచుకొని తనకోమలకరపల్లవమునఁ జేలాంచలమును దడవుకొనుచుండెను.

అన్న—తల్లిదండ్రులు లేనివాఁడని—మేనల్లుఁడని—చిన్నతనమునుండియుఁ బెంచి బిడ్డనిచ్చుకొన్నందుకు విచారము మాకుఁగాని చిన్నబిడ్డవు నీకేమి తెలియు నమ్మా!

సర—అమ్మా! తెలియ కేమి? తెలిసికొనకుండ నెంత కాల మిట్లు చిన్నబిడ్డనై యుండఁగలను?

అన్న—ఉండక నీవేమిచేయఁగలవు? ఎవ రేమిచేయఁగలరు? మొదటినుండియు వాఁడట్లే యున్నాఁడు. చదువే కావలసినచో నింటనుండి మేనమామయొద్దనింకను జదువుకొనఁగూడదా! దేశాంతరములకుఁ బోవుట యెందుకు? ఆవెఱ్ఱివెఱ్ఱిపూజ లెందుకు? తీర్థయాత్ర లెందుకు? ఇరువదియేండ్లైనఁ దిన్నఁగ నిండలేదు గదా! ఆనిష్ఠ లెందుకు? చిన్నతనమునుండియు నెత్తి పెంచిన యాత్మీయుల విడనాడు టెందుకు? ఈయిల్లనినఁ బెద్దపులిగాఁ జూచుటయెందుకు? చిన్నతనమునుండియుఁ గన్నుల నద్దుకొని పెంచుకొన్నందుకుఁ బ్రతిఫలమా యిది?

సర—అమ్మా! తొందరపడి యూరక నిందింపవలదు—నీ మాటలకుఁ బ్రత్యుత్తర మిచ్చుట కాయన నీయెట్టయెదుట లేరు గదా! నాయందలి ప్రేమచే నీవు వారిని నిందించుచుంటివి గాని నాహృదయమును వేధించుచున్న సంగతియించుకంతయును గ్రహించుట లేదుగద!

అన్న—సరే. నేనూరకున్నను లోకులు నిందింపరా? ఈడు వచ్చినబిడ్డ నింట నుంచుకొన్న తల్లిదండ్రులకెంత విచారము పసిబిడ్డవు నీ కేమి తెలియును?

సర—అమ్మా! నాకు మాత్రము విచారము లేదా?

అన్న—లేదని యెవ్వరు చెప్పఁగలరు? ఉన్నది!—దోసెడు తలబ్రాలు వోసి యగ్నిసాక్షిగఁ బెండ్లియాడినవానికిఁగూడ నుండవలదా?

సర—లేదని నీకేమి తెలిసినది?

అన్న—తెలియకేమి? ఉన్నచో నింటికి రానే వచ్చును.

సర—అమ్మా! నీవు స్వార్థపరత్వముతో మాటలాడుచున్నావు. మేమిరువురము నగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన దంపతులము గదా! ఆయన చెంతకు నేనేల పోఁగూడదు?

అన్న—పోవుట యెక్కడకు? ఒకయూరా యొకపల్లెయా? ఒకయిల్లా యొకవాకిలియా?

సర—మేమిరువురమును ధర్మముకొఱకు దంపతుల మైతిమి గాని భవనములకొఱకును బట్టణములకొఱకును గాదుగద!

అన్న—కాకున్న మఱి యెందుకు? ఏమిసుఖ మనుభవించుటకు

సర—అమ్మా! పరస్పరానుబంధంబున నైహికాముష్మిక సుఖంబుల సమానముగ ననుభవించుటకై దాంపత్యధర్మము విధిం

పంబడినది. ఆధర్మమును విధ్యుక్తముగ నిర్వహించుట వలననే సర్వసుఖములును లభియింపఁగలవు.

అన్న—సరేకద! అట్లయినచో నీసంబంధమున నీ వేమి సుఖపడుచున్నావు—ఆతఁ డేమిసుఖపడుచున్నాఁడు ?

సర—తల్లీ! కడుపుతీపుచే ననాలోచితముగ మాటాడుచున్నావు. క్షణస్థాయియగు భౌతికసుఖము సుఖము కాదు. చిరస్థాయి యగునాత్మసుఖమే యనంతసుఖము! నిరంతరసందర్శనభాగ్యము లభియింపకున్నను నేను వారిని సర్వదా నాయాత్మలో భావించిధ్యానించుకొనుచుఁ బరమానందసుఖము ననుభవింపుట లేదా! అట్లే వారును నన్నుఁ దమహృదయమునఁ దలంచుకొనుచుఁ బ్రేమానందసుఖము ననుభవింపఁగూడదా ?

అన్న—ఇం కష్ట మెందుకు ? ఇంకష్టములు యెందుకు ? వానికి మామీఁదఁ గోప మేమైన నున్నచో మే... వానప్రస్థాశ్రమమును స్వీకరించెదమే. ఇంటికి వచ్చి సుఖముగఁ గాఁపురము చేసికొనఁగూడదా ? మీయిరువురు నొక్కటియై యానందముతోఁ గాలక్షేపము చేయుచున్నను కర్ణానందముగ వినినమైన మేమానందింతుముగాదా! తల్లిదండ్రులవంటివార మగుమ మ్మానందింపఁజేయుటవలన నాతనికిఁ బుణ్యమే కాని పాపము రాదే !

అని యన్నపూర్ణ కన్నుల నీరుపెట్టుకొనసాగెను. సరస్వతియు మందగద్గదస్వరముతో " అమ్మా! కోరినకోరిక లన్నియును దీరుచునే యున్నచో నిఁక నీప్రపంచమునఁ గష్టసుఖము లను మాట యెందుకు ? " అనియెను.

అన్నపూర్ణ మొగము చిట్లించుకొనుచు విలక్షణస్వరముతో " నీవేదాంతరహస్యములు నాకు బోధపడుటకు ననంతగాఁ జదువు

కొన్నదానవుగాను." అనునంతలో నామెకంఠస్వరము రుద్ధమైపో యెను. ముఖమండలము వైవర్ణ్యమునందెను. ఆకస్మికముగ నామె హృదయమున నెన్ని తెఱఁగుల భావములు మిలమిల మెఱసిపోయెను.

సరస్వతి చకితనయనములతోఁ జూచుచునిలువఁబడిపోయెను. ఆమెహృదయముకూడ నప్పుడు రఘునాథరావు ప్రతిభంజనసమయమునం దలి యమృతసాగరముంబోలి ఘూర్ణిల్లుచున్న ట్లామృదుమనోజ్ఞ వదనకమలంబునఁ బ్రతిబింబించుచుండెను.

అప్పుడన్నపూర్ణ కన్నీరు నించుచు గద్గదస్వరముతో "తల్లీ నీవు చదువులసరస్వతివై—శూన్యగేహమునకు శుభ్రమణిదీపకళా సరస్వతివై— యాత్మజీవితముల కమృతసరస్వతివై— యనుతప్త హృదయముల కానందసరస్వతివై—కానరికన్నులయెదుటఁ గనక సరస్వతివై— ప్రక్క-ప్రక్కల బాలికాసరస్వతివై— మెలంగుచు న్నంతవఱకే మాబ్రతుకు గాని—" అని యిఁక మాటాడఁజాలక వెక్కి వెక్కి దుఃఖింపసాగెను.

సరస్వతికిని దుఃఖ మాఁగినదికాదు. ఆమెకన దమ్ములనుండి యవిరళాశ్రుధారలు ప్రవహించి వక్షోవసనమును దడిపివైచుచుం డెను. అప్పుడచ్చటఁ గరుణరసము భిన్నస్వభావసంకలితమై మూ ర్తిద్వయవిలసితమై యున్నట్లయ్యెను. అప్పటివారియవస్థంగాంచి నచో నెంతటిధీరోదాత్తులైనను దమయంతర్బాష్పగౌరవమునకు జలాంజలి విడువకమాన రని సాహసించి చెప్పఁగలము.

ఇరువురు నట్లే మౌనముతో నిలిచియుండిరి. ఇంతలో గోస్త నీతీరమునకు మాధ్యాహ్నికకృత్యములం దీర్చుకొనఁబోయిన గౌరీప తిశాస్త్రి వచ్చి వీథగుమ్మముకడనిలిచి "సరస్వతీ!" అని పిలు చుచుఁ దలుపుఁగొట్టెను.

అంతలో నాయికాపురిమానచింతాభావములకును నంతరాయము సంఘటిల్లెను. అన్నపూర్ణ కన్నులఁ దుడుచుకొని భర్తకుఁ దలుపుదీయుటకై వెడలిపోయెను. తండ్రి సేవతాత్పర్యమునకుఁ బూజాద్రవ్యములను సమకూర్చుటకై సరస్వతి పూజామందిరమునఁ బ్రవేశించెను.

---

## నాలుగవ ప్రకరణము.

“భవ్యమగునట్టి ప్రేమయె ♦ పంచశరుని
కమరపట్టణ మొకపల్లె ♦ యైనఁ గాదె;
వర్ధిలేనట్టి ప్రేమ మీర ♦ పాలయమున
కంబునిధి యొక శీకర ♦ మైనఁ గాదు;
చేయిగన్నుల విలయంబు ♦ ప్రేమగతులఁ
గన్నఁగవతోడ నెవ్వారు ♦ గాంచఁగలరు?

ప్రేమ - ప్రమదావనము.

వేంకటేశ్వరరావు శ్రోత్రియబ్రాహ్మణకుటుంబమున జన్మించిన వాఁడు; ఇరువదియైదేండ్లయీడుగల సంపూర్ణయౌవనుఁడు. ఆతని పూర్వులు కుమారారామమున నగ్రహారము సంపాదించియుండిరి. అదియంతయు నిప్పుడు లేకపోయినను నాతనికి సంవత్సరమునకు నాలుగైదువేలరూప్యముల యాదాయము వచ్చుభూస్వాస్థ్య మిప్పటికిని నిలిచియున్నది. ఇది కాక తండ్రి సంపాదించి యిచ్చిన రొక్కముకూడ విశేషముగ నున్నది. కుమారారామమునం దాతని కొక పెద్దమేడయును దోఁటయు నున్నవి. అనుకూలవతియు నభినవయౌవనయు నగు ననసూయ యాతనికి సహధర్మచారిణియై యుండెను. ఆతని కేవిషయమునను గొఱంతలేదు.

ఆతఁ డెప్పుడును వినోదవిలాసములతోఁ గాలక్షేపము చేయు స్వభావము కలవాఁడు. శృంగారకావ్యము లయందును సంగీతమునందును వానికి మిగుల నాసక్తి. ఆతనికిఁ బూర్వాచారము లనిన నసిష్టములేదు. కాని యాతఁడు మాత్రము నవీనాచారముల కలవాటుపడినవాఁడు. ఆతఁడు తనయిరువదిమూఁడవయేఁటఁ దండ్రిమరణించినతరువాతఁ దమయింటఁ బారంపర్యముగ నడపఁబడుచున్న దేవతార్చనాపీఠమును బూజింపకుండ నింట నుంచుకొనుట మంచిదికాదని యోచించి సదక్షిణముగ నొకపుణ్యబ్రాహ్మణునకు దానము చేసివైచెను.

అతఁ డిప్పుడు దామోదరరావుచే సంగీతము చెప్పించుకొనుచుండెను. వీణావాదనమునం దానికి మంచిసామర్థ్యము కలిగినది. త్యాగరాజకృతులును దీక్షితులవారికృతులును జాలవఱ కాతనికి వచ్చియుండెను.

రాత్రి యెనిమిదిగంట లైనది. వేంకటేశ్వరరావు భోజనానంతరమునఁ దాంబూలచర్వణము గావించుచు మేడపై శయనమందిరమునం దొక రత్నకంబళముపైఁ గూర్చుండి యానందముతో వీణవాయించుకొనుచుండెను. ఆతఁ డతిమధురముగ రాగము నాలాపించి తానమును వాయించి క్రమముగ "తొలినేఁ జేసినపూజాఫలము" అనుత్యాగరాజకృతిని వీణతోఁ బలికించుచు మృదులస్వరంబున బాడుచుండెను.

ఇంతలో ననసూయ మూర్తీభవించిన శృంగారదేవతవలెఁ బుష్పమాలికాలంకృతయై పుస్తకమును జేతఁ బూని నడకలు నేర్చిన నవ్యమశిష్గ్రహముం బోలి సోపానము నధిరోహించి వచ్చి శయనమందిరద్వారపార్శ్వమున నొదిగి నిలువఁబడి యానందమును బట్టఁ

జాలక యాపాటతోఁదనకంఠస్వరముం గలిపి " తొలినేఁ జేసినపూజాఫలము " అని తానుగూడఁ బాడెను.

స్వరత్రియమునకును సమ్మేళనమైనది. ఫలరసమున నమృతరసము చేరిన ట్లుండెను. మలయవాయువులలో మాధవీకుసుమసౌరభము లలమికొనిన ట్లుండెను. చంద్రికాకాంతిలో విద్యుత్కాంతి ప్రసరించిన ట్లుండెను. ప్రియురాలికలకంఠస్వరము మధురవీణాస్వరముకంటెను మాధురీమయ మైనది కాఁబోలును! అవును — అచేతనమగు వీణ కేవలతాత్కాలికసుఖస్వరమయమైనది మాత్రమే. కాని సచేతనయగు ప్రాణప్రియామోహనమూర్తి నిరంతరప్రేమామృతరసమయ మైనది!!

వేంకటేశ్వరుఁడు ప్రేమపరిఫుల్లనయనములతోఁ దలయెత్తి చూచెను. ఎట్టయెదుటఁ దొంగితొంగిచూచుచుఁ గలకలనవ్వుచున్న యలమేలుమంగముద్దుమొగ మాతనికంటఁ బడియెను. అప్పుడు వేంకటేశ్వరుఁడు ప్రేమోద్రిక్తహృదయముతో వీణ మీటుచు.

" అలమేలుమంగ — ఆట లాడంగ
అలరువాకిళ్లలో — అమృత మొల్కంగ
శ్రీరంగ రంగ — చిన్నారిరంగ
నీనిండురంగ — చెన్నుమీరంగ "

అనిపాడెను. పదములుమాత్రము పాటయందున్నవి గాని భావములన్నియు నంతరంగమునందే నృత్యము చేయుచుండెను. వేంకటేశ్వరుఁడు సముత్సాహపరవశుఁ డైనప్పు డనసూయ నిల్లె మేల మాడుచుండును.

అప్పుడు ప్రేమమయి యగునసూయ విలాసమయం బగు పదవిన్యాసముతో నానందమయంబులగు కటాక్షావలోకనంబులతో

నవవికసితకుసుమవల్లరింబోలి కలకలనవ్వుచు సమీపమునకుఁ బోయి తనమెడలోనున్న పుష్పహారముతోఁ బ్రాణేశ్వరు నలంకరించెను. అనసూయ పరిహాసప్రియుండగు తనప్రాణేశ్వరుని దానును బరిహసింపవలయునని తలఁచినదిగాని యానందాతిరేకముచే నప్పుడు వేంకటేశ్వరుఁడు నిజముగఁ బూలరంగఁ డయ్యెను !!

అప్పుడు వేంకటేశ్వరుఁ డానందముతో ననసూయను గౌఁగిలించుకొని యారత్నకంబళముపైఁ దనపార్శ్వమునఁ గూర్చుండఁజేసికొనియెను. అనసూయ చిఱునవ్వు నవ్వుచు మృదుమధురస్వరముతో ‹‹వీణవాయింపుఁడు! పాటనాఁపి వైచితిరేమి ? ›› అనియెను.

వేంక — (అనసూయచుబుకమునుస్పృశియించుచు) ప్రియా! ఈపాట నీమాటలకంటెను మధురమైనదా ?

అన — మీరు నాకుఁజెప్పినకృతు లన్నిటిలోనను ‹‹పూజాఫలమే›› మిగులరసభావసమన్వితమై మనోహరముగ నున్నది.

వేంక — రాగలతిక వగునీకుఁ దెలియని దేమున్నది ? బాగుగ గ్రహించితివి.

అన — మొన్నటిదినమున శ్రీభీమేశ్వరదేవాలయమున భీమశంకరశాస్త్రి యీకృతినే పాడినాఁడు — కాని యింత బాగుగ లేదు.

వేంక — నీమాట నిజమే. ఈకృతి నిట్టిమధురస్వరసంయుతముగ దామోదరుఁ డొక్కఁడుమాత్రమే పాడఁగలఁడు. పాపము! సురాపానము మొదలగుదురభ్యాసములు లేకయున్నచో నాతఁడు సంగీతపూజ్యుఁ డయ్యెడివాఁడే.

అన — ఔను. ఆతఁడు మంచికుటుంబమున జన్మించి మంచివైభవము ననుభవించినవాఁడేనఁట! తుదకాతనియదృష్ట మీవిధముగఁ బరిణమించినది.

వేంక—నీకీకృతి యంతయును వచ్చినదా ?

అన—కృతి వచ్చినది కాని కల్పితస్వరముమాత్రి మింకను రాలేదు.

వేంక—కలకంఠముకూడ ననుకరింపఁదగిన సహజమధుర కంఠస్వరముఁ గలనీకు కల్పితస్వరములతోఁ బని యేమున్నది?

అన—(మందహాసవదనముతో) మాటిమాటికిని బరిహాస ములేనా ?

వేంక—హాస్యప్రియ వగునీవు సత్యమునుగూడఁ బరిహాస ముగనే భావించుచున్నావు.

అన—మీమాటయే నాకు సత్యము—మీహాస్యమే నాకా నందము—

వేంక—నీప్రేమయే నామహాభాగ్యము— నీసాన్నిధ్యమే నాస్వర్గరాజ్యము— నీవేనాప్రాణము—

అని ముద్దుపెట్టుకొనియెను. అప్పుడు ప్రేమభరవిహ్వల యగు ననసూయ "తొలినేఁ జేసినపూజాఫలము" అని పాడఁదొడంగెను.

వేంకటేశ్వరుఁడు వీణవాయింపనారంభించెను. ఇరువురు నదే పాట— ఆప్రేమానందమూర్తులసన్నిధాన సౌభాగ్యంబునంజేసి ధన్య త్వముం గాంచినదియుం బోలె నావీణయును "తొలి నేఁజేసినపూజా ఫలము" అని పాడుచుండెను.

కృతియంతయును బూర్తియైనది. అనసూయ క్రొత్తకృతిని నేర్చికొనుటకై పుస్తకమును దీసికొని పత్రములను దిరుగవైచుచుం డగాదానిలోనుండి యొకకాగితము క్రిందఁ బడియెను. వేంకటేశ్వ రరావాకాగితముం దీసిచూచి యాశ్చర్యముతో "ఇదియేమి" అని యడిగెను.

అన—ఈచిత్రపటమును మీరు చూడలేదా ?

వేంక—లేదు. ఇది యెక్కడిది ?

అన—శారదామూర్తివలెనిదియీపుస్తకమునందే యున్నది.

వేంక—వీణ వాయించుచున్నటు లున్నదే.

అన—అవును.

అని చెప్పి యనసూయ యాచిత్రపటమునందుకొని నిశ్చల నయనములతోఁ జూచుచుండెను. వేంకటేశ్వరరావు వీణమీటుచు ,,అదియేమి యంతవింతగాఁ జూచుచున్నావు ? '' అనియెను.

అన—విశాలము లగుకన్నులును వినీలంబులగుకుటిలకుంతలములును, వికచారవిందసదృశంబగు వదనమండలమును విశ్వసుందరదుర్లభంబగుమోహనసౌందర్యమను పింతగనే యున్నవి.

వేంకటేశ్వరుఁడు తృణీకారసూచకస్వరముతో ,,అలాగా ? నీకంటెనా ? '' అనియెను.

అన—ఔను.

ప్రశస్తగుణగ్రహణసుస్వభావ యగునవసూయ సత్యముగఁ దానెట్లు భావించుకొన్నదో యట్లే చెప్పినది.

వేంక—(ప్రేమసూచకస్వరముతో) ఓసిముగ్ధహృదయా ! నీచక్కఁదనము నీకెట్లు తెలియును ?

అన—(మృదుమధురస్వరముతో) మఱి యింకెవ్వరికిఁ దెలియును ?

వేంకటేశ్వరుఁడు—గుండెలపైఁ జేయి పైచుకొని ,,నాకన్నులకు—నాయంతరంగమునకు—నాప్రాణములకు— నాకు—'' అనియెను.

అనసూయ పట్టరాని యానందముతో నాత్మేశ్వరుని కౌఁగిలించుకొనియెను.

## అయిదవ ప్రకరణము.

పుణ్యమో పాపమో నీవు ♦ పూనుకొన్న
యొక్క కార్యంబు నెఱవేర్చు ♦ మన్నయపుడు
మంచిచెడ్డలఁగూర్చి యో ♦ చింపు మెపుడు :
తెలివిగలదేని నిన్నటి ♦ దినమునందు.

నిన్న — హారావళి.

రాత్రి రెండు యామములు కావచ్చెను. అష్టమీచంద్రుఁ డప్పుడప్పుడే పశ్చిమాశాసముద్రమునఁబతనోన్ముఖుఁ డగుచుండెను. ఆయస్తంగతార్థచంద్రుని క్షీణకిరణము లాషాఢకృశయగుకృష్ణవేణీవిశీర్ణవేణికలం బ్రసరించుచుండెను. అప్పటికి యామినీరమణి తన చుట్టుచెంగావిచీరపై నీలవసనావకుంఠనమును సవరించుకొనుచుండెను. ఆరజనీకాంతతో మంతనములాడుచుఁ బ్రవహించుచున్న కృష్ణవేణీతరంగిణి యప్పుడు సార్థకనామయగుచుండెను. విజ్ఞానవిరహితంబగునంతరంగము నజ్ఞానమాక్రమించుకొనునట్లు, ప్రచురకౌముదీవిహీనంబగు ప్రకృతికాంతను బ్రబలావేగముతో నంధకారమాక్రమించుకొనుచుండెను.

ఆసంధిసమయమున విజయవాడకు సమీపమునందున్న రాజమార్గమునకుఁ బార్శ్వమునందలి తరుషండమునుండి యెవ్వరో యిరువురుమనుష్యులు మెల్లమెల్లఁగ మాటలాడుకొనుచుండిరి.

ప్రథ—ఇంకేఁ గార్యము లేదు. పసరు పనిచేసినది కాదు.

ద్వితీ—(నిట్టూర్పు విడిచి) మఱచితిమిగాని దొరగారిమందు మనతో నుండవలసినది.

ప్రథ—శృతిమించిరాగానఁబడినప్పు డేమనుకొన్న నేమిలాభము?

ద్వితీ—ఇఁక నేమిచేయుదము?

ప్రథ—నెత్తిఁబెట్టుకొని పోవలసినదే. పట్టువచ్చినప్పుడు పర్వతమునైన నమోయఁగలము గాని పట్టువదలిపోయినప్పుడు గడ్డిపరకనైనను గదపలేము.

ద్వితీ—చేతులు ముడిచిపెట్టుకొని యిట్లే కూరుచున్నచో జిక్కు కాదా?

ప్రథ—ఆతొందరలో డొంకలోఁ బడిపోవుటచే మనయిద్దఱకును గాళ్లనిండ ముండ్లు విరిగినవిగాని పనివచ్చినప్పుడు పాఱిపోలేని పంద యెవఁడున్నాఁడురా యిందులోను?

ద్వితీ—ఆమాత్రము ధైర్యము చెప్పుటకయిన వాఁ డిట్లయిపోయినాఁడుగదా!

ప్రథ—చెట్టుపడిపోయినది. పిట్టలు చెదరిపోవలసినకాలము వచ్చినది.

ద్వితీ—ఆమాట చెప్పకురా! గుండె బ్రద్దలయిపోవుచున్నది.

ప్రథ—నిజమేరా! కుడిబుజము కూలిపోయినదిరా!

ద్వితీ—బుజాలేకాదు ప్రాణాలేపోయినవిరా!

ప్రథ—ముందున్నవాఁడవు వెనుకకు వచ్చుటచేత సీతది తప్పిపోయినదిరా?

ద్వితీ — ఏమిలాభము! గండము తప్పినదిగాని పుట్టి ముంచి వేసినదికాదా!

ప్రథ — ఆశకోసి వేసినది — ముందు (బోయినవాండ్రు) మన కోస మెదురుతెన్నులు చూచుచుందురు. ఇంత మునింగిన దని వారి కెట్లు తెలియును?

ద్వితీ — మనము బయలుదేరినవేళ మంచిదికాదు. ఇన్నిచిక్కులు వచ్చినవి.

అంతలో దూరమునుండి బంగ్లువచ్చుచున్న గంటలచప్పుడు వినవచ్చెను. వారిరువురును మాటలను గట్టిపెట్టి నిశ్శబ్దముగం గూరుచుండిరి. అప్పు డనతిదూరమునం దొకవ్యక్తి రాజమార్గము నతిక్రమించి తమవైపునకే వచ్చుచున్నట్లు వారికి దృగ్గోచర మయ్యెను. ఇరువురును వంటుకొనుచు మెల్లమెల్లగ సమీపవృక్షాంతరాళమునకుం బోయి దాంగికొని కనిపెట్టిచూచుచుండిరి.

ఆవ్యక్తి క్రమక్రమముగ వారు వదలిపోయినస్థలమునకు వచ్చి యగ్గిపుల్లను వెలిగించి చూచెను. అచ్చట గృష్ణవర్ణదీర్ఘకాయుండును, బలిష్ఠుండు నగునొకపురుషుండు నురుగులుగ్రమ్మిన ముఖముతో మృతప్రాయుండై పడియుండెను. ఆవ్యక్తి మరల నగ్గిపుల్లను వెలిగించి యాతని సర్వావయవములను బరీక్షించిచూచెను. ఆపురుషునికుడిపాదమునం జీరుకొనిపోయినట్లున్న చిన్నగాయమును రక్తచిహ్నములును నగపడియెను. పాదమంతయును బనరుడాగులతో నిండియుండెను.

అప్పు డావ్యక్తి యాతనికిం బాముగఱచియుండు నని నిశ్చయించుకొనియెను. తోడనే తనసంచిలోనున్న కరాటముం బైకిందీసి యందలిభస్మమును గాయముపై నంటించెను. మఱికొంతభస్మమును

న్నలయందును నాసారంధ్రములయందును కర్ణరంధ్రములయందును బోసి యూదెను. అవిశ్రమముగఁ జేసినపిమ్మట నేమేమిరోమమంత్రము లనుచ్చరించుచు దనచేతులతో నాతనిశిరముమొదలు పాదములవఱకును స్పృశియించుచు నదేపనిగ నీపాకర్షణమునకై హస్తసంచాలనము చేయసాగెను ఆచర్యయంతయును సమీపముననే చెట్లచాటున దాఁగియున్న పురుషులిరువురు నాశ్చర్యముతోఁ జూచుచుండిరి

ఆవ్యక్తి తదేకధ్యానముతో నావిధముగ మంత్రించుచుండగాఁ గొంతసేపటికి మృతప్రాయుఁడై పడియున్న యాతనికిఁ జైతన్యము కలిగెను. క్రమముగా మఱికొంతసేపటికాతఁడు లేచికూర్చుండెను. అప్పుడు చెట్లచాటున నున్నపురుషు లిరువురు నద్భుతానందపరవశు లైపోయిరి. అప్పు డాపురుషుఁడు దీర్ఘశ్వాసములను విడుచుచుఁ దనపాదమును గట్టిగఁ బట్టుకొని గోండ్రింప నారంభించెను.

చికిత్సకుఁడు—ఎట్లున్నది ?

పురు—మరణబాధగ నున్నది—అయ్యా ! నన్ను బ్రదికింపఁజాలినపుణ్యాత్ముఁడ వీబాధనుండికూడ రక్షింపఁజాలవా ! స్వామీ ! మీరెవ్వరు ?

చికి—నేను విషచికిత్సకుఁడను.

పురు—నాయనా ! నీవు నాపాలిటిదైవమవు. నీప్రభావముచే నీయాతననుగూడఁ దప్పింపవా ?

చికి—నీవెవ్వరు ?

పురుషుఁడు సందేహముతో నించుకసేపూరకుండి "నేనెవ్వఁడనైన నేమి ? నన్ను రక్షింపుము !" అని పాదములఁ బట్టుకొనియెను.

చికిత్సకుఁ డాపురుషునిర క్తనాళము లన్నిటను వ్యాపించి చైతన్యమును జంపివైచినవిషమునంతను మంత్రౌషధశక్తులచే సాకర్షించి పాము గఱచినపాదమువఱకును దింపివైచెను; కాని సంపూర్ణముగ విషమును దీసివేయలేదు. అందుచే నాపురుషుఁడు మిగులబాధపడుచుండెను. చికిత్సకుఁ డాతనిఁజూచి "నన్ను బ్రతికించుటకుమాత్రమే మందు నాయొద్ద నుండెను. సంపూర్ణముగ నీవిషమును హరింపఁజేయు నౌషధములు ప్రస్తుతము నాయొద్ద లేవు" అనిమెను.

పురుషుఁడు బాధతో 'మహాత్మా! నన్నెందుకు బ్రదికించితివి? ఈ బాధ ననుభవింపఁజాలకున్నాను' అనియెను.

చికి—అవకాశ మున్నంతవఱకు నాచేతనైనపని చేసితిని. ఔషధము లేనప్పు డిఁక నేనేమి చేయఁగలను?

పురు—ఈ బాధ కొంచెమైనను దగ్గింపఁజాలవా?

చికి—ఇక్కడ నట్టియౌషధ మేమియును లేదు.

పురు—ఎక్కడ నున్నది?

చికి—నీవు నాతోఁగూడ వచ్చినయెడల—

పురు—(అర్ధోక్తియందే) బాధచే నొక్కయడుగైనఁ గదపఁజాలకున్నాను— నీతో వచ్చుట యెట్లు?

చికి—ఒక బండి మాటాడి తీసికొని వచ్చెదను.

పురు—నేను బండిమీఁద నెక్కి రాను—

చికి—అది యేమి?

పురు—ఒకరివెంట వచ్చుట నాకిష్టము లేదు.

చికి—పోనిమ్ము! తెల్లవారినవెనుక మీవారి నెవరినైన వెంటఁ బెట్టుకొని రావచ్చును.

పురు—పట్టపగలు గుడ్డగూబనైనను బ్రతుకంటఁ బడును గాని ప్రమాదముచేసైన నేనట్లు చేయఁజాలను.

చికి—పోనిమ్మా ! ఇఁక నేఁ బోయెదను.

పురుషుఁ డాతనిపాదములం బట్టుకొని ‹ పుణ్యాత్మా ! నన్ను నీవు బ్రతికించితివి ! నేను నీబిడ్డను ! నన్నింతటి బాధలోఁ ద్రోసి వైచి విడనాడిపోవుట నీకు న్యాయము కాదు ! › అనియెను.

చి—నాతో వచ్చినచో నీబాధఁ దీర్చెదను.

పురు—నీతోమాత్రము రాఁజాలను. కాని నీవు రమ్మన్న చోటికి వచ్చెదను.

చికి—ఎట్లు వచ్చెదవు ?

పురు—ఎట్లు వచ్చెదనో చెప్పుటవలన నేమియుపయోగ మున్నది ? ఎక్కడకు రావలయునో సెలవిండు.

చికి—గోదావరీతీరమునందలి గోపాదక్షేత్రమునకు నీవు రావలయును. అచ్చట నున్నవటవృక్షమునొద్ద నన్ను నీవు కలిసికొన వచ్చును.

పురు—మహాత్మా ! నాపైఁ బరిపూర్ణానుగ్రహ ముంపవల యును. ఈబాధ తీరువఱకు నీప్రాణములతో నాకేమియును సౌఖ్యము లేదు. నేను మీవెనుకనే వచ్చి మిమ్మచ్చటఁ దప్పక కలిసికొనియె దను. మీకుఁ బదివేల నమస్కారములు !

“ శీఘ్రముగ నీకు మనశ్శాంతి యగుఁగాక ! ” అని యాశీర్వదించి చికిత్సకుఁ డయ్యంధకారమున నంతర్హితుఁడై పోయెను.

పిమ్మట నా చెట్లచాటున నున్న యిరువురుపురుషులును వచ్చి పర మానందముతో నాతని గౌఁగిలించుకొనిరి. ఆపురుషుని ఘరణమున్ను

గూర్చియు, పునర్జీవనముం గూర్చియు మహాత్ముఁ డగునాచికిత్సకుని మహామహిమం గూర్చియు ననేకవిధములఁ గొంతసేపటివఱకు వారు ముప్పురును ప్రశంసించుకొనిరి.



## ఆఱవ ప్రకరణము.

‘‘చెలువలరెంటనవ పెండ్లికి
బలవంతము సేయుదురఁటె ♦ చలవరుచుండెన్
గులజాలు; మారాలోచన
వ.లే—’’

కపోతము— హారావళి.

విజయవాడకుత్తరమువైపున రాజమార్గమున కించుకదూరముగ నొకపెద్దప్రహరియును దానినడుమ రెండంతస్తులచిన్న మేడయు నుండెను. ప్రహరిద్వారమునుండి సౌధద్వారమువఱకును గలమార్గమున కిరువంకల నొత్తుగఁ బోఁక చెట్లు పెఱిగియుండెను. సౌధద్వారముకడ ద్వారపాలకులవలె రెండుకొబ్బరిచెట్లుండెను. ఆసౌధమును బరివేష్టించియున్న ప్రహరిమధ్య ప్రదేశమునందంతటను నానావిధఫలవృక్షములును బుష్పలతలును గన్నులపండువుగా నుండెను. ఆమందిరము విశాలోద్యానవనమధ్యమం దుండుటచేతను, బట్టణమునకుఁ గొనయం దుండుటచేతను, రాజమార్గమునకించుక తొలఁగియుండుటవలనను, నగరసమ్మర్దమునకు సహింపక నెమ్మదిగ నుండఁగోరువారి కతి నివాసయోగ్యమై యుండెను.

ఒకనాటి ప్రాతఃకాలమున నెనిమిదిగంటలవేళ నాసౌధమునకు మొదటియంతస్తునందలి దక్షిణపు వైపుగదిలో నొక పురుషుఁడు మంచముపైఁ బరుండియుండెను. విభూతిరుద్రాక్షమాలికాలంకృతుఁడును, గాషాయవసనావృతవిగ్రహుండును, దివ్యతేజోవిరాజమానుండును నగు నొక యోగిపుంగవుం డాతనిసమీపమునందొక పీఠముపైఁ గూర్చుండియుండెను.

శయ్యాగతుండగు పురుషుఁ డప్పుడు యోగికి నమస్కరించుచు "మహాత్మా! మీయనుగ్రహమువలనే నేను జీవింపఁగలిగితిని. మీ మహిమవలన నాశరీరాయాసము చేతితోఁ దీసివేసినట్లుపశమించినది. దుర్మార్గులచేతులలోఁ బడిపోకుండఁ బ్రాణదానముం గావించితిరి" అనియెను.

యోగి—ఏమైన నేమి! ఇఁకొకయడుగు ముందుగ వచ్చినచో నాదొంగలచేతులలోఁ బడకుండ నీభార్య నీకు దక్కియుండును.

పురు—స్వామీ! ఆమె నాభార్యకాదు!

యోగి—మఱి యెవ్వరు?

పురు—అది యొకవారకన్య—

యోగి—నీయింట నేదు కున్నది?

పురు—నేను పెండ్లియాడవలయునను నుద్దేశముతోఁ దీసికొని వచ్చితిని.

యోగి—ఎంతకాలమైనది?

పురు—ఆఱుమాసము లైనది.

యోగి—ఇంతవఱకు నేల పెండ్లి చేసికొనలేదు?

పురు—వేశ్యావివాహముకంటె విధవావివాహము చేసికొనుటయే యెక్కువలోకోపకారముగ నుండునని యెంచి నేను నామొదటియుద్దేశమును మార్చుకొంటిని.

యోగి చిఱునవ్వుతో "నీవు తీసికొనివచ్చిన యా రకన్య నిన్నుఁ బెండ్లియాడుట కంగీకరించినదా ?" అనియెను.

పురు—అంగీకరించినది—కాని యామెబంధువులుమాత్రి మంగీకరింపలేదు. అందువలననే యింతపని జరిగినది. నాపెదతండ్రి కుమారుఁ డొకఁడున్నాఁడు. వాఁడు త్రాగుబోతు. వేశ్యాలోలుఁడు— రాత్రిజరిగిన యీఘోరకృత్య మాపరమదుర్మార్గునిమూల మున నే జరగినది.

యోగి—పాపము వారామెను జంపివేయరుగద ?

పురు—చంపరు— ఎట్లో మనసు త్రిప్పి దానియింటికే తీసికొని పోవుదురు.

యోగి—ఒకవేళ నీవావారకన్యనిదివరకే పెండ్లి యాడి యున్నయెడల నప్పుడు విధవావివాహము కొఱకామెను నీవు వదలి వేయుదువా ?

పురు—అంతకు ముందుగనే నాయుద్దేశము మార్చుకొనుటచే నేనామెను బెండ్లియాడుట మానివైచితిని.

యోగి—తీసికొనివచ్చినదాని నేమిచేయఁ దలఁచుకొంటివి ?

పురు—నావంటిసంస్కారప్రియు లెవ్వరైన నున్నచోఁ బెండ్లిచేయవలయు నని నిశ్చయించుకొంటిని.

యోగి—ఇప్పుడు నీవు వింతతూద్వాహము చేసికొనుటకు నిశ్చయించుకొంటివా ?

పురు—ఔను.

యో—సంబంధము స్థిరపడినదా ?

పురు—స్థిరపడినట్లె—

యో—అదియేమి ?

పుష—అనివార్యమగు పూర్వాచారమునకు భయపడి యీ వధు వింకను నంగీకరించుట లేదు.

యోగి—వధు వంగీకరింపనప్పుడు పెండ్లి యెట్లు?

పురు—అక్కఱలేదు— దురాచారసంస్కారణప్రియుఁడగు నా మేనసోదరుఁ డీవిషయమున మిక్కిలి పట్టుదల కలిగి యున్నాఁడు.

యోగి—ఆ చిరంజీవి యెవ్వరు ?

పురు—అతఁడు నాప్రియమిత్రుఁడు— చెన్నపట్టణమునఁ బట్టపరీక్షకుఁ జదువుచున్నాఁడు— ఆతని పేరు భారతరావు.

యోగి యించుక సేపాలోచించి "నీవు విద్యాధికుని వలెనే యగపడుచున్నావు— కాని నీమాటలనుబట్టి నీహృదయ మస్థిర మైనట్లు తోఁచుచున్నది. సంస్కారశూరుఁడవై యుండియు నీవు నిన్నుఁ బ్రేమించిన వారకన్యను పెండ్లియాడుట మానుకొంటివి. నిన్నుఁ బ్రేమించుట కంగీకరింపని వితంతువధువును బలవంతముగఁ బెండ్లి చేసికొనుటకై ప్రయత్నించుచున్నావు. ఇది యీ సంస్కారప్రియత్వము ! ఇది యీ దేశోద్ధరణధురంధరత్వము ! ఇది యీ విద్యాధిక ధర్మము ! ఆర్యధర్మనిరతులును, భారతవర్ష మహావైభవ పునరుజ్జీవన కారణజన్ములు నగు రామమోహనుఁడు— ఈశ్వరచంద్రవిద్యాసాగరుఁడు— కేశవచంద్రసేనుఁడు మొదలగు మహామహుల పవిత్రోపదేశముల నీవిధముగనా నీవు గ్రహించినది ? మానవస్వభావమునకు వ్యతిరేకమగు సంస్కారమా ? మనుష్యత్వమునకు విరుద్ధమగు ప్రవర్తనమా ? అనియెను.

పురుషుఁడు విరక్తిభావముతో "స్వామీ ! మీరు నాయుద్దేశమును బాగుగ గ్రహించినట్లగపడదు." అనియెను.

యోగి—ఇందు నీయుద్దేశ మేమి ?

పురు—నాప్రాణమిత్రునియభీష్టమును ఫలింపఁజేయుటకును, ఒకయనాథబాలిక నుద్ధరించుటకును నా మొదటియుద్దేశము మార్చుకొనవలసివచ్చినది.

యోగి తీవ్రస్వరముతో 'నీయుద్దేశమే పరమధర్మ మనుకొంటివా? ప్రాణమిత్రునియభీష్టసిద్ధికొఱకుఁ బ్రాణములనైన విడువవచ్చునుగాని భార్యాభర్తృధర్మమును బరిత్యజింపఁదలఁపవచ్చునా?' అనియెను.

పురు— ఆమె నాకు భార్య కాదే!

యోగి—అలాగా? -- నీవామెను బ్రేమించితివి—నిన్నామె ప్రేమించినది—ఇరువురును పెండ్లియాడుటకు నిశ్చయించుకొంటిరి. ఇఁక నామె నీకేమగును? హృదయ మస్థిర మైనంతమాత్రమున ధర్మ మస్థిరమైపోవునా? కల్యాణమునకుఁ గార్పాససూత్రమే ప్రధానమనుకొంటివా? ప్రేమసూత్రమక్కఱలేదా? ధర్మసూత్రమక్కఱలేదా?

పురుషుడు వేదన నభినయించుచు మఱిమాటాడ లేదు. మాటలాడుట కాతని కేమియును దోఁచనులేదు. యోగి మాధ్యాహ్నికకృత్యములం దీర్చుకొనుటకై నదీతీరమునకుఁ బోయెను.



# ఏ డ వ ప్ర క ర ణ ము.

ఉ. జగ మంధకారమయమై
పగపు సముద్రమయి బ్రదుకు భారంబై తోఁ
చఁగ నగని గోలుపోయిన
ఖగముఁగూలితనిన్నఁ జూచి యేగుదుర్యోడా!

కపోతము—హారావళి.

సరస్వతియును సత్యవతియును జిన్నతనమునందియుఁ జెలిమికత్తెలై యుండిరి. ఇరువురు నిరుగుపొరుగువారై యుండుటవలన వారికి నిరంతరసమావేశమున కభ్యంతరమేమియును లేకయుండెను. ఆ కారణముచే వారి స్నేహానుబంధము దినదినాభివృద్ధి నందుచుండెను. ఇరువురును సరళహృదయలు. సర్వసంపన్నంబు లగు సజాతీయ కుటుంబములం జన్మించినవారు; సమానప్రకృతులు; సమవయస్కులు. శ్రావణతరంగిణులంబోలి వారిరువురును సంపూర్ణయౌవనవతులై యుండిరి. కాని యాతారుణ్యామృతరసప్రవాహము శరద్వేణికవలె వినిర్మలమైనది. ఆయిరువురకును గౌరీపతిశాస్త్రియే చదువు చెప్పెను. అన్నపూర్ణాగౌరీపతులు సత్యవతినిగూడఁ దమ కన్నబిడ్డయగు సరస్వతివలెనే చూచుకొనుచుండిరి.

సత్యవతికిఁ జిన్నతనమునందే పెండ్లి యయ్యెను. ఆమె తండ్రి తనతల్లి మరణించినసంవత్సరములోపలనే సత్యవతికి వివాహముఁ గావించెను. పెండ్లి యగునప్పటికి సత్యవతికి మూడవయేఁడు. ఆమె భర్త యగునారాయణునకుఁ బండ్రెండవసంవత్సరము. నారాయణుఁడు చెన్నపట్టణములోఁ బట్టపరీక్షయందుత్తీర్ణుఁడైనతరువాత

నచ్చుటఁ దనకు స్నేహితుఁడైన యొకజమీందారునిధనసాహాయ్యముచే నింగ్లాండు దేశమునకుఁ జదువుకొనఁబోయెను. అతఁడు విదేశమునకుఁ బోయినకొలఁదికాలమునకే దైవదుర్విపాకముచే నాతఁడచ్చట మరణించినట్లు జాబువచ్చెను. పాపము సత్యవతి తనపంద్రెండవయేఁటనే వితంతువయ్యెను.

సత్యవతి యన్నయగు భారతరావు చెన్నపురియందలి క్రైస్తవకళాశాలలో బి.యే.పరీక్షకుఁ జదువుకొనుచుండెను. అతఁడు కరుణామయస్వభావుఁడు. కుశాగ్రబుద్ధి. సత్యవతిం దలంచికొనిన నాతని హృదయము నీరైపోవుచుండును. అతఁడు సత్యవతియానందముకొఱకు సత్యవతిసుఖముకొఱకు నిరంతరము నాలోచించుచుండును. తఱచుగ నాతఁడు సత్యవతికిఁ బ్రేమరస ముట్టిపడునట్టిపలుకులతో జాబులు వ్రాయుచుండును. ఒక్కొక్కప్పుడు తల్లిదండ్రులహృదయములు కరఁగి నీరైపోవునట్లు--అకస్మికముగ నాసమయమునందుఁ దన హృదయభావము వారికిలీలామాత్రముగ స్ఫురియించునట్లు మనవులను దెలుపుచుండును. ఆయుత్తరములం గాంచితల్లిదండ్రులునిరంతరము నెడతెగకుండదహించుకొనిపోవుచున్నహృదయములతో దీర్ఘశ్వాసములనువిడుచుచు దమనుస్నహాజీవితము నతికష్టముగఁగడపుచుండుటయే గాని చిరకాలానుబంధముచేఁ బరపరిచితమై యున్నతమయాచారసూత్రము నుల్లంఘించుటకు సాహసింపఁజాలక చింతించుచుండిరి.

నేఁటిదినమున సరస్వతియింటికిఁ బోవఁదలఁచుచున్న సమయమున భారతరావునొద్దనుండి సత్యవతికి జాబు వచ్చెను. అన్నగారియుత్తరమనిన సత్యవతికిబ్రహ్మానందము. సత్యవతి తనయన్నగారినిదల్లిదండ్రులకంటెను విశేషముగఁ బ్రేమించుచుండెను. భారతరావు తాను వేసవికాలపుసెలవులలో వచ్చెదనని తండ్రిగారికిఁ గూడ నొకలేఖ వ్రాసి పంపెను.

సత్యవతి యొంటిగఁ గూరుచుండి తనప్రియసోదరుఁడు వ్రాసినయుత్తరమును జదువుకొనుచుండెను. అప్పు డామెహృదయకమలము క్షణక్షణవికసిత మగుచుండెను. ప్రేమరసార్ద్రములగుచూపులు ప్రేమభరాలసములగుటచే నక్షరపథమున మందమందముగఁ బరిచారము సేయుచుండెను. నిర్మలప్రేమైకనిధానంబు లగునందలి మృదులపదంబులు మధురధ్వనితములై మధురభావానుభవంబున కనుబోధము లగుచుండెను. సత్యవతి తదేకదృష్టితో నాయుత్తరమును దిలకించుచుండెను.

“ప్రియసహోదరీ!

నేనిచ్చట సంతోషముతోఁ జదువుకొనుచుంటి నని వ్రాయఁగలుగుట ప్రేమాతురవిలసితంబు లగునీజాబులను దలఁచుకఁ జూడఁగలుగుచుండుటవలననే — పరీక్షలతొందరలో నుండుటచే నీకు వారము దినములనుండి యుత్తరము వ్రాయఁజాలకపోయితిని. నాయాలస్యము నీకించుక మనఃక్లేశమునకుఁ గారణ మగునేమో యని నాహృదయము చలించిపోవుచున్నది. సోదరీ! సుఖదుఃఖములకు మన మిరువురమును సమభాగులము. ప్రేమవల్లికాపల్లవాంతరాళము నందలికోమలప్రేమైకకోరకములము. నీసుఖమే నాసుఖము. నీయానందమే నాయానందము. నీకించుక మనస్తాపమైనను నేను సహింపఁజాలను. వెన్నెలవెలుఁగని చిమ్మచీకటిలోఁ గన్నులు తెఱవనికాలమునందే ప్రతికూలపవనసంక్షోభతరంగము నిన్నొ అసికొనిపోయినది. అది యజ్ఞాతమైనది — అపునరావృత్తమైనది — అది యప్పుడే మహావాయుసముద్రమున విలీనమైపోయినది. లీలామాత్రంబగు నాయనుభవమును భావాంతరమున విలీనముచేసి జీవనప్రపంచమునఁ బురోభిగమనము గావించుటయే మనకర్తవ్యము. సుఖమయపరిపం

చమును గన్నెత్తిచూచుటకుఁ బరమేశ్వరునికి క్రీడాసాలభంజిక లగు జీవులకందఱకును సమానాధికార మున్నది. పరమేశ్వరుఁడు నిన్ను నిరంతరసుఖానుభవంబునకే సృష్టించియుండె నని వ్రాసితివి. తల్లీ! ప్రేమైకస్వరూపుఁ డగు జగదీశ్వరుఁ డంతటిదయావిహీనుఁడు కాఁడు. కేవలసుఖమయప్రపంచమున మానసికదౌర్బల్యముచే స్వయముగ మనమే దుఃఖబిభీషికలం గల్పించుకొని నైరాశ్యమును దెచ్చిపెట్టుకొనుచున్నారము. సోదరీ! నీవు కలఁతనిద్దురలో దుఃఖస్వప్నములం గాంచుచున్నావు. అవి కేవలము భ్రాంతిమూలకము లైనవి. జాగరితవై యించుక యాలోచించి చూడుము! పరిమళకుసుమమును బాదములతో నలిపివేయవలయునని యెవ్వరు తలంతురు? నీయుత్తరమును జూచినప్పుడు చిన్నవోయియున్న నీముద్దుమొగము నాకన్నులఁ గట్టినట్లయినది. నీవేఁడికన్నీటిం దలఁచుకొని నారక్తనాళములు శోషించి పోయినవి. చలించిపోవుచున్న నీహృదయకమలమును భావించుకొని నాహృదయసంచాలన మాఁగిపోయినది. తల్లీ! ఇఁక నేనెట్లు సహింపఁగలుగుదును? దూరదేశమందున్న నాహృదయమును విదారణము గావించునంతటి సునిశితంబు లగుతీవ్రాక్షరముల నీకోమలకరపల్లవమునుండి యెట్లు వెలువరించితివి? కుసుమసుకుమార మగునీహృదయమున కంతటి కాఠిన్య మెట్లు కలిగినది? సోదరీ! ప్రేమైకమూర్తి వగునీకు నీప్రియసోదరునిపై జాలి లేకపోయినదా? "నాకీలోకమునం దింక నేమి యున్నది?" అనివ్రాసితివి. ఎంతటినిర్దయురాలవు! త్వదేకప్రాణమైయున్న నీ యాత్మసోదరుని మఱచిపోయితివా? నీవేఁడి నిట్టూర్పుల నాహృదయకమలమునుండి వెలువరించుచున్నప్పుడు నావేఁడికన్నీటికి నీనయనకమలాంతరమునఁ జోటు లేకుండఁ జేయుదువా? అట్లు చేయఁజాలవు. నీకరుణార్ద్రహృదయమును నే నెఱుంగుదును. ప్రియసహోదరీ!

హృదయపూర్వకముగ నొక్కమాట చెప్పుచున్నాను. ఇదియే యుపలాలనము— ఇదియే ప్రార్థనము— ఇదియే ప్రబోధము— ఇదియే యాజ్ఞ — ఇదియే శపథము— ప్రేమైకజ్యోతిస్మూర్తుల మగుమనమిరువురమును నీలాకాశపథంబున నిష్కలంకముగఁ బ్రకాశింపఁగలిగినను, నిబిడజ్యోత్స్నాపటలంబున విలీనమైపోవఁగలిగినను బరమానందమే — నీతోఁబుట్టువు నగునన్ను నీకష్టసుఖము లకు సమభాగార్హునిగాఁ జేయుము! సోదరీ! నీవు సత్యవతివి— ఈమాటమఱవకుము! నేను సెలవు లోనంగివతోడనే వచ్చెదను. చి॥ సౌ॥ సరస్వతి నడిగితి నని చెప్పుము!

నీప్రియసోదరుఁడు

భా ర త రా వు".

సత్యవతిహృదయసరోవర మననుభూతపూర్వంబు లగుభావ తరంగములచే సంక్షుభిత మైపోవుచుండెను. ఆదుస్తరతరంగమధ్య మున భయధైర్యములకుఁ బరస్పరప్రబలసంఘర్షణ మగుచుండెను. దుఃఖానందముల కన్యోన్యదుర్భరసంఘట్టన మగుచుండెను. తెలియఁబడకుండఁగనే యామెకనుదమ్ములనుండి ముక్తాఫలంబులవలె నశ్రుబిందువులు జాలువారుచుండెను. శీతలప్రేమరసచిహ్నితం బగు నాలేఖ యుష్ణాశ్రుబిందుసంసిక్త మైపోయెను. సత్యవతి కాసంగతి తెలియనేలేదు. దీర్ఘశ్వాసనంచలితం బగువక్షోవసనమార్ద్రీభూతమై వక్షోభాగమునొత్తుకొని పోవుటకూడ నామె యెఱుంగదు.



## ఎనిమిదవ ప్రకరణము.

అరయఁగ నీజీవితము న
మతి నాజీవితము నొక్క ♦ మాదిరిగానే
పరుగిడుచు నున్నయవి స
త్వరముగఁ దమ యంత్యదశలఁ ♦ బడయుటకొఱకున్.

మౌక్తికము — హారావళి.

"ఏమే సత్యవతీ! వచ్చెద నని చెప్పి యాలస్యము చేసితివి ?" అని సరస్వతి వచ్చి సత్యవతిని బలుకరించెను.

సరస్వతియమృతస్వరము సత్యవతిహృదయప్రవాహమును భావాంతరమునకు మరలించినది. అప్పుడు సత్యవతి ప్రకృతిస్థయై ప్రేమవికసితనయనములతో సరస్వతిం దిలకించెను. సరస్వతి చమత్కృతయై మృదులస్వరముతో "అదయేమే! అట్లున్నావు ?" అనియెను.

సత్యవతి గద్గదస్వరముతో "ఎట్లున్నాను ?" అనియెను.

సర — సుఖనిద్రలో దుఃఖస్వప్నముం గాంచినట్లున్నావు.

సత్య — సఖీ! ఈయిహజీవితమునం దంతకంటె నింక నేమున్నది ?

సర — అది కేవల మజ్ఞానము — దుఃఖనిద్రలో సుఖస్వప్నములను గనవలయును.

సత్య — చెలీ! నాకంతటియదృష్ట మెక్కడ నున్నది ?

సర — నీకావెఱ్ఱి వదలుట లేదు. అదృష్టమునకై కన్నులఁ దెఱచి చూచుచుండుటవలన నేమిలాభమున్నది ?

సత్య—ఔను నామాట నిజమే.

సర—ఐనచో నీకవిచార మెందుకు ?

సత్య—అన్నకొఱకు—ఆతనిసుఖముకొఱకు--ఆతనిసంతోషముకొఱకు—

సర—అన్నయొద్దనుండి మరల జాబు వచ్చినదా యేమి ?

"ఔను" అని చెప్పుచు సత్యవతి యాయుత్తరమును సరస్వతిచేతి కిచ్చెను. సరస్వతి యాజాబును సవిమర్శముగఁ దిలకించుచుండెను. సరస్వతికన్నులుకూడఁ గ్రమముగ నాశ్రువులతో నిండిపోయెను. ఆమె కొంతసేపటివఱకును మాటాడఁజాలక రెక్కనిట్టూర్పు విడిచి "సోదరీ! ప్రియసోదరుని నిష్కల్మషప్రేమస్వరూప మీయుత్తరమునందలిప్రత్యక్షరమునందును బ్రతిబింబించుచున్నదిసుమా!" అనియెను.

సత్యవతి విషాదస్వరముతోఁ "అక్కా! ఈశూన్యగేహము నకై యాదిత్యజ్యోతి నిరర్థకతేజోపరిప్లుత మైపోవలసినదేనా—ఫలపుష్పవిహీనం బగుచిపల్లవలతికకై యామహ్మతరసకలశ మంత స్సారశూన్య మైపోవలసినదేనా ?" అని కన్నుల నీరుపెట్టుకొనియెను.

సరస్వతి సాంత్వనస్వరముతో "చెల్లెలా! ఏల విచారించెదవు ? బహుజన్మసుకృతపరిపాకముచే స్వర్గసుఖస్వరూపుఁడగు ట్టి సోదరునిం బడయుభాగ్యము నీకు లభియించినది. పసిఁడితామరకుఁ బన్నీటికొలనులభియించుట పరమసుఖముకాదా ?" అనియెను.

సత్య—నిరాశాంధకారనిమగ్న నైయున్న నేను సుఖపడుట యెట్లు ?

సర—నిరాశ యనునది కేవలము పట్టి భ్రాంతికల్పిత మైన దుఃఖబిభీషిక యే కాని వేఱు కాదు—సంతుష్టి యొకటి మాత్రమే సత్యస్వరూప మైనది—సుఖమయ మైనది.

ఇట్లు చెప్పునప్పుడు సరస్వతికంఠస్వర మించుకగాద్గద్యమును వహించెను.

సత్య — అక్కా ! నీమాట సత్యమే కావచ్చును. కాని— అనుభవాతీతముగా నున్నది— ఆకాశమునఁ జిత్రలేఖనమా ?— అంధకారమునం దద్దముచూచుకొనుటయెట్లు ?

సర — వెఱ్ఱిదానా ! అంధకారము నీబాహ్యనయనములకే గాని యాభ్యంతరికనయనములకది యెంతమాత్రమును లేదుకాదా?

సత్య — భిన్నప్రకృతులును భేదమనస్తత్త్వంబులు నగు రెండు తరంగములనడుమ నాశూన్యజీవితనౌక సంచలించిపోవుచున్నది. అందొకటినన్నాయనంత ప్రేమసాగరమున కాకర్షించుచున్నది. వేఱి యొకటి యగాధప్రేమప్రవాహమున కాభిముఖ్యముం గల్పించుచున్నది— నేనీసంఘర్షణమునఁ గొట్టుకొనిపోవుచున్నాను. నాకిరువంకలను ప్రేమానందజ్యోతులు ప్రకాశించుచున్నవి— కాని నేను మాత్రము దుఃఖాంధకారమునందే యల్లాడుచుంటిని. సోదరీ ! ఈ శుష్కవల్లరికిక వసంతము లేదు— ఈదుఃఖయామినికిఁకఁ జంద్రసందర్శనము లేదు— ఈవృంతచ్యుతకుసుమమున కిక నీశ్వరపాదసంస్పర్శనసౌభాగ్యము లేదు— సరస్వతీ ! ఎందుకీయాశ ?

సర — నిరాశపడిమాత్రమేమిచేయుదువు ?

సత్య — సుఖమరణమున కెదురుచూచుచుండుటకంటె నింకనుపాయ మేమున్నది ?

సర — అట్లయినచో సామాన్యప్రకృతికిఁ నీకును భేదమేమున్నది ? స్వధర్మమును నిర్వహింపవలదా ?

సత్య — నిజముగా నాకుఁ గర్తవ్య మేమున్నది ? ఉన్నను— నితాంతచింతావైకల్యముచే విశ్రాంతివిరహితహృదయ నగు నేనేమి చేయఁగలను ?

సర—సోదరీ! ఆవిషయమున నేనును నీవంటిదాననే కాదా?

సత్య—అది యెట్లు?— అనుభవము లేకపోయినను నీకాశ యున్నది.

సర—నాకున్నయాశ నీకేల లేకపోవలయును?

సత్య—నీకన్నులవెలుఁగు నీనయనముల లేకపోయినను నీ యంతరంగమునఁ బ్రకాశించుచునేయున్నది— అందుచేతనే నీకు త్సాహశక్తి యున్నది— స్వధర్మనిర్వహణసామర్థ్యమున్నది—

సర— నీవు మాత్రి మట్లేల భావించుకొనఁగూడదు? నీయంతరంగప్రకాశమును నీవేల సందర్శింపఁగూడదు? అంత్యమగు భౌతికప్రపంచమునుబట్టి యనుభవమునకు భిన్నత్వము నాపాదించుకొనుచున్నావు— ఆశానిరాశలను గల్పించుకొనుచున్నావు— సుఖదుఃఖములఁ బరామర్శించుకొనుచున్నావు— కాని భావప్రపంచమున మనయిరువురి యనుభవము నొక్కటియే కాదా?

సత్యవతి మఱి మాటాడలేదు; మౌనముతోఁ దలవంచుకొని యన్నగారియుత్తరమును నిరుద్దేశముగ నటునిటుఁద్రిప్పుచుండెను.

సర—సత్యవతీ! ఏమి యాలోచించుచున్నావు?

సత్యవతి నిట్టూర్పువిడిచి "అన్న వేసవి సెలవులలో వచ్చును" అనియెను.

సర—ఔను—అది మనకు సంతోషసమయము! కాని— నేనంతవఱకు—

సత్యవతి యులికిపడి "అదియే మీసరస్వతీ యట్లనుచున్నావు?" అనియెను.

సర—అనుట కేమున్నది?—రేపటిసంగతి యెట్లుండునో యెవ్వరు చెప్పఁగలరు?

సరస్వతి నిగూఢహృదయాంతరం బేమున్నదియో గ్రహింపఁ జాలక సత్యవతి “అక్కా! నీమాటలయర్థ మేమియో నాకు బోధపడుట లేదు. విస్పష్టముగఁ దెలుపఁగూడదా? నీప్రాణము నొద్దఁగూడ నీకీసంశయ మెందుకు?” అనియెను.

సర — నా ప్రాణమునకుఁ గష్టముం గల్పించుట నాకిష్టములేదు.

సత్య — అట్లనియెద వేమి? నీకష్టము నాకష్టము కాదా? నీ సుఖము నాసుఖము కాదా?

సర — ఔను. మనజీవనప్రవాహము లనంతసాగరమునం జేరువఱకు నిర్లేపప్రవహించుటకుఁ బరమేశ్వరుఁ డనుగ్రహించుఁగాక!

సత్య — నామనోరథముకూడ నదియే.

సర — ఎప్పటికిని నీసుఖముకొఱకే నాజీవితమువినియోగపడ వలయు నని నాకోరిక —

సత్య — అక్కా! నీనిత్యసందర్శనమే నాయానందము — నీ సుఖమును జూచుచుండుటయే నాకుసుఖము.

అప్పుడు సరస్వతి ప్రేమవికసితహృదయముతో సత్యవతిం గౌఁగిలించుకొని “సోదరీ! మనజీవితమునం దీముహూర్తము చిర స్మరణీయ మైనది!” అనియెను.

సత్యవతి యులికిపడి “అక్కా! అశ్లీలముగవచియించితివి-మనకీజీవితమునం దిట్టిముహూర్తములు నిరంతరానుభవనీయము లగుఁగాక!” అనియెను.

సరస్వతి యొక్కింత సేపాలోచించి యొక్కదీర్ఘశ్వాసమును విడిచెను.

సత్య — అక్కా! మరల బావసంగతి యేమైనఁ దెలిసినదా?

సర — నీవానాఁడు గోదావరీతీరమునం జూచి మాటలాడిన తరువాత మఱియెట్టిసమాచారమును దెల్పియ లేదు.

సత్య—అన్నవచ్చినతరువాత మేమిరువురమును గలసి బావ యొచ్చటనున్న నచ్చటకుఁ బోయి పాదములఁ బట్టుకొని బ్రహ్మాలి యింటికిఁ దీసికొని రావలయు నని తలంచుచున్నాను.

సర—తల్లీ! ఎంత వెఱ్ఱిదానవు!

సత్య—బావకు నాయం దెంతయో ప్రేమ యున్నది. నా మాటయం దెంతయో గౌరవ మున్నది—ప్రాణాచారము పడి ప్రార్థించిచూచెదను.

సర—ఏమని ప్రార్థించెదవు?

సత్య—నీయర్ధాంగి యగుమాయక్కను నీప్రాణమువలెఁ బ్రేమింపు మని—

సర—సోదరీ! ప్రేమస్వరూపునకుఁ బ్రియవాక్యప్రబోధ మెందుకు? దినకరప్రచారమునకు దీపముం జూపుట యెందుకు?

సత్య—ప్రార్థింపకుండఁ బరమేశ్వరుఁడు సాక్షాత్కరించునా?

సర—అట్లే యైనచో—ఏకాంతభక్తిసాధ్యంబగు నీశ్వర సాక్షాత్కార మితరమూలకముగ నెట్లు లభియించును?

సత్య—(దీనస్వరముతో) ఏవిధముచే నైనను నాదుఃఖజీవనము నీసుఖజీవనమున కెంతమాత్రము నుపయోగపడఁజాలదా?

సర—సోదరీ! నీవట్లెన్నఁడును దలంపవలదు.

అని సత్యవతిం గౌఁగిలించుకొనియెను. సత్యవతి సరస్వతి కంఠముం గౌఁగిలించుకొని కన్నీటితో నామెవక్షోవసనమును దడిపి వైచెను. సరస్వతికనుదమ్ములుకూడ నశ్రుపూరితము లయ్యెను. అప్పు డామధురమూర్తుల మధురహృదయము లనంతప్రేమలీనము లైపోయెను.

ఓరమణీమణులారా! మీజీవనములు ధన్యములు! మీ మైత్రి ధన్యమైనది. మీప్రేమార్ద్రహృదయములు ధన్యతమము

లైనవి ! దుర్భరంబగునీదుఃఖజీవనవనంబున నమృతఫలంబులు మీ చేతులకే లభియింపఁగలవు ! దుస్తరంబగు నీదుఃఖసంసారసముద్రమున నానందతరంగిములు మీకన్నులకే యగపడఁగలవు ? మీవంటికుమారీమణులం గాంచుటచేతనే భారతమాత రత్నగర్భ యని పేరుమోయుచున్నది ! పుణ్యమూర్తులగు మిమ్ముఁబోలినసతీమణు లింకను నవతరించి ప్రాతస్మరణీయంబులగు భారతవర్షరమణీమణుల చరిత్రములను బెంపొందించెదరుగాక !

---

## తొమ్మిదవ ప్రకరణము.

"ఇది నీకుఁ దగినసదనము
కదలకు మిటనుండి; తుష్టిఁ గాంచుము; యిదిగా
దది, యదిగా దిది యని వి
మ్మదిఁ దోఁచినరీతిఁ జనకు మా రాచిలుకా !

చిలుక—హారావళి.

కుమారనగరమున గృహమును జేరి యేటియొడ్డున వేంకటేశ్వరరావున కొకసుందరోద్యాన మున్నది. మధురఫలవృక్షములును మనోజ్ఞపుష్పలతానికుంజములును, చిత్రపత్రగుల్మకుండికలును, శీతలజలయంత్రములును గలిగి యాలోకరమణీయమై, యనవరతకలవిహంగసంగీతమధురంబై యున్న యాయుపవనము శృంగారసేవ్యుఁ డగుమన్మథుని లీలాభవనముంబోలి విలసిల్లుచుండెను. పచ్చని పచ్చికపట్టునడుమ దిద్దితీర్చినట్లున్న బాటలకిరువంకలను బుష్పకుండిక

లమర్పఁబడి యుండెను. సురభిళకుసుమనికుంజాంతరముల శృంగార లీలాసదనంబులగు చలువతాతిన్నెలు కన్నులపండువుగా నుండెను. ఆయుద్యానమధ్యమున నీలశిలాసోపానసమంచిత మగుపుష్కరిణి యొండుగలదు. వికచకమలకైరవకుసుమశోభితమగునావిమలజల పుష్కరిణి నిరంతరమును వినీలనిర్మలాకాశమును గన్నులు విచ్చి చూచుచున్నట్లుండును. అది యాకసమువలెనే క్షణక్షణమునకు వింతమార్పుల నొందుచు నయనాభిరామంబై యుండును.

ఆపుష్కరిణి కుత్తరభాగమునఁ జిత్రశిల్పరచనావిలసితంబగు విహారభవనమున్నది. ఆభవనమునకు నలువంకలను ద్వారములును ద్వారసోపానముల కిరువంకలను బుష్పకుండికలును గూర్పఁబడి యుండెను. ఆమందిరముచుట్టును, దాక్షా, మాధవీ, మల్లికాది లతామంటపములును, గదళీ, నారికేళ, సహకార, వకుళాశోక పున్నాగాదిఫలపుష్పతరుశ్రేణులును విరాజిల్లుచుండును. ఆభవన మంతయుఁ జిత్రపటములు, రత్నకంబళములు మొదలగునమూల్య పరికరములతో నలంకరింపఁబడి యుండెను. వస్తుపరిదర్శనమునకై యింతవఱకుఁ జెప్పవలసివచ్చినది గాని యామూలముగా నుద్యానవనవర్ణనముం గావింపవలయునని మాతలంపుగాదు. మా నవలాపాఠకులకు సుందరోద్యానములును, బుష్కరిణులును, విహార భవనములును, గ్రొత్తలు కావు; కావునఁ దద్వర్ణనావిషయంబున విశేషపరిశ్రమందిసికొని పాఠకులహృదయముల నడ్డగించుటకంటె నది సర్వసమృద్ధం బగుసుందరోద్యానమనిమాత్రము ప్రశంసించి యాప్రయత్నము నింతటితో విరమించుచునార్నము.

వేంకటేశ్వరరావు నాఁటిరాత్రి యనసూయ చూపినచి త్రపటమును జూచియుఁ జూడనట్లు చూచియున్నాఁడు. అప్పటికా

తనికన్నుల కాయనసూయ యొక్కతెమాత్రమే భూలోకరమణీమ ణులలో మనోమోహనమూర్తి యైయుండెను; ఆమె నిలిచెడిచోటు నిత్యకళ్యాణమును, దిరిగెడుచోటు దివ్యక్షేత్రము నైయుండెను. ఆమెరూపమునందలిసారళ్యమును— ఆసారళ్యమునందలితారళ్యమును— ఆతారళ్యమునందలిమాధుర్యమును, నాతఁడీయిహాజీవనమునందు మఱి యెచ్చటను జూచియుండలేదు. ఆమెమధురప్రియవచనములలో నాతఁడు మధురామృతమునాస్వాదించుచుండెను; ఆమెప్రేమోపచారములలో నానందరాజ్యసుఖము ననుభవించుచుండెను. ఆతనికిఁ దనప్రాణములకంటెను బ్రియమైనవస్తు వీలోకమునందేమున్నది? ప్రాణాధికప్రియ యగుననసూయ యొక్కతె మాత్రమే— ఆతఁడు నిరంతరము ననసూయాప్రణయరసతరంగములలో నోలలాడుచుండెను.

నేఁటిసాయంకాలము నాలుగుగంటలు దాఁటినపిమ్మట వేంకటేశ్వరరావు తనసుందరోద్యానవనమందిరమునఁ గూర్చుండి యేదియో పుస్తకమును జదువుకొనుచుండెను. తెఱవఁబడియున్న గవాక్షద్వారములనుండి సురభిళవాతపోతము లామందిరమున విచ్చలవిడిగ రాకపోకలఁగావించుచుండెను. ఆకమ్మతెమ్మెరలతోఁగలసి యాతని పుస్తకమునందలిపత్రములుగూడ నెగసి గంతులు వైచుచు నస్పష్టముగ నేమేమియో మాటలాడుకొనుచుండెను. అప్పుడు వేంకటేశ్వరరావు చెదరిపోవుచున్నపత్రములను సరి చేసికొనుచు!—

"మనసుకుదురదేమో వేమారు
కోరి వేఁడిన నీ॥ మనసు—"

అని పాడుకొనుచుండెను. భువనైకమోహిని యగుమోహిని మధురమోహన సంగీతమును బొంచుండి యాలకించుచు నించించుక ముందఱికి వచ్చుచున్నట్లున్నరుక్మాంగదుని చిత్రపట మాతని

కన్నులంబడియెను. అప్పుడా మోహినికూడ "మనసుకుదుర దేమో" అని పాడుచున్నట్లే యాతఁడు భావించుకొనియెను. అంతలో నాక స్మికముగ నతనిదృష్టి చెదరి తనప్రాణేశ్వరి యగుననసూయయును దాను నొక్కచోఁ గూర్చుండినట్లున్న చిత్రపటముపైఁ బ్రసరించెను. అప్పు డనసూయ తన్నుఁ జూచి కలకల నవ్వుచున్నట్లాతని కగపడి యెను. ఆతఁ డించుక చకితుఁడై తలవంచుకొని యంతలో మరలఁ గన్నెత్తిచూచెను. ఆమధురమందహాసవదనమునుండి యక్కృత్రిమ ప్రణయచంద్రికలట్లే వెల్లివిరియుచుండెను. ఆసరళతరళకటాక్షావ లోకనములు తనకట్లే కలువపూదండలను గల్పించుచుండెను. ఆమె ప్రేమానందమూర్తి — ఆనిష్కలంక ప్రణయమాధురీమూర్తియం దెట్టివిలక్షణచిహ్నమును లేదు. ఆపవిత్రదేవీమూర్తి నిరంతరసన్ని ధానసౌభాగ్యముచేతనే వేంకటేశ్వరరావునకు భూలోకస్వర్గము కరతలామలకమై యుండెను. ఆతఁ డనన్యహృదయుఁడై తన ప్రాణేశ్వరివంకనే తదేకదృష్టితోఁ జూచుచుండెను. ఆతని కదియే పరమానందము—ఆతఁడు సుఖోన్నతనిర్మలాకాశమున శుక్రతార యై ప్రకాశింపఁగలుగుట యాప్రణయానందముచేతనే—సంసార స్వర్గసింహాసనమున దేవతాసార్వభౌముఁడై కొలువు సేయఁగలు గుట యాదివ్యప్రణయానందముచేతనే—ఆహా! ప్రణయినీప్రణ యహృదయసమ్మేళన మెంతటిమాధురీమయమైనది! ఎంతటిసుఖ మయమైనది!! ఎంతటి యానందమయమైనది!!!

అప్పుడు వేంకటేశ్వరునిచేతియం దున్నపుస్తకమునందలి పత్రములు విశృంఖలములై గాలికిఁ జెదరి టపటపఁగొట్టుకొనఁ జొచ్చెను. ఆచప్పుడుచే నాతనిదృష్టి చెదరి పుస్తకముపైఁబడియెను. ఆకస్మికముగ నాపత్రాంతరాళమునందున్న ప్రతిబింబపట మాతని కన్నులఁ బడియెను. అప్పు డాతనిదృక్కిరణజాలమార్గము నను న

గించి యొకవిద్యుత్కిరణము తళుక్కున నయనాంతరాళమునఁ బ్రసరించిన ట్లయ్యెను. చెదరిపోవుచున్నదృష్టులను సమీకరించుకొని యాతఁడు మరల నొకసారి యాచిత్తరువుం జూచెను. సమసంచలనం బగునాతనిశ్వాసగమనమున కప్పుడించుక వైలక్షణ్యము కలిగెను. ఆతఁడు కంపితకరములతోఁ దనచెంతనున్నబల్లపై నాపుస్తకము నట్లేయుంచి ప్రాణేశ్వరి యగుననసూయప్రతిబింబమువైపునకు మరలఁ దనదృష్టులను బ్రసరింపఁజేసెను. అనసూయ సుందరవదనమండలమున నకృత్రిమప్రణయహాస మల్లే విరాజిల్లుచుండెను.

ఆతఁ డాసరళమనోహరమూర్తియందు మాత్రమే లోకమోహనసౌందర్యమును గాంచుచుండెను. అట్టిసుందరీమణి కూడ మెచ్చుకొనఁదగునంతటి రామణీయకమూర్తి యీభూలోకమునందుండు నని యాతఁ డెన్నఁడును భావించియైన నుండలేదు—కాని—ప్రాణప్రియ యగు ననసూయయే యాతనిసుస్థిరభావమున కించుకచాంచల్యమును గల్పించెను. అమాయకహృదయ యగు ననసూయ కాసంగతి యించుకంతయును దెలియదు. ప్రణయముగ్ధుఁడగు వేంకటేశ్వరుఁడుగూడ నాయస్ఫుటపరిణామమును గ్రహించి యుండ లేదు. దానిమూలముననే యాప్రతిబింబమును మఱియొకసారి చూడవలయు నని యాతనికిఁ గుతూహలము కలిగినది !! మరలఁ జూచుటయును గలిగినది—

కాని, వేంకటేశ్వరుఁ డనసూయాప్రాణప్రియుఁ డైనందుకుఁ దగినపని చేయుచున్నట్లగపడదు— ఏమనిన:— ఆతఁడాచిత్రమును జూచియుఁ జూడఁజాలకుండెను. చూడకుండవలయునని యాతని యుద్దేశము—అనసూయ చేతిలోనున్నప్పు డాచిత్రపటము నాతఁడే యుద్దేశముతోఁ జూడకుండ నుండెనో, యాయుద్దేశముతోనే

యున్నయెడల నిప్పు డాతఁ డాచిత్రమును నిస్సంశయముగఁ జూడఁ గలిగియే యుండును. ఆయుద్దేశమునందుఁ జూచుటకును జూడకుండుటకును భేదము లేదు. ఇప్పు డామధురామృతరసమునకు మధురసనంస్పర్శన మైనదికాఁబోలును! పాప మది యాతని కంతవఱకుఁ దెలియదు. అందువలననే యాతని కాసందేహము!

వేంకటేశ్వరరావు తనప్రాణప్రియయగు ననసూయమాటలను శిరసావహించుచుండెడివాఁడు. ఆమె పరిహాసమునకైన నసత్యము చెప్పదని యాతని నమ్మకము. నాఁటిరాత్రి యామె యాచిత్తరువుం గూర్చి చెప్పినమాటమాత్ర మాతని కప్పు డసంభవముగా నగపడియెను. అనుభవమునుబట్టి యాతఁ డట్లూహించి యుండలేదు—విశ్వాసమునుబట్టి యట్లు నిశ్చయించుకొనియెను. అనుభవములేని విశ్వాస మగుటచేతనే యనుమానమునకుఁ గారణమైనది.

సత్యమును గ్రహించుటకై యాతఁ డాచిత్తరువు ననసూయ చిత్రపటముతోఁ బోల్చి చూడఁదొడంగెను. తదేకదృష్టితో సవిమర్శముగఁ గొంతసేపు పరిశీలించి "అనసూయమాట కొంతవఱకు సమంజసముగనే యున్నది" అని యనుకొనియెను. ఆసమయమునకు సరిగ నింటిదూలముపై గూడుపెట్టుచున్న యాఁడుపిచ్చుక ముకుపుటమునుండి తృణలేశము జారిపడిపోయెను. అప్పు డది "చుచ్చుచుచ్చు" అనిధ్వనిచేసెను. అప్పుడాధ్వని యించుక విషాదసూచకముగనే తోఁచినది. అదియుపశ్రుతిగ నగపడిన నగపడవచ్చును గాని వేంకటేశ్వరునిహృదయభావమును మనకంటెబాగుగ గ్రహించియే యాపిచ్చుక యట్లు పలికియుండు ననిమాత్రము నిశ్చయించుట కవకాశము లేదు. అనసూయ నిష్కళంకహృదయముతో సత్యమునే చెప్పినది. వేంకటేశ్వరుఁడు సవిమర్శదృష్టితోఁ బరీ

తుంచి సత్యమునే గ్రహించెదను. గుణములు గ్రహించుటలో దప్పే మున్నది?

అతఁ డంతటితోఁ దృప్తి వహించి యున్నట్లగపడదు— మరలమరలఁ జూచుచునే యుండెను. ఆ మూర్తిరూపమునందు శాంతశృంగారకళలున్నవి. ఈమూర్తిచిత్రరూపమునందు ధీరశృంగార చ్ఛాయ లున్నవి— ఆ చూపులలోఁ దారళ్యము, ఈచూపులలోఁ జాపల్యము —ఆముఖమండలమున సౌమ్యభావము, ఈముఖమండలమున గంభీరభావము—ఆమందహాసమునఁ జంద్రికా కాంతి— ఈ మందహాసమునఁ జంచలా కాంతి —వేంకటేశ్వరుఁ డెన్నియోసారులు చూచి యీవిధముగ స్వరూపభేదమును గ్రహియింపఁగలిగెను. ఇఁక సౌందర్యతారతమ్యమును గ్రహించుట కాతఁ డంతగా శ్రమ పడవలసినపని యేమున్నది? ఆమాట ప్రియంవదయగు ననసూయ చెప్పనే చెప్పినది—వేంకటేశ్వరుఁడుకూడ నట్లే నిశ్చయించుకొని యెను. "అప్పుడు నిశ్చయముగ నీదినసుందరీమణియే ఇట్టిసుందరీ శిరోమణిని నేనిదివఱకెచ్చటను జూచియుండలేదు." అనువాక్యము లప్రయత్నముగ నపూర్వముగ నాతనివదనమునుండి వెలువడి యెను. అప్పుడు సమీపవృక్షశాఖపైఁ గూర్చుండియున్న కాకము "కావు, కావు, కావు" మని యఱచెను.

ఆయజ్ఞానవిహంగము "నీప్రాణసఖిహృదయమును గావుము. నీపవిత్రశీలమును గావుము—నీప్రియప్రాణమును గావుము—" అని బోధించినదని యెవ్వరుచెప్పఁగలరు? వేంకటేశ్వరుని కాశబ్దము వినఁ బడినట్లు లేదు. కాని యాతఁడు తనమాటకుఁ దానే యప్రతిభుఁ డైపోయెను. ఎట్టయెదుట లోకమోహనమూర్తి యగుప్రాణప్రియ తనపార్శ్వమునందే యుండెను!! అదియే కారణము!—ప్రియ రాలివాక్యముల బ్రత్యక్షమునఁ గాంచఁగలిగినప్పు డాతఁ డప్రతిభుఁ

డేల కావలయును? ఎల్లప్పుడును బ్రియురాలివాక్యమునే సత్యమని విశ్వసించునాతఁ డిప్పు డేకాంతముగ నీపూర్వపక్షసిద్ధాంతములు చేసికొనుట యెందుకు? అనసూయ యెక్కడ? తెనే సుందరీశిరోమణి యనుమాట యెక్కడకుఁ బోయినది? వీనికి సమాధానము చెప్పుట కాతనికి శక్తి లేదు. అజ్ఞాతముగ నాతనినిర్మలహృదయాకాశమునం దేదియో యదృశ్యచ్ఛాయ యావరించుకొన్నది!

ఆతఁ డాపుస్తకమును మూసివైచి యటనుండి లేచి మందిరాంగణమునకుఁ బోయి యటునిటుఁ బ్రచారము చేయుచుండెను. ఆతని హృదయాంతరాళమునం దెట్టిగాలి వీచి ఘర్మబిందువులఁ గల్పించుచున్నదో తెలియదుగాని పూలతోఁటనుంచి చల్లనిగాలి మెల్లమెల్లగ వీతెంచి యాతనిమేనిపైనున్న యాఘర్మబిందువుల నపనయించుచుండును. పశ్చిమాకాశతీరమునం దున్న యస్తంగతసూర్యుని యరుణకిరణము లాతనిపైఁ బ్రసరించుచునే యుండెను. గాని వాని నాతఁడు చూడలేదు. ఆకిరణములు క్రమక్రమముగ నాభానమండలమునందే దైన్యమైపోవుచుండుటనుగూడ నాతఁడు తెలిసికొనలేదు. తుదకాకరత్నాతి కాలజలదాంతరమున మునిఁగిపోవుటయు నాతఁడు గ్రహింపలేదు.



## పదియవ ప్రకరణము.

చందమామను గను వేంకట ♦ సంబరంబొ
సలిలకేళులంబు చెన్నగాఁ ♦ జాలకన్నెఁ
బొడఁగనిసమాత్రి సుప్పొంగి ♦ పోవుచుండు
కలలు వారా తిరగనైన ♦ దెలిసికొనరు!,,

చందమామ — పాం. ఎలి.

అనసూయ ప్రతిదినముకంటెను నేఁడించుక యాలస్యముగ నుద్యానమునకు వచ్చెను. ఆమె పూవులం గోసికొని పుష్కరిణి యొడ్డునం గలవకుళవృక్షముకడనున్న చంద్రశిలావేదికపైఁ గూరుచుండి దండలు గ్రుచ్చుకొనునప్పటికిఁ జంద్రోదయమయ్యెను. ఎప్పటివలె వేంకటేశ్వరరావామెతోఁ గలసి పూవులఁ గ్రుచ్చుటకు రాలేదు. అనసూయ పూలదండల నెగుడుదిగుడుగను నడ్డదిడ్డముగను గ్రుచ్చెను. తలక్రిందుగ గ్రుచ్చుటచేఁ జాలవఱకు మల్లెమొగ్గలు చెదరి విడిపోయినవి. ఆవ్యత్యస్తభావ మెందుకుఁ గలిగినదో యామెకుఁ దెలియలేదు. గ్రుచ్చినదండలను ముడివేయుటకూడ నామె మఱచిపోయెను. ఎత్తి పళ్ళెరమునందుంచునప్పుడు వానిలోఁ గొన్ని మొగ్గలు జారి పడిపోయెను. నిరుత్సాహభావముతో నాదండల నట్లే ముడివైచి పళ్ళెరమునం దుంచి యచటనుండి బయలుదేరెను. ప్రాణేశ్వరుఁడు సమీపమున లేనప్పుడనసూయ పను లిట్లే యుండును.

ప్రాణేశ్వరుఁ డుద్యానవనమందిరమునం దుండెనని యామె యెఱుంగును. ససంభ్రమమై యచ్చటకుఁ బోయి చూచెను. ఆమందిరమున దీపము లేదు. అనసూయ దీపమును వెలిఁగించి చూచెన్న

బల్లమీఁదనున్న పుస్తకము బల్లమీఁదనే యుండెను. ఆతఁ డచ్చట నగపడలేదు. ఆమె యుత్తరద్వారమునొద్దకుఁ బోయి చూచెను. పోఁగలయుసకవ్వల వేంకటేశ్వరుఁడు తలవంచుకొని యిటునటుఁ బ్రచారముచేయుచుండెను. ఆమెనాతఁడుచూడలేదు— దూరమునుండియరుదెంచుచున్నప్రియురాలిమృదుపదవిన్యాసమునందలి నస్ఫుటధ్వనిలేశమునుగూడ నాతఁడాలకింపఁగలిగెడివాఁడు—హృదయేశ్వరి యగునసూయనెమ్మె తావులం గొనితెచ్చు మందమలయానిలాంకూరసంస్పర్శలేశమునైనను నాతఁడు గ్రహింపఁగలిగెడివాఁడు ఇప్పుడామె తనయెట్టయెదుట నున్నను నాతఁడు తెలిసికొనఁజాలకుండెను.

పాప మనసూయ కానంగలిగియే తెలియదు — ద్వారమునొద్దకు వచ్చి చూచునప్పటి కాత్మేశ్వరుఁ డామె కన్నులఁ బడియెను. అంతకంటె నానంద మేమున్నది? ఇఁక నామెకుఁ గావలసిన దేమున్నది? ఆమె యత్యుత్సాహముతో “తొలినేఁజేసిన పూజాఫలము” అని మృదులస్వరమునఁ బాడుచు నాతనియెదుటకు వచ్చెను. వేంకటేశ్వరుఁ డులికిపడి ప్రకృతిస్థుఁడై నవ్వుచు “ పూలు గుస్ఫుట మైనదా?’ అనెను. ఆస్వరముకూడ విలక్షణముగనే యుండెను. అది యనసూయకుఁ దెలియనేలేదు. ఆమె యానందోత్ఫుల్లనయనయై ప్రేమసూచకస్వరముతో “ పువ్వులు గుప్పెనిసి—మీనవ్వులకుఁ దగినట్టు ” అనెను.

వేం—కాదు—నీనవ్వులకుఁ దగినట్లు.

అ—నానవ్వులో మీనవ్వులో పువ్వులనడిగి తెలిసికొందము రండు!

వేం—నీవు సూత్రధారిణివి.—అవి నీవు చెప్పినట్లే వర్తింతువు.

## మాతృమందిరము.



ప్రాణేశ్వరీ! ఔను. నిజముగ నీవు ప్రేమసూత్రధారిణివే:— నేను
నీప్రేమైకనటుఁడను! పుట. 69.

అనసూయ నవ్వుచు “మీరు సూత్రధారులు——నన్నును సూత్రధారిణిగాఁ జేసితిరి! అదియే నాభాగ్యము!” అనియెను.

అడుగుముట్టఁ గలఁగిపోయిననరోవర మంతలోఁ దేరుకొనియెను. మార్తాండోదయమున మంచువిరిసిపోయిన ట్లయ్యెను—— అమృతకిరణప్రసారమున నంధకార మంతరించినట్లయ్యెను——మలయవాయు సంస్పర్శనమున మల్లికాముకుళము వికసించినటయ్యెను. ప్రణయముగ్ధహృదయ లగుప్రాణప్రియులమధురసంభాషణములు ప్రాణేశ్వరులహృదయముల కల్లెయుండును.

వేంకటేశ్వరరావు పరమానందముతో ననసూయను ముద్దుపెట్టుకొని యానందసుఖముననుభవించుచు “ప్రాణేశ్వరీ!——ఔను నిజముగ నీవు ప్రేమసూత్రధారిణివే——నేను నీప్రేమైకనటుఁడను.” అనియెను.

అనసూయ ప్రేమానందపరవశయై సాధ్వీసముచితం బగు నునుసిగ్గుచే నించుక మొగము మరలించుకొనియెను. అప్పుడు సంపూర్ణచంద్రకిరణప్రసారముచే నామె నిద్దంపుఁజెక్కుటద్దముల పయిం దోఁచినతళతళలు వేంకటేశ్వరుని ప్రేమానందతరళనయనములలో మిలమిల మెఱసిపోయెను. అప్పు డాతని కాసంపూర్ణచంద్రమండలమునకు, అనసూయ మనోహారవదనమండలమునకును నించుకంతయైన భేదమగపడ లేదు. ఆతఁడాపున్నమచందమామను, ఆయన్నులమిన్నముద్దుమోమును దనివితీరని చూపులతో మాటిమాటికిని జూడ నారంభించెను.

అప్పు డనసూయ చిఱునవ్వునవ్వుచు “హృదయేశ్వరా! ఆపూర్ణచంద్రుని చెంత నేయున్న యానక్షత్రము పేరేమి?” అని ప్రశ్నించెను.

వేం—ఎఱుఁగవా యేమి ? ముక్తాఫలమువలెఁ బ్రకాశించు చున్న యానక్షత్రము చిత్రానక్షత్రము !

అనసూయ ప్రణయపులకితకంఠస్వరముతో "నాపూర్ణ చంద్రుని చరణసాన్నిధ్యమున నేనును జిత్రానక్షత్రమనే" అని యెను.

వేంకటేశ్వరుఁడు ప్రసన్నమధురస్వరముతో "ప్రాణేశ్వరీ! నీవు చిన్ననక్షత్రమవు కావు— ప్రేమామృతమూర్తివి— ఈ ప్రేమామృతకలశమునొద్ద నేను పిపీలికాప్రాయుఁడను" అనియెను.

అనసూయసిగ్గుతో "నేను మీపాదదాసిని—మీయాజ్ఞా బద్ధురాలను—అంతగాఁ బ్రశంసించుట కర్హురాలను గాను" అనియెను.

వేంక—పోసిమ్మ— అది నీకు సరిపడనిచో— సరే— ప్రేమైకజ్యోతివగునీవు—చక్కని చుక్కవు— అవును.

అన—ఎంతచక్కనిచుక్కనైనను జంద్రచరణసాన్నిధ్యమే దానిసౌభాగ్యము—

వేంకటేశ్వరుడాజ్యోత్స్నామయుంబగునాకాశమువంకఁ దదేక దృష్టితోఁ జూచుచుండెను.

సరళహృదయయగునసూయ ప్రణయసాగరమునందలిగభీరతరంగముల నెన్నఁడు నెదుర్కొని యుండలేదు. అందలిదారుణావర్తములయం దెప్పుడును బరిభ్రమించియుండలేదు. అమాయికహృదయయగునసూయచేష్టలును బలుకులునుగూడ నామెకే ప్రతికూలము లగుచుండెను. ప్రాణేశ్వరునిసమీపమునం దున్నప్పు డామె తన్మయత్వముచే సకలమును మఱచిపోవుచుండును. ఆనందముచే నెట్టులో చినన్నట్లు మాటలాడుచుండును. ఇప్పు డామెతన్మ

చిత్తానక్షత్రముతోఁ బోల్చుకొనుట యంత బాగుగలేదు. మణిమ యాకారముతో స్వాతినక్షత్ర మెప్పుడు చంద్రు సమీపించునా యని తొంగితొంగి చూచుచున్నసంగతి యామె కింతమాత్రమును దెలియనే తెలియదు !

స్వాతి సమీపించినంతనే చంద్రునకుఁ గళ తగ్గిపోవుననిగాని యప్పటికే చిత్తానక్షత్రము దూరమైపోవు ననిగాని, యదియే యాతని క్షీణత్వమునకుఁ బ్రారంభమనిగాని వేంకటేశ్వరుఁడైన నూహించుకొన్నట్లగపడదు.

---

## పదునొకండవ ప్రకరణము.

“ ఎత్తెఁగనో రాముఁగనో ♦ యే సేసిచట్టి
తత్త్వలుండిన మది ♦ దలంపఁగాఁ బోక
మన్నించి మనకుంచి ♦ మతియొక్కసారి
కన్నులఁ గనుమయ్యా ! ♦ కరుణాంతరంగ ”

ఏంకాతిసేవ

గోపాదక్షేత్రమునందలి యంతర్భవనమునం దొకగదిలో నొకపురుషుఁడు దుర్భరబాధ ననుభవించుచుండెను. ఆతఁడు మోకాలిపైఁదలనుంచుకొని రెండుచేతులతోడను గుడికాలి చీలమండ పైభాగమును గట్టిగనదిమి ట్టుకొని మూల్గుచుఁ గూర్చుండియుండెను. బలిష్ఠమగు నాతనిపరిపుష్టశరీర మించుక సడలియుండెను. భయంకరమగునాతని వికృతవదన మిప్పుడు యాతనావిషాదచిహ్నితమై

సాక్షియుండెను. స్వభావముచేతనో, సంస్కారవిహీనమైయుండుట చేతనో, యాతని కేశబంధము విడివడి యాతనిభయంకరవదనమునకు వికారాకారము గల్పించుచుండెను. అతనియొద్ద కన్నులుగుంటలు పట్టియుండెను. ఆగదిలో నింక నెవ్వరును లేరు. కిటికీలన్నియును తెఱవఁబడియుండెను. వెలుతురంతగా లేకున్నను గాలిమాత్రము బాగుగ వచ్చుచుండెను. ద్వారపార్శ్వమున నిరువురుసేవకులు కూర్చుండి యుండిరి.

అప్పు డొకమహాపురుషు డాకస్మికముగ నామందిరమునఁ బ్రవేశించి యాతనియెదుట నిలువఁబడియెను. అతనిపాదకమలములు పాదుకావిలసితములు; శరీరము కాషాయవసనాచ్ఛాదితము; హస్తయుగళము దండకమండలసంకలితము; విశాలవక్షోభాగము బీజపూరమాలికాలంకృతము. కంఠసీమ రుద్రాక్షనక్షత్రహారశోభితము. ముఖమండలము శుభ్రశ్మశ్రువిరాజితము; ఫాలభాగము విభూతిరేఖాంకితము; లలాటము కుంకుమతిలకాంచితము. ఆమూర్తి పవిత్రసదాశివమూర్తి, ఆదివ్యమూర్తి శాంతతేజోవిరాజితమై యుండెను. ఆమహాపురుషునివదనమండలమునఁ బ్రతిభాశక్తి యున్నది. కటాక్షావలోకనములయం దాజ్ఞాశక్తి యున్నది; మధురమందహాసమున నుత్సాహశక్తి యున్నది. ఆసిద్ధమూర్తియందు సర్వశక్తులును మూర్తీభవించినట్లుండెను. అతఁడు ప్రబోధానందస్వామియే.

బాధపడుచున్న యావ్యక్తి తలయెత్తి యామహాపురుషుని వంకఁ జురచురఁ జూడసాగెను.

అప్పుడు ప్రబోధానందస్వామి ప్రశాంతగంభీరస్వరముతో "ఏమి యాలోచించుకొంటివి ?" అని ప్రశ్నించెను.

పురుషుఁడు క్రోధకర్కశస్వరముతో "ఆలోచన కేమున్నది—నిలువున నిన్నుఁ జీల్చివేయవలయుననియే—" అనియెను.

మాట ముగియకుండఁగనే స్వామి చిఱునవ్వుతో "రక్షిం
చినవానినిగూడ శిక్షించునంతటి క్రూరరాక్షసుఁడవా నీవు ?"
అనియెను.—

పురు—వచ్చినవానిని బెదిరించుటచే నీవు నా దైవమ వను
కొంటిని—కాని—తుదకు నాకిట్టి తీరనియాతనం గల్పించి నాపాలిటి
కాలయముఁడ వై పోవుదు వని నేననుకొనలేదు.

స్వామి—ఇందు నేఁజేసిన దేమున్నది ?

పురు—మఱి యీబాధ నేనే తెచ్చిపెట్టికొంటినా ?

స్వామి—కోపమువలదు—ఇది నీవు తెచ్చిపెట్టుకొన్నది
కాదు—కాని దీనిని నీవు తీర్చుకొనుట లేదు.

పురు—నేనా ?

స్వామి—ఔను ! నీ వెవ్వరు ?

పురు—ఆసంగతి నీకెందుకు ?

స్వామి—(చిఱునవ్వుతో) నీసంగతి నాకక్కఱ లేనప్పుడు
నీబాధసంగతి నాకెందుకు ?

పురు—అట్లయినచో నన్నిచ్చట బంధించుట యెందుకు ?

స్వామి—నీరోగము కుదుర్చుటకు—

పురుషుఁడు క్రోధావేశపరవశుఁడై కన్నులెఱ్ఱఁజేసి పండ్లు పట
పటఁ గొఱుకుచు సటలువెరికిన సింహమువలె నొక్కయుదుటున
స్వామిపై కుఱుకఁబోయెను. కాని, బాధచే శక్తిహీనుఁడై పోవుటచేత
నో, స్వామిమనోబల మాతనినడ్డగించుటచేతనో గాని యాతఁడు
కూర్చున్నచోటునుండి కదలఁజాలకపోయెను. స్వామియొక్కయుదు
గైన వెనుకకు వైవకుండ శాంతభావముతో నాతనివంక నట్లే చూచు
చుండెను.

పురుషుఁడు దీర్ఘశ్వాసములను విడుచుచు "మావాం డ్రెచ్చటనున్నారు ?" అనియెను.

స్వామి—నీకు మీ వాండ్రతో సంబంధము వదలిపోయినది.

పురు—(తీవ్రస్వరముతో) సంబంధము వదలిపోవుటయా ? ఎట్లు ?

స్వామి—వారిచ్చటకు రాఁజాలరు— నీవచ్చటకుఁ బోఁజాలవు—

పురు—నీవేమో బ్రహ్మాండనాయకునివలె మాటాడుచున్నావు ?

స్వామి—బాధ తీరినచో నీవంతవాఁడ వగుదువు.

పురు—ఈ బాధ తీరుట యెప్పుడు ?

స్వామి—నీసంగతి సత్యముగాఁ జెప్పినప్పుడు—

పురు—నేను చెప్పినవి సత్యమో యసత్యమో కనిపెట్టుటకు నీకేమి నిదర్శనమున్నది ?

స్వామి—అంతకును నీబాధయే నిదర్శనము—

పురుషుఁడు తలవంచుకొని చాలసేపాలోచించి నిట్టూర్పులు విడుచుచు "అయ్యో ! నన్నూరక బాధపెట్టుట యెందుకు ? ఒక్కసారిగఁ జంపివేయరాదా ?" అనియెను.

స్వామి—నీనిగూఢచరిత్రమును వెలిపుచ్చుటకంటె మరణమే మేలైనదని నీకుఁ దోఁచుచున్నదా ?

పురు—ఔను.

స్వామి—నీవంతపాపము చేసితివా ?

పురు—పాపమా ?

స్వామి—పాపముగవుక నేబాధ—

పురు—పాపమునకు బాధ యుండునా?

స్వామి—పాపమే బాధ.

పురు—ఆ బాధ యేమైన నున్నయెడలఁ జచ్చినతరువాత నుండవలయును. ఇప్పుడెందుకు ?

స్వామి—అప్పుడు లేకుండుటకే యిప్పుడు—

పురు—ఆలోకములోఁ గాలయమునికిఁ జోటీనా యేమి యీలోకములో నీవు ? ఈలాగెంత మంది నేడ్పింపఁదలఁచుకొన్నా వునాయనా ?

స్వామి—వెఱ్ఱివాఁడా ! ఏడ్పించువారెవ్వరు ? పాపమునకు ఫలము బాధపడి యేడ్చుటయే.

పురు—అదేమిమాట ! పాముకాటునకును పాపబాధకును సంబంధ మేమున్నది ?

స్వామి—(శాంతస్వరముతో) నాయనా ! అట్లనుకొనవల దు ! ఆపాపమే పాముకాటు !

పురుషుఁడింక మాటాడలేదు. "పాపమే పాముకాటు" అనునానన్యవాక్యము నారదబ్రహ్మాదివ్యవీణాతంతువులనుండి వెలువడినసామశ్రుతివలెఁ బ్రబోధానందస్వామి యమృతమధురకంఠము నుండి వెలువడి చల్లఁగ నాపురుషుని శ్రవణకుహరములఁ బ్రవేశించెను. ఆయమోఘనిస్వన మంతటితో నాఁగిపో లేదు; ప్రతిగగన పరమాణువునందును బ్రతిధ్వనితమై ప్రతివాయుతరంగమునందును బ్రచలితమగుచుఁ గ్రమముగ మృదంగనిస్వనముంబోలె భేరీధ్వని ననుకరించి, యపారపారావారనిర్ఘోషముం దలకడచి, శతసహస్ర సహస్రాశనిపాతదారుణారావముం బ్రతిఘటించుచు నాతనిశుష్కకర్ణకుహరములం బ్రతాడితములుగఁ జేసి వ్రేచుచుండెను. ఆతనిహృదయాకాశమునఁగూడ నదియే ప్రతిధ్వనించుచుండెను. ఆతనిప్రతి రక్తనాళమునందును బ్రతిరక్తపరమాణువునందును నదియే ప్రతిధ్వ

నించుచు విశ్వవేగముతోఁ బ్రవహించిపోవుచుండెను. ఆతని కప్పు డాంతరికప్రపంచమునందును బాహ్యప్రపంచమునందునుగూడ "పాపమే పాముకాటు" అను నమోఘధ్వనియే యెడతెగకుండఁ బ్రణవధ్వనివలె వినవచ్చుచుండెను.

ఆతనిసకలేంద్రియములును దన్మయము లైపోయెను. అప్పు డాతనికి బాహ్యజ్ఞానము వదలిపోయెను. అగభీరావర్తరంగములలో నాతనిహృదయము కొట్టుకొనిపోవుచుండెను. అప్పు డాతని కంతటను నంధకార మావరించుకొన్నట్లయ్యెను. ఆగాఢాంధకారమున మిలమిల మెఱయుచున్న భయంకరవిషసర్పములు తండోపతండములై వచ్చి యాతనిఁ దరమితరమి కఱచుచుండెను. ఆబాధలకు సహింపఁజాలక యాతఁడు భయభ్రాంతుఁడై పరుగులెత్తుచుండెను. అంతటను విషసర్పములే—నిలువునను జుట్టబెట్టుకొని గరళజ్వాలాకరాళంబులగు కాలసర్పములు కఱచికఱచి కండలెక్కుడీయుచుండెను. దుస్సహంబగునాకఠోర యాతన నాతఁ డనుభవింపఁజాలక గోలుగోలున నేడ్చుచు నట్టె నిలువునఁ గూలఁబడిపోయెను. అంతలో నయ్యాశీవిషముఖంబులనుండి యొక్కసారిగ నగ్నిజ్వాలలు తరంగాయితములై వెడలువడి యాతని నావరించుకొనియెను. ఆభీకరకాలకూటానలజ్వాలామధ్యమునం బడి యాతఁడు వేగిపోవుచుండెను—ఆతనికి నిష్కృతి యగపడుటలేదు—గతితోఁచుటలేదు—ఇఁకఁ దప్పించుకొనిపాఱిపోవుటకుఁగూడ శక్తి లేదు—రక్షించుటకు దిక్కులేదు—దిక్కులన్నియును గాలకాకోదరభీకరములై యుండెను—కాలానలకీలాభీలములైయుండెను. అప్పుడాతఁడసహాయుఁడై హతాశుఁడై దుస్సహయాతనాపరిక్లాంతుఁడై శుష్కకంఠములో గద్గదస్వరంబున "దాహము! దాహము! దాహము!"

అనిరోదనము చేయుచుండెను. ఆబాధకుం బరిమితి లేదు—ఆదాహమునకు నిష్కృతి లేదు—

అప్పు డాకస్మికముగ భూమ్యాకాశములకు నిలువునం బెరిగి నట్లున్న శాంతగంభీర భయంకర శ్యామలదివ్యమూర్తి యొకటి కన్నులం బడియెను. ఆదివ్యపురుషుని నలువంకలును శతసహస్రసంఖ్యాతీతంబులగు కాలభుజంగములు పరివేష్టించియుండెను. ఆదివ్యమూర్తిం జూచి యాతండు భయభ్రాంతిహృదయుండై మఱింతబిగ్గఱగ "దాహము! దాహము! దాహము!" అని యఱచుచుండెను. అప్పు డాయపరిత్యక్తలీలామూర్తి యాతని సమీపించి మేఘగంభీరస్వరముతో "ఓరీ! పుణ్యాచరణంబునకై భువనరక్షకుం డగు పరమేశ్వరుండు దయామయుండై నీకుం బ్రసాదించినయీజన్మమునందు నీవు చేసిన దేమున్నది?" అని హెచ్చరించెను.

ఆప్రబోధవాక్యశ్రవణమాత్రమున నాబాధితునిదుస్సహబాధ యాకస్మికముగ శతసహస్రగుణాధికమైనట్లయ్యెను. అప్పు డాతండు దుర్భరయాతనావిహ్వలస్వరముతో "పాపము! పాపము! పాపము!" అని బిగ్గరగం బ్రలపింప నారంభించెను.

ఆతం డట్లు పాపమంత్రపురశ్చరణము చేయుచుండంగనే యాదివ్యమూర్తి ప్రబోధానందస్వామియై యవతరించినట్లయ్యెను. తోడనే యాస్వామి జ్వాలామధ్యమునం బ్రవేశించి కుంపటి వేడికి గోలుగోలున నేడ్చుచున్నచిన్నిబిడ్డను గన్నతల్లి యెత్తికొన్నట్లుగా నాతని నెత్తిపట్టుకొనియెను. అంతలోనే యాకస్మికముగ నామహారోగములు మాయమైపోయెను. సంతాపజ్వాలలు చల్లారిపోయెను. ఆదివ్యమూర్తిసుప్రసన్నవదనమండలము నెదుట నాతనికిం జంద్రమండలసాన్నిధ్యమునం దున్నట్లయ్యెను. యాతనాపరిక్లిన్నుండగు నాతం

డప్పుడు సుఖపరవశుఁడయ్యెను. ఆచల్లనిసమయమునం దమృతమధురస్వరముతో “పాపమునకుమందు పశ్చాత్తాపమే” అనుదివ్యవాక్యము చల్లగ నాతనిచెవులఁబడియెను. అతఁడులికిపడి కన్నులఁదెఱచి చూచెను. అచ్చట నెవ్వరును లేరు !!

---

## పండ్రెండవప్రకరణము.

“భూతపంచక మచియోడి • పోఁగలెల్లఁ
దపవిపురివట్టికూర్చిన • త్రాళ్ళకంటి
దగును జీవంబు; క్రమముగా • నట్టె పాగి
విగిసి బిగ్గరగాఁ జాగి • తెగును దుదను”

యాద్యాశ్రమ్ శవ్నశ్రమ్ హారాః ఠ.

అన్నపూర్ణకు దుస్సహాకష్టములచే హృదయము చివికిపోయినది. ఆమెకుఁ బ్రథమసంతానమైనకుమారుఁడు దక్కకుండఁబోయెను. కుమార్తెజీవితమునకు సుఖము లేకుండఁబోయెను. చూచుచు నామె యెట్లు సహించియుండఁగలదు ? ఆమనోవ్యాధిచేతనే యామె క్రమక్రమముగఁ గృశించి తుదకుమంచముపట్టెను. పలుకుబడిగల గౌరీపతిశాస్త్రి తనబహిఃప్రాణమగునన్నపూర్ణకు రోగోపశమనమునకై యెన్నియోమందుల నిప్పించుచుండెను. ఎంతయో ద్రవ్యమును దృణప్రాయముగ వెచ్చించుచుండెను. ఏమిచేసిన నేమిలాభము ? మనోవ్యాధికి మందెచ్చట నున్నది ?

క్రమముగా నన్నపూర్ణసర్వశక్తులు నవసన్నము లైపోవుచుండెను. నిద్రాహారములు కట్టువడిపోయెను. గ్రుక్కెడునీరైన నిందుటలేదు. ఇఁక నౌషధము లేమిపనిచేయును? గౌరీపతిశాస్త్రి భగవంతునిమీఁదనే భారముంచుకొనిచింతానిమగ్నుఁడైయుండెను. తల్లిప్రాణమునందలియాశచే సరస్వతి గడియకొకమందుగ నామెకు మార్చిమార్చియిచ్చుచుండెను. పాపము సరస్వతికిఁ దోడఁబుట్టువులు లేరు— సతీజీవనమున కేకమాతావలంబనస్వరూపుఁడగు ప్రాణేశ్వరుఁడు విదేశములఁబట్టి పోయెను; అతఁడేమయ్యెనో యెటనుండెనో తెలియుటయైన లేదు; వయసుచెల్లినతండ్రి యన్నివిధములచేతను దుఃఖసముద్రములో మునిఁగియుండెను. ఇప్పు డీదైవవిపరీతమే తటస్థించినచో నాతఁడెట్లు జీవింపఁగలఁడు? తలఁచుకొనినప్పుడెల్ల సరస్వతి దుఃఖము పొరలిపొరలివచ్చుచునేయుండెను— సరస్వతి ధైర్యవతి యగుటచేఁ దనదుఃఖమును లోలోపలనే యడంచుకొని తల్లికుపచారములఁ జేయుచు గృహకృత్యముల నెఱవేర్చుకొనుచుండెను.

సతీశిరోమణి యగుసత్యవతి తనప్రాణసఖియగుసరస్వతికి ధైర్యముచెప్పుచు నాకష్టకాలములో నామెకుఁ దోడునీడయై మెలఁగుచుండెను. సరస్వతిధైర్యగ్రంథి మాటిమాటికి శిథిలమైపోవుచునే యుండెను. కాని యామె దుఃఖపరితప్తహృదయుఁడై క్రుంగిపోవుచున్న వృద్ధుఁడగుజనకునికొఱకుఁ గన్నీరుపెట్టి దుఃఖింపఁజాలకుండెను. అందుచే సరస్వతిదుఃఖము మఱియును దుర్భరముగా నుండెను. సంసారమున సర్వసుఖస్వరూపిణి యగుజననికంటెను బ్రియమైనవస్తు విం కేమున్నది? కనికరపుఁజూపులచేతను, గారవపుఁ జెయ్వులచేతను, బ్రియవచనములచేతను, బ్రేమామృతపరిపారముచేతను, బిడ్డలకష్టములను మఱపించునది కన్నతల్లిగాక మఱియెవ్వ

రు? తల్లియే ప్రేమానందస్వరూపిణి! తల్లియే సుఖస్వరూపిణి! తల్లియే సర్వస్వస్వరూపిణి !!

ఆకుమఱుంగున చెందియున్న సరస్వతి యింతవఱకును దాను సుఖవతినని యే భావించుకొనుచుండెను. తనకుఁ దనప్రాణేశ్వరుని సన్నిధానసౌభాగ్యము లేకపోయినను, సందర్శనానందసామ్రాజ్యము లేకపోయినను నిరంతరమా ప్రేమైకమూర్తిని నెమ్మనమున ధ్యానించుకొనుచు నానందసుఖము ననుభవించుచుండెను. ఇప్పు డామె హృదయాంతరాళమున నొకవంక ఝంఝూప్రభంజనములు వీచుచున్నవి— ఒకవంకఁ గాలమేఘము లావరించుకొనుచుండెను. అంతటను గాఢాంధకారము గ్రమ్ముకొనుచుండెను.

రాత్రి రెండుజాములయ్యెను. ఎంతసేపటికిని బ్రొద్దుజరుగుటలేదు. సరస్వతి తల్లి మంచమునొద్దఁ గూర్చుండి తదేకదృష్టితో నామెముఖమునంక నే చూచుచుండెను. అన్నపూర్ణ తనప్రేమైకపుత్రికయగు సరస్వతి మొగముపైఁ బ్రేమాలసవీక్షణములఁ బ్రసరింపఁ జేయుచుండెను. ఆవి యంత్యప్రేమావలోకనము లని సరస్వతి గ్రహింపలేదు. పాపమాంసారిక యాబాలిక కెట్లు తెలియును? తెలియకపోయినను నామె తనహృదయమునం దేదియో నూందోళనము ననుభవించుచు నేయుండెను. అంతవఱకు మేల్కొనియున్న సత్యవతి యాప్రక్కనే యొకచాఁపపైఁ బరుండి నిద్రించుచుండెను.

ఆజనని చూపులనుబట్టి సరస్వతి యప్పుడు తల్లికి మందునీయవలయు నని ప్రయత్నించెను. అన్నపూర్ణ వలదని సంజ్ఞచేసెను. ఎప్పుడు మందిచ్చినను దీసికొనుచుండునామె యిప్పుడు నేదనుటచే సరస్వతిగుండె గుభిల్లుమనియెను. అప్పుడు సరస్వతి శోకగద్గదస్వరముతో “అమ్మా! మందుపుచ్చుకొనవా?” అనియెను.

అన్నపూర్ణ యతికష్టముతోఁ దనచేతిని సరస్వతిచేతిపై నుంచెను. అప్పు డామెకన్నులనుండి జొటజొటఁ గన్నీరు ప్రవహింప సాగెను. సరస్వతి వికృతస్వరముతో "అమ్మా! అది యేమి?" అనియెను.

అన్నపూర్ణ హీనస్వరముతో "తల్లీ! కంటఁ దడిపెట్టకుము! ఏమి కావలయునో యది యైపోయినది! నీకష్టమునకును నామరణమునకును నేనే కారకురాలను—ఆఁడుబుద్ధి యసురబుద్ధి యైపోయినది!—" అని యింక మాటాడఁజాలకపోయెను.

అప్పుడు సరస్వతి కన్నీటి నాపుకొనఁజాలక "అమ్మా! నీవు చల్లగ నున్నచో నాకేమికష్టము?" అనియెను.

అన్నపూర్ణ యాయాసనూచకస్వరముతో "బిడ్డా! అజ్ఞానముచే నేనే నీసుఖవల్లికను జేతులారఁ ద్రుంపివైచితిని—నానాలుకపై ముల్లు విఱుచుకొంటిని— నేను పెంచినబిడ్డయని—నేనదలింపఁదగినవాఁడని— నామేనల్లుఁడని—ముందువెనుకలాలోచింపక యెట్లయిన బుద్ధివచ్చునేమో యనుదుర్భ్రమతో "మూఁడుముహూర్తములు దాఁటిపోయినవి! లోకులక్షఁ బడలేక నీకు బిడ్డ నిచ్చినందుకు బాగుగనే సుఖపెట్టుచుంటివి! నీకీయకపోయినను నాబిడ్డ సుఖపడునుగదా! నీవిట్టివాఁడవగుదువని నేననుకొనలేదు' అని యాతనిదూషించి పలికితిని. పాపమాబిడ్డ యానాఁడు—తిన్నఁగఁ దిండియైనను దినలేదు. అదియే కడసారి రాక—మరల నీయింటి గుమ్మము ద్రొక్కి చూడలేదు—మూఁడేండ్లయినది—" అని యూర కుండెను.

సరస్వతితలపైఁ బిడుగుపడినట్లయ్యెను. ఆయంత్యసమయమున నట్లు పశ్చాత్తాపమునందుచు శోకించుచున్నతల్లి నెట్లూఱడింపవలయునో యామెకుఁ దోఁచుట లేదు. ఏమియు నెఱుఁగనిబిడ్డ కిట్టిసమ

యమున నీదారుణవృత్తాంతమును జెప్పి మఱింతదుఃఖపెట్టఁగూడదని యేండ్లు గడపినయన్నపూర్ణకుఁ దోఁచవలసినది — కాని కన్నబిడ్డకే తానుచేసినతప్పు నీయవసానకాలమునఁ గన్నబిడ్డయెద్దఁగాక యన్నపూర్ణ చెప్పుకొనుట కిఁకఁ దావెక్కడనున్నది? ఈమాటలు భర్తతో నేమని చెప్పఁగలదు? అదిగాక — ఉపకార మగునని యెంచిన తనమాటలు సరస్వతి కపకారములైనవి. అట్టిసరస్వతికి — అట్టిగారాబుపట్టికి — అట్టిజీవనసర్వస్వమునకుఁ దనయవసానకాలమునందైనను దనతప్పును జెప్పకున్నచో నన్నపూర్ణకు శాంతి యెక్కడనున్నది?

తల్లి తనయెడఁ దప్పు చేసినదని సరస్వతి యెట్లు భావించుకొనఁగలదు? దైవదుర్విపాకమువలనం గలిగినసంఘటనమున కెవ్వరేమిచేయఁగలరు? తనతల్లియిట్టియవసానకాలమునందుఁ బశ్చాత్తాపదుఃఖమును గూడ ననుభవించుచుండుట సరస్వతి చూడఁజాలకపోయెను. సరస్వతి దుఃఖసముద్రమున మునిఁగిపోయెను. అప్పు డామె తనతల్లిజీవితమ వలెనే తనజీవితనౌకయును నట్టనడిమిసముద్రమునం దల్లాడుచున్నట్లు భావించుకొనియెను. దుఃఖముచే హృదయమును జెదరఁగొట్టుకొనుటవలన లాభము లేదు — ఆయవస్థలోఁ దల్లిహృదయమున కెటులయిన శాంతినిగూర్పవలసియుండెను. దుఃఖతరంగములచేఁ దూలిపోవుచున్నసరస్వతి బాలికయయ్యు నవస్థనుబట్టి యించుక ధైర్యము తెచ్చుకొని ప్రేమకంపితస్వరముతో, “అమ్మా! అది యంతయును మఱచిపొమ్ము! నీహృదయమునకు శాంతినీయఁగలమంచితలంపులనే మనసునకుఁ దెచ్చుకొనుము!” అనునప్పుడు సరస్వతికన్నులనీరు నిండిపోయెను.

అన్నపూర్ణ యవసన్నస్వరముతో — “తలంపుల కేమున్నది-ఒక్కటే — ధ్యానము —” అనియెను.

ఏయదృష్టసూత్రముచే నాకర్షింపఁబడియెనోగాని యింత వఱకు నన్నపూర్ణనుజూచుటకు సహింపఁజాలక దూరదూరమునందే యుండుచున్న గౌరీపతిశాస్త్రి యాకస్మికముగ నాగదిలోపలఁ బ్రవేశించెను. అనివార్య మగుధర్మానుబంధము—అమోఘమగుప్రేమానుబంధము—అనుకూలమగు సహవాససంబంధము—ఎంతపండితుఁడైనను దుఃఖ మాఁగునా? అతనికన్నులనుండి యవిరళాశ్రుధారలు ప్రవహించుచుండెను. మినుకుమినుకు మనుదీపపువెలుతురున నన్నపూర్ణ సరస్వతిపైనున్నచూపు మరలించి ప్రాణేశ్వరుని వదనమండలమును గడసారి యొకసారి చూచెను. ఆచూపులలో భారతవర్ష పతివ్రతాతిలకములపవిత్రతేజము విరాజమాన మగుచుండెను—ఆచూపులలోనే యనుజ్ఞాకాంక్ష యున్నది—ఆచూపులలోనే యంత్యప్రార్థనమున్నది—ఆచూపులలోనే యాత్మపుత్రికాసమర్పణమున్నది—ఆచూపులలోనే యన్నియు నిమిడియున్నవి. ఆచూపు లిఁక లేవు!!!

---

## పదుమూడవప్రకరణము.



"పురుషునకునర్ధదేహమై ♦ శరణముఁనకు
శరణమై ఘనసంసార ♦ తరణమగుచు
సకలసౌభాగ్యములకుసం ♦ స్థానమైన
వనితలేకున్న భవనము ♦ వనముగాదె"

గృహలక్ష్మి—పోగావళి.

అన్నపూర్ణ యిహలోకమును విడిచిపోయినది. గౌరీపతిశాస్త్రియుత్సాహశక్తి వదలిపోయినది. సరస్వతికి దిక్కులేకుండఁబో

యినది. బాలికయగుసరస్వతిహృదయ మెక్కడఁ జెదరిపోవునో యనుభయముచే గౌరీపతి తనదుఃఖమును దనలోననే యడంచు కొనుటకు దుస్సహప్రయత్నములను జేసికొనుచుండెను. ఆఘోర దుఃఖసమయమున సత్యవతియే సరస్వతీగౌరీపతుల కుపచారము లను గావించుచుండెను; సరస్వతికనేకవిధముల ధైర్యము చెప్పుచుం డెను. గౌరీపతి గృహమంతయు నంధకారపూరితమైపోయిన ట్లుండెను. ఉండదా? అతనియర్ధాంగలక్ష్మి యంతరించిపోయినది. ఆశూన్యగేహమునం దింక నేమున్నది? అది యాతనిహృదయము వలెనే దుఃఖమయమై యుండెను.

దుఃఖము దుస్తరమైనదియే— అయిన నట్టిదుఃఖములోనే దినములు గడచిపోయెను. ప్రపంచమునే మఱపించివైచినదుఃఖ ప్రభావ మిప్పుడు కాలప్రభావమునకించుక లోఁబడిపోయినమాట సత్యమే. కాని గత్యంతరములేని సరస్వతీగౌరీపతుల హృదయముల యందుమాత్ర మాదుఃఖ మెప్పటివలెనే యున్న ట్లగపడుచుండెను. దుఃఖమునుగూడ సుఖముగనే భావింపనలవాటుపడిన సరస్వతికూడ నిప్పుడు దుఃఖమునకు లోఁబడిపోయెను. కన్నబిడ్డలకుఁ గష్టమను మాట వినఁబడకుండఁ గడుపునఁ బెట్టుకొని వారిజీవితముల సుఖమ యములుగఁ జేయవలయునని యెంతటికష్టములనైన నవలీలగ భ రించుటకై వెనుదీయని మాతృదేవతం గోలుపోవుటకంటెను దుస్స హదుఃఖ మీలోకమునం దేమున్నది? అట్టిదుస్సహదుఃఖసముద్ర మున మునిఁగియుండియు సరస్వతి తండ్రియూఱటకై తనదుఃఖమును లోలోననే యడంచుకొని తల్లిమాటమఱపించుటకై యాతనికనేక విధములగు నుపచారములను జేయుచుండెను.

చిరకాలానుభవచిహ్నముల నొక్కసారిగఁ దుడిచివేయుట యెవ్వరితరము? గౌరీపతి స్వగృహమునందలి ప్రతిపదమునందును

పత్నీస్మారకచిహ్నములే యగపడుచుండెను; ప్రతినిమిషమునందును సరస్వతి భావిస్థితింగూర్చియే యాతనిహృదయము కళవళపడుచుండెను. ఇంక నాతండామందిరమున నిలువఁజాలఁడు! ఇట్టియవస్థలో నసహాయయగుపుత్రికను విడిచి యెక్కడకుఁ బోఁగలఁడు? ఆతనికిఁ బూర్వస్థితియంతయును దుఃఖస్వప్నమైపోయినది— భావిస్థితియంతయును గష్టజాగరణమువలెఁ గానవచ్చుచుండెను. ఆతనికేమి చేయుటకును దోఁచుటలేదు. బంధుమిత్రాదులాతనిబరామర్శించుటకై వచ్చుచుఁ బోవుచునే యుండిరి. అందుచే నాతనిదుఃఖము మఱింతయతిశయించుచుండెనే గాని యుపశమించుటలేదు. గతవృత్తముకంటె భావిసంశయమే యాతనికధికమనస్తాప ముంగల్పించుచుండెను.

సంసారచక్రమైనను సంఘచక్రమైనను సామ్రాజ్యచక్రమైనను నిటె నొక్కయిరుసుపై నాధారపడియుండును. ఆయిరుసు చెదరకుండ నున్నంతవఱకే యాచక్రము మిట్టపల్లములయందు సయితము సమగతిని దొరలిపోఁగలిగియుండును. దానికి విచ్ఛిత్తి కలిగినచో నాచక్రము కూలఁబడిపోవలసినదే— పాపము గౌరీపతిసంసార మీవిధముగ నైనది. క్రమముగా నీవిచారముచే గౌరీపతికి నిద్రాహారములుగూడ దూరములైపోవుచుండెను.

ఆతనియవస్థం జూచి సరస్వతికిఁ జాలభయము కలిగెను. ఆమె తనదుఃఖము నడంచుకొని ధైర్యముతో జనకునియొద్దకుఁ బోయి "తండ్రీ! ఇట్లింతికాలము విచారించిన నేమిలాభము?" అనియెను.

గౌరీపతిశాస్త్రి గద్గదస్వరముతో "తల్లీ! విచారముకాక మఱి యేమున్నది?" అనియెను.

సర—అమ్మ యెన్నాళ్లు విచారించినను మరల రాదుగదా!

గౌరీ—తల్లీ! గతమునకు వగచుటవలనఁ బ్రయోజనము లేదని నేనెఱుఁగనా?

సర—అట్లయినచో నీక నీమనస్తాపమెందుకు?

గౌరీ—అమ్మా! మనశ్శాంతి కుపాయము లేదు. ఐహిక తంత్రములం బడి యేఁబదియేండ్లు నిరర్థకములై పోయినవి. కుమారుఁడు పోయెను— భార్యపోయెను— ఇంకను సంసారమునఁ గష్టమే గాని సుఖ మగపడుట లేదు.

సరస్వతి శోకగద్గదస్వరముతో “తండ్రీ! అభాగ్యురాలగు నీపుత్రిక మీపాదములకు సంకెల యైనది. మీసంతానము మాతాపితరుల నుత్తమపథానువర్తులం జేయఁగలుగు లోకములోని సంతానమువంటి దైనది కాదు” అనియెను.

గౌరీ—కన్నబిడ్డలు సుఖపడుచుండఁగాఁ జూచుకొనునంతటి యదృష్టము మాకుఁ బట్టినదికాదు.

సర—మాయదృష్టమునకు మీరేమిచేయఁగలరు?

గౌరీ—సర్వేశ్వరునిసంకల్పమునం దేమున్నదియో యెవ్వరు చెప్పఁగలరు?

సర—నాకావిచారము లేదు. నిరంతరపితృసేవాలాభమున నాదుఃఖముల నన్నిటిని మఱచిపోయెదను.

గౌరీ—తల్లీ! నాజీవనపథమునకు నీవొక్కతెవే ఛాయావృక్షమ వైయుంటివి!

సర—అట్లయినచో నేను ధన్యురాలను.

గౌరీ—ఆమాట నేననుకొనవలసినది. కాని నాకట్టిభాగ్యము సంపూర్ణముగ లభియించినది కాదు.

సర—తండ్రీ! కష్టములు కలకాలముండునా? రేపటి మాట యెట్లుండునో యెవ్వరు చెప్పఁగలరు?

సరస్వతిహృదయము దారుణదుఃఖానలముచే దహించుకొని పోవుచుండె నని గౌరీపతి యెఱుంగును— ఆమె యిట్టికష్టకాల మునం దింతటిధైర్యముతో నుండఁగలదని యాతఁ డనుకొనలేదు. ఆతఁడు ధైర్యమును వహించి ,, అమ్మా! నీవంటిబిడ్డను బడయుట చే నాజన్మము సార్థకమైనది. ఇఁక నా శేషజీవితము నీకుసుఖమును గూర్చుటకే వినియోగపడుఁగాక! '' అనియెను.

సర—తండ్రీ! ప్రాజ్ఞులైనమీకు నేను చెప్పవలసిన దేమి యును లేదు. కాని, యాత్మశాంతిననుభవింపవలసిన యీవయసున గూడ మీచింకను నాకొఱకు బెంగపెట్టుకొనుట యెందుకు?

గౌరీ—బిడ్డలతండ్రినైన నేను పెద్దపులివలె నెట్లు ప్రవర్తిం పఁగలను తల్లీ! తండ్రినైననాకు బిడ్డవగు నీసుఖముకొఱకుఁ బ్రయ త్నించుట విధాయకకృత్యముగాదా?

సర—మీ రేమిచేయుదురు?

గౌరీ—నాకీయింట మనశ్శాంతి కుదురుట లేదు. ఈనెల దాఁటకుండఁగ నేబయలుదేరి సేతుస్నానమును గంగాస్నానమును జేసి రావలయునని యున్నది. ఎచ్చటనైనఁ బరబ్రహ్మ మగపడినచో నెట్లైన బ్రతిమాలి తీసికొనివచ్చి మిమ్మొకయింటివారిని జేసిచూడ వలయు నని యాశయున్నది.

సర—అయినచో నన్నే బయలుదేరుదము!

గౌరీ—ప్రయాసకష్టముల ననుభవింపఁజాలవు నీ వెట్లు వచ్చె దవు తల్లీ!

సర—తండ్రీ! మీయనుగ్రహముచే నాకట్టికష్టములనైన ననుభవించుటకుఁ దగినధైర్యము లభియించినది! భర్తృవియోగముకంటెను, మాతృమరణముకంటెను దుస్సహమైనకష్ట మీలోకమున మఱియొకటి యుండదు నని నాకు నమ్మకము లేదు.

గౌరీపతిశాస్త్రిహృదయము నీరై పోయెను. ఆతఁడు ప్రాజ్ఞుఁడు— పరిపక్వహృదయుఁడు; కేవలసంసారశృంఖలానిబద్ధుండు కాఁడు — అయినను జీవన్ముక్తునకు భవబంధమువలె నాతనికి సరస్వతి యంతరాయముగానున్నదని యాతఁడు భావించుకొనియెను. ఆత్మనిర్వృతికై యాత్మజాతను బరిత్యజించుట మనుష్యధర్మముకాదని యాతనికిఁ దోఁచెను. దుఃఖసముద్రమున మునిఁగి తేలుచున్న ప్రియపుత్రికను నీయవస్థలో నూరకచూచుచుండుటయు నాతనికతిదుర్భరముగ నుండెను. విజ్ఞానధనుఁ డగునాతఁడు కర్తవ్యమూఢుఁడై కొట్టుకొనిపోవుచుండెను.— కాని యాతనికట్టిప్రతిబంధము కలుగలేదు— ఆతనిమానసికపరివర్తనములన్నియును భ్రాంతిమూలకములై పోయెను. సరస్వతి సామాన్యబాలిక కాదనియు, జ్ఞానతేజోమూర్తి యనియు నిప్పుడాతనికి స్పష్టముగ బోధపడియెను. అప్పుడాతఁడు తనపూర్వచరిత్రమునంతను మఱచిపోయెను. సరస్వతిని వెంటఁబెట్టుకొనియే పుణ్యతీర్థముల సేవింపవలయు నని గౌరీపతిశాస్త్రి నిశ్చయించుకొనియెను.



## పదునాలుగవ ప్రకరణము.



॥ఆదిగదా యుత్తమోత్తమ ♦ మైనప్రేమ!
అట్టిప్రేమసంబంధ విష ♦ మమృత మగును;
కాలకోదరము పూల ♦ మాల యగును;
దారుణారణ్య మభినవో ♦ ద్యాన మగును;
జ్వలనకుండంబు చందన ♦ కలశ మగును;
బంధశాల యరవిరి ♦ పాను పగును;
మండువేసవియెండ రే ♦ యెండ యగును;
మృత్యుదేవత సమస్త ♦ మిత్రి యగును.

శ్రీమతి—ప్రమదావనము.

నాఁడు శుక్రవారము. కనకదుర్గాదేవ్యాలయము నిత్యోత్సవములతోఁ గన్నులపండువై యుండెను. దుర్గామూర్తి సర్వాలంకారవిభూషితయై భక్తులకు సాక్షాత్కారిణియై తనజగన్మాతృత్వమును బ్రత్యక్షము చేయుచుండెను. భక్తిపరవశులగు స్త్రీపురుషు లనేకులు వేలకొలఁది నారికేళఫలంబులఁ గొట్టి దుర్గాదేవిపాదాభిషేచనముం గావించుచుఁ దమతమ మ్రొక్కులను జెల్లించుకొనుచుండిరి; లలితాసహస్రనామములతోఁ గుంకుమపూజలఁ గావించి తమజన్మముల సార్థకములుగఁ జేసికొనుచుండిరి. సంధ్యాసమయమున దివ్యదీపారాధనము లైనది మొదలుగ నెడతెఱపి లేకుండఁ బూజలు జరుగుచుండెను. శ్రీసూక్తస్తుతులచేతను, ప్రణవసంకలితదివ్యసహస్రనామోచ్చారణములచేతను బ్రత్యేకప్రార్థనావాక్యములచేతను గర్భాలయమంతయుఁ బ్రతిధ్వనించుచుండెను.

నిమిషనిమిషమునకును నీరాజనములే. మాటిమాటికిని మంత్రపుష్పములే. భక్తిపరవశు లగుస్త్రీపురుషుల రాకపోకలచే దేవాలయ మంతయు నతిసమ్మర్దముగ నుండెను. భర్తలవెంట భార్యలును, దల్లులవెంట బిడ్డలును బోయి కలియుగప్రత్యక్షదేవి మూర్తి యగుకనకదుర్గం గన్నులారం గాంచి ధన్యంమన్యు లగుచుండిరి; ఫలపుష్పాదులను సమర్పించి పరమానందము నందుచుండిరి. కొందఱుకన్య లనుకూలవరులం గోరుకొనుచుండిరి. కొందఱు సువాసినులు నిత్యసౌభాగ్యమును గాంక్షించుచుండిరి. కొందఱుదంపతులు సార్థకసంతానఫలము నర్థించుచుండిరి. అనేకులనేకవిధముల దీనజనోద్ధారిణి యగునాదేవిని బ్రార్థించుచుండిరి. వాంఛారహితు లగుయోగులుకూడ నాత్మానందము నభిలషించి సేవించుచుండిరి. ఆజగన్మాత నర్థింపరానిదేమున్నది? ఆతల్లి ప్రసాదింపఁజాలనిదేమున్నది?

రాత్రి పదిగంటలైనను జనసమ్మర్ద మింకను దగ్గలేదు. దేశదేశములనుండి భక్తులు వచ్చుచుఁ బోవుచునేయుండిరి. పరమభక్తాగ్రేసరుఁ డగుగౌరీపతిశాస్త్రి తనభార్య యగుసరస్వతిచే లలితాసహస్రనామములతో దుర్గాపూజ చేయించుచుండెను. సరస్వతి మాతృభావముతో— భర్తృభావముతో— దుర్గాదేవి దివ్యమంగళచరణపీఠముపైఁ గుంకుమపూజ గావించుచుఁ దదేకధ్యానముతోఁ దన్మయురాలై యుండెను. అప్పుడాదీపకాంతులయెదుట నాదివ్యతేజోమూర్తి యాత్మపూజానిమగ్న యగురెండవకనకదుర్గంబోలి విరాజిల్లుచుండెను. మూర్తీభవించిన భక్తికళాసరస్వతి యైయున్న యాసరస్వతిం జూచి యచ్చటివా రెల్లరును విస్మితులైపోయిరి. సరస్వతియం దట్టిభక్తిపారవశ్యమును గౌరీపతిశాస్త్రి యెన్నఁడును జూచియుండలేదు. అతఁడును ముక్తకంఠుఁడై పోవుచుండెను.

సరస్వతి యేమి ధ్యానించుచున్నది? ఆమె యేమని ప్రార్థించుచున్నది? భర్తృసందర్శనమును వాంఛించి యుండును—పితృమనశ్శాంతి నాకాంక్షించి యుండును. అంతకంటె నామెకుఁ గోరఁదగిన కోరిక లేమున్నవి? అప్పుడామె యేమి వాంఛించినను సద్యఃఫలము లభియింపవలసినదే— సరస్వతి యంతటి యేకాగ్రచిత్తముతోఁ దల్లి నారాధించుచుండెను. అనితరభావసంపన్నంబగు ననుకూలభక్తిసాధనముచే సందుకొనరానిదేమున్నది?

సహస్రనామపూజ సమాప్తమైనది. ధూపదీపాద్యర్చనములైనవి. సరస్వతి ముకుళితకరకమలయై దేవీసాన్నిధ్యమున నిలువఁబడియుండెను. గౌరీపతిశాస్త్రి భక్తిభావపులకితకంఠస్వరముతో శ్రీసూక్తపారాయణముం గావించుచుండెను. ఆనందపారవశ్యముచే నాతఁడు ఖలమును మఱచిపోయెను. ఆకస్మికముగ సరస్వతిసర్వశరీరమును బులకితమైపోయెను; దృష్టులు చెదరిపోయెను; ముఖమండలమున వికాసము దోఁచెను గాని సకలాంగకములును బ్రకంపితములైపోవుచుండెను. విభ్రాంతురాలింబోలె నప్పుడామె చటాలున నాగర్భాలయమునుండి వెనుదిరిగి వచ్చి వెలుపలనున్న జనసంఘమునఁ బ్రవేశించెను. ఆదీపపుఁగాంతులలో నామెతరళనయనము లొక్కసారిగ నచ్చటనున్నయందఱవదనమండలములయందును జంచలకటాక్షములను బరగించెను.

సరస్వతి యాజనసంఘమునఁ దోవచేసికొనుచుఁ దటిద్వేగముతో నొక్కనిమిషములో ముఖద్వారమునొద్దకు వచ్చెను. ముఖమంటపమునఁగూడ జనసమ్మర్దము విశేషించియుండెను. సరస్వతి యున్మత్తంబోలె యాముఖమంటప మంతటను దిరిగెను. నిమిషములో నామంటపసోపానముల నవతరించి దేవాలయముచుట్టును బరిభ్రమించెను. అంతటను దీపకాంతులే— అంతటను జనసంఘమే—

సరస్వతి నిలిచినచోట నిలుచుట లేదు. చూచినచోటు చూచుట లేదు. అందఱును భక్త్యుత్సాహపూరితహృదయులైవచ్చుచుఁ బోవుచుండుటచే నప్పు డామె నెవ్వరును లక్ష్యము చేయుట లేదు. సరస్వతి క్రమముగా దుర్గాలయపశ్చాద్భాగమునం దున్నకోలనియొద్దకుఁ బోయెను. ఆమె యచ్చటను నిలువఁబడలేదు. ఆగిరి సమగ్రదేశ మంతటను దిరిగితిరిగి తిన్నగా గుహాముఖమునొద్దకుఁబోయెను; నిర్భయముగ నాగుహాగర్భమునఁ బ్రవేశించి యంతలోనే దిరిగి వచ్చెను.

అటనుండి యామె యతిశీఘ్రముగ వెనుకకుఁ దిరిగి నిమిషములో నాలయప్రవేశద్వారమునొద్దకు వచ్చెను.అప్పు డామెమనస్థితి యెట్లుండెనో యూహించుట కసాధ్యముగ నుండెను. దుర్గాదేవి యామెచెవిలో నేమి చెప్పినదో ఆమెకన్నుల కేమి యగపడినదో—కాని శ్రీసూక్తపారాయణమున నిమగ్నుఁడై యున్నతండ్రికోఱ కామె నిరీక్షింపలేదు. పిచ్చిదానివలె గిరిసోపానముల నవతరించి క్రిందికిఁ బోయెను. కనకదుర్గాదేవీప్రసన్నం బగునళికస్థలముంబోలి యష్టమీచంద్రుఁడు ప్రకాశించుచుండెను. సరస్వతి విభ్రాంతి వహించినదియుం బోలె నటునిటుఁ దిరుగుచు నంతలో శీఘ్రపదగమనముతో నామార్గమునుబట్టి దక్షిణాభిముఖయై బయలుదేరెను. ఆమెచూపు లడుగుజాడలపైఁ బ్రసరించుట లేదు; తీవ్రవేగమునఁ ముందటికే పరుగెత్తుకొని పోవుచుండెను.

క్రమముగ సరస్వతియును బరుగెత్తుట కారంభించెను. నిమిషములో నామె కృష్ణానది యొడ్డునకు వచ్చెను.అప్పటితరుణచంద్రకాంతులలో నాకృష్ణవేణీచంచలతరంగములు తళతళ మెఱయుచు నాసరస్వతీహృదయభావతరంగముల ననుకరించుచుండెను. అట్టితరంగహస్తములతోడనే యాదివ్యస్రవంతి యామెను జేరఁబిలుచు

చుండెను. ఆనదీవేణికలంబోలి సరస్వతిహృదిరక్తనాళమునందును నుష్ణరక్త మతితీవ్రముగఁ బ్రవహించుచుండెను. తీరనికషంబు లగుధ్వనితతరంగముల ననుకరించి యామెహృత్స్పంద మతివేగముగఁ గొట్టుకొనుచు హృదయాంతరాళమును విదారితముగఁ జేసివైచు చుండెను. ఆమె వేఁడినిట్టూర్పులచే నదీజలశీతలసమీరణంబులకుఁ గూడ వడ దాఁకుచుండెను. ఆమె కోమలశరీర మాపాదమస్తక మును స్వేదసంసిక్తమైపోయెను. తీరమార్గము ననుసరించి యామె యట్లే పోవుచుండెను; పార్శ్వభాగములఁ బరీక్షించుచుండెను; ఉన్నత ప్రదేశముల నధిరోహించి యగపడునంతదూరమువఱకుఁదనతీవ్రదృ ష్టులను బురోభాగమునకుఁ బ్రసరింపఁజేయుచుండెను. ఆమె కోమల శరీరము నలయింపఁజేయుటకెంతమాత్రమును జింతాలేశములేక— ఆమె స్థిరహృదయమునుగూడనాకర్షించుసామర్థ్యము గలిగి—ఆమె కన్నులయెదుట దూరమునం దేమియగపడుచున్నదో యూహించు టకుఁగూడ నసాధ్యమై యుండెను.

విరామములేకుండ నామె యట్లే పరిభ్రమించుచుండెను. పాప మాకస్మికముగ సరస్వతి యున్మాదిని యైపోయినదా యేమి?— ఎవ్వ రేమైపోవుచున్నను గాలముమాత్రము తిరిగిచూడకుండఁ దన దారిని పోవుచునే యుండును. గ్రహచారముకూడ దాని ననుసరిం చియే యుండును—చూచుచుండఁగనే తరుణచంద్రుఁడు పశ్చిమా కాశతీరమునకుఁ బోయెను. బాహ్యప్రపంచమును మఱచి యామె పరుగెత్తుచుండెను—ఆయాసముచే నామె సొలసిపోయెను. అంతలో నమృతకిరణుఁ డపరగిరిశిఖరమున కవ్వలఁ బడిపోయెను. ఆకస్మిక ముగ నాలో చంద్రిక యంతరించిపోయెను. అప్పుడు సరస్వతి కంతయు నంధకార మైపోయెను. ఆశావిహీనయై యామె యట్లే కూలఁబడిపోయెను.

అప్పటి యామెహృదయావస్థ యెట్లుండెనో తెలిసికొనుట కుపాయ మేమున్నది? ఆమె చాలసేపటివఱ కట్లే దీర్ఘశ్వాసము లను విడుచుచుఁ గూర్చుండి యుండెను. అప్పు డామె హృదయాంతరాళమున నెన్నియో యాలోచనాపరంపరలు తరంగితములై యుండును! ఎన్నియో పూర్వపక్షసిద్ధాంతములై యుండును— ఆకస్మికముగ నామె యటనుండి లేచెను; నలువంకలను దిరిగి దిరిగి చూచెను. ఏమున్నది? అంతటను గాఢాంధకారమే —

అప్పుడామె తీరమును వదలి నదీజలముల కభిముఖముగ బయలుదేరెను. నిమిషములో నామె సర్వజీవోద్ధారిణి యగునదీమాతృకను సమీపించెను. సరస్వతిపావనచరణకమలములకుఁ బవిత్రనదీ జలస్పర్శన మైనది. ఆపావనజలతరంగము లామెపాదములపైఁ బడి యేమేమియో ప్రతిమాలుకొనుచున్న ట్లుండెను. తదేకదృష్టితో నున్న సరస్వతి కాసంగతి యేమియును దెలియదు. ఆమె యప్పుడు "హా! పరమేశ్వరా!" అని శోకగద్గదస్వరముతో బిగ్గరగ నెలుఁగెత్తి యేడ్చెను. మాతృమరణసమయమునఁగూడ నామె యట్లు దుఃఖింపలేదు. అంతమాత్రముచే వివేకవతి యగుసరస్వతి తుదకధైర్యవతి యైపోయిన దని సంశయపడ నక్కఱలేదు— ఎవ్వరు తమజీవితకాలమునం దొక్కప్పుడైన నట్టిపవిత్రదుఃఖలేశమునైన ననుభవించి యెఱుంగరో— యట్టివారి జీవితము నిస్సారమైనది! నిరర్థకమైనది! సరస్వతిహృదయము మన కవేద్యమై యున్నది గాని యామెహృదయసరోవరమున నిట్టికరుణరసతరంగములు నిరంతరమును బ్రతిధ్వనితము లగుచునే యుండును!—

ఆయమృతకళ క్రమక్రమముగ నమృతగర్భమునఁ బ్రవేశించుచుండెను. ఆమెకోమలాంగకములు పావనగౌరవములైనవగుటచే జలనిమగ్నము లగుచుండెను. అప్పు డానముత్తుంగతరంగము లా

మెను బలవంతముగఁ దీరమునకుఁ జేర్పఁ బ్రయత్నించుచుండెను. ఆదృఢహృదయమును మరలించుటకు క్షణభంగురము లగుజలభంగముల కెట్లు సాధ్యమగును ? తుదకామె ,, హా ! ప్రాణప్రియా ! హా ! ప్రాణకాంతా ! హా ! ప్రాణేశ్వరా ! '' అని యాత్మేశ్వరుని దివ్యనామమంత్రోచ్చారణముం జేయుచు నామంత్రరాజమహామహిమంబుచేతనుం బోలె నానదీగర్భమున నంతర్నిమగ్నమై పోయెను. ఆదివ్యతేజోమయసరస్వతికిని నాకృష్ణవేణీసరస్వతికిని నైక్యానుసంధాన మైపోయెను. అప్పు డాయమృతమయమూర్తి యమృతమయప్రపంచమున నంతర్ధానమై పోయెను.

ఆయమృతమూర్తి యంత్యమధురస్వరమునుండి వెలువడినపావనమంత్రాక్షరము లింకను నాగాఢాంధకారమున దశదిశలఁ బ్రతిధ్వనించుచునే యున్నవి. ఎంతటి విపరీతసంఘటనము ! ఎంతటి విచారకరసందర్శనము. కరుణామయి యగుప్రకృతిదేవి యాకష్టసందర్శనమునకు సహింపఁజాలక కన్నుల మూసివైచుకొన్నది ! కరుణార్ద్రహృదయయగు కృష్ణాతరంగిణి తరంగచ్ఛలంబునఁ గొట్టుకొనిపోవుచున్నది ! ఆకృష్ణవేణీతరంగములకంటెను తీవ్రముగ మనహృదయములుకూడఁ గొట్టుకొనిపోవుట కేమిసంబంధమున్నదికి పరిచయానుబంధమే మనల నిట్లు బాధించుచున్నది ! కేవలపరిచయముచే మనమే యిట్లగుచుండఁగాఁ బాప మేకపుత్రికామాత్రజీవనుఁడగు గోపనశాస్త్రి యెట్లుండునోగదా !!

———

## పదునేనవ ప్రకరణము.

"త్రాగుము నాతో నేఁటికి
త్రాగినయటు త్రాగుమీ! స్వతంత్రతతోడన్
త్రాగిన్నదరికిఁ దమ్మీ!
యాగన్యము చెప్పరింపు మీ మెలమెల్లన్!

మధుకలశము — సౌరావళి.

రాజమహేంద్రవరనగరము నందలి గోదావరియొడ్డున కించుక దూరమునం దొకవిశాలభవనము కలదు. ఆమందిరమున సాయంకాల మాఱుగంటలు మొదలు రాత్రి పదిగంటలవఱకును జనులరాకపోకలు విశేషించి యుండును. దానిని గొందఱు విహారమందిర మనియును, గొందఱు విశ్రామభవన మనియును గొందఱానందనిలయ మనియును భావించుచుందురు. ఎవ్వ రెట్లనుకొన్న నేమి? విలాసప్రియు లగువారి కది పరమమిత్రస్థానమనియే చెప్ప వచ్చును.

రాత్రి యేడుగంట లైనది. ఆసౌధమునందలి యంతస్తు లన్నియును జనసంకులములై యుండెను. ఒక్కచో సంగీతరసతరంగములు—వేఱొకచో సరససల్లాపసుధాతరంగములు-మఱియొకచో వివిధమధురాహారభోజనకలకలారావతరంగములు— ఇంకొకచోఁ దీవ్రమదిరారసప్రతిబింబితదీపమాలికాతరంగములు— ఆసౌధమంతయు నీవిధముగ విలాసోత్తేజితమై యుండెను. ఆభవనమునందలి క్రిందియంతస్తునకుఁ బశ్చాద్భాగమునం దున్నవిశాలచతురంతప్రదేశమే మధుమతీవిలాసనిలయము—అదియే రహస్యపాననిరతుల నిత్యసేవాస్థానము—అందిప్పుడు మధురభాషిణి యగుమధుమతీ

దేవి గానందనృత్యము చేయుచుండెను—ఆశ్రితకోటి కానందో త్సాహములం బురికొల్పి నవ్వించుచుండెను—నాట్యము చేయించు చుండెను. ఆయుత్సాహసమయమున నొకమోహినీమూర్తి భక్తుల కందఱకును బానపాత్రములం బ్రసాదించుచుండెను. ఆదేవీప్రసాద మునకై యందఱును దొందరపడుచుండిరి— ఉవ్విళ్లూరుచుండిరి— దేవీప్రతిమూర్తి యగునాసుందరి సిష్పృతపాత్రముగ నందఱకును గ్రిమక్రమముగ నందించుచునే యుండెను.

ప్రదీపకాంతులలోఁ బానపాత్రములు మెఱసిపోవుచుండెను. మదిరారసమున నామదవతీకటాక్షములు మీనపుచ్ఛములంబో లి సంచలితము లగుచుండెను. భక్తులదృష్టు లన్నియు నాసుందరీమూ ర్తిసుందరకటాక్షములపై నాధారపడి యుండెను. అచ్చటఁ బిన్నపెద్ద తనముల విభేద మెంతమాత్రమును లేదు. సర్వసాభ్రాతృత్వ మా సేనామందిరమున మూర్తీభవించిన ట్లుండెను. ఆసుందరీమూర్తి నెం అపుడేఁగనలె నంతటను దిరుగుచు:—

“మఱచితివో నాయకా

మై మఱచితివో నాయకా!

నను మఱచితివో నాయకా!—

మఱిమఱిఁబిలిచ్చన మాటాడవు నీ

సరస నిలిచి కల శము రాకున్నది--మఱ--”

అని మృదులస్వరమునఁ బాడుచు నొయ్యారముగ నాసవకల శముల నందించుచున్న ట్లుండెను. తన్మయత్వముచే నెల్లరును మో హినీదేవి యమృతకలశమును దమకందించుచున్నటే భావించుకొను చుండిరి. ఇంకేమి కావలయును? భూలోకస్వర్గము వారికన్నుల నెుగటఁ దాండవ మాడుచున్నది! వారికిఁ దనివి తీరుట లేదు. అందఱు నాసుందరమూర్తిని గనకకుసుమములతోఁ బూజించుచుం

డిరి. అర్థపాణిను లామె స్వాధీనము చేసి యానందపరవశులై పోవుచుండిరి. ఆ దేవి సుప్రసన్నవదనయై యందఱను సమభావముతోనే యాదరించుచుండెను.

అర్ధస్ఫుటస్వరముతోఁ గొందఱు పాడుచుండిరి. అడుగువరుసలతోఁ గొందఱాడుచుండిరి. నిశ్చలచిత్తములతోఁ గొందఱాలకించుచుండిరి. నిమీలితనయనములతోఁ గొందఱాలోకించుచుండిరి. కొందఱా సుందరీమూర్తిని ధ్యానించుచుండిరి. కొందఱు పలుమాఱుఁ బిలుచుచుండిరి. కొందఱామెతో నవ్వుచుండిరి. ఆసుందరి వేయి గన్నులతో నందఱను బరికించుచునే యుండెను. వేయిచేతులతోఁ బానపాత్రము లందించుచునే యుండెను.

అప్పుడొకయువకుఁ డాకస్మికముగ నాపానమందిరమునఁ బ్రవేశించెను. ఆతనివయ సిరువదియేండ్లకు మించి యుండదు. ఆతని శరీరము మిగులబలిష్ఠమై చూచుటకు సుందరమై యుండెను. ఆతని దుస్తులు నూత్నము లయ్యును మలినములై యుండెను. ఆతఁడు ష్టీపమును ధరించియుండెను. ఆతనివదనము స్థిరగంభీరధీరభావవిలసితమై యుండెను; కన్నులు విశాలములై చూపులు తీవ్రములై యుండెను. నాసిక దీర్ఘమై యగ్రమున నించుక వంగి యుండెను. తుమ్మెదఱెక్కలవలె నీలములై యొత్తుగనున్న మీసము లాతనివదనమున కందముం గూర్చుచుండెను. ఆతనిశరీరచ్ఛాయ చామనచాయ—ఆజానుబాహుఁ డగునాతఁడు మల్లవిద్యాపారంగతునివలె నగపడుచుండెను.

అప్పుడే మధుపాత్రము నందుకొని త్రాగఁజూచుచున్నయొక పురుషుఁ డాతనిం జూచి యించుక విస్మితుఁడై ‘‘రంగా! విడుదలైనదా?’’ అనియెను.

రంగ — ఆ! రాజమందిరము వదలిపోయినది. ఇఁకఁ బాన మందిరమునఁ బ్రవేశించితిని.

పురుషుఁడు నవ్వుచు "రమ్ము! ఇదిగో!" అని చెప్పుచు సురాపాత్రము నాతని కీయఁబోయెను.

రంగఁడు వికటహాసముచేయుచు "ఈశుష్కగర్భమున కీశూన్యకలశమా! ఓయిదామోదరుఁడా! ప్రాఁతకూనలతో నేతమెత్తింపవలయునుగాని పలుచపలుచగాఁ జిలుకరించుటవలన నేమిలాభము!" అనియెను.

దామో — ఓరినీయాశకూల! లోకమంతయును మ్రింగివేయునట్లున్నావే!

రంగ — ఔను! ఆఱునెలలయుపవాసఫల మగపడవలదా?

దామో — అంతకడు పెక్కుడ నున్నదిరా?

రంగ — అమ్మ కరుణించినచో నంతకంత గదా?

దామో — అట్లయినచో గోదావరి కూనలఁ బట్టింపుమందువా?

రంగ — ఓరిసంగీతరాయఁడా! సంచివట్టిపోయినదా యేమి?

దామో — ఆఁ! అంతమాత్రమునకేనా? ఆటలో గెలిచిన యూఱువాదలు నప్పుడే పోయిన వనుకొందును! ఆశపడి వచ్చినందు కెంత త్రాగెదవో త్రాగుము.

రంగ — ఆలస్య మెందుకు? ఆ యమ్మను బిలువుము!

దామోదరరావు మధుమతికి సంజ్ఞ చేసెను. వెంటనే యామె రెండు కాచపాత్రములలో మద్యము నింపి తీసికొనివచ్చి యిరువురకును జేతియొకటిగ నీయఁబోయెను. దామోదరుఁడు నవ్వుచు రంగని జూపించెను. రంగఁడా పాత్రములను రెండు చేతులతోడనందు

కొని మద్యమును గడగడఁద్రాగివైచి “ ఒకగుక్కెడైనను రాలేదు. తెమ్మా! ఇంకను దెమ్మా! ” అనియెను. మధుమతి మద్యభాండ మును దీసికొనివచ్చి యొకదానివెనుక నొకటిగ నాపాత్రముల యందు సారాయమును బోయుచుండెను. రంగఁడు త్రాగుచుండెను. ఆనవపాన మమ్మవారిజాడ్యమువలె నంటుపోకను. రంగఁడు త్రాగుచుండుటచే దామోదరునకును ద్రాగవలయుననితోఁచెను. అతఁడు కూడ నొకపాత్రమునందుకొని కొలఁదికొలఁదిగఁ ద్రాగుచుండెను. రంగఁడు తమిదీఱఁ ద్రాగి తేలుచు మద్యపూర్ణంబు లగు రెండు పాత్రముల నిరుచేతుల నుంచుకొనియెను.

దామోదరుఁడు మైకముచేఁ దూఁగుచు “ రంగా! అట్లు చూచెద వేమి? త్రాగుము! ఇఁక నేను త్రాగలేకున్నను జూచి యైన సంతోషించెదను ” అనియెను.

రంగ — తల్లి తల కెక్కుచున్నది! తలదాఁకఁ ద్రాగుటకు నోరున్నచో బాగుగనే యుండును.

దామోదరుఁడు మైకముతో నవ్వుచు “ కైదులో గంజి యైన దొరకనివానికిఁ గడుపునిండ సారాయము దొరకినది. చాలదా? ” అనియెను.

రంగ — అరకాసు చేత లేనివాని కాఱువందలు దొరకినవి కావా?

దామో — నాకేమి? నాగోటిలోఁ గోటిరూపాయలున్నవి! నిత్యదరిద్రము నీకుఁగాని నాకు లేదు.

రంగ — నేను మహారాజును — రాజ్యములు లేని రాజును! నాకేమితక్కువ? నీవుగాకున్న నీతాత మఱియొకఁడు —

దామో — నీసంగతి నేనెఱుఁగుదును — ఆలస్యమైపోయినది. అంధకుని బోయినారు. ఆమద్యమును ద్రాగివేయుము. పోదము!

రంగఁడా రెండుపాత్రములను నిమిషములో శూన్యములుగఁ జేసివైచెను. మధువతి నవ్వుచు ' ఇంకను బోయుదునా ?' అని సంజ్ఞ చేసెను.

రంగఁడు వెక్కసము నభినయించుచు " అక్కఱలేదనిన నపరాధము ! కొంచెముపోయుము ! " అని పాత్రముం జూపెను.

మధుమతి మరల నొకపాత్రమును మద్యముచేఁ బూరించెను. రంగఁడు సగమువఱకును ద్రాగి యవశిష్టమద్యపాత్రమును దదేకధ్యానముతోఁ జూచుచు మదిరాపానమదావేశముచేఁ దలయూఁచుచు నస్ఫుటస్వరముతో :—

సారాయములోఁ దేటా సుర
సామ్రాజ్యమునకు బాటా
చేరీచేరకయూరించెడి చెలి
చిక్కనిముద్దులమూటా మాటా॥ సార॥
అమృతరసములోఁబలుకూ
బ్రహ్మానందములోఁ గులుకూ
కమలము విరిసినపరిమళములలోఁ
గామినికన్నులతళుకూబెళుకూ॥ సార॥
మైకములోపలిచూపూ తిరు
మందిరమందలితీపూ
లోకంబెఱుఁగనిలోఁగిటిముంగిలి
వాఁకిలితలుపులరేపూమాపూ॥ సార॥

అని పాడుట కారంభించెను. ఆ రాగమునకుసరిగ దామోదరుఁడు స రి గ మ స్వరకల్పనముచేయుచుఁ దాళమువైచి తానును బాడఁదొడఁగెను. మద్యభాండము చేఁబూని మధుమతి మోహినీ

మూర్తివలె మందహాసవదనముతో నెట్టయెదుట నిలువఁబడియుండెను. దామోదరునికన్నులు మధుమతిమీఁదనే యుండెను. రంగని దృష్టిమద్యపాత్రముపై నుండెను. ఇరువురకును స్మృతి తప్పిపోవుచుండెను. అప్పుడు రంగఁడు దామోదరునిం జూచి "డబ్బునిచ్చివేయుము!" అనియెను.

దామోదరుఁడు నోట్లసంచిని మధుమతి చేతి కిచ్చుచు మదపారవశ్యముచేఁ గన్నులం దేలవైచి యస్పష్టస్వరముతో: -

మనసులోనిమాట మధుమతికిఁ దగినమాట
మఱపురాని పాట చేమంతిపూలతోఁట॥ మన॥
వలపుగులుకు కన్నె జవ్వనపుమిసిమిపన్నె
అలరుఁదావితిన్నె మధురాసవంపుదొన్నె॥మన॥
ఆత్మలోని నవ్వు చిగురాకుచాటుపువ్వు
లేయరంటిపండు నిమొవ్వు నా యాసకెంతొదవ్వు॥మన॥

అని పాడుచుఁ దన్మయత్వమున మునిఁగిపోయెను. మధుమతి యాసరసునియొద్ద సంచిని దీసికొని వెడలిపోయెను. సంచిలోనిధనమంతయు నెందుకీయవలయునో దామోదరునకుఁ దెలియలేదు. తనకెంత రావలయునో మధుమతికి లెక్క తెలియదు. ఇచ్చినది పుచ్చుకొనుటయే గాని మధుమతి యెప్పుడు నెవ్వరినిగూడ నింతకావలయునని యడిగి యెఱుంగదు. అందుచే నామె కెప్పుడు నధికముగనే దొరకుచుండును. రంగనికిఁ దాగుటయే గాని ధనముతో నిమిత్తమే లేదు!!



## ప దు నా ఱ వ ప్ర క ర ణ ము.

‘‘కమలాకాంతల నిన్ బోలం
గలవారలు కోటికోట్లు ♦ కలరో లేరో
కులశీలపవిత్రతాయుతం
బాలా నీకే చెల్లెనమ్మ ♦ పులుఁగుపడంతీ!

కపోతము — హారావళి

సరస్వతి తండ్రితో బయలుదేరునప్పుడు సత్యవతి నెన్నియో విధముల నుపలాలించి ప్రబోధించి యెట్లో యామెకడ సెలవు గైకొనియే వెడలిపోయెను. సత్యవతికి గత్యంతరము లేక యంగీకరింపవలసివచ్చెను. కాని యామె యప్పటినుండియును ప్రాణముం బాసినశరీరమువలెఁ గళావిహీనయై యుండెను. ఆశుభసమాచారము లోకమునం దతిశీఘ్రముగఁ బ్రచారమగుచుండును. చెన్నపురి నుండి బయలుదేరి వచ్చుచున్న భారతరావునకు విజయవాడలో సరస్వతీమరణవృత్తాంతము తెలియవచ్చెను. ఆదుఃఖకరసమాచారము సోదరునివలన సత్యవతి వినియెను. ఆమె కీజగమంతయు నంధకారమయమైపోయెను. ఎల్లదుఃఖములను నిమిషములో మఱపింపఁజాలిన ప్రాణసఖి యగుసరస్వతియే మరణించినది. ఇఁక నాసత్యవతికి దుఃఖసముద్రమును దరించుట కుపాయ మేమున్నది?

అన్నవచ్చినసంతోష మామె కించుకంతయును లేకపోయెను. ఆతఁడు పట్టపరీక్షయం దుత్తీర్ణుఁడయ్యెనని తెలియవచ్చినప్పటిసంతోషముకూడ నామె కగపడలేదు. ఆమెకన్నుమూసినప్పుడెల్ల సరస్వతింగూర్చినస్వప్నములనే కాంచుచుండెను. సరస్వతి దూరమునందుండి

చేయెత్తి యామెను బిలుచుచున్నట్లు—సరస్వతితల్లివచ్చి "సత్య
వతీ" సరస్వతినివిడిచి యొక్కతెవు నిట్లుంటివేమే !" అని పలుక
రించుచున్నట్లు—తాను కృష్ణానదిలో స్నానముచేయుచు మునింగి
పోయినట్లు—సరస్వతి యావేగముగ వచ్చి తన్నుద్ధరించి యొక్క
డకో తీసికొనిపోయినట్లు—ఇట్టివి యేస్వప్నములు !

ఆమెకు నిరంతరమును సరస్వతీధ్యానమే—తన్ను సరస్వతితోఁ గూడఁ బంపుటకుఁ దనతల్లిదండ్రు లంగీకరింపలేదు. కూడఁ దీసికొనిపోవుటకు సరస్వతియు నంగీకరించినది కాదు. తాను దోడుగనున్నచో సరస్వతి మరణించుట కవకాశము లేకపోవును. తానును బయలుదేరకపోవుటయే యామెమరణమునకుఁ గారణమైనది—సత్యవతి యీవిధముగ భావించుకొనుచు హృదయపరితాపము ననుభవించుచుండెను. భారతరా వామెహృదయమును లోకవ్యాపారములకు మరలించుటకై యెన్నియోవిధములఁ బ్రయత్నించుచుండెను; వార్తాపత్రికలను జదివి చెప్పుచుండెను; మహాపురుషులయుపన్యాససారాంశములను బ్రబోధించుచుండెను. అన్నమొగమాటముచే వినుచుండెను గాని యామె కేమియును రుచించుట లేదు. క్రమక్రమముగ నామెమనఃపరితాపముచే గృశించుచుండెను.

ఒకనాఁడు భారతరా వామెయొద్దఁ గూర్చుండి "సోదరీ ! నీసంగతి యేమియును బాగుగలేదు." అనియెను.

సత్యవతి నిట్టూర్పులు విడుచుచు ',నాయదృష్టము !' అనియెను.

భార—ఇప్పుడు నీయదృష్టమున కేమిలోపము ?

సత్య—అనుభవించుటకు బ్రదికి యుండుటయే లోపము!

భార—ఇంకను నీవెఱ్ఱివేదాంతములు వదలిపెట్టవా ?

సత్య—అంతకంటె నుత్తమమార్గ మేమున్నది ?

భార—తల్లిదండ్రులకును సోదరునకును మనస్తాపముంగూర్చు టయే నీకు ధర్మముగఁ దోఁచుచున్నదా ?

సత్యవతి కన్నీటిలోఁ దలవంచుకొని "నేనేమిచేయఁగలను?" అనియెను.

భార—నీవే చేయఁగలవు— మాప్రాణము లన్నియు నీ మీఁదనే యాధారపడియున్నవి.

సత్య—మీరుసుఖముగ నుండుటయే నాకుసుఖము—మంద భాగ్యురాలగునాకొఱకు మీసుఖమార్గమునుగూడఁగంటకితముగఁ జేసికొనుట యెందుకు ?

భార—సోదరీ! ఎంతమాటాడితివి? నీక్లేశవదనముంగాంచుచు మేమెట్లు ధైర్యముతో నుండఁగలుగుదుము.

సత్య—అది యనివిలంఘ్య మైనప్పు డెవరేమి చేయఁగలరు?

భార—అది యనివిలంఘ్యమా ? దానికిఁ బ్రతీకారము లేనే లేదనియా నీయూహ ?

సత్య—భగవదుద్దేశమును మార్చుట యెవ్వరితరము ?

భార—అట్లయినచో మనప్రయత్న మేమియు నక్కఱయే లేదా ?

సత్య—దైవము బలవంత మైనప్పుడు పౌరుష మేమిచేయఁ గలదు ?

భార—ఆబుద్ధిని సక్రమముగ నుపయోగించుటలోనే యం తయు నున్నది.

సత్య—ఎట్లు ?

భార—నీసోదరుఁడు సుఖముగ నుండవలయునని నీకుఁ గోరిక లేదా ?

సత్య—ఉండదా ?

భార—నీవిచారము మఱచిపోవలయు నని నీకిచ్ఛ లేదా ?

సత్య—ఉన్నది. ఏమిలాభము ?

భార—అదియే యజ్ఞానము. ప్రయత్నము చేసి చూడవలయును.

సత్య—ఎంత ప్రయత్నించినను వృంతచ్యుతకుసుమము నీశ్వరుఁడైనను మరల నదుకఁగలఁడా ?

భార—తల్లీ ! ఇవి యన్నియు ననుభవవిరుద్ధము లగుయుక్తి వాదములు— నిరాశాపూర్ణహృదయుఁ గువారినిరర్థకవచనములు. ఆశ లేకున్నచోఁ బ్రపంచకమే లేదు.

సత్య—ఔను. నాకాశ లేదు. ఈప్రపంచమున సుఖమును లేదు.

భార—నేను నీసోదరుఁడ ననునభిమాన మున్నదా ? నీకు నీసోదరునిపైఁ బ్రేమ యున్నదా ?

సత్యవతి యప్రతిభురాలై పోయెను. ఆమె యేమియును మాటాడఁజాలక పోయెను.

భార—సోదరీ ! నాసుఖముకొఱకుఁ బ్రయత్నించుట నీకు విధాయకకృత్యము గాదా ?

సత్య—ఆవిషయమున నేను నాప్రాణములనైన విడుచుట కంగీకరించెదను.

భార—అది నాకు సుఖకర మనియా నీయభిప్రాయము ?

సత్య—నీసుఖమున కభ్యంతరము కాకుండుటయే నాకు సుఖము.

భార—నాకుమాత్రము సుఖ మెట్లు వచ్చును ?

సత్య—నీవు పెండ్లి చేసికొని యొకయింటివాఁడవై తల్లిదండ్రులతోఁ గలసి సుఖయింపవచ్చును. అనేకకుటుంబములను బోషించుచునదృష్టము పరమేశ్వరుఁడు నీకుఁ బ్రసాదించినాఁడు ?

భార—నేను బెండ్లియాడినచో నిజముగ సంసారసుఖము లభియించునా ?

సత్య—సుఖావకాశ మున్నది— ఆశ యున్నది—

భార—నీకామాశ యేల లేకపోవలయును ?

సత్య—నాయాశాచంద్రుఁ డస్తమించి పోయినాఁడు.

భార—నిన్నటిరాత్రి యట్లే యున్నదా ? నేఁడు సూర్యోదయము కాలేదా ? రాత్రి మరలఁ జంద్రోదయము కాదా ?

సత్యవతి మౌనముతోఁ దలవంచుకొనియెను.

భార—సోదరీ ! మాటాడ వేమి ? నా యానందచంద్రిక యస్తమింపలేదా ? చిన్నతనముననే నాభార్యమరణించినది కాదా? అంతమాత్రముచే నేను హతాశుఁడనై పోయితినా ? అదృష్టముం దలఁచుకొని పరితపించుచుంటినా ? నీజీవితముతోఁగూడ నాజీవితమును సంతోషవంతముగఁ జేయుటకుఁ బ్రయత్నము చేయుచుంటినిగాదా ? సుఖము మనచేతిలో నున్నప్పుడు— మనహృదయములో నున్నప్పుడు— ఈయనర్థకవిచారమును దెచ్చిపెట్టుకొనుట యెందుకు?

సత్యవతి యాపాదమస్తకమును గంపించి పోవుచుండెను. అన్నమాటలకు సమాధానము చెప్పుట కామెకు ధైర్యము లేదు; అన్నహృదయమును హరలించుటకు శక్తి లేదు. అన్నమనస్సు నొప్పించుట కామె కిష్టములేదు. సత్యవతిహృదయము కొట్టుకొని పోవుచుండెను; పరితపించిపోవుచుండెను—. సరస్వతి యిట్టిదుస్సహసందిగ్ధసమయమునం దుండినచో నెంత యనుకూలముగ

నుండును ? ” అని యామె భావించుకొనియెను. సరస్వతి యామె జీవితమార్గమును నిర్మలముగఁ జేసిపోయినది— భక్తి రసార్ద్రముగఁ జేసిపోయినది— ఆనందచ్ఛాయల నావరింపఁజేసి పోయినది. భారతరావు విప్లవమార్గమునే పరిమళవంతముగఁ జేయఁజూచుచున్నాఁడు— ప్రేమామృతరససిక్తముగఁ జేయఁ దలఁచుచున్నాఁడు— సుఖకుసుమనికుంజావృతముగఁ జేయ నెంచుచున్నాఁడు. భారతరావు పట్టినపట్టు వదలుస్వభావము కలవాఁడు కాఁడు. ఇది యంతయుం దలఁచుకొని సత్యవతి రత్నప్రతిమవలె నిశ్చేష్టయైపోయెను.

అప్పుడు భారతరావున కొకయుత్తరము వచ్చెను. అతఁడు దాని నందుకొని చదివిచూచి యాజాబును సత్యవతిచేతి కిచ్చెను. సత్యవతి యాయుత్తరమునుఁ జదివెను. అందిట్లున్నది.

“మిత్రమా !

నీవు పట్టపరీక్షయం దుత్తీర్ణుఁడ వైతి వనుసంగతి తెలిసి యానందించితిని. నేను విజయవాడనుండి కాకినాడకు వచ్చి క్రైస్తవపాఠశాలయందు నధ్యాయుఁడుగా నుంటిని. ఈవిద్యాశాలయం దింకొక యుపాధ్యాయుఁడు కావలసి యుండెను. నీవు వచ్చినచోఁ జాల బాగుగ నుండును. నీజాబున కెదురు చూచుచున్నాను. నీక్షేమము వ్రాయుము. చి॥ సత్యవతి సుఖవతియై యున్న దని తలంచెదను. విశేషములు వ్రాయుము !

ఇట్లు నీమిత్రుఁడు
చంచలరావు”

సత్యవతి సంతోషముం దెచ్చుకొని “అన్నా ! నీకుద్యోగముగూడ గాఁబోలును !” అనియెను.

భార—కావచ్చును !

సత్య—ఆచంచలరా వెవ్వరు? అతఁడు నన్నెట్లెఱుంగును?

భార—నామిత్రుఁడైనప్పుడు నిన్నెఱుఁగకుండునా? నీసంగతి యంతయు నాతనికిఁ దెలియును—ఆతఁ డెప్పుడును నీకొఱకే జాలి పడుచుండును.

సత్య—ఆలాగా?

భార—ఔను. ఆతఁడు నిరంతరపరోపకారపరాయణుఁడు-దయార్ద్రహృదయుఁడు.

సత్య—కావుననే నీకు మిత్రుఁడు.

భార—నాకు నాతనికి నెంతయంతర మున్నది? ప్రాణమిత్రుఁ డనిన నాతఁడే—నీమాట తలఁచుకొని నాకంటెను నాతఁ డెక్కుడుగ విచారించుచుండును.

సత్య—పవిత్రస్నేహభావ మట్టిదియే కాదా?

భార—అతనిచరిత్రముకూడ నతిపవిత్రమైనది. బాలవితంతుసముద్ధరణమునకై యాతఁ డెల్లప్పుడును పాటుపడుచుండును—

సత్యవతి యప్రతిభ యయ్యెను "బాలవితంతుసముద్ధరణమా?—బాలికలను వితంతువులుగాఁ జేసినవాఁ డెవ్వఁడు?" అని ప్రశ్నింపఁ దలఁచెను గాని యందుపైఁ దనయన్న యనాలోచితముగఁ "దల్లిదండ్రులు" అని బదులుచెప్పునేమో యని యామె సంశయపడియెను. అన్నచే నంతమాట యనిపించుట కవకాశముం గల్పించుట సత్యవతి కిష్టము లేదు. ఆమె యాకస్మికముగ నిరుత్తరయైపోయెను. భారతరావున కదియే యాలోచనమున కవకాశమును గల్పించెను.



## పదునేడవ ప్రకరణము.

"తెల్లనివి పాలు నల్లని
వెల్లను నీళ్లనుచుఁ దలఁచె దీనేమియు నా
యుల్లిక తెలుఁగవు గుండెఁ
దల్లడపా టొదవ నేమి తార్కాణిగదా ! "

చిత్రకథాసుధాలహరి.

రసము పుల్లనైయున్నను రంగుమామిడిపండ్లనే యేరికొను చుందురు. మేనికి దెగులు తెచ్చుచున్నను మిసనుబియ్యమునే వాంఛించుచుందురు. మన్నికతక్కువైనను మాంచెష్టరుబట్టలనే యుపయోగించుచుందురు. చెక్కలుమండిపోవుచున్నను సీమసబ్బులనే వాడుకొనుచుందురు. మదుపు తక్కువైనను మాయ మెఱుఁగులకే పడిపోవుచుందురు. రూపమోహము చాలఁ జెడ్డది ! శాల్మలీఫలమున కాశపడి పోయి చిలుక కన్నులఁబోఁగొట్టుకొనుచున్నది ! దీపకాంతులకు భ్రమపడి పోయి శలభము శింపివోవుచున్నది ! రూపమునం దట్టిమాధుర్య మున్నది ! రూపమునం దట్టియద్భుతాకర్షణశక్తియున్నది. కాని రూపమోహ మతివినిందితమైనది ! రూపకాంతి కన్నులను మూసివైచుచుండును. అట్టిరూపమును గన్నులఁ దెఱచి చూడఁగలవాఁ డొక్కఁడుమాత్రమే యీలోకమున ధన్యుఁడని చెప్పవచ్చును.

వేంకటేశ్వరరావు సామాన్యప్రకృతి. ఆతనిహృదయము పరిపక్వమైనది కాదు. వినిర్మలప్రేమనిబద్ధమైనదియే గాని విలాసచంచలమైనది. కావుననే యాతఁ డిప్పు డమృతకలశము తనచెంతనే యున్నను—ఆనవపాత్రమునకుఁ బ్రాఁకులాడుచున్నాఁడు—ముద్దు

గులాబిపువ్వు చేతిలో నున్నను పెదవులపూవునకుఁ గన్నులు మర లించుచున్నాఁడు. ఆచిత్రపటమును జూచినకొలఁదిఁ గ్రమముగ నాతని కామూర్తినే ప్రత్యక్షముగఁ జూడవలయు నని కోరిక కలుగుచుండెను. ఆమె యెవ్వరో యనసూయకుఁ దెలియదు; తనకును దెలియదు. దామోదరరావు నడుగవలయు నని యాతఁ డనుకొని యెను. దామోదరుఁడీనడుమఁగొన్నిదినము లనుండి యిచ్చటకు వచ్చుట లేదు. ఊరికిఁ బోయెద నని మాత్రము చెప్పియున్నాఁడు. ఇంకను వచ్చియుండఁడు—వచ్చినచో నాతఁడు తన్నుఁ జూడకుండ నుండఁ గలఁడా ?—వేంకటేశ్వరరా వీవిధముగ నాలోచించుకొనుచుండెను.

మరలమరల నాతనికాకోరిక కలుగుచునే యుండెను. ఆకస్మికముగ నేదియో మనసునకుఁదట్టుటచే మరలించుకొనుటకుఁ బ్రయత్నించుచునే యుండెను. ఎంతప్రయత్నించినను నాతని కాధ్యానము వదలుట లేదు. ఆతఁడట్లే భావించుకొనుచుండెను. అప్పు డనసూయ మెల్లమెల్లగ వెనుకనుండి వచ్చి పరాకుగనున్న యాతనికన్నులను మూసెను. ఆసుఖస్పర్శచే వేంకటేశ్వరునిసర్వాంగకములు నానంద పులకితము లయ్యెను. ఆతనిశరీరమునందలి ప్రతిపరమాణువునుగూడ నాసుఖస్పర్శమునందలియానందము నెఱుంగును. వేంకటేశ్వరునకు ధ్యానభంగ మయ్యెను. అప్పు డాతఁ డనసూయకరకమలములపైఁ దనచేతులనుంచి:—

"వెన్నెలచాటున నీ రెవరు ?
నెఱవన్నెలచాటున వా రెవరు ?
చిఱునవ్వులలో విరిదండ
బంగరుపువ్వులలోఁ గలకండ !"

అని పాడనారంభించెను. అనసూయ నవ్వుచు ముందటికి వచ్చి మృదులస్వరముతో "అంతపరాకుగ నున్నారేమి ?" అనియెను.

వేంకటేశ్వరుఁ డులికిపడి సంభ్రమముతో "ఏమియు లేదు. నీవువచ్చితి వని చూడలేదు" అనియెను.

అన—ఎందుచేత ?

వేంక—పరధ్యానముతోఁ గూర్చుండియుంటిని—

అనసూయ నవ్వుచు "ఔను ! అది యెందుచేత ననియే యడుగుచుంటిని" అనియెను.

వేంకటేశ్వరుఁ డప్పుడు తా నసందర్భముగ మాటలాడితి నని గ్రహించుకొనియెను. తనహృదయభావముల కాటును బోటును గలిగియున్నసంగతి నాతఁడు తెలిసికొనియెను. వేంకటేశ్వరుఁ డప్పు డాత్మభావగోపనమునకై చిఱునవ్వునవ్వుచు "ప్రాణేశ్వరిపై మన సుపోయినప్పుడు పరాకు కాదా ?" అనియెను.

అనసూయ యాతనిపైఁ బ్రేమైకవీక్షణములఁ బరగించుచు "నేనాలస్యముగ వచ్చితి ననుకొని యెదను" అనియెను.

వేంక—వంటలక్కతో మాటాడుచుంటివి కాఁబోలును ?

అన—లేదు. ఆమె యీనడుమఁ గొన్నిదినములనుండి "నీనాథుఁ డట్లున్నాఁడేమి ? అంతపరాకుగ నున్నాఁడేమి ? ఆత నిచూపు లట్లున్న వేమి ?" అని నన్నుఁ బ్రశ్నించుట కారంభించినది. ఆమాటలకు నాకర్థము తెలియుటలేదు. అందుచే నేనామెతోఁ దఱచుగ మాటాడుట మానివైచితిని. భోజనము చేసి మేడమీఁదికి వచ్చుచుండఁగాఁ బంజరములోని చిలుక నన్నుఁ బలుకరించినది. దానికొక పనసతోన నందించి మఱి వచ్చితిని. అందుచే నించుక యాలస్య మైనది.

వేంక—పరాకుగ నుంటి ననుట కది యేకారణము?

అన—కాదు కాదు! పరిహాసమునకై వంటలక్క యన్న మాటయే మరల నేను నంటిని.

వేంక—ఆలాగా? నిజముగ నేనట్లు లేనుగద?

అన—ఉన్న నేమి? పరాకుగ నుండుటగూడఁ దప్పా?

వేంక—తప్పు కాదుగద! నాయందుఁ దప్పు లేదని నీవు భావించుటయే నాకుఁ గావలసినది. చెప్పుము! తప్పు లేదుగద!

అన—చెఱకుపానకమునఁ జేఁదు లేదని చెప్పుట యెందుకు? వెన్నెలవెలుఁగున వేండ్రము లేదని చెప్పుట యెందుకు?

వేంకటేశ్వరున కింతవఱకు ననసూయ తనతప్పులను గ్రహియింపఁగలుగుటయే యానందముగ నుండెడిది. ఇప్పుడో—తనయందెంతమాత్రమును దప్పు లేదని యామె మనఃపూర్వకముగఁ దెలుపువఱకును దృప్తి కలుగుటలేదు. అతఁడు స్వస్థచిత్తముతో "ప్రాణేశ్వరీ! నీవు ప్రేమమయమూర్తివి! నీహృదయము నిష్కల్మషమైనది! నీనిస్తరంగప్రేమామృతసాగరమున నాజీవితనౌక చల్లగ జరగిపోవుచున్నది. నిన్ను జీవితేశ్వరిగఁ బడయుటచేతనే నాజన్మము సార్థకమైనది!" అనియెను.

తనప్రాణేశ్వరుఁ డింతటివిలక్షణముగ సంభాషించుట యనసూయయిదివఱకు వినియుండలేదు. ఆమాటలనుబట్టి యాతనిహృదయపరిణామము సులభముగ బోధపడుచునే యున్నది. ఆదృష్టియే లేనియనసూయ కాసంగతి యెట్లు తెలియును? ఆసంభాషణమునందుఁగూడ నామె యభినవానందము ననుభవించుచుండెను.

అంతలో దామోదరరా వచ్చటికి వచ్చెను. అనసూయ మేలుపలిసోపానముల నవతరించి క్రిందికి దిగిపోయెను. వేంకటేశ్వరుఁ

దప్పుడు "దామోదరా! రమ్ము!" అనిపిలిచెను. దామోదరుఁడు లోపలకుఁ బోయి యొకకుర్చీపైఁ గూరుచుండెను.

వేంక—మిత్రమా! ఈనడుమ నెక్కడకుఁ బోయితివి?

దామో—రాజమహేంద్రవరము.

వేంక—ఎందుకు?

దామో—అడుగవలయునా?

వేంక—జూదమును మానఁదలఁచుకొన లేదా?

దామో—జూదము మానినచోఁ ద్రాగుటకు ధన మెక్కడ నుండివచ్చును?

వేంక—త్రాగుటమాత్ర మంత మంచిదా?

దామో—మధ్యమవయసుకూడఁ గడచిపోవుచున్న యిప్పుడా మంచిచెడ్డలను బరామర్శించుట?

వేంకటేశ్వరుఁడు నవ్వుచు "నీకొఱకుఁ గన్నులు కాయలు కాచినట్లున్నవి" అనియెను.

దామో—అంతయావశ్యక మేమి వచ్చినది?

వేంకటేశ్వరుఁడు సంభ్రమముతో నటునిటుఁ దిరిగి చూచెను; కుర్చీపైనుండి లేచి వెలుపలిసోపానములవఱకును బోయి పరిశీలించెను. అనసూయయెచ్చటనైన దాఁగి యున్న దేమో యని యాతని సంశయము! పాపము! నిర్మలస్వభావ యగు ననసూయ యప్పుడే క్రిందికి దిగిపోయినది. వేంకటేశ్వరునిహృదయము శంకాకళంకిత మగుటకుఁ గారణ మాతఁడు రహస్యచింతానిమగ్నుఁడైపోవుటయే. అతని సుఖామృతకలశ మానందసౌధమునందలి శాంతిశిఖరమునుండి పరిభ్రష్టమై క్రమముగ సోపానముల కంతరాంతరములనుండి యధోముఖముగ దొరలిపడిపోవుట కారంభ మయ్యెను. వేంకటేశ్వరుఁడు

మెల్లమెల్లగ మరల వచ్చి యథాస్థానమునం గూర్చుండి ‘‘దామోదరా! రహస్యముగ నిన్నొక్కమాటయడుగవలయునని యున్నది’’ అనియెను.

దామోదరుఁడు నవ్వుచు ‘‘ నేను వినవచ్చునా ?’’అనియెను.

వేంక—పరిహాసము కాదు. అంతరహస్యము! మాట చెప్పి మఱచిపోవలయును.

దామో—అదియెట్లు? మఱచిపోవుటయును నిదురపోవుటయును మనప్రయత్నములకు సాధ్యములగునవియా ?

వేంక—కాదు. ఈరహస్యము మనయిరువురిలోనే యుండవలయును.

దామో—సరే. చెప్పుము!

వేంకటేశ్వరుఁడు సంగీతపుస్తకమునుండి చిత్రపటమును దీసి దామోదరునకుఁ జూపించెను. దామోదరుఁడు నవ్వుచు ‘‘బహిరంగముగఁ జాలదినములనుండి యీపుస్తకమునందే యున్నదీనిలో రహస్య మేమున్నది ? ’’ అనియెను.

వేంక—ఈమూర్తి యెవ్వరు ?

దామో—స్త్రీమూర్తి—

వేంక—అది కాదు—ఈమె యెవ్వరు ?

దామో—ఆసంగతి నీకెందుకు ?

వేంక—ఈ సౌందర్యమును జూచి మాయనసూయకూడ మెచ్చుకొన్నది.

దామో—సానిమెఱుఁగులు సంసారులకు వింతగ నుండవా మఱి ?

వేంకటేశ్వరుఁ డాత్రముతో ‘‘ఈమె సానియా ? ’’ అనియెను.

దామో—సాని గాకున్న నీమెచిత్రము నాపుస్తకములోని కెట్లువచ్చును ?

వేంక—ఈమె నీయొద్ద సంగీతము నేర్చుకొనుచున్నదా ?

దామో—సంగీతమే కాదు. చాలఁగఁజదివినది ! సానివాడయంతయును సంసారిగూడెము చేయవలయు నని యామె యుద్దేశించినది.

వేంక—అది యెట్లు ?

దామో—తాను బెండ్లి గూడి యందఱ నట్లు ప్రోత్సహింపవలయు నని యామెయూహ.

వేంకటేశ్వరుఁడు మందహాసముతో "భోగముదానికి బెండ్లియా ?" అనియెను.

దామో—సానులే పెండ్లియాడినచో సంసారుల పెండ్లిండ్లకు సంగీతమేళములమాట యేమనియా నీసంకోచము ?

వేంక—అది కాదు—ఆ పెండ్లి లోకస్వభావమునకు విరుద్ధము కాదా ?

దామో—అట్లయినచో సానులవృత్తియే లోకస్వభావానుకూలముగ నున్నదని కాఁబోలును నీయూహ ?

వేంక—కాదా మఱి ?

దామో—ఈనడుమ నీస్వభావము మారినట్లున్నదే !

వేంకటేశ్వరుఁడు హతప్రతిభుఁడై పోయెను. దామోదరుఁడు తన జాలసూత్రములను బలముగఁ బురివెట్టుచున్నసంగతి పాపము చపలహృదయుఁడగు వేంకటేశ్వరుఁ డెట్లు గ్రహింపఁగలఁడు ? అతఁ డతిమందస్వరముతో "ఆమెకుఁ బెండ్లియైనదా ?" అనియెను.

దామో—అంతయును సిద్ధమైనది—తుద కస్తవ్యస్తమైనది.

వేంక — ఇప్పు డామె సానిగనే యున్నదా ?

దామో — లేదు — కన్యయై యున్నది.

వేంక — ఇంకను పెండ్లి యాడఁదలఁచియే యున్నదా ?

దామో — తగినవరుఁడు దొరకినచో —

వేంకటేశ్వరుఁడు సంకోచముతో "ఆమె నొకసారి చూడవలయు నని యున్నది" అనియెను.

దామో — ఆమె సామాన్యురాలు కాదు. మంచిమాటలతో మనయింటికి వచ్చునను నమ్మకము లేదు.

వేంక — రహస్యముగా మనము పోయి చూడవచ్చునా?

దామోదరుఁడు వికటహాసము చేయుచు "మనయిరువురిలో నుండవలసినరహస్య మిదియే కాదా ? " అనియెను.

వేంక — ఔ — ను —

దామో — అలాగా? కొంపుగోట్టకుండఁ గల్లుతాగుటయెట్లు?

ఆమాట వేంకటేశ్వరునిహృదయమున బల్లెపుఁబోటువలెనాటెను. అంతటితీవ్రఘాతముల కాతనిహృదయ మలవాటుపడునట్లు చేయుటయే వేంకటేశ్వరుని దనకపటజాలములఁ గదలకుండఁ జిక్కించుకొనుటకుఁ బ్రధానసూత్రమని దామోదరుఁడు నిశ్చయించుకొనియెను. ఆతంకముల నధికముగఁ గల్పించుటయే యాశనభివృద్ధిపఱచుటకుఁ బ్రధానోపాయ మనునాకర్షణ సూత్రసాంప్రదాయములను దామోదరుఁడు బాగుగ నధ్యయనము చేసి యుండెను. వేంకటేశ్వరుఁ డొక్కయడుగు రమ్మనఁ దప్పకుండ దామోదరుఁ డను కొనినట్లే యాతనికపటసూత్రమునఁ గట్టువడిపోయెను. ఆతనినిర్మల ప్రేమాంతరంగమున నీచమోహచ్ఛాయ యావరించుకొనుట కవకాశముగ నాశావాయుసంచాలన మయ్యెను.

## ప దు నె ని మి ద వ ప్ర క ర ణ ము



“ తలుగాకిశనమునకు బా
మాల కోరిచి చెట్లఁబట్టి పోవఁగఁ జనునే!
యిలవెలఁది బోయ లొగ్గిన
వలలోఁబడఁ బ్రాణహాని వచ్చుట గాదే ”

చిలుక—హారావళి.

క్షీరకలశమునకు క్షారజలస్పర్శన మైనది. తూలరాశికిఁ గీలాసంపర్కము కలిగినది. పూలదండకుఁ గాలాతపతాపము సోఁకినది. వేంకటేశ్వరునిహృదయము స్థానము తప్పిపోవుచుండెను!—తీవ్రవేగముతోఁ గొట్టుకొనఁబోవుచుండెను. ఏదియో తప్పుచేయుచున్నట్లాతఁడు తల్లడిల్లి పోవుచునేయుండెను. కాని యాతనివివేచనాశక్తి యంతరించి పోయినది. అనసూయతో నేమని చెప్పుదు నని యాతఁడు సంకోచించుచుండెను. ఇదివఱ కాతఁ డెక్కడకును బోవుట లేదా? ఆమెతోఁ జెప్పుట లేదా? ఇప్పుడెందుకుఁ జెప్పఁగూడదు? ఆతఁడనసూయను దఱచుగఁబని లేకుండఁగనే పలుకరించుచుండెడివాఁడు; ఇప్పుడామెకన్నులఁ బడుటకే కళవళపడుచుండెను. వేంకటేశ్వరుఁ డెట్లో తెగించి నాటకసందర్శనమునకై తాను బెద్దాపురము పోవలయు నని యనసూయతోఁ జెప్పెను. అనసూయ యాత్మేశ్వరునియానందమున కెన్నఁడు నభ్యంతరముగల్పించి యెఱుఁగదు. ఆతనియానందమే యామె యానందము! అనన్యహృదయ యగునసూయ యాతనిప్రయాణమునకు హృదయపూర్వకముగ సమ్మతించెను.

రాత్రి భోజన మైనతరువాత దామోదరుఁడును వేంకటేశ్వరుఁడును గుఱ్ఱపుబండిపైఁ బెద్దాపురమునకు బయలుదేరిరి. బండి కదలినది. ఆకస్మికముగ నప్పుడేదియో యదృశ్యసూత్రము వేంకటేశ్వరుని మెడకుఁ జుట్టుకొని మేడమీఁదికి లాగుచున్నట్లయ్యెను. గుఱ్ఱము ముందఱికిఁ బరుగెత్తుచున్నది. ఆతఁడు కంఠము బిగిసికొనఁబోవు చుండెను. బండి యాఁగుటలేదు. అందుచే బలవంతముగ నాపరిమళ సూత్రము పటాలునఁ దెగిపోయెను. ఆచప్పుడు వేంకటేశ్వరుని హృదయసంచలనస్వరంబున విలీనమైపోయి యుండును. వేంకటేశ్వరుఁ డప్పుడు గళము సవరించుకొని „ దామోదరా! నేఁడు వెన్నెల యెంతసేపటికివచ్చును ? ” అనియెను.

దామోదరుఁడు నవ్వుచు „ పెద్దాపురము వెళ్లునప్పటికి—” అనియెను.

వేంకటేశ్వరుఁ డేకాంతముగా „ రాజరత్నము నాటకముఁ జూచుటకుఁ బోదుగద ? ” అనియెను.

దామో—పోయిన మనసా మ్మేమిపోయినది ?

వేంక—పోవద్దని చెప్పలేదా?

దామో—చెప్పితిని.

వేంక—నేను వచ్చెదనని కూడఁ జెప్పితివా ?

దామో—చెప్పిన నేమిలాభము ? దానిని నీవెంతగ నెఱుఁగుదువో యది నిన్నంతగా నెఱుఁగును !

వేంక—వినియుండు ననుకొనియెదను.

దామో—వినకయున్నచో నీప్రయత్న మంతయు నెందుకు?

వేంక—నామనసునం దేమో యడఁటుగా నున్నది.

దామో—క్రొత్తగావున నట్లే యుండును.

వేంక—ఆమాట నిజమే.

వారిట్లు సంభాషించుకొనుచుండఁగా గుఱ్ఱపుబండి పెద్దాపుర మున నాటకశాలయొద్దకు వచ్చెను. అప్పు డాయిరువురును బండి దిగి గుఱ్ఱపువానితో బండిపార్శ్వమునందుంచి కాచుకొనియుండుమని చెప్పి ముందువైపునకుఁ బోయిరి. నాఁడు ధనాభిరామనాటకమును బ్రద ర్శించుచుండిరి. వారు నాటకశాలలోనికిఁ బోలేదు. రాజమార్గము నకుఁ బార్శ్వమునందలిమరియొకసన్నగడివీధినిబట్టి పోయిరి. దామోదరుఁ డా వీధినున్నయొకమేడయొద్ద కాతనిఁ దీసికొనిపోయెను. ఆసౌధ ముఖద్వార మోరవాఁకిలిగ మూయఁబడియుండెను. అప్పుడు దామో దరుఁడు ‘‘రమ్ము’ అని చెప్పి యాతని లోనికి వెంటఁబెట్టుకొని పోయెను. మంత్రముగ్ధునివలె వేంకటేశ్వరుఁడు దామోదరునియడు గుల నాశ్రయించి పోవుచుండెను. తిన్నగఁ వారిరువురును సోపాన ముల నధిరోహించి మేడమీఁదికిఁ బోయిరి. అప్పుడొకయువతీమణి ద్వారయవనికాంతరాళమునుండి వెలుపలికి వచ్చి మందహాససుంద రవినీతవదనముతో వేంకటేశ్వరునకు నమస్కరించి ‘‘ దయచేయుఁ డు ! ’’ అనియెను.

వేంకటేశ్వరుఁడు ' వెఱపడిపోయెను. ఆతఁ డప్పు డభూత పూర్వం బగు నొకమనోవికారమునకు లోనైపోయెను. దామోదరుఁ డాతనిచేయి పట్టుకొని పార్శ్వమున నలంకరింపఁబడిన యొకగదిలో నికిఁ దీసికొనిపోయెను. వేంకటేశ్వరుఁడు దామోదరునిచేతిలోని జంత్రపుబొమ్మ యైపోయెను. దామోదరుఁ డాతని నొకకుర్చీపైఁ గూర్చుండఁజేసి తానును గూర్చుండెను. క్రింద నొకరత్నకంబళము పైఁ గూర్చుండి యాయువతీమణి తమలపాకులను మడఁచుచుండెను. వేంకటేశ్వరుఁ డోరకంటితోఁ జూచి యామె యే రాజరత్నమని యనుకొనియెను. బాగుగ నాలోచించి చూచెను. నవనవోత్తేజిత మగునారూప మిచ్చట నపుత్తేజిత మైయుండెను. అవ్యక్తమధురం

బగు నాలావణ్య మిచ్చట సువ్యక్త మైయుండెను. ఈమె యామె యొక్కయె మైయుండు నని యాతడు నిశ్చయించుకొనియెను.

అప్పుడు దామోదరరావు "నాగమణీ! వేంకటేశ్వరరావుగా రీయనయే." అనియెను.

నాగమణి మృదులస్వరముతో "ఓనియుంటిని— దర్శన భాగ్యము నేటివఱకు లభియింపలేదు" అనియెను.

దామో—(నవ్వుచు) వచ్చుటకుఁ బని యేమున్నది?

నాగ—పటకుటీరమునకుఁ బట్టభద్రుఁడు వచ్చిన ట్లున్నది.

దామో—పట్టభద్రుఁడుగావుననే రాజరత్నమును జూడవల యు నని వచ్చినాఁడు.

వేంకటేశ్వరున కామాట లాకర్షణమంత్రములవలెనుండెను. ఊరక కూరుచుండుట యాతని కుచితముగ నగపడుటలేదు. మాటాడుటకు మాటలు స్ఫురింపకుండెను. అప్పుడు నాగమణి తాంబూలపుఁబళ్లెరము నాతని సమీపమునందున్న బల్లపై నుంచెను. దామోదరుఁడు నవ్వుచు "తీసికొనుము!" అనియెను. వేంకటేశ్వరున కామరి యాదలు తెలియవు. ఆతఁడు కంపితహస్తముతో నాయాకు మడపులు నందుకొనియెను.

నాగమణి మృదులకంఠముతో వ్యక్తావ్యక్తమధురస్వరంబున:—

"ఉపచారము చేసేవా
రున్నారని మఱవకు రామ॥ఉపచారము॥"

అని యించుకపాడి యంతలో నాఁగి కంఠమును సవరించుకొని "రాజా!" అని పిలిచెను.

తోడనే రాజరత్నము తొలుకరిమెఱుపువలె నామందిరమునఁ బ్రత్యక్షమయ్యెను. వేంకటేశ్వరునికన్నులు చెదరిపోయెను. ఆతని

కష్టదు కలలోఁగన్న నిధానము కన్నులఁబడినట్లయ్యెను. ఆతనిరక్త నాళము లన్నియును విద్యుత్తంత్రులవలెఁ దీవ్రవేగసంచలితము లైపో యెను. ఆతని యాపాదమస్తకమునుగూడ నవ్యక్తభావోద్రేకముచేఁ బ్రకంపితమైపోవుచుండెను. ఆతఁ డెట్లో మఱియొకసారి కన్నెత్తి చూచెను. రాజరత్న మించుక తల వంచుకొని తలుపుచాటున నిలిచి యుండెను. వేంకటేశ్వరుఁడు సమాధినిష్ఠునివలె— చంద్ర కాంతశిలావిగ్రహమువలె నిశ్చలుఁడై యట్లే కూర్చుండి యుండెను.

దామోదరుఁడు మందహాసము చేయుచు ,, మిత్రమా ! నాపలుకు చెల్లినది— సీతలఁపును దీఱినది. చాలరాత్రి యైనది-- ఇఁక నాటకములోనికిఁ బోవుదమా ? '' అనియెను.

వేంకటేశ్వరునిగుండె గుభిల్లు మనియెను. ఆమందిర మాత నిస్వేచ్ఛావిలసనమున కభ్యంతరముగ నున్నను బ్రియముగనే యుం డెను. అందాతనికిఁ బలుకులు స్ఫురింపకున్నను భావములు మెఱసి పోవుచునే యుండెను. మధురపరిమళములు వెలువడకున్నను మనః కమలము వికసించుచునేయుండెను. అంతరంగమునకు బోధపడకు న్నను నానందము నిండుచునే యుండెను. ఆతఁడు కంపితస్వరముతో ,, దామోదరా ! అప్పుడే పోవుటయా ? '' అనియెను.

దామో—నాటక మైపోయినతరువాత నేమిలాభము ?

వేంక— నాటకము చూచుటకంటెఁ బాట వినుటయే నా కానందము.

దామోదరుఁడు చిఱునవ్వుతో ,, అలాగా ? రాజరత్నము తలయెత్తి చూచినచో నీయుద్దేశమును గ్రహించియుండును. గ్రహిం చినచో నీవు తలయూఁచునట్లు పాడియే యుండును.

నాగమణి దామోదరునిమాట కడ్డము వచ్చి ,,అట్లనవలదు. తుదకు మీరు తలవంచుకొనవలసివచ్చునేమో ! '' అనియెను.

దామో—నాకేమి ?

నాగ— గురుత్వ మున్నది గాదా ?

ఈమాటలసందడిలో వేంకటేశ్వరుఁ డింకొకసారి రాజరత్నమును జూచెను. అప్పుడే యామెకన్నులుకూడ నాతనికన్నులలోఁ బ్రతిఫలించినవి.

దామోదరుఁడు చేసన్న చేయుచు మందహాసముతో "నాగమణీ ! ఇంకను మనగురుత్వ మెందుకు ?" అని రాజరత్నముం జూచి "రాజా ! ఇటురమ్మ ! సిగ్గుపడువానియొద్ద సిగ్గెందుకు ?" అనియెను.

నాగమణి స్వభావమున కించుక భిన్నముగఁ బక్కున నవ్వెను. వేంకటేశ్వరుఁడు నిలువున నీరయ్యెను. రాజరత్నము రివ్వున నటనుండి వెడలిపోయెను. దామోదరుఁ డామెను బట్టితీసికొనివచ్చుటకై వెడలిపోయెను. అప్పుడు నాగమణి వేంకటేశ్వరునిం జూచి "అయ్యా ! క్షమియింపుఁడు ! మా రాజరత్నమునకుఁ దలకుమించినసిగ్గు ! అది సానియింటఁ బుట్టఁదగినది కాదు. సభకు నూటపదియాఱు లిచ్చెదనన్నను బోదుగద ! సరసులవంకఁ గన్నెత్తి చూడనైనఁ జూడదుగద ! దానిచదువే చదువు— సంగీతమే సంగీతము ! మీవంటివారుగనుక సరిపోయినది. మఱియొక రైనచోఁ గోపగించుకొనరా ?" అనియెను.

వేంకటేశ్వరరావు కంపితస్వరముతో "ఇందుఁ గోపమునకేమున్నది ? క్రొత్తగదా !" అనియెను.

నాగ—క్రొత్తయేమి ? దానికి దినదినముఁ గ్రొత్తయే— దాని కామార్గమే నచ్చదు ! చదువుకొన్నది కాదా ? పెండ్లియైనఁ జేసికొనునఁట !— పెండ్లామువలె నొక్కనియధీనమునం దుండునఁట !—

వేంక — మంచియుద్దేశమే —

నాగ — అయ్యో! ఆమాట నిజమే — మంచికోడలుఁ జూచినచోఁ దరువాత మాయొగ మెవ్వరు చూచెదరు ? సాని పుట్టువు కంటెను హీనజన్మమీలోకమునందున్నదా ? నోరెత్తినచోరాగ-నోరుమూసికొన్నచో మూఁగ — ఈమంచిబిడ్డ లన్నియును మా యింటఁ బుట్టిన దానికిఁ దెలియవలయును గాని — చెప్పినను వినదే! దానితో నేను పడుచున్న పాట్లు దైవమునకుఁ దెలియును — దామోదరరావుగా రెఱుఁగుదురు!

నాగమణి యిట్లుపన్యసించుచుండఁగా దామోదరుఁడు రాజరత్నమును దీసికొని వచ్చెను. రాజరత్నము నాగమణిపార్శ్వమున రత్నకంబళముపైఁ గూర్చుండెను. వేంకటేశ్వరునకూపిరి తిరిగినట్లయ్యెను. అప్పుడు దామోదరుఁడు వీణ తెచ్చి రాజరత్నమున కిచ్చెను. ఆమె యొయ్యారముగ వీణాతంతువులను సారించుచు శ్రుతులను సరిచేసి యొక్కసారి వేంకటేశ్వరునిపై నిశితకటాక్షములను బరగించెను. సుసజ్జితమగు ధనువునుండి వెలువడినవాఁడిబాణములవలె నవి యాతనిహృదయమున దూసికొనిపోయెను. అప్పుడు వేంకటేశ్వరునిహృదయమును గన్నులునుగూడఁ జెదరిపోవుచుండెను. నాగమణి తంబురతో శ్రుతివైచుచుండెను. దామోదరుఁ డేమంత్రమునుపదేశించెనోగాని రాజరత్నము తనమధురకంఠస్వరమును వీణాస్వరముతోఁ గలిపి:—

"తొలి నేఁజేసినపూజాఫలము"

అనుకృతిని బాడుచు వాయింప నారంభించెను. వేంకటేశ్వరునివీనుల కమృతాభిషేక మైనట్లయ్యెను. అప్పు డాతని కామందిరము స్వర్గధామమువలె నగపడియెను. నాగమణియు రాజరత్న

మును రంభాతిలోత్తమలవలె నగపడుచుండిరి. ఆయానందములో నాతఁడు తన్నుఁ దానే మఱచిపోయెను. ఆయజ్ఞాతసమయముననందే యాతనిజీవనప్రవాహమున కజ్ఞాతపరివర్తనము కలిగెను. వేంకటే శ్వరుఁడు దిగ్గున లేచి తాను బయలుదేరివచ్చునప్పు డనసూయతన మెడలోవైచిన పుష్పహారమును దీసి రాజరత్నముకంఠము నలంక రించెను. ఆసందడిలో నానివేళ్లికల్యాణాంగుళీయకము జారి క్రిందఁ బడిపోయెను. అప్పుడు దామోదరుఁడు లేచి పకపక నవ్వుచు:—

"ఆనంద మానంద మాయెను మా
జానకిపెండ్లికూఁతు రాయెను."

అని పాడ నారంభించెను. వేంకటేశ్వరుఁడు చిత్రప్రతిమ యైపోయెను. అప్పుడు రాజరత్న మాయుంగరమును దీసి వేంకటేశ్వ రునకిచ్చెను. ఆతఁడా మెదక్షిణహస్తమును గ్రహించి యామెయనా మికాంగుళమునం దాయుంగరము నలంకరించెను. దామో దరుఁడు పకపక నవ్వుచు "అయంముహూర్తస్సుముహూర్తోస్తు" అనియెను. వేంకటేశ్వరుఁడు విభ్రాంతుఁడైపోయెను.

రమణీమణి యగునసూయ ప్రేమతోఁ దనకొసంగినపూల దండతో రాజరత్నము నలంకరించుట వేంకటేశ్వరునకు ధర్మమా? అగుఁగాక! అనసూయ పెండ్లివేళఁ దనకువరదక్షిణగా లభించిన యుంగరమునుగూడ నామెకిచ్చుట కాతని కధికార మెచ్చటనున్నదిరి తదేకప్రాణయగునసూయపరోక్షమునం దట్టియపరాధమును గావిం పవచ్చునా?—వేంకటేశ్వరుఁ డంతవఱకు కాలోచింపలేదు. ఆతని హృదయకమల మంధకారమున వికసించినది—ఆతనిబుద్ధిశక్తి యపమార్గమున విజృంభించినది!

వేంకటేశ్వరుఁడు ప్రకృతిస్థుఁ డగునప్పటికిఁ దాను జేసిన దంతయుఁ దప్పే యని యాతనికి బోధపడియెను. ఆతనిహృదయాంతరాళమున సహస్రఘంటారవములతో "తప్పు! తప్పు!" అని యెవ్వరో ప్రబోధించుచున్నట్లయ్యెను. ఆనిశ్చలసమయమున "కొక్కొరోకో!" అనుకోడికూఁత యాతనిచెవులఁ బడియెను. వేంకటేశ్వరుఁడు సంభ్రమముతో "దామోదరా! ఇఁకఁ బోవుదము" అనియెను.

ఇరువురును వెలుపలకు వచ్చునప్పటి కెవ్వరో యొక స్త్రీమూర్తి వారిని బాగుగఁ బరిశీలించి వారిప్రక్కనుండియే వెడలిపోయెను. వేంకటేశ్వరుఁ డదరిపడియెను. అట్లే యాతఁ డడుగడుగునకు నదరిపడుచునేయుండెను. ఇరువురును నాటకశాలయొద్దకుఁ బోయి గుఱ్ఱపుబండి నెక్కి మరల గుమారనగరమునకు వెడలిపోయిరి. ఇరువురిలోనుండఁదగినరహస్య మిప్పు డేమైనది? అందఱకు ననుమానకారణ మగుటయేకాక తుదకు గుఱ్ఱమునకును బండికినిగూడఁ దెలిసిపోయినది!!



## పందొమ్మిదవ ప్రకరణము.



"ఎవనిగతిభేదమునఁ జేసి ◆ యీ జగంబు
వివిధపరిణామములతోడ ◆ వెలయుచుండు
నట్టి కాలాత్మకునకు ని ◆ రంతరంబు
ననితర ధీనగతికి వం ◆ దనశతంబు."

సంశయము.—శోకావళి.

" ఆస్త్రీమూర్తి యెవ్వరు? వేశ్యాగృహమునుండి వెలువడునప్పటికి మాపరిక్కనుండియే పోయిన యాస్త్రీమూర్తి యెవ్వరు? అనసూయ యైయుండునా? అనసూయ యచ్చటి కెందుకువచ్చినది? ఎట్లు వచ్చినది? అనసూయ యట్లు వచ్చుటకుఁ గారణమేమి? ఇంతవఱ కామెముఖమున నెట్టియనుమానచిహ్నమును గనఁబడుట లేదే! ఆమె యనసూయ కాదు—ఆమె యంతటిసంశయహృదయ కాదు—అంతటిధైర్యవతియును గాదు—ఒకవేళ నామె యనసూయయే యైనచో నాసంగతి యంతయు నామెకుఁ దెలియనే తెలిసినది. కానిచో—ఆమె కెంతమాత్రముఁ దెలియనే తెలియదు! ఎట్లయినను నాముందుమార్గమున కడ్డము లేదు—కాని నాయర్ధాంగలక్ష్మి యగు ననసూయయెడల—మదేకప్రాణ యగు ననసూయయెడల— నేనొనరించినది యపరాధము కాదా?—ఇందపరాధమేమున్నది? ఏ యనసూయ నన్నే ప్రాణముగఁ జూచుకొనుచున్నదో యట్టి నా ప్రాణములను జలింపఁజేయుచున్న రాజరత్నము నొకసారి చూచి యాప్రాణముల నిలుపుకొనుట యాయనసూయ కుపకారమే కాదా? ఈసమర్థనము కేవలము నిరర్థకమైనది—అమాయికహృదయ యగు ననసూయను బులిమిపుచ్చుటకై

యుపయోగింపఁదగినయుక్తివాదము — కాని యిదియుత్తమధర్మమని యెవ్వరంగీకరింతురు ? — అధర్మమే కావచ్చును. కాని నాజీవితము దుస్సహమైపోవుచున్నప్పుడు నేనేమి చేయుదును ? ప్రతీకారము చేసికొననక్కఱలేదా ? ఇంతమాత్రముచే ననసూయపై నాకుఁ బ్రేమ లేకుండఁ బోయినదా ? ఆమెను నాప్రాణమువలెనే చూచుకొనుచుండెదను. తప్పితిఁగిననే నామె కింకను దాసానుదాసుఁడనై మెలఁగుచుండెదను. ఇఁక నామెకుఁ గష్టముఁగనుండవలసినపనియేమున్నది? తనలీలాకపోతమింకొకరిసౌధముపైనాడుచుండుటయెవ్వరికిఁ గష్టముగనుండదు? అంతమాత్రముచే నేమి? అది తిరిగి తనయింటికే వచ్చుచున్నది కాదా — అనన్యగతిక యగుననసూయ నన్నేప్రాణముగఁ జూచుకొనుచున్నది. నాయందలిస్వల్పపరిణామమునుగూడ నామె సహింపఁజాలదు — కాని నాహృదయము నావశమునందు లేనప్పుడు నేనేమి చేయఁగలను ? తనకంటె రాజరత్నమే సౌందర్యవతి యని యనసూయయే యంగీకరించినది — అంతే కాదు. రాజరత్నముచతురమతి — సంగీతకళానిధి — అనసూయ నాహృదయము నలరించుచునే యున్నది — కాని రాజరత్నము బలవంతముగ నాహృదయము నాకర్షించుచున్నది. ఎట్లునిలువఁగలను ? ఎట్లు పోవఁగలను — పోయినఁ దప్పేమున్నది ? అంద మందఱకు నాదరణీయమైనదే — ఉపభోగార్హమగుసౌందర్యమునకై యుత్సాహపడుట తప్పా ? చంద్రికను జూచినకన్నులతో నింద్రధనుస్సును జూడఁగూడదా ? మాధవీసౌరభము నాఘ్రాణించుట మల్లికాలతకేమినష్టము ? — మృదుస్వభావ యగునసూయ యింతవఱకాలోచించుకొనఁగలదా ? ఎట్లయిన నామెకు ధైర్యము చెప్పెదను. ఏమని చెప్పుదును ? చెప్పకున్న నామెకుఁ దెలియదా ? తెలిసి

యామెయే సమాధానపడుఁగాక ! నేను నాహృదయమును మరలించుకొనఁ జాలను—నాకోరికల నడఁగించుకొనఁజాలను. సముద్రము మేరమీఱినప్పు డెవ్వ రాఁగఁగలరు ? ” అని యనేకవినముల వేంకటేశ్వరుఁడు పూర్వపక్షసిద్ధాంతములను జేసికొనియెను.

నదీజలము సస్యక్షేత్రముకంటె సముద్రమునకే యతివేగముగఁ బ్రవహించి పోవుచుండును. ఆరూపము మారిపోవును—ఆ మాధుర్య మంతరించిపోవును—ఆయుపయోగమే యగపడకుండఁ బోవును. వేంకటేశ్వరునిజీవితప్రవాహమున కిట్టిసంఘటనము కలిగినది. ఆతనిప్రేమచంద్రిక మోహమేఘాచ్ఛన్న మైపోయెను. ఆతని శాంతిదీప మాశావాయుసంచలిత మైపోయెను. ఆతనిహృదయమునకు భావాంతరము కలిగెను—ఆతనిచూపులకు రూపాంతరము కలిగెను. ఆతనికోరికలకుఁ బ్రకారాంతరము కలిగెను. ఆతనిచరిత్రమునకు యుగాంతరము కలిగెను. ఆతని కీయిహజీవితమునందే జన్మాంతరము కలిగినది !

అనసూయను రాజరత్నమునుగూడ నొక్కకంటితోఁజూడవలయు నని యాతఁడు నిశ్చయించుకొనియెను. అది యెట్లు? ఒకవృంతమున రెండుపుష్పముల నలరించుట యెట్లు ? ఒకపుష్పమున రెండుపరిమళముల వెలువరించుట యెట్లు ? ఒక్కరియందు గౌరవము, మఱియొక్కరియం దభిమానము—ఒక్కరిపై ననురాగము, మఱియొక్కరిపై మోహము— ఒకచో నానందము, మఱియొకచో నుత్సాహము— వేంకటేశ్వరుఁడు వడియేటఁ బడి కొట్టుకొనిపోవుచుండెను. ఆప్రవాహవేగ మేతీరమునకు మరలిన నాతీరము నొరసికొనుచుఁ బోవుచుండెను. ఆతనికి స్వతంత్రత లేకుండఁబోయినది-- స్వస్థత లేకుండఁ బోయినది—ఆతనిప్రచారము దినమున కొకతీరిగఁ

బరిణమించిపోవుచుండెను. క్రమక్రమముగ వేంకటేశ్వరుని గుట్టుపు బండి రాత్రులయందే గాక పగళులయందుఁ గూడఁ బెద్దాపురమునకుఁ బ్రయాణము చేయుచుండెను. వేంకటేశ్వరునికన్నులు మూసికొనిపో వుచున్నకొలఁదిని దామోదరుని మాయాజాలసూత్రములు బిగిసికొని పోవుచుండెను.

వేంకటేశ్వరుని రహస్యము క్రమముగ విశ్వవ్యాప్త మైపో యెను. కొంతకాలమున కనసూయకుఁగూడఁ దెలిసిపోయెను. ఆత్మే శ్వరునియధర్మపద్ధతి ననసూయ యంగీకరించి యుండునా? ఉన్న చో నది మానవప్రకృతికి విరుద్ధము కాదా? పతిప్రాణయగు నన సూయ వేంకటేశ్వరునిస్వేచ్ఛకు భంగము కలిగింపఁజాలకుండెను. అంగీకారమునకును నౌదాసీన్యమునకును జాల భేద మున్నది! ఆమె యాకష్టమును సుఖముగ భావింపఁజాలకుండెను గాని యంతటికష్ట మనుగూడ సుఖముగ ననుభవించుచుండెను. ప్రేమమయి యగు నామె ప్రాణేశ్వరునితప్పుల నొప్పులుగఁ దలంచుట లేదు గాని యా తనియెంతటితప్పులైనను క్షమియించుచుండెను. అనసూయ తన ప్రేమమయహృదయమున నాత్మేశ్వరుని భరియించుచున్నది. ఆత నియూలమునఁ దన కెంతటికష్టములు తటస్థించినను నామెసహింపఁ గలదు! ఆమణిదీపము నెట్టిఝంఝాప్రభంజనములును జలింపఁజేయఁ జాలవు— ఆయమృతవల్లిక నెట్టిగ్రీష్మాతపములును గసుగందఁజే యఁజాలవు!

ఆమెకు దఃఖము లేక పోలేదు. అనసూయ యేకాంతముగ నొక్కచోఁగూర్చుండి యదృష్టమును భావించుకొని యేడ్చుచునే యుండెను- ఆనందముతో నాత్మేశ్వరున కుపచారములు చేయుచు నే యుండెను. వేంకటేశ్వరుని నడవడి యెట్లుద్వోగూప్యమును వహిం

చుచున్నదో యట్లే యనసూయహృదయానుభవముకూడ ద్వైవిధ్య మును బొందుచుండెను. ఈపరిణామ మంతయు నొక్కనిమిషములో నైనదా? లేదు — అపునరావృత్తం బగుకాలపరిచారమునఁ బ్రతి నిశ్శబ్దపదచలనమందునుగూడ నజ్ఞాతముగ నాపరిణామము జరిగిపో వుచుండెను. ఆపరిణామరహస్యము నిరంతరస్వేచ్ఛాపరిచారపరా యణుఁ డగువేంకటేశ్వరున కించుకంతయును బోధపడుట లేదు. పాపము— నిరంతరత దేకపతిధ్యాననిమగ్నయగు ననసూయకూడ నాపరిణామవిభేదములను గ్రహింపఁజాలకుండెను.

ఆదాంపత్యధర్మ మీవిధముగఁ బరిణామచక్రాంతరాళమున బరిభ్రమించిపోవుచుండెను. కాలక్రమమున వేంకటేశ్వరుఁ డధః పతితుఁడై పోవుచుండెను. అబలయగు ననసూయ యేమిచేయఁగలదు? ఆతని నుద్ధరించుట కామెకు శక్తియెక్కడనున్నది? లేకపోవుఁగాక! అనసూయ ప్రేమమధురవచనములతో వేంకటేశ్వరునిఁ బ్రబోధింప వలసినది. ప్రణయమంత్రములతో నాతనిఁ బ్రార్థింపవలసినది. కాని యామె కంతటిధైర్యము లేదు. ప్రాణేశ్వరునితప్పును దలఁచుకొను టకుఁగూడఁ బ్రాణములు చలించిపోవుచున్న దామె నాథునియెదుట నాతనిలోపములంగూర్చి యెట్లుమాటాడఁగలదు? అనాలోచితముగ ననసూయపైఁ దప్పు పెట్టుటయే గాని మోహముగ్ధహృదయమును బశ్చాత్తాపఖేదము మరలించినట్లు ప్రేమసూత్ర మాకర్షింపఁగల దా? జ్వరతాపము నౌషధతాపమే శమింపఁజేయవలయునుగాని జలపానముచే నేమిలాభము?

వేంకటేశ్వరునకు మనస్స్తిమితత లేదు. ఆతనిసహధర్మిణి యగుననసూయకును లేదు. ఆయిరువురినడుమను బ్రతికూలవాయు వులు వీచుచున్నవి. తుద కేవిధముగఁ బరిణమించునో యెవ్వరుచె

వ్వఁగలరు? కష్టమునకును సుఖమునకును భేదమునే యంగీకరింపని ప్రాజ్ఞులమాట యెట్లున్నను సామాన్యముగ లోకులందఱు ననసూయ యగతికి విచారించుచుండిరి. అనసూయ చెప్పకొనకున్నను లోకులందఱును వేంకటేశ్వరుని నిందించుచుండిరి. అది యనసూయకుఁ గష్టముగనే యుండవచ్చును. ఆకష్టమునుగూడఁ బరిగణించుట లోకమునకు విధాయకకృత్యము కాదు. అనసూయసుస్వభావమే వేంకటేశ్వరుని దుస్స్వభావమునకు మెఱుఁగుపెట్టి లోకము కన్నులయెదుట స్పష్టముగఁ బ్రదర్శించుచున్నది! ఆకన్నుల నెవ్వరు మూయఁగలరు? లోకస్తుతి నిందలకు లోఁబడకుండ నెవ్వరు తప్పించుకొనఁగలరు?

---

## ఇరువదియవప్రకరణము.

"శ్రీమంతంబై శుభదో
ద్దామంబై పుణ్యలోక • ధామం బగుని
త్యామోదస్థానము హ
స్తామలకం బగును సుకృతు • లగువారలకున్"

కపోతము — హోగావలి.

సేవాసులభుఁ డగు శ్రీరంగనాయకునికంటెఁ దీవ్రప్రభావుఁ డగు తిరుపతివెంకన్నకే లోకులు భయపడుచుందురు. గ్రామపాలకుఁ డగు గోపాలస్వామికంటె గ్రామదేవతయగు గోఁగులమ్మకే జాతరలు విశేషముగ జరగుచుండును. మహాలక్ష్మిప్రభావముకంటె మారీదేవతాప్రసాదమునే లోకులు వాంఛించుచుందురు. పెద్దాపురమున

మరిడమ్మకు భయపడనివారు లేరు. ఆదేవిని గొలువనివారు లేరు. ఆమె కుపహారముల నర్పింపనివారు లేరు. జ్వరము వచ్చినచో మరిడమ్మకుఁ జలిమిడి పెట్టవలయును. చేను పండినచో మరిడమ్మ గుడిలోఁ గుంచెఁ గట్టవలయును కష్టసమయములయందును, సుఖ సమయములయందునుగూడ నాయూరివారి కాదేవియనుగ్రహామే శ్రీరామ రక్షయై యుండెను.

ఆగ్రామ దేవతామందిరమునఁ గొన్నిదినములనుండి యొక ప్రత్యక్ష దేవతామూర్తి వెలసియుండెను. ఆదివ్యమూర్తి తీవ్రస్వభావ యగుశక్తిస్వరూపిణి కాదు — శాంతస్వభావ యగు దేవీస్వరూపిణి. ఆమూర్తి దివ్యసుందరీమూర్తి యగుటచే నానగరప్రజ లందఱు నామెకుఁ "బూవులమ్మ" యని పేరుపెట్టుకొనిరి. భయభక్తులతో నామె కనేకు లనేకవిధముల నుపహారముల నర్పించుచుండిరి. ఆమె ప్రత్యక్షముగ వాని నన్నిటి నందుకొని యందఱకును బంచిపెట్టు చుండెను. తానుఁ గూడఁ బ్రత్యక్షముగనే యారగించుచుండెను. ఆదేవి యెవ్వరియుపహారము నారగించునో వారు తాముధన్యుల మైతిమని భావించుకొనుచుండిరి. ఆమె యెవ్వారికిఁ బ్రసాదమును గటాక్షించునో వారనుగ్రహింపఁబడితి మని సంతుష్టినందుచుండిరి. పరమాన్నపాత్రములును, ఫలాహారభాజనములును, పానకపుబిందె లును లెక్కలేకుండ వచ్చుచుండెను. ఆకారణముచే దర్శనార్థు లగుచిన్నపెద్ద లందఱకునుగూడ నిరంతర దేవీప్రసాదము లభియిం చుచుండెను. అనేకు లామెకుఁ జేయెత్తి మ్రొక్కుచుండిరి; చిన్న బిడ్డల నామెపాదములపైఁ బడవైచుచుండిరి; బహువిధములఁ బ్రార్థిం చుచుండిరి. ఆదేవి తనకటాక్షవీక్షణమాత్రముననే యందఱ నాద రించుచుండెను. విలాసచేష్టామాత్రముననే యందఱ నానందింపఁ జేయుచుండెను.

ఆదేవిచరిత్రముంగూర్చి నగరప్రజలలో ననేకులనేకవిధము లుగఁ జెప్పుకొనుచుండిరి.:— "కలికాలవశంబునఁ గర్మభ్రష్టులైన ప్రజలలో మరల దైవవిశ్వాసముంగల్పించుటకై మహామాత మామిడిపూవునుండి యవతరించి యీరీతిగ మనకు సాక్షాత్కరించినది" అని కొందఱును, "సుకవిశాపముచేఁ జీర్ణీభూత మైపోయిన పెద్దాపురదుర్గమునందలి దుర్గేశ్వరి పాండవులమెట్టపైనున్న యదృశ్యగుహాగర్భమునందలి యమృతసరోవరమునఁ గనకకమలముపై నింతవఱకు నిదురించుచున్నదనియు మంచికాలము వచ్చునప్పటికి మరలఁ బ్రత్యక్ష మగుననియు మాతాత చెప్పుచుండెడివాఁడు; పెద్దలమాటలెప్పుడును నిరర్థకముగఁబోదు; దానికిదియే నిదర్శనము! ఆదుర్గేశ్వరియే యీపూవులమ్మ— ఇఁక మనజన్మక్షేత్రమున జగపతిదుర్గముకూడఁ బునరుద్ధారితము కావచ్చును" అని కొందఱును "బోగముదాని చెఱువుగట్టునఁ బూవులు గుచ్చుకొనుచుండఁగాఁ బురసంచారము చేయుచున్న మరిడమ్మ యీమెను జూచి తనమందిరమున నుంచుకొనియెనఁట!" అని కొందఱును "ఈ మరిడమ్మనూటయెనమండ్రు సోదరీశక్తులలోనిమెయు నొకసోదరీశక్తి" అని కొందఱును దమతమవిశ్వాసములకుఁ దగినట్లు చెప్పుకొనుచుండిరి. ఎవ్వ రెట్టి నమ్మకము కలిగియున్నను నామె పూవులమ్మ యనియే యందఱు నేకగ్రీవముగ నంగీకరించియుండిరి.

ఆర్షప్రజ లగుభారతీయులభక్తి యనితరసాధారణమైనది. పరదేవతావిషయంబున వారివిశ్వాసముకూడ నతినిగాఢమైనది. ఆమె యెవ్వరైన నేమి? గ్రామదేవతయగుమరిడమ్మ మందిరమునం దున్నది. ఆదేవీమూర్తియందు దివ్యతేజము విరాజిల్లుచున్నది. కావుననే యామె నందఱును బూవులమ్మయని భావించి పూజించు

చుండిరి. ఈపవిత్రహృదయభావమును గ్రహింపఁజాలకయే—భారతీయులు చెట్లను, బట్టలను, గొండలను, బండలను గూడ దేవతలుగ నమ్మి యారాధింతురని యనాలోచితముగఁ గొందఱాక్షేపించుచుందురు. పరమార్థ మనుమాటయే యెఱుంగక కేవలభౌతికసుఖమే భవపరమావధిగఁ దలంచుకొను పరిజ్ఞానవిహీనులు భారతీయులపరంపరాగత మగుపవిత్రస్వభావము నెట్లెఱుంగఁగలుగుదురు? "సర్వంవిష్ణుమయం జగత్" అనుదివ్యగీతము భరతఖండప్రజల ప్రతిహృద్గోళసంచలనమునందును బ్రతిధ్వనించుచుండు ననుసంగతి కేవలభౌతికసుఖవాంఛాపరాయణులు గర్వోన్మత్తహృదయములకు బోధపడుటయెట్లు? ఆదైవవిశ్వాసమువలననే యానగరప్రజ లందఱుఁ గూడ నాదేవీమూర్తిని బూవులమ్మగా భావించుకొనిరి.

ఆదైవవిశ్వాసమే భారతభూమియం దంతటను శాంతిస్థాపనముం గావించినది. అదియే భారతప్రజలహృదయములకు నిత్యానందతుష్టిం బ్రసాదించినది. అదియే భారతసోదరులలో సర్వసమష్టిభావమును నెలకొల్పినది. అట్టిదృఢవిశ్వాసపరిపూర్ణహృదయములనుండియే "ఆత్మవత్సర్వభూతాని" "పరోపకారార్థమిదంశరీరమ్" అను మహావాక్యామృతరసతరంగిణులు ప్రవహించినవి. భౌతికసుఖదుఃఖములను మఱపించి భావనాప్రపంచము నానందస్వర్గముగఁ జేయుటకు భక్తిమార్గముకంటె సర్వోత్తమసాధనము మఱియొకటి యేదియును లేదు.

పూవులమ్మనఁబు చార మానగరప్రజలకందఱకును దెలిసిపోయెను. భక్తిరసావేశముచే ననన్యభావహృదయులగునాప్రజల కందఱకు నామె దేవీమూర్తియే యైయుండెను. మానవాకారముచే సాక్షాత్కరించిన దేవీమూర్తి నిదివఱకు వారెన్నఁడును జూచి

యుండలేదు. అయినను వారామెను బూవులమ్మ యనియే నమ్ముచుండిరి. నిశ్చలభక్తితేజమునెదుట సంశయాంధచ్ఛాయలు నిలుచుటకుఁ దావెక్కడున్నది? ఆమెను సందర్శించుటకై — ఆమెకు వందనముచేయుటకై — ఆమెను బ్రార్థించుటకై — ఆమెకుపహారముల నర్పించుటకై — పురజనులందఱును దండోపతండములుగ నాగాశ్రమ దేవతామందిరమునకు వచ్చుచుఁ బోవుచునే యుండిరి. సూర్యోదయము మొదలు జాముర్రాత్రివఱకు నాశక్తిమందిరము జనసముద్రకోలాహలితమై సముత్సాహపూరిత మగుచుండెను.

రాత్రి పదిగంట లైనది. ఆలయమున నప్పుడు జనసమ్మర్ద మేమియును లేదు. ఆలయద్వారములు తెఱవఁబడియేయుండెను. చీకటి రాత్రి — దేవీమందిరాంగణమునఁ బోతురాజునొద్ద గండదీపము వెలుంగుచుండెను. ఆప్రదీపకాంతులలో మఱిడీమహాలక్ష్మిదివ్యవిగ్రహము సుస్పష్టముగ నగపడుచుండెను. పూవులమ్మ యాగండదీపమున కెదురుగ నొకపసుపుఁబీటపైఁ గూర్చుండియుండెను. మఱిడీశక్తి యాదీపప్రకాశమున నుత్తేజితమగుచున్న యారాత్రి పురసుందరీమూర్తి దివ్యతేజమును గన్నులువ్రాల్పక కనుఁగొనుచుండెను. ఆదివ్యతేజమునకు లజ్జించుచున్నదేమోయనునట్లు దీపజ్యోతి చలించిపోవుచుండెను. అచ్చట మఱి యెట్టిజనసంచారమును లేదు. ఆశాభిహతంబు లగుశలభములుమాత్రము ఫలభ్రాంతిచే నాదీపమును సమీపించుచుండెను. కొన్ని భగ్నపక్షములై ప్రతప్తతైలాంతరమునఁ బడిపోవుచుండెను. కొన్ని తమకుఁగూడ నాగతి కలుగువఱకు నాదీపముచుట్టును బరిభ్రమించుచుండెను. దురాశదుర్గతికి మూల మనుసంగతి యందొకటియును గ్రహించుట లేదు.

పూవులమ్మ యంతయును జూచుచునే యుండెను. ఆసమయమునం దొకపురుషుఁడు మెల్లమెల్లగ నామందిరమునఁ బ్రవేశించెను.

దీపపు వెలుతురున నాతనియాకారము స్పష్టముగ నగపడుచుండెను. ఆతఁ డెవ్వఁడు ? మన దామోదరరావే— దామోదరునిఁ జూచిన తోడనే పూవులమ్మ పుత్తడికీలుబొమ్మవలెఁ బీఠమునుండి లేచి యాతని కెదురు వచ్చెను. ఆశ్చర్యము ! దామోదరుఁడుత్సాహావేశముతో నామెం జూచి "మధుమతీ !" అని సంబోధించెను. మధుమతి మాటాడలేదు; మధుమతి యిక్కడ కెందుకు వచ్చినది? దివ్యజ్యోతి యగునీతేజోమూర్తి యీభూలోకమున కెందుకు వచ్చినదని యాశ్చర్యపడవలసినది— ఈత్రిపురసుందరిని దేవీమూర్తిగ భావించి పరిజనులందఱును సేవించిరనుటలో వింత యేమున్నది? మహారాజ్ఞీమణి కాఁదగిన యీసుందరీమూర్తి మద్యవిక్రేతయధీనమున నందుండఁదగినదా ? ఈమె యానాఁడు నన్నుఁ జూచినది. నాయందనురాగము చేతనే యిప్పుడు నాచెంతకు వచ్చియుండును ! నాఁటిరాత్రి వేంకటేశ్వరుఁడును నేనును నాగమణియింటినుండి వెలుపలికివచ్చినప్పుడగపడిన స్త్రీమూర్తి యీమెయే కావచ్చును. ఆసందడిలో నంతఁగాఁ బరిశీలింపలేదు. దీనినిబట్టి చూడఁగా నీమె నాకొఱకే యన్వేషించుచున్నదని తోఁచుచున్నది" అనునీయాలోచనములన్నియు దామోదరుని హృదయాంతరాళమున నొక్కసారిగ నిమిషములో మెఱసిపోయెను.

దామోదరుఁడు మరల నింకొకసారి మధురస్వరముతో "మధుమతీ !" అని పలుకరించెను. మధుమతి మాటాడలేదు. లోపల నెవ్వరైన నుండిరేమో యనుసంశయముతో దామోదరుఁడు మఱిమాటాడక మధుమతిం జూచి "రమ్మ" అని సంజ్ఞ చేసెను. మధుమతి యాతని వెనువెంటనే బయలుదేరెను. దామోదరుఁడు ముందు నడచుచుండెను. మధుమతి యాతని వెనుకనే మాటాడకుండఁ బోవుచుండెను. దామోదరుఁ డామె నెచ్చటకుఁ దీసికొనిపోవును ?

నాగమణియింటికిఁ గొనిపోయినచోఁ గొంపమునిఁగిపోవును. ఇఁక నెట్లు? ఊరివారందఱు నామెను బూవులమ్మ యని యెఱుఁగుదురు— అయినను నామె నెచ్చట రహస్యముగ దాఁపఁగలఁడు? పూవుదాఁచినను బరిమళము దాఁగదుగదా— అతని కాలోచనయు పాలుపోవుట లేదు.

నిరుద్దిష్టభావముతో నాతఁడట్లే యామెను దీసికొనిపోయెను. తుదకు వారిరువురును గ్రాంపులపల్లిబండ్లఘట్టమువఱకును బోయిరి. అచ్చట నొకమద్యవిక్రయశాల యున్నది. దామోదరుఁడా యింటియొద్దకుఁ బోయి "నూకాలు!" అని పిలిచెను. దామోదరునికంఠస్వరము నానవాలుపట్టి యొకయూడిగయువతి చేత దీపముపట్టుకొని వచ్చి తలుపు తెఱచెను. ఆకస్మికముగ నామెచేతిలో దీపపుబుడ్డి క్రిందఁబడిపోయెను. తోడనే గుభాలునఁ దలుపుమూసి కొన్నచప్పుడయ్యెను. ఆమె దామోదరుఁడనియే తలుపు దీయవచ్చినది. కాని యాతనివెనుకనున్నపూవులమ్మ యామెకన్నులఁబడియుండును. అందుచేతనే యామెసర్వాంగకములును గంపించిపోయినవి— చేతిలోనిదీపము జారిపోయినది— ఆభయమే మరల నామెచేఁ దలుపులను మూయించివైచియుండును.

దామోదరున కాశాభంగమయ్యెను. ఇఁక నానగరమునం దాతనికిఁ దాపు దొరకదని తోఁచెను. తెల్లవారకుండ నామెను దాళ్లూరు తీసికొనిపోవలయు నని తలంచెను. తిరుగుప్రయాణము దొరకక యొకబండిమాత్రమాఘట్టమునం దుండెను. దామోదరుఁడా బండివానిం బిలిచి "తాళ్లూరునకు బండి కట్టెదవా?" అని యడిగెను.

బండి—ఎప్పుడు?

దామో—ఇప్పుడే— తెల్లవారకుండఁ బోవలెను.

బండి — ఈమార్గమున దొంగలభయము !

బండివానిమాట నిజమే— రాత్రిజాముదాటినతరువాత నా దారిని బండ్లు నడవవు. మధుమతియొద్ద నాలుగైదువందలవిలువగల వస్తువులుకూడ నున్నవి. కార్యాతురుఁడగుదామోదరుఁ డాసంగతి నంతగాఁ బాటింపలేదు. ఆతఁడు బండివానింబిలిచి "నీకునాలుగు రూపాయ లద్దె నిచ్చెదను. బండికట్టుము!" అనియెను. అద్దెకాస పడి యాతఁడు బండి గట్టెను. దామోదరుఁడు మధుమతిని బండిపై నెక్కించి తానుగూడ నెక్కెను. బండి యతిత్వరితముగ గాఢాంధకారమున ఘంటానాదముతో నడచుచుండెను.

బండి యెఱ్ఱగుట్టలవఱకును బోవునప్పటి కాకస్మికముగ మధుమతి కెవ్వనఁ గేక వైచి బండిలోనుండి క్రింద కుఱికి పడిపోయెను. బండి యాఁగిపోయెను. దామోదరుఁడు బండ దిగి యామెను లేవనెత్తుటకుఁ బ్రయత్నించెను గాని మధుమతి యాతని చేతులనుబట్టి యావలకుఁ ద్రోసివైచెను. మధుమతి శక్తిస్వరూపిణియే— ఆమెశరీరమునం దెంతశక్తి యున్నదో దామోదరునకుఁ దెలిసిపోయెను. అందుచే నాతఁ డామెను స్పృశించుటకుఁగూడ భయపడుచుండెను. దామోదరుఁ డనేకవిధముల నామెను బ్రతిమాలి చూచెనుగాని యామె యెట్టిప్రత్యుత్తరమునీయ లేదు. చపలహృదయుఁడగుదామోదరునిపై నాకస్మికముగ నామెకుఁ గోపము కలిగియుండును. సాత్త్వికస్వభావయగు నాసుందరమూర్తి రసనారంగమునుండి యెట్టిపరుషభాషణములును వెలువడలేదు. ఆమె కూరుచున్నచోటునుండి లేవలేదు. ఆతనితో మాటాడుటకుఁగూడ నామెకసహ్యముగ నుండెనుగాఁబోలును! మౌనభావముతోనే కన్నులెఱ్ఱచేసి యాతనిఁబొమ్మని సంజ్ఞచేసెను. స్త్రీహృదయములు కుసుమసుకుమారములయ్యును సమయమునుబట్టి వజ్రకర్కశములై పోవుచుండును.

దామోదరునిప్రయత్న మంతయు విఫలమైపోయెను. ఆతని కాశాభంగమైపోయెను. బండివాఁడు నాతఁడును గలసి నామెను బలవంతముగ బండిలోఁ బడవేయవలయు నని ప్రయత్నించుచుండిరి. కాని నామె వారిరువురను ద్రోసివైచుచుండెను. ఇంతలో నొక దొంగలగుంపు వారిని జుట్టు బెట్టుకొనియెను. బండివాఁడు పాఱిపోయెను. దొంగలదండాఘాతములచే దామోదరుఁడు స్మృతి తప్పిపడిపోయెను. నిమిషములో దొంగలందఱును మధుమతిని జేతులపై నెత్తికొని యాతాళవనమధ్యమునం బడి యెఱ్ఱగుట్టలవైపునకుఁ దీసికొని పోయిరి. అంతలో నాగాఢాంధకారము నిశ్శబ్దమైపోయెను. కొంతసేపటికి బండివాఁడు వచ్చి దామోదరుని బండిపై నెక్కించుకొని మరలఁ బెద్దాపురమునకుఁ దీసికొని పోయెను.

దైవసంఘటనము లవేద్యము లైనవి. ప్రకృతిపరిణామములు విచిత్రము లైనవి. విలాసభవనమున మదపరవశులకు మద్యపాత్రములఁ బ్రసాదించినమధుమతి మరిడమ్మమందిరమున భక్తిపరవశులకు ఫలాహారములఁ బ్రసాదించినది. అచ్చట జగదేకసుందరీమూర్తి యిచ్చటఁ బ్రసన్నైకదేవీమూర్తియైనది. అచ్చటఁ గామింపఁదగినకామినీమణి యిచ్చటఁ బూజింపఁదగినపూవులమ్మ యైనది. మధుమతి యెవ్వరు? ఆమెవిలాసభవనమును విడిచి పెద్దాపురము వచ్చుటకుఁ గారణమేమి? అచ్చటఁ దన్నందఱును దివ్యశక్తిగఁ దలంచి పూజించుచుండఁగాఁ దాను దాసివలె దామోదరునివెంటఁ బోవుట యెందుకు? అంతలో నాతనిపై నామె కేల కోపము కలిగినది? దొంగలందఱును బలవంతముగ నామె నెత్తికొనిపోవునప్పు డాభయంకరసమయమున నామెవదనమునుండి యొక్కపరుషవచనముగాని దుఃఖాలాపముగాని యేల వెలువడలేదు? ఆసుందరీమూర్తి దివ్యశక్తియే కాకున్నచో నసహాయ యయ్యు నావిధముగ సంచ

ంపఁగలుగునా ? అంతరాత్రివేళ నొంటిగా దామోదరుని వెంటఁ బోవఁగలుగునా ? అందఱుదొంగలు తన్నుఁ బట్టి తీసికొనిపోవుచుం డఁగా, నార్తనాదమైనఁ జేయక నిర్భయముగ నుండఁగలుగునా ? ఈప్రశ్నలకు మధుమతి మనకు సమాధానము చెప్పదు. మధుమతి సత్యచరిత్రమున కడ్డముగ మహామాయాంధకార మావరించినది. అందుచే నది మనకవేద్యమై యున్నది. జన్మపరిణామముచే జ్ఞాన సూర్యోదయ మైనట్లుగా సమయపరిణామముచే సత్యసూర్యోదయ ము కావలయును. సత్యమును సత్యమునందు విలీనము చేయుటయే పరిణామరహస్యమునందలి పరమార్థము ! కావున సత్యమెప్పటికై నను బయలుపడక మానునా ?

---

## ఇ రు వ ది యొ క ట వ ప్ర క ర ణ ము



> "ఏమయిన నేమి కొంచె మూ ♦ హించి చూడఁ
> బ్రేమమయుఁ డీశ్వరుఁడు, సృష్టి ♦ ప్రేమమయము
> ప్రేమమయు లెల్లజీవులు ♦ ప్రేమ యొకటె
> పావనం బైనదని బోధ ♦ పఱచుచుండె"

ప్రేమ — హారావళి

రంగనికి నావారని చెప్పుకొనఁదగినబంధువు లెవ్వరును లేరు. నాది యనియనుకొనఁదగినయిల్లెచ్చటను లేదు. ఆతనికిఁ గాసునకు గతి లేదు— కోటికిఁ గొదవయును లేదు. జను లందఱు నాతని దొంగరంగఁడని చెప్పుకొనుచుందురు. ఆతఁడు పరోపకారముకొఱ కుఁ బరపీడనముం గావించుచుండును; దరిద్రులకొఱకు ధనవంతు

లను బాధించుచుండును; ఒకరికడుపుమంట చల్లార్చుటకై యింకొక రిహృదయమును మండించుచుండును. ఒకరికష్టమును దీర్చుటకై యింకొకరిసుఖమునకు భంగము కలిగించుచుండును. ఆతని దెంతటి దయార్ద్రహృదయమో యంతటికోధకర్కశహృదయము. ఆతఁడు భాగ్యవంతులకుఁ బ్రక్కలోనిభల్లము— నిరుపేదలకుఁ బెరటిలోని కల్పకము; పాపపుణ్యప్రవాహములనడుమ నాతనిజీవితనౌక కొట్టుకొని పోవుచున్నది!

అధికారు లనిన నాతని కెంతమాత్రమును భయము లేదు. కారాగృహము నాతఁడు పుట్టినింటికంటెను బ్రియమైనసుఖనివాసముగ భావించుచుండును. రాజదండన మైనచోఁ గాక యమదండన ముండదని యాతని దృఢవిశ్వాసము. అందుచేతనే యాతఁ డెట్టియకార్యమునైనను బహిరంగముగనే చేయుచుండును. ఆవశ్యక మైనచో నాతఁ డెట్టియధర్మమునకైనను వెనుకంజ వేయువాఁడు కాఁడు; కాని యాతనికిఁ గొన్నిధర్మములుకూడఁ దెలియును. ఆతఁ డెప్పుడును కేవలము స్వార్థపరత్వముచే నితరులను బాధింపఁడు. పరులకొఱకే పరులను బీడించుచుండును—కాని తనకడుపుమండి నప్పుడుమాత్రము ధనవంతులను బాధించుచుండును; బలవంతముగ బాధించుచుండును. ధనలుబ్ధులదుష్ప్రవర్తనములే లోకమునకు దరిద్రము గల్పించుచుండె నని యాతనిమూఢవిశ్వాసము.

ఎవ్వ రేమన్నను నాతని కభిమానము లేదు. కాని తన్నెవ్వరును దొంగయని తలంచుట కాతఁ డిష్టపడఁడు. ఇతరులద్రవ్యమును రహస్యముగ నపహరించుటయే దొంగతన మని యాతని యుద్దేశము. ఆతనిపేరు విన్న భయపడువా రెందఱుండిరో యాతని పేరుచెప్పి మ్రొక్కుకొనువారుకూడ నంతకంటె నెక్కుడుగనే యుండిరి. ఆతఁడు సుఖదుఃఖముల నొక్కరీతిగనే యనుభవించు

చుండును; నిందాస్తుతుల నొక్కమాదిరిగనే పరిగణించుచుండును; కీర్త్యపకీర్తుల నొక్కపోలికనే భావించుచుండును. ఆతనికి సత్కర్మము దుష్కర్మమును సమానమే — కాని యింతవఱకాతని నెవ్వరును గర్మయోగి యనిమాత్రము పొగడియుండలేదు.

ఆతఁ డడిగినది లేదనుట కెవ్వరికిని సాహసము లేదు. అట్లని యాతఁడు నిరర్థకముగ నితరులను బాధింపఁడు — రక్షకభటులాతని నదలించుటకు భయపడుచుందురు. అపకారులుకూడ నాతనిపై నధికారులయొద్ద నభియోగము తెచ్చుటకు భీతిల్లుచుందురు. ఆతఁ డొకప్పు డొకతమాశీలుదారునిఁ బొట్టకూటికై ప్రార్థించి విఫలుఁడై యాక్షేపముచే నిర్భయముగ నాతని నట్టనడివీథిలోఁ గొట్టెను. ఆనేరమునకై యాతని కాఱుమాసములు శిక్షవిధింపఁబడెను. ఆశిక్ష ననుభవించి కారాగృహము నుండి వెలువడిన కొలఁదిదినములకే రాజమహేంద్రవరమునందలి విలాసభవనము న మన కాతనితోఁ బరిచయము కలిగినది. దామోదరుఁ డాతనికిఁ దాగినంత మద్యము నిప్పించినసంగతి మనకు జ్ఞప్తియందుండవచ్చును. ఆతనిమొదుట ననుటకు భయము గాని యాతఁడే దొంగరంగఁడు !

ఇంకను నాలుగుగడియలరాత్రి యున్నది. రంగఁడు చామర్లకోటనుండి బయలుదేరి పెద్దాపురమునకుఁ బోవుచుండెను. ఆతఁడుత్సాహముతో దారిని నడచుచు:—

“ధనము దాఁచుట దొంగతనము — పేరిమ,
ధనము గడించుటే ధర్మసాధనము — ధన.
కుడిచి తేగనుచుట దుర్భరము — పేద —
కడుపునింపి చూడఁ గనుటే సంబరము — ధన —
తనిసి కుల్కుట చిన్నతనము — తోడి
తమ్ములఁ దనియించుతలఁపే! పెత్తనము. ధన.”

అని పాడుకొనుచు నిర్విచారముగఁ బోవుచుండెను. ఆతఁడు బంతులమేడయొద్దకుఁ బోవునప్పటికి దూరమునుండి యొకగుఱ్ఱపుబండియెదురుగవచ్చుచున్నశబ్దము వినఁబడుచుండెను. ఆయశ్వపదశబ్దముతోఁగూడ "నాయనా! ధర్మము! నాలుగునాళ్లనుండి తిండిలేదు — బాబు! ధర్మము" అనుదీనాలాపములుకూడ నాతని చెవులఁబడియెను.

రంగఁడు శీఘ్రగమనముతో బండికెదురుగఁబోయి సమీపించునప్పటికి చండాలదంపతులు పదియేండ్లయీడుగల తమ యాఁడుబిడ్డతోఁగూడ నాబండికడ్డముగ నిలిచి "బాబూ! కడుపుమండుకొనిపోవుచున్నది! కరుణించి యొక్కకాసు ధర్మము చేయవలయును" అని ప్రార్థించుచుండిరి. అప్పుడు బండిలోనియాతఁడు కోపముతో నాచండాలుని దనచేతనున్నగుఱ్ఱపుచబుకుతోఁ ఛెడీయనఁ జేర్లిచ్చి కొట్టెను. ఆదెబ్బతో నాతఁడు క్రిందఁ బడిపోయెను. అప్పుడాతనిభార్యయునుబిడ్డయు గోలుగోలున నాతనిచెంతఁ గూలఁబడి రోదనము చేయుచుండిరి.

రంగనికాయార్తనాదముచే వీరావేశముకలిగెను. తోడనే యాతఁడు పరుగెత్తుకొనిపోయిబండి నాఁపిబండిలోనున్నయాతని దనచేతికఱ్ఱతో నొకదెబ్బ కొట్టెను. ఆదెబ్బతో నాతఁడు క్రిందఁ బడిపోయెను. బండివాఁ డాతనిఁజూచి పాఱిపోయెను. గుఱ్ఱము నిలువఁబడిపోయెను. బండిలోనుండి పడినయాతఁడు పాపము వేంకటేశ్వరరావు—ఆతఁడు రాజరత్నమునింటినుండి బయలుదేరి కుమారనగరమునకుఁ బోవుచుండెను.

రంగఁడు స్మృతితప్పిపడిపోయిన వేంకటేశ్వరుని జేబును దడవి చూచెను. అందుఁ బదిబంగారుకాసు లుండెను. ఆకాసులతో రాజరత్నమున కేదియో వస్తువు చేయింపవలయు నని యాతఁడు కొని

యుండును. రంగఁ డాకాసులను దీసికొని యాపేదచండాలురయొద్దకుఁ బోయెను. వారాతనిఁజూచి యింకను దమ్ముఁ గొట్టుటకే వచ్చుచుండె నని భయపడిరి. రంగఁడు వారిం జూచి సాంత్వనస్వరముతో "రండు! నాతోఁ గూడ రండు!" అని పిలిచెను. ఆయాసముతో నాచండాలుఁడు లేచెను. రంగఁ డాతనిచేయి పట్టుకొని నడపించుకొని పోయెను. ఆతనిభార్యయును బిడ్డయునుగూడ నాతని వెంటనే వచ్చుచుండిరి. ఆతఁడు కొంతదూరమువఱకుఁ దీసికొని పోయి యాపదికాసులనుగూడ నాచండాలున కిచ్చెను. ఆతఁడదరిపడి "బాబూ! కడుపుఁగూటివాండ్రకుఁ గాసులెందుకు?" అనియెను.

రంగ—ఈసొమ్ము నీకుటుంబపోషణమున కొకయేఁడాదికి సరిపోవును. తీసికొనుము!

చండా—అక్కఱలేదు బాబు! నేనీబంగారము దాఁచుకొనలేను. కాసుచూచినఁ గన్నులు తిరిగిపోవుచున్నవి.

రంగ—నీపేరెవరు?

చండా—అప్పఁడు.

రంగ—అప్పఁడూ! నీ కేమియు నుభయము లేదు. నీకొక కాసు మార్చియిచ్చెదను. తక్కినవి నీయొద్దదాఁచుకొని కావలసినప్పుడు మార్చుకొనుము.

అప్ప—పదిదినములు కడుపునిండఁ దిండిదొరకినచోఁ దరువాతఁ బాటుపడిసంపాదించుకొందును—ఇఁక నాకు సొమ్మెందుకు?

రంగ—వెఱ్ఱివాఁడా! సొమ్మెందు కనియెదవేమి? నీబిడ్డకొకవస్తువు చేయించుకొనుము.

అనునప్పటి కాచండాలబాలిక మొగమింత యయ్యెను. ఆబాలికతళుకుఁజూపులతో రంగని జూచుచుఁ గులుకునడకలతోఁ దండ్రియొద్దకుఁబోయి యాతనియుదరముపై నుత్తమాంగము నుంచి జాల

మృణాళములంబోని తనచిన్నచేతులతో నాతనినడుమును కౌఁగిలించుకొనియెను. అప్పుడు ప్రియపుత్రికాస్పర్శసుఖపరవశుఁడై రంగనిం జూచి "బాబూ! మాపేదముత్యాలమ్మకుఁ బూవులే వస్తువులు!" అనియెను.

అప్పుడు చెప్పినమాట నిజమే. ముత్యాలమ్మ యెప్పుడు నడవిపూలతో నలంకరించుకొనుచుండును. ఆపూలదండలతోడనే యామెయాఁకలిమంట చల్లారుచుండును. ఆమెకు మెయినిండ వసనము లేకయున్నను మెడనిండఁ గుసుమమాలికలు వ్రేలాడుచుండెను. చండాలబాలిక యైనంతమాత్రమున సౌందర్యమును బ్రేమింపఁగూడదా?— సౌరభమును మెచ్చుకొనఁగూడదా? కూటికిఁ బేదతన మున్నది కాని గుణానురాగమునకుఁ బేదతన మెక్కడనున్నది?

ముత్యాలు పసిబాలిక — భారతసంతానమునఁ గడఁగొట్టు చెల్లెలు— భారతారామమునఁ గడజాతి కోరకము — భారతజనపదమునఁ గడయింటిదీపము— ఆబాలికజీవితమునకుఁ బరంపరాగతమగుచండాలచ్ఛాయ సోఁకినది. అందుచే నామె చండాలిని యైపోయినది. ఈచండాలసాంప్రదాయము మనుజులలోననే గాదు; మృగములవఱకును బక్షులవఱకునుగూడ వ్యాపించినది. రంగని కాబాలికయవ్యక్తమధురస్వరూపమును, స్వభావమును, విలాసమునుగూడఁ జాల ముచ్చటగ నగపడియెను. నీలమైనను రత్నము కాదా? వట్టివేరైననేమి పరిమళించుచున్నప్పుడు?— ఆమె చండాలబాలికయని రంగనికి నిరసనభావము కలుగలేదు. ఆముత్యాలమ్మకుఁ గాను లీయవలసిన దనియే యాతనికిఁ దోఁచెను. అతఁ డాబాలికం జూచి "ఇవి నీవు తీసికొనుము" అని యాకాసుల నామె కీయఁబోయెను. బాలిక తండ్రివంకఁ జూచెను. అప్పుడు సంతోషముతో "అమ్మా! ఆబాబు దయతో నిచ్చుచున్నప్పుడు తీసి

కొనకున్నఁ దప్పు ! తీసికొనుము" అనియెను. ముత్యాలు చిగురా కులవంటి తనచిన్నిచేతులను సోయిలించెను. ఆబాలికదోయిటి యందు రాగి డాకాసులను బడవైచి శుటకుండి వెడలిపోయెను.

ఆచండాలకుటుంబమున కాపభాతము సుప్రభాత మయ్యెను. ఆచల్లనిప్రభాతవాయుతరంగములలో విస్పష్టమధురస్వరంబున —

"కులమే కావలెనా మఱిసద్గుణమే కావలెనా
కలకల విరిసిన తామరకొ ప్పిప్పరి
వలపులచలువలు తెలిసినవారికి ॥కుల మే॥
అందమె కావలెనా మాటలచందమె కావలెనా
కెంజిలి రాకులసందునఁ గోకిల
సుందరగానముఁ జూచినవారికి ॥అంద॥
చేలమె కావలెనా నిర్మలశీలమె కావలెనా
శ్రీలలనావరు మేలిమిగన్న కు
చేలునిమదిఁ గనఁజాలినవారికి ॥చేల॥

అను మనోహరానుభావగీతము విశ్వవ్యాప్త మగుచుండెను.



# ఇరువదిరెండవ ప్రకరణము.



"తల్లులను ముగ్గురను గన్న ◆ తల్లి, కడుపు
చలువగలతల్లి, మా జగం ◆ బులకు దల్లి
మూడుమూర్తులతల్లి యా ◆ మొదటితల్లి
యేగు దమ్ముల మాకు ది ◆ క్కగును గాక!"

మాతృస్తవము—హారావళి.

ప్రథమప్రకరణమునందే మనకు ధర్మగిరింగూర్చి కొంతపరిచయము కలిగినది. ఆగిరిగర్భమునందలి విశాలదేవాలయమునఁ గలియుగప్రత్యక్షదైవత మగు సత్యనారాయణుని యర్చావిగ్రహము ప్రతిష్ఠింపఁబడి యుండెను. ఆదివ్యమూర్తి యేకాలమున నే దేవతలచేఁ బ్రతిష్ఠింపఁబడియెనో యెవ్వరికిని దెలియదు. అప్పుడప్పుడు పర్వదినములలో నర్ధరాత్రివేళ దేవతలు మనుష్యరూపముం దాల్చి వచ్చి యాదేవునర్చించి పోవుచుందు రనియు నప్పుడు వారిదివ్య సంగీతవాద్యధ్వనులు వినఁబడుచుండు ననియు నచ్చటిజనులకు దృఢ విశ్వాసము కలదు. ఆశైలశిఖరమునందుఁ బ్రతిధ్వనిస్వరూపిణి యగు గిరిపాలికాదేవిమందిర మున్నది. ఆయారణ్యకుల కండఱకు నాభూధరమే పుణ్యక్షేత్రమైయుండెను. హింసాచౌర్యములే వారి నిత్యకృత్యములు. మధుమాంసములే వారినిత్యజీవనాధారములు. వారు తమకోరికలు నెఱవేఱుటకై సత్యదేవునకు స్వాదుఫలోపహారముల సమర్పించుచుందురు; తమతలపూవు వాడకుండుటకై గిరిదేవత యగుకులదేవతకు మ్రొక్కులు చెల్లించుచుందురు. భారతవర్షమునం దెంతటిక్రూరాత్ములకైనను భక్తివిశ్వాసములు సహజములుగదా!— ఆశైలగర్భాలయమునఁ గొంతకాలమునుండి యొకసన్యాసి నివసించి యుండెను. ఆప్రజలందఱు నాతని దేవతాప్రతినిధిగ భావించి సేవిం

చుచుందురు. ఎంతకాలము గడపినను దేవతలు త్రిదశులే యైనట్లుగా నెన్నాళ్లనుండియో యాతఁ డిచ్చటనే నవయౌవనుఁడై యుండెనని యాతనిమాహాత్మ్యముంగూర్చి యనేకు లనేకవిధములుగఁ జెప్పుకొనుచుందురు.

ఆమహాత్ముఁడు నరుల నాదరించుచు వారికి భక్తిమార్గమును బ్రబోధించుచు వారిచ్చుఫలోపహారముల నారగించుచుండును. ప్రత్యక్షదైవస్వరూపుఁ డగు నాతఁ డప్పుడప్పు డనదలగువారి కన్యాదానముం గావించుచుండెను; వస్త్రదానములను జేయుచుండెను. కేవలధనైకసాధ్యము లగు నన్నవస్త్రము లాసన్న్యాసి కెట్లు లభియించినవి? ఆ సిద్ధపురుషునిపీఠమునఁ జింతామణిశక్తి యున్నదనియు దానిమూలమున నాతఁడు తలఁచినదంతయు సిద్ధించుచున్నదనియు వారినమ్మకము! భుక్తిముక్తులను బ్రసాదింపఁజాలిన యామహాత్ముఁడు వారికెల్ల విధముల దైవముగనే యుండెను. ఆతఁడే నాఁడు దేవాలయమునఁ బ్రవేశించెనో చూచినవా రెవ్వరును లేరుగాని యాతనిదివ్యదర్శనము లభియించినప్పటినుండియు వారిసుఖానందములు వర్ధిల్లుచుండుటచే నందఱు నాతని నానందస్వామియనిపిలుచుకొనుచుండిరి. సౌలభ్యము కొఱకు వారట్లు వాడుకొనుచుండిరి కాని నిజముగ నామహాత్ముని నామము కల్యాణానందస్వామి.

గిరిపాలికామందిరమునఁ దఱచుగ బలిదానములు జరగుచుండును. మదిరాసమారాధనములు నిర్వర్తింపఁబడుచుండును. ఆ మందిరమున నర్చావిగ్రహము లేదు. పీఠముమాత్రమున్నది. ఆమందిరద్వార మెప్పుడును తెఱవఁబడియేయుండును. రాత్రులయందా దేవి సహచరీసమన్వితయై యామందిరమునఁ గొలువుదీర్చుచుండునను విశ్వాసముచేఁ బ్రజలు రాత్రులయందాప్రదేశమునకుఁ బోవుటకు భయపడుచుందురు. ఔను—నరకపాలమాలికాధారిణి యగు

నాదివ్యశక్తి రక్తపాననిరతలగుసహచరీశక్తులచేఁ బరివేష్టింపఁబడి యట్టహాసమునఁ గొలువుచేయుచున్నపు డాచండికామూర్తిని సందర్శించుట కెవ్వరు సాహసింపఁగలరు ?

నాఁడేమోగాని యాదేవ్యాలయద్వారములు మూయఁబడి యుండెను. ఆరాధనమునం దేమియపరాధము కలిగినదో యని యందఱును భయభ్రాంతులగుచుండిరి. ఆదిశక్తి యగపడకున్నను నామెపీఠము కన్నులం బడినంతమాత్రమున వారికిఁ బరమానందమగుచుండెను. నేఁడట్టి భాగ్యము వారికి లభియించుటలేదు. ఇంతకును వారుచేసినయపరాధ మేమైయుండును ? మొ్రొక్కుబడులు చెల్లించుటలో నేదియో లోపము జరిగినది— నిన్నటిదినము బలిదానసమయమున వేఁటపోతుశిర మొక్కవేటునకుఁ దెగిపడలేదు. నిప్పునకుఁ జెదలుపట్టినట్లు నిర్నిమిత్తముగ శ్రీచరణసమర్పితమద్యభాండమునకుఁ జీమలుపట్టినవి. గొంతుకోసిన కోడిపుంజు కోయని పలికినదిగాదు. అమ్మవారిగుడిలోని గండదీప మాకస్మికముగ నారిపోయినది. నిండుభక్తితోఁ ద్రొక్కుచున్న నిప్పులగుండము నీరైపోయినది. బలి నిరర్థకమైపోయినది. నైవేద్య మపవిత్రమైపోయినది. అందుచేతనే యమ్మవారు తోడఁబలికినదికాదు. ఆకారణముచేతనే వారంతగాఁ దల్లడిల్లిపోవుచుండిరి— ఇన్నిలోపములుండఁగా లోపము లేదని యెవ్వరు చెప్పఁగలరు ?

ఏయపరాధముచే నిట్లయినదో వారికి బోధపడుట లేదు. కాని యెట్టిప్రతిక్రియనైనను జేయుటకు వారు సిద్ధముగనేయుండిరి. తల్లియే కోపగించినప్పుడు తనయుల కింకదిక్కేమున్నది ?— వారికేమియును దోఁచుట లేదు. ఏమియగిష్టము తటస్థించునో యను భయముచే నందఱు నాందోళితహృదయులై వచ్చి కల్యాణానందస్వామిపాదములపైఁబడి సర్వవృత్తాంతమును నివేదించుకొనిరి. స్వా

మి సన్యాసియైనను నాతనికి సంసారము వదలినది కాదు. అజ్ఞానులు నార్తులు నగు నయ్యాటవికుల నుద్ధరించుట కాతనికంటె నింక దిక్కెవ్వరున్నారు ? వారెట్లున్నను స్వామి యింతవఱకును వారి నుదాసీనభావముతోనే చూచుచుండెను. కాను ! సమయము తటస్థించువఱకును సర్వేశ్వరుండైన నేమియుం జేయంజాలండు— ఇప్పుడామహాత్మునకుం దనశిష్యులను బ్రసన్నభావముతోం జూడవలసిన సమయము వచ్చినది.

ఆతండించుకసేపాలోచించి వారికభయప్రదానముంగావించి ప్రకాశించి యందఱితోం గలసి దేవీమందిరద్వారమునొద్దకు వచ్చెను. తలుపు లట్లే మూయంబడి యుండెను. కొందఱు భజనలు చేయుచుండిరి. కొందఱు ప్రార్థనలం గావించుచుండిరి. కొందఱు బలిపశువులం దోలికొనివచ్చుచుండిరి. కొందఱు మద్యభాండముల నెత్తికొనివచ్చుచుండిరి. కొందఱా దేవికుపహారములుగం గుంకుమ, పసుపు, పండ్లు, పానకములు, పత్రములు, పుష్పములు, దీసికొనివచ్చుచుండిరి. ఆజనసంఘమం దంతటను భయభక్తిసూచకంబు లగుకోలాహలధ్వనులు బయలువెడలుచుండెను. అప్పు డందఱు నైకకంఠ్యముగ భక్తిపారవశ్యముతో!—

"అపరాధ మపరాధ మమ్మా ! యే
నెపము లెన్నక మమ్ముం ♦ గృపంజూడు మమ్మా॥ అప
కొలువు చేయించుకోవమ్మా! మా
తలంగొట్టి యిమ్మన్నం ♦ దలంకంబోమమ్మా ! ॥అప
తలుపులు దీయవె తల్లి ! పేరం
బిలిచిన నోయను ♦ పలికెకే తల్లీ ! అప॥
కంటంబడవె కన్నతల్లీ ! మా
కంటికి ఱెప్పవై ♦ కాపాడు తల్లీ ! ॥అప॥

వేయాఱు వేఁటలతల్లీ ! మాకు
సాయమైయుండవె ! చల్లనితల్లీ ॥అ॥

అనిపాడుచునాడుచుఁ బ్రార్థింప నారంభించిరి. కాని తలుపులు విడలేదు. అప్పుడు దండఱున్నుచ్చైస్స్వరముతో "స్వామీ ! మాయపరాధములను క్షమించి మాతల్లి మాకుఁబ్రసన్నురాలగునట్లు చేయుము !" అని వేఁడుకొనిరి.

అప్పుడు స్వామి తనదక్షిణహస్తమును పైకెత్తి మఱియొకసారి యందఱకు నభయప్రదానముం గావించి యాలయద్వారము వంకఁ దదేకదృష్టితోఁ జూచుచు:—

"సర్వార్థదా సర్వజగత్ప్రసూతిః
సర్వేశ్వరీ సర్వభయాపహంత్రీ
సర్వోన్నతా త్వం సుముఖీ భవ శ్రీః
హిరణ్మయీ మే భవసుప్రసన్నా.
సమస్తవిఘ్నౌఘవినాశకారిణీ
సమస్తభక్తోద్ధరణే విచక్షణా
అనంతసమ్మోదసుఖప్రదాయినీ
హిరణ్మయీ మే నయనే ప్రసన్నా"

అని స్తోత్రము చేయనారంభించెను. ఆ సుతీంద్రు ముని ప్రార్థన మమోఘమైనది. అంతలోఁ దలుపులు విడిపోయెను. ఎట్టయెదుట దివ్యపీఠముపై నెవ్వఁడు సదర్శించి యెఱుఁగని త్రిపురసుందరీమూర్తి సుప్రసన్నవదనముతో సాక్షాత్కరించియుండెను. ఆ దేవి పార్శ్వమునఁ బ్రబోధానందస్వామి పుష్పాంజలినిబద్ధుఁడై మూర్తిభవించినసదాశివునింబోలి నిలువఁబడియుండెను. అందఱు నద్భుతానందసంభ్రాంతచేతస్కులై నిలువుగన్నులతో నామూర్తిద్వయమును సందర్శించుచుండిరి. ఆ దేవీమూర్తి సహస్రకరాళవదనమండలముం

డిత కాదు— ప్రసన్నైకవదనమండల పరిశోభిత. ఆదివ్యశక్తి నర కపాలమాలికావిరాజిత కాదు— పరిమళకుసుమమాలికావిరాజిత. ఆజగన్మాత రక్తాంబరధారిణికాదు — పరిశుభ్రద కూలవసనధారిణి. ఆజనని కఠోరాయుధకరసహస్రసమంచిత కాదు— వరాభయ ప్రదానకరకమలయుగళసమంచిత. ఆనిరుపమాన తేజోమయ దివ్యమూర్తి నిర్భీకదర్శనీయ మైయుండెను. అందఱును దదేక ధ్యానముతో నట్లే చూచుచుండిరి. అప్పు డాత్రిపురసుంద రీమూర్తి సుప్రసన్న దృష్టులతోఁ గల్యాణానందస్వామిని బిలిచిన ట్లయ్యెను. కల్యాణానందస్వామి దేవీమందిరమునఁ బ్రవేశించెను. ఆదేవికటాక్షవీక్షణమాత్రముచేతనే కల్యాణానందస్వామి కాజ్ఞానుభోగ మయ్యెను. తోడనే యాస్వామి దేవీపార్శ్వమున నిలిచి యుండఱను దయారసకటాక్షములతోఁ దిలకించుచుఁ బ్రశాంతమధురస్వరంబున "బిడ్డలారా! మాతృదేవతాప్రేరితుండనైన నేను జగన్మాతయాజ్ఞగా మిమ్ములను బ్రబోధించుచున్నాఁడను. అనన్యహృదయులతో నాలకించి తల్లియాజ్ఞలను బరిపాలింతురుగాక! అణువు మొదలుగ బ్రహ్మాండమువఱకును గలయీప్రపంచమునందలి సకల జీవులును సర్వభూతదయాకరాంతర యగునీజగజ్జనని ప్రియసంతానమే కాని వేఱుకాదు. అట్టిసంతానమున కెట్టిహింస యైనను దల్లి సహింపఁజాలదు. బలిప్రదానముచేతనే పరదేవత ప్రసన్నురాలగు నని మీరు భావించుచున్నారు. అది కేవలము వట్టిభ్రాంతి. బిడ్డలను దినుతల్లి విశ్వసంరక్షిణి యెట్లగును? మీయజ్ఞానమును మాయించుటకే— మీయకృత్యములను ఖండించుటకే యింతవఱకు నుదాసీనయై చూచుచున్నయీజగన్మాత యిప్పుడు మీ మొట్టమొదట సాక్షాత్కరించినది! ఇంతటినుండి మీరీదేవీమందిరము నెదుట బలిప్రదానములఁ గావింపకుండుటకై ఘోరగీవముగ శప

థము చేయవలయును. మఱియును—అమృతరసప్రదాయినియగు నీయంబికాదేవి కపటత్రవ్యదోష్యపహారముల నర్పించుటకంటె నవివేకమింకేమైన నున్నదా? ఇదిమొదలుగ మీరట్టియాచారమునుగూడ మానుకొనవలయును. భక్తరక్షణి యగునీచిదానందాదేవి పర్వదినములయం దిట్లే యీమందిరమున మీకు సాక్షాత్కరించి మీమ్రొక్కుల నందుకొనుచుండును! మీకష్టసుఖములం గనుపెట్టిచూచుచుం గన్నబిడ్డలవలె మిమ్మెల్లవిధములం గాపాడుచుండును! ఈవాక్యములు జగన్మాతవాక్యములు; ఇది జగజ్జననియాజ్ఞ!" అని ప్రబోధించెను.

అప్పు డటనున్నవారందఱు నేకగ్రీవముగా, "అపరాధులము! అజ్ఞానులము! ఆనందస్వామీ! అమ్మయాజ్ఞల కడుగుదాటకుండ నాచరించెదము!—అమ్మా! నీచరణసేవకులము! నీదాసానుదాసులము! నీకన్నబిడ్డలము! నీకంటె మాకింక దిక్కెవ్వరున్నారు? తల్లీ! దయయుంచి మమ్ముం గాపాడుము! ఎఱుంగక చేసినమాయపరాధములను క్షమియింపుము! నీమాట వెంబడినే నడచెదము! మాతోడునీడవై మెలంగుచు మమ్ము రక్షింపుము. తల్లీ! రక్షింపుము! రక్షింపుము! రక్షింపుము!" అని లెంపలు వైచికొనుచుం బ్రార్థింప నారంభించిరి.

అప్పు డాచిదానందాదేవి మందహాసవదనముతో వారిపైం గరుణావీక్షణములం బ్రసరింపం జేయుచున్నట్లగపడియెను—అభయహస్తముం బ్రసాదించినట్లయ్యెను. అద్భుతానందపరవశులై యందఱును నదేకదృష్టితో నాదివ్యమూర్తిం దిలకించుచుండిరి. తెఱచినకన్నులు తెఱచినట్లుండంగనే యాకస్మికముగ మరల నాలయద్వారకవాటములు మూఁతలువడిపోయెను. ఆకవాటఘంటాధ్వనులలో జయజయధ్వనులు విలీనములైపోయెను.

## ఇరువదిమూడవ ప్రకరణము.

మాయలోపల నెంత ♦ మమత యున్నదియు
మమతలోపల నెంత ♦ మహిమ యున్నదియు
తారాపథములోఁ ♦ దళతళ మెఱసి
నిర్వ్యామోహనమైన ♦ విశ్రాంతి దోఁచె.

ఏకాంతసేవ.

ప్రథమప్రకరణమునం దేవ్యత్యాంతరాళమునం దొకస్త్రీమూర్తి నుద్ధరించుటకై ప్రయత్నములు జరుపఁబడియెనో యావ్యత్యాంతరాళమునం దిప్పు డాప్రబోధానందస్వామి కూర్చుండియుండెను. అప్పు డాతనియనుచరుఁడై వచ్చినప్రియశిష్యుఁడే యిప్పటి కళ్యాణానందస్వామి— కల్యాణానందస్వామి యించుకయవనతముఖుఁడై ప్రబోధానందుని పాదసాన్నిధ్యమునఁ గూర్చుండియుండెను. తరుపత్రాంతరాళములనుండి ప్రసరించుచున్న వెన్నెలపొడలు వారి కాషాయాంబరములకు వింతచందమును గల్పించుచుండెను. కొంతసేపటివఱకు నెవ్వరును మాటాడలేదు. అప్పుడు కల్యాణానందుఁడు నిట్టూర్పువిడిచి మందగద్గదస్వరముతో “ మహాత్మా! ప్రకృతిపరిణామములంగూర్చి నాకంతఁగా విచారములేదు కాని—” అనియెను.

ప్రబోధానందుఁ డర్ధోక్తియందే “ కానియేమి! పాపపుణ్యములఁ బరిగణింపనక్కఱలేదా? ” అనియెను.

కల్యా—అందుకే భయపడుచున్నాను.

ప్రబో—ఆభయము తత్పూర్వమందే యుండవలసినది!

కల్యా—అట్టివైపరీత్యము తటస్థించునని నేననుకొనలేదు.

ప్రబో—ప్రబోధానందుని శిష్యుఁడ వయ్యును చపలహృద యుఁడవై పోయితివి!

కల్యా—నేను నిశ్చలహృదయుఁడ నైయుంటి ననియే నావిశ్వాసము.

ప్రబో—కాదు— నీవు కఠినహృదయుఁడవు. హృదయము నిశ్చల మైనంతమాత్రమున నేమిలాభము? ప్రేమార్ద్రమై యుండ వలదా?

కల్యా—ప్రేమార్ద్ర మగుటచే నే పిఱికితనము కలిగినది.

ప్రబో—ఇంతపిఱికివాఁడవు మాతృసేవ నెట్లు నిర్వహింపఁ గలవు?

కల్యా—గురుకటాక్షముచే నావిషయమున నెట్టిలోపమును గలుగకుండఁ బ్రయత్నించుచునే యుంటిని.

ప్రబో—తల్లిమూలమున నాచేనాజ్ఞాపింపఁబడిన నీవిధాయక కృత్యము నేమిచేసితివి?

కల్యాణానందుఁడు నిరుత్తరుఁ డయ్యెను.

ప్రబోధానందుఁడు వి మధురస్వరముతో "కుమారా! నీకోమల హృదయమును నేనెఱుంగుదును—కావుననే నిన్నంతగఁ ప్రబోధిం చితిని. ఏమైన నేమి? తుద కీవిధముగ జరగిపోయినది!" అనియెను.

కల్యా—అంతటియసాధ్యకార్యమునకు నన్ను నియోగింప వలదని నేను మొట్టమొదటనే మిమ్ములను బ్రార్థించితిని.

ప్రబో—అజ్ఞానము వదలకపోవుటచే నీకది యసాధ్యముగఁ దోఁచినది.

కల్యా—నాహృదయమున కంతటిశక్తి లేకపోయినది.

ప్రబో—ఆహృదయదౌర్బల్యమె పాపమునకుఁగారణమైనది. ఆదౌర్బల్యముచేతనే యమృతస్వరముల వెలువరించుచున్నవీణా

తంతువు త్రుటితమైపోయినది — వికసనోన్ముఖమైనపరిమళకుసుమము వృంతచ్యుతమైపోయినది — పావనకళాకలితంబగుజీవచింతామణి చిదురుపలైపోయినది. అద్భుతానందరసప్రవాహిని యగు చిత్రకథ యాకస్మికముగఁ దుదముట్టిపోయినది !

కల్యాణానందుఁడు గద్గదస్వరముతో "మహాత్మా ! కథ ముగిసిపోయినది ! అది మే మాతృదేవతయెడల నేఁజేసినమహాపరాధము—" అనియెను.

ప్రబో — ఆయపరాధముచేతనే నీకుమాతృమందిరసందర్శనలాభము లేకుండఁబోయినది.

కల్యా — స్వామీ ! ఈయపరాధమునకు నిష్కృతి లేదా ?

ప్రబో — బుద్ధిపూర్వకముగఁ జేసినపాపమునకు నిష్కృతియేమున్నది ?

కల్యా — మహాత్మా ! తప్పునకు దండనము లేదా ?

ప్రబో — ఉన్నదికాదా ?

కల్యా — ఉన్నచోఁ బాపమునకు శాంతియేల లేకపోవలయును ?

ప్రబో — మాతృదేవతయాజ్ఞను బరిపాలించుటకు నీవసమర్థుఁడవైపోయితివో యాయాజ్ఞను నిర్వహించువఱకు నీకు నిష్కృతి లేదు.

కల్యా — ఇప్పుడు తల్లి యేమి యాజ్ఞాపించినను నవలీలగ నెఱవేర్పఁగలుగుదును.

ప్రబో — ఇదివఱ కట్లేల చేయలేదు ?

కల్యా — ఆయొకపనిమాత్రము చేయఁజాలనైతిని.

ప్రబో — మరల మహామాత నిన్నట్టికార్యమునందే నియోగించినచో నేమిచేయుదువు ?

కల్యా—చేయుట కిఁక నేమున్నది ?

ప్రబో—ఇప్పుడు చేసిన దేమున్నది ? ఇంకను జేయుట కెంతయో యున్నది—

కల్యా—ఉన్నచో నేను ధన్యుఁడనే యగుదును.

ప్రబో—నిన్ను ధన్యునిగఁ జేయవలయుననియే— నిన్నుఁ గన్నయాంధ్ర దేశమును ధన్యముగఁ జేయవలయు ననియే మహామాత యభీష్టము.

కల్యా—స్వామీ! తల్లి నాతప్పును క్షమియించినదా ?

ప్రబో—ఆజనని నిత్యక్షమాశాలిని—నీతప్పును క్షమింపఁ గలదు—

కల్యా—తండ్రీ! నాకిఁక మాతృసేవాభాగ్యము లభియించునా ?

ప్రబో—మాతృప్రసాదము సర్వసులభమైనదే కాని మాతృసేవమాత్ర మట్టిది కాదు—

కల్యా—అమ్మ కటాక్షించినచో నందరాని దేమున్నది ?

ప్రబో—ఆకటాక్షసంపాదనమున కర్హత యుండవలయును.

కల్యా—స్వామీ! భయభక్తివిశ్వాసములతో సేవించుచున్న నే నింకను బంధవిమోచనమున కర్హుఁడను గాలేదా?

ప్రబో—లేదు—నీవు దివ్యతేజమునం దుండియుఁ దిమిరమును దలంచి భయపడిపోయితివి—అమృతమును సేవించుచుండియు నామయమును శంకించి తల్లడిల్లిపోయితివి.

కల్యా—ఏమిచేయుదును ? ఆకస్మికముగ మనస్సంయమన మసాధ్య మైపోయినది.

ప్రబో—మనసుతోఁగూడఁ బోవుచున్నంతవఱకు నీకు మాతృసేవాభాగ్యము లేదు.

కల్యా—ఇంక నట్టిభయము లేదుగాదా ?

ప్రభో—వెఱ్ఱివాఁడా ! మనసు స్వాధీనమునందు లేనంతవఱ కీప్రపంచమునందు భయము లేనిచో టెక్కడ నున్నది ? భవ బంధము వదలనంతవఱకుఁ బరిణామము లేనిసమయ మెక్కడ నున్నది ?

కల్యా—స్వామీ ! ఇంకను నాకంత రాయము లున్నవా ?

ప్రభో—అజ్ఞానము వదలనంతవఱ కన్నియు నంతరాయ ములే—

కల్యా—గురుదేవా ! విజ్ఞానమును సాధించుటకై యింకను నే నేమిచేయవలయునో యనుగ్రహించి బోధింపుఁడు !

ప్రభో—కొంతకాలమువఱకు నీవిచ్చటనే యప్రమత్తుఁడవై యుండి నీవిధాయకకృత్యములను నిర్వర్తించుచుండుము. మాతృసే వాపరాయణుఁడ వగుచున్న మహామాత యచిరకాలములోనే యను గ్రహింపఁగలదు. నీకేవస్తువవలన భయమగుచుండెనో యేవస్తు వు దలంచిన నీహృదయము చెదరిపోవుచుండెనో యావస్తువునే యనంతశక్తిస్వరూపముగ భావించి ధ్యానించుచుండుము. ఇదియే నీజ్ఞానసాధనమునకుఁ బరమోపాయము.

అని చెప్పుచుఁ బ్రబోధానందస్వామి లేచెను. కల్యాణానం దుఁ డాతనిపాదములకు నమస్కరించి వీడ్కొనియెను. అంతలో నాస్వాము లిరువురు నాచంద్రకాంతరాళమునం దదృశ్యులై పోయిరి.



## ఇరువదినాలుగవ ప్రకరణము.

గోడ వెట్టినట్టు ♦ లాండుది బొంకినఁ
బురుషుఁ డైనఁ దప్పఁ ♦ బూసినట్టు
లనుట నిక్క, మాటు ♦ వరియూయి మతిమం)
మంత జంత యౌంత ♦ బొంకు బొం కె?

చిత్రక గుధామారి.

వేంకటేశ్వరుఁ డా దెబ్బతో స్మృతితప్పి పడిపోయెను. బండి వాఁడు కొంతసేపటి కిక్కడకు వచ్చి యాతనిసేద దేర్చి బండిపై నెక్కించెను. అప్పుడు వేంకటేశ్వరుఁడు బండివానితో "అపశకునమైనది. బండి పెద్దాపురమునకే మరలింపుము" అని చెప్పెను. బండివాఁ డేమియు మాటాడకుండ నాతని యాజ్ఞను బరిపాలించెను. బల్లనఁ దెల్లవారుచున్నప్పటికి బండి పెద్దాపురమున రాజరత్నమునింటి యొద్ద నిలిచెను. రాజరత్నము బండిచప్పుడు విని పరుగెత్తుకొని వచ్చి ద్వారము కడ నిలువఁబడియెను. వేంకటేశ్వరుఁ డాయాసముచేఁ దూలుచు బండిదిగెను. రాజరత్నము తత్తరముతో వచ్చి యాతని బట్టుకొని "ఇది యేమి? ఇట్లున్నారు" అనియెను. వేంకటేశ్వరుఁడు "దైవానుగ్రహముచే బ్రదికియున్నాను" అనియెను. రాజరత్నము భయసంభ్రమములతో నాతనికిఁ గైదండ యొసంగి మెల్లగ మేడ మీఁదికిఁ దీసికొనిపోయి యొకసోఫాపైఁ గూర్చుండఁజేసెను.

ఇంతలో నాగమణి సంభ్రమముతో నచ్చటికి వచ్చి వేంకటేశ్వరునివలన సకలవృత్తాంతమును విని యాలోచనము నభినయించి "ఇంకేమి? అనుకొనుచున్నట్లే యైనది!" అనియెను.

రాజ:—అక్కా! అది యేమి?

నాగ—నీవింకను చెవదారినే యున్నావు. అందఱును నీవలె నే యుందురనుకొంటివా వెఱ్ఱిదానా ?

రాజ—ఏమి ?

నాగ—నీప్రేమయేమో, నీప్రియుఁడేమో, నీవేమో— అంతియేకాని నీకు రెండవలోకమే తెలియదు ! ఎట్లున్నను నీవు సావిత్రీనామ సతీమణివి కాఁజాలవుగదా !

వేంక టేశ్వరుఁ డులికిపడి ,, సతీమణి కాకేమి ? ఈసతీమణి సాహచర్యసంప త్తిమూలముననే నామరణము తప్పిపోయినది '' అనియెను.

నాగమణి చేతులు త్రిప్పుచు ,, మీరు మీసతీమణియొద్దనే యున్నయెడల నిట్టికష్టములు కవకాశమే లేకపోవును గాదా ? '' అనియెను.

వేంక - అట్లయినచో నిచ్చటిసుఖసామ్రాజ్య మెట్లు లభియించును ?

నాగ—మీరు సుఖసామ్రాజ్యమనుకొనునది మీసహధర్మిణికి దుఃఖాంధకారాగారము కాకుండునా ?

వేంక— ఇది యేమి సహధర్మిణీధర్మము ?

నాగ—ఆయమారి కీయమా రెంతదూరమో యీయమారి కాయమారుకూడ నంతియేకాదా ?

వేంక—అనసూయ యెన్నఁడు నట్లు తలంచి యుండ దని నేననుకొందును.

నాగ—ఔను— కులవధువునకున్న గౌరవమదియే—

రాజ—అక్కా ! నీవు నిందాగర్భముగ మాటాడుచున్నావు —అనసూయ నిజముగ ననసూయ యనియే నేను వినియుంటిని.

నాగ—నీవు వినియుంటివి— ఈమన కనియుండిరి. మీ యిరువురు నొక్కస్వభావము కలవారు కావుననే యిరువురకు నన్యోన్యానురాగము దృఢపడినది. ప్రణయముగ్ధహృదయులగుమీకు దూరాలోచన మెక్కడ నుండును?— ఫలరసము మధురసముగ మారినప్పుడు దానిగుణము కూడ మారుననుటలో వింత యేమున్నది?

రాజ—కావచ్చును— అనసూయస్వభావముమాత్ర మట్లె స్నటికిని మారునని నాకు నమ్మకము లేదు.

నాగ—అనసూయగుణము మారనిచో నా త్మేశ్వరునకుఁ గళాఘాతము లెందుకు ?

వేంకటేశ్వరుఁ డదరిపడి ‟ నాగమణీ! ఏమంటివి ? ” అనియెను.

నాగమణి పెదవులు విఱుచుచు ‟అనుట కేమున్నది ? అనుభవమునుబట్టి తెలియుచునే యున్నది !” అనియెను.

రాజరత్న మాశ్చర్యముతో ‟ అక్కా ! అనసూయయే యిట్లు చేయించియుండుననియా నీయభిప్రాయము ? ” అనియెను.

నాగ—ఇంకను సందేహమా ? పరవశుఁ డైపోయిన పతితో నామె కేమిప్రయోజన మున్నది ?— ఆమె గర్భవతి యఁట కాదా ? ఆమె కిక సంతానసుఖము లభింపనున్నది. ఆసుఖమార్గమున కీకంటకములుకూడ నెందుకు ?

వేంకటేశ్వరుఁడు తీవ్రహృదయముతో నాలోచింపఁ దొడంగెను.

రాజ—అక్కా ! అంతసాహసమా ?

నాగ—స్త్రీసాహసము నీటిలోఁబుట్టిన నిప్పువలె ననివార్యమైనది. అబలబానలజ్వాలలలో నెన్నిప్రాణములు లాహుతులు కా

లేదు ?— ఎన్నిరాజ్యములు నాశనముకాలేదు ?— ఎన్నికోటలు కూలిపోలేదు?

వేంకటేశ్వరుని సర్వాంగకములును కంపించిపోవుచుండెను. ఆతని రక్తనాళములలో నుష్ణరక్తమతివేగముగఁ బ్రవహించిపోవుచుండెను; ఆలోచనాపరంపరలచేఁ దలదిమ్మెక్కిపోవుచుండెను; హృత్పిండము కొట్టుకొనిపోవుచుండెను; నిరవుఁడై నిస్తబ్ధుఁడై యాతఁడు నిర్విణ్ణుఁడైపోయెను.

రాజరత్నము మందస్వరముతో "అక్కా! నాకుఁ జాల భయమగుచున్నది" అనియెను.

నాగ—అమ్మా! నీకు భయము కాదా? ఎవ్వనిహృదయమును నీహృదయము నేకమైనదో, యెవ్వనిజీవితమును నీజీవితము నేకమైనదో యాప్రాణమునకే యాపద కలుగనై యున్నప్పుడు నీకు భయము కాక మఱి యెవ్వరికి?

రాజ—అనసూయ మాత్రమిట్లాలోచించుకొనఁజాలదా?

నాగ—ఆమె యెంతటియాలోచనకలది గాకున్న నింతపని చేయింపఁగలదు?

రాజ—ఆమె యేయీదారుణకృత్యము చేయించినదందువా?

నాగ—ఇంకను సందేహమా?

రాజ—అంతఃపురము దాఁటిమెలఁగని యామె కంతటి సామర్థ్య మెక్కడిది?

నాగ—ధనమున కందఱును దాసులే.

రాజ—పాప మామెకు ధన మెక్కడిది?

నాగ—నిన్నమొన్నటివఱకును వేలకొలఁది రాఁబడిగల విభుని ప్రేలితో నడపించిన యామెకు ధనమున కేమిలోపము?

రాజ—ఆదొంగరంగని నామె మెల్లుంగును!

నాగ—వెఱ్ఱిదానా! మగనిపై మతివిఱిగినమగువల కెట్లుగ రాని దేమున్నది?

రాజ—నీమాటయందు నాకంతగా నమ్మకము కలుగుటలేదు.

నాగ—ఆయనకు నమ్మకము లేదు. అందుచే నీకును లేదు. ఆయనప్రతిధ్వనియే నీవు—

రాజ—ఆమాట కేమిగాని—ఆపనియే యామె చేయఁదలంచినచో నింతప్రయత్న మెందుకు? ఈయన ప్రతిదినమును దన యింటికే వచ్చుచుండిరి గాదా!

నాగ—అదియే దూరలోచన లేనిమాట—ఇతరులచేతనే తీఱిపోవుచున్నప్పుడు న్యాయముగఁ జేయి చేసికొనుట యేల? అది యనితరసాధ్యమైనప్పుడు తాను న్యాయముగనే చేసితీరును!

వేంకటేశ్వరుఁడు క్రుద్ధస్వరముతో “ఔను! ఇఁక నే నా యింటికిఁ బోను! ఆపాపాత్మురాలి మొగముచూడను!” అనియెను.

రాజరత్నము నివ్వెఱపడిపోయెను. నాగమణి దీనస్వరముతో “పదిశాసులు పోయినను భగవదనుగ్రహముచేఁ బ్రాణములుదక్కినవి. ప్రాణములు చల్లగ నున్నచో భాగ్యముతోఁ బనియేమున్నది? మనకున్నది మనకుఁ జాలును. ఇఁక మీరాజ్యోలికిఁ బోనలదు. మా ప్రాణము లన్నియు మీయొక్క ప్రాణముపై నిలువఁబడి యున్నవి. మీరు జాగరూకులై యుండవలయును. ఆయాదాయ మంతయు నా మెనే యనుభవింపనిండు.” అనియెను.

వేంకటేశ్వరుఁడు క్రోధకర్కశస్వరముతో “ఆపాపాత్మురాలి కొకచిల్లిగవ్వయైనఁ దక్కనిచ్చెదనా? ఎంతపని చేసినది! దామోదరుఁడు రాసిమ్ము! ఏమిచేయించెదనో?” అనియెను.

వేంకటేశ్వరుని ప్రణయచంద్రమండలము సంపూర్ణరాహుగ్రస్తమైపోయెను. ఎల్లయెడల మోహాంధకారము క్రమ్ముకొనిపోయెను. ఆతనిజీవనారణ్యమధ్యమునఁ గంటకలతయేదియో కల్పలతయేదియో నిర్ణయింపరాకుండఁబోయెను. ఆగాఢాంధకారపూరితం బగునాతనిహృదయాంతరాళమునం దింతవఱకు ననసూయయరుంధతీనక్షత్రముఁ బలె మినుకుమినుకు మనుచుండెను. ఆకస్మికముగ నిప్పుడాచుక్క కాలయవనికాంతరాళమునం బడి యగపడకుండఁ బోయినది. ఆతని ప్రేమమయ జీవితమున కవసానకాలము సంప్రాప్తమైనది కాఁబోలును! వేంకటేశ్వరుఁడు రాజరత్నముకొఱకు మోహసాగరమున మునిఁగి తేలుచు నిరంతరమును గొట్టుకొని పోవుచుండెను.

---

## ఇరువదియైదవ ప్రకరణము.



వలపులఁ గూరిమి నెఱపెడు
తలఁపుల నొండొరుల మించు దంపతులకు దు
ర్బలవిధిచేత వియోగము
గలిగిన శోకరణి నోర్వఁ గావచ్చుఁ గటా!

కపోతిమా — హారావళి.

అనసూయ పతిప్రాణ; పతిదైవత; పతివ్రత—పతి యడుగులో నడుగువైచి, పతిహృదయమున హృదయము చేర్చి పరమానందముతో జీవయాత్ర గడపఁగోరినది. కాని యామెకు దైవకటాక్షము దుర్లభమైపోయినది—కాలపరిణామము వ్యత్యస్తమైపోయినది. ఆకుసుమవల్లిక గ్రీష్మాతపతాపమునకు గుఱియైపోయినది. ఆ

యమృతఫలశాఖ ప్రబలప్రభంజనాహతికిఁ బాలైపోయినది. ఆమెను కుమారహృదయముకష్టసహనసామర్థ్యముకలది; కావుననే యామె తననాథునిసుఖముకొఱకెట్టికష్టమునైన ననుభవింపఁజాలియుండెను. ఏమాట యాడిన నేమనుకొనునో యనుసంశయముతో నామె తన నాథుఁడడిగినమాటకు మాత్రము ప్రత్యుత్తరము చెప్పి యంతమాత్రముచేతనే సంతుష్టినందుచుండెను. ఆతఁడు మునుపటివలెఁ జనవు చూపకున్నను నాతనిసందర్శనమునకుమాత్రమే సంతోషించుచుండెను. దినదినమునకుఁ బ్రాణేశ్వరునిప్రవర్తనము మారిపోవుచున్నట్లు స్పష్టముగ నగపడుచున్నను జూచియుఁ జూడనట్లుమసలుచుండెను. ఎంతకష్ట మెంతకష్టము! సతీమణులు తమప్రాణములనైన నవలీలగ నితరులకొఱకర్పింపఁగలరు గాని, ప్రాణేశ్వరుని జేతులార నితరులచేతుల కొప్పగించుటకు సహింపఁగలరా ?

అనసూయ కిప్పుడు భర్తృసందర్శనసౌభాగ్యముకూడ దూరమైపోయెను. కేవల మమాయకురాలై యుండుటయే యనసూయయందలి యొకగొప్పలోపము. ఏమాట యేటుపనిచేయునో యేపని యేవిధముగాఁ బరిణమించునో, యేపరిణామ మెంతవఱకు వచ్చునో పాప మామెకుఁ దెలియదు. అందుచేతనే యామెయాడినమాటలును, జేసినపనులునుగూడ నామె కింతవఱకుఁ దెచ్చినవి. ఆవినిర్మలప్రేమామృతమూర్తి యగునసూయకుఁ బ్రేమతక్క మఱియేమియును దెలియనే తెలియదు. ఈసత్యమును వేంకటేశ్వరుఁడు తన ప్రేమనయనములతో విస్పష్టముగఁ దిలకించియేయున్నాఁడు. ఆప్రేమామృతము నాతఁడుఁగూడ నాస్వాదించియే యున్నాఁడు. ఆయమృతపానముచేసిన మాతని కీవిషవిషమవిక్రృతి యేల కలుగవలయును? ప్రేమమయప్రపంచమునఁ బ్రేమచంద్రికలనే గాంచవలసిన వేంకటేశ్వరుఁ డీమోహాంధకారములో నేల మునిఁగిపోవలయును ?

అదియే పరమరహస్యము! అదియే సృష్ట్యాదినుండియుఁ దెలియఁబడనివిషయము. నిర్వికారుఁడగు పరమేశ్వరునకును వికారాకారిణియగు ప్రకృతికిని నడుమఁ దెలియఁబడనియట్టి రహస్యమే యున్నది- దీనినే జ్ఞానవాదులు మాయ యనిరి; కర్మవాదులు కర్మ మనిరి; యోగవాదులు యోగ మనిరి—ఆనిగూఢశక్తిప్రభావముచేతనే వేంకటేశ్వరుని ప్రేమమయహృదయాంతరాళమున మోహాంధకారము వ్యాపించినది! ఈరహస్యసూత్రమును జ్ఞానధనులగు మహాత్ములుకూడ నెఱుంగఁజాలకపోయిరి—ఇఁక వేంకటేశ్వరుఁడన నెంతటివాఁడు?—

ఏది యెట్టున్నను సామాన్యముగ లోకమంతయు గ్రహించి యింక పలికిన దేమనఁగా:—"కుండెడుపాలలో నొక్క విషబిందువు పడినంతమాత్రమున నదియంతయు విషమైపోవును— కుండెడు విషములో నెన్నిపాలు పోసినను పాలు గానేరవు— వేంకటేశ్వరుని యమృతహృదయకలశమున విషబిందువు పడినది. అందుచే నంతయును విషమైపోయినది. ప్రేమామృతప్రవాహిని యగు ననసూయ యింకేమి చేయఁగలదు? ఇంతకును గారణము సహవాసదోషము! దామోదరుని దగ్గఱకుఁ జేరనీయకున్నచో నింతపట్టిమునుఁగదు—" ఇంతమాత్రమే—

వేంకటేశ్వరు నెఱింగినవారందఱు నీవిధముగ జాలిపడుచుండిరి. అనసూయ సామాన్యవ్యక్తి కాదు— దివ్యశక్తి— అందుచేతనే యింతటికష్టమును సహింపఁగలుగుచున్నది. కాని యానాఁడుమ భర్తయింటికి రాకపోవుటచే — ప్రాణేశ్వరుని సందర్శనలాభము కలుగకపోవుటచే నామెదుఃఖము దుర్భరముగనే యుండెను.

ఆవసంతకాల మాకస్మికముగఁ దిరిగిపోయినది. ఆసుఖదినములంతలో మారిపోయినవి. అనసూయ యెంతటి జ్ఞానవతియైనను

స్త్రీప్రకృతి— ఆమెహృదయాంతరాళమునం దప్పటియుత్సాహము లేదు— ఆమెవదనకమలమునం దప్పటివికాసము లేదు. ఆమోహనసౌందర్యమునం దప్పటిమాధుర్యము లేదు.ఆవినిర్మలతేజమునం దప్పటిలావణ్యములేదు. ఆరూపము మారిపోయినది. ఆమెకు నిద్రాహారములు దూరము లైపోయెను. ఆమెకోమలాంగకము లశుష్కించిపోయినవి. ఆపరిమళపుష్పహారములు— ఆయుద్యానవనవిహారములు— ఆమణిమయాలంకారములు— ఆయాకస్మికసాహసోత్కారములు— ఆయాటలు— ఆపాటలు— ఆమాటలు - అవి యన్నియు నిప్పు డేమైపోయినవో?— అనసూయ యిప్పుడు పామునకు బునమువలె నొక్కచోంబడి పొరలాడుచున్నది!!

ఆమె కిప్పుడు వంటలక్క యగుజోగమ్మకంటె మఱిదిక్కు లేదు— దుర్భరదుఃఖానుభవముకంటె నింక గతి లేదు. అనసూయ జోగమ్మయొడిలోఁ దలనుంచుకొని వెక్కివెక్కి యేడ్చుచుండెను. జోగమ్మ యేమేమియో చెప్పి యామెనూఱడించుచునే యుండెను. మంచిమాటలచే మఱపించుట కనసూయ పసిబిడ్డయా? ఆమెహృదయపరితాపము హృదయేశ్వరునివాగమృతప్రసారముచేతనే చల్లారవలయును— ఆమెదుఃఖాశ్రువులు ప్రాణేశ్వరుని కోమలకరపల్లవములచేతనే పరిమార్జితములు కావలయును— కాని యామెకాయాశ లేదు. నిరాశాప్రభంజనములలో నామెప్రాణదీపకళికలు ప్రకంపితములై పోవుచుండెను. అప్పుడు జోగమ్మ యామె కన్నీరు దుడుచుచు “తల్లీ! దుఃఖపడకుము! హృదయపరితాపముచేఁ బుష్పమువంటినీమెత్తనిమేను వాఁడి వసుగై పోవుచున్నది. అమ్మా! నీకష్టమును నాపాపపుఁగన్నులతోఁ జూడఁజాలకున్నాను” అనియెను.

అనసూయహీనగద్గదస్వరముతో “అత్తా! నేనేమిపాపము చేసితిని? తుదకుప్రాణేశ్వరునిదర్శనముకూడ లేకుండఁబోయినది!” అనియెను.

జోగ—అమ్మా! అంతగా నడలెదవేల ? నేఁడుగాకున్న రేపైన నాతఁ డింటికి రాకమానఁడు—అతఁడుమాత్రము నిన్నుఁ జూడకుండ నుండఁగలఁడా? ఈమాత్రమున కింతవిచార మెందుకు?

అన - మునుపు పగ లెక్కడఁ దిరిగినను రాత్రి కింటికి వచ్చెడివారు. క్రమముగాఁదరువాత రాత్రులుతిరిగి పగ లింటికిఁ దప్పకుండ వచ్చెడివారు. ఇప్పుడు రాత్రియుఁబగలునుగూడ నింటిమాటయే తలపెట్టుట లేదు. ఇఁక వారు నాకంటఁబడుదురను నాశ యేమున్నది? ఏమోకాని నేఁడు నాహృదయము చేపట్టికలఁచివేసినట్టున్నది. నాప్రాణములు తల్లడిల్లిపోవుచున్నవి.

జోగ—తల్లీ! వట్టిభయము పెట్టుకొని బెంగచేఁ గృంగిపోవుచున్నావు. ఆతనిశరీర మక్కడ నున్నను బ్రాణము లన్నియు నీమీఁదనే యుండును—

అన—ఆదినములు తిరిగిపోయినవి. ఊరక నాకెందు కాశపెట్టెదవు? ఆయనకు రావలయు నని యున్నచో నడ్డగించువారెవ్వరు ?

జోగ—అమాయకురాలవు నీకాసంతి యేమి తెలియును?

అన—అందుచేతనే యింత మునిఁగినది.

జోగ—ఏమి మునిఁగినది ? నీకు ధైర్యము లేదుకాని—నీమాట కాతఁ డడ్డము చెప్పఁగలఁడా ?

అన—ఆయన పలుకరించుటయే మానుకొనినప్పుడు నేనేమని మాటాడఁగలను ?

జో—తప్పంతయు నాతనిమీఁద నుండఁగా నాతఁడు నిన్నే మొగముపెట్టుకొని పలుకరింపఁగలఁడు ?

అన—ఆయనది తప్పని నేనెన్నఁడు ననలేదే! అట్లని నా మనసునందుఁ గూడ భావించుకొనలేదే! కాని యాయన యట్లు

భావించుకొనుట లేదు. అట్లు తలంచుకొన్నచో నాకంటఁ బడకుండ నుండఁ గలరా? నన్నుఁ బలుకరింపకుండ నుండఁగలరా? నేను తన హృదయములోని హృదయమునే కానా? తనప్రాణములోని ప్రాణమునే కానా? ఆయనకా సందేహ మేల కలుగవలయును?

జోగ — సహవాసదోషముచే నాతని స్వభావము మాఱి పోయినది.

అన — స్వభావము మాఱిన మాఱుఁగాక! సంబంధము వదలిపోలేదే!

జో — అది యెట్లు వదలిపోవును? ఎప్పటికైన నిది నిత్యము గాని యది నిత్యమా? నీవు సంతానవతివై—

అన — అయ్యో! ఈనిర్భాగ్యురాలి కంతటి యదృష్టమా?

జోగ — కాలకర్మవశంబునఁ గలిగినకష్టములు కలిగినట్లే యుండవు.

అన — కష్టముల ననుభవించుటకే యీ యనసూయ పుట్టినది. కాకున్నచో నఱచేతిలోనియమృత మందకుండఁ బోవుట యేమి?

జోగ — ఎక్కడకుఁ బోవును? ఆకర్షణయంత్రము నీగర్భమునందే యున్నది కాదా?

అన — అత్తా! అంతమాత్రమున నేమిలాభము? కొమ్మ విఱుగకుండ నున్నప్పుడుగద కుసుమము ఫలియించుట? ఉత్తరక్షణము మనది గాదు. రేపటిమాట యెట్లుండునో యెవ్వరు చెప్పఁగలరు?

జో — అమ్మా! అధైర్యపడుటచే నేమిలాభము? ధైర్యము వహించి సుఖకాలముకొఱకు నిరీక్షింపవలయును.

అన — నాయందలి ప్రేమచే నిట్లనుచుంటివి గాని నాజీవితము నకింక సుఖలేశమైన నున్నదా?

జోగ—నీవింతగా నిరాశఁ జెందుటకు నీపై నాతని కేమైనఁ గోపమున్నదా ?

అన—లేదు.గావుననే యీశరీరమునం దింకను బ్రాణములు లేకుండఁ బోలేదు— అందుచేతనే యీదుఃఖము! ఈమర్మరదుఃఖశాంతికి సుఖమరణముకంటె నన్యాంతర మేమున్నది? ఆత్మేశ్వరుని ప్రేమైకతేజము నాగర్భమునం దుండుటచే నదియును నాకు దుర్భరమే యైపోయినది. ఇఁక నేనేమి చేయుదును?

అని యనసూయ జోగమ్మకంఠమును గౌఁగిలించుకొని వెక్కి వెక్కి యేడువఁదొడంగెను. జోగమ్మహృదయము దహించుకొని పోవుచుండెను. ఆమెకును గన్నీరాఁగినదిగాదు. ఏమనియూఱడింపఁగలదు? ఆమె యెట్లో ధైర్యమును దెచ్చుకొని యనసూయకన్నీరు దుడుచుచు ,, తల్లీ! దుఃఖింపకుము! నాప్రాణము లుండఁగా నీ కెట్టికష్టమును రానీయను! నీసుఖముకొఱకు నాప్రాణములనైన విని యోగించెదను '' అని యుపలాలించెను.

ఇంతలో పిచ్చిగుమ్మముకడ గుఱ్ఱపుబండి వచ్చి నిలిచినచప్పుడయ్యెను. జోగమ్మ యతిత్వరితముగఁ దలుపు తెఱచుటకై పోయెను. ఆనిమిషములో ననసూయ ప్రతప్తహృదయాంతరాళమున నెన్నియో భావస్ఫులింగములు నక్షత్రములవలె మెఱసిపోయెను.



## ఇరువదియాఱవ ప్రకరణము.

అకట ! యింతటి దాంపత్య ◆ మింతమైత్రి,
యింతవలపు, నింతకూరిమి, ◆ యింతగరుణ,
యింతదయ, యింతనుఖ్యాద, ◆ యింతమోహ,
మంతయును గాక మెచ్చట ◆ నైనఁ గలదె ?
కుటిలమైనట్టి తాత్కాలిక ◆ క్రోధవహ్ని
బారిఁబడి పోవఁదగునదా ◆ ప్రణయమహిమ ?

ప్రణయకోపము—హారావళి.

ఉత్తరక్షణమునందే యనసూయ కాత్యాయనునిసాక్షాత్కారము లభియించెను. ఆనిమిషమునందే యామెశారీరకమానసిక వ్యాపారములకు విలక్షణపరిణామము కలిగెను. తోడనే యామె చటాలున లేచి ప్రకంపితసర్వావయవయై వచ్చి ప్రాణేశ్వరునిపాదములపైఁ బడి తనకరకమలములతో నాథునిచరణకమలములం బట్టుకొని వేఁడికన్నీటితో నభిషేచనము గావించెను. అప్పుడు వేదకేశ్వరుఁడు క్రోధావేశపరవశుఁడై తనయెడమకాలితో ననసూయయుత్తమాంగమును నిష్కారణముగఁ దన్ని గెంటివైచెను. శివశివా! ఇది యెట్టివిరూపసంఘటనము ! ప్రణయసాగరతరంగడోలికావిలసితంబులగు రాయంచదంపతులంబోని యీయువతీయువకులయమూల్యప్రేమమయదాంపత్యధర్మమునకుఁ గాలకర్మవశంబున నెంతటిఘాతము సంభవించినది!! నిరంతరసతీహితపరాయణుఁ డగునా వేదకేశ్వరుఁడేనా యితఁడు? ప్రణయలీలామృతతరంగిణియు, ప్రసవసుకుమారశరీరిణియు, పతిగతైకజీవనయు నగు ననసూయను—తనసహధర్మచారిణియగు ననసూయను—సవిలాసముగ, సోత్సాహముగ, సానం

దముగ, సానురాగముగ నుపలాలింపవలసినయనసూయను—ఇట్లు చేయందగునా ? అర్ధాంగలక్ష్మియు, నబలయునగునసూయను మన్నింపవలసినమార్గ మిదియా ?

రాకాచంద్రశీతలస్వభావుండగు నావేంకటేశ్వరుండిప్పుడు గ్రీష్మమధ్యందినమార్తాండప్రచండమూర్తియై యుండెను. అమృతమోహనమూర్తి యగు ననసూయ యిప్పుడాతనికంటికిం గరాళమృత్యుదేవతాస్వరూపిణిగ నగపడుచున్నదా బోలును! చందనరసశీతలం బగునాసుకుమారసుందరతనుస్పర్శ మిప్పు డాతనికి దారుణకలికిలాసదృశ మైపోయినది కాబోలును! ఆతనికన్నులెఱ్ఱవడిపోయెను. క్రోధావేగముచే నాతని సర్వాంగకములును గంపించిపోవుచుండెను.

అప్పు డనసూయ మెల్లగ లేచి పిన్నపోయినముఖవదనయై శోకవినమ్రగద్గదస్వరముతోం బ్రాణేశ్వరును ద్దేశించి ‹‹ నేనేమియపరాధము చేసితిని ? ›› అనియెను. ఆదీనస్వరమునం గరుణరసము పొంగిపొరలిపోవుచుండెను. ఆ ముకునుదమ్ములనుండి వేడికన్నీరు వెలువిరిసిపోవుచుండెను.

వేంకటేశ్వరుం డలక్ష్యభావముతో ‹‹ చేయందలంచినను నీవేమి చేయుంగలవు ? లెమ్ము ! ఇంక నీవీయింట నుండవలదు ›› అనియెను.

అనసూయ కామాటలయర్థము బోధపడలేదు. ఆమె దీనస్వరముతో ‹‹ ఇంక నేనీయింట నొంటిగ నుండంజాలను—మీపాదసేవచేయుచు నచ్చటనే యుండెదను. ›› అనియెను.

వేంకటేశ్వరుండు కర్కశస్వరముతో ‹‹ ఎచ్చటనుండెదవు ? ›› అనియెను.

అన——మీచరణకమలసన్నిధానమునందే——

వేంక——చాలు! ఇఁక నాతో నీకు సంబంధము లేదు.

అనసూయ కాకస్మికముగఁ దలపైఁ బిడుగుపడినట్లయ్యెను—ఆమె యేడ్చుచు "మీహృదయేశ్వరికి మీహృదయాంతరాళమునఁ జోటు లేకపోయినను మీపదతలములనందైన నించుకతావు దొరకదా?" అనియెను.

వేంకటేశ్వరుఁడు వికృతస్వరముతో "ఇఁక నీకాయోగము లేదు?" అనియెను.

అనసూయ సుడిగాలికిం దూలుసుమవల్లరింబోలి గడగడ వడఁకిపోయెను. భర్త యుదాసీనుఁడై యున్నప్పుడే యామె మాటాడుటకు భయపడుచుండెడిది. ఇంతవఱకనసూయ ప్రాణేశ్వరుని వదనమండలమునం దించుకకోపచిహ్నమునైనను గని యెఱుంగదు. ఇంతటితీవ్రక్రోధపరవశుఁడగునాథునితో నిప్పుడామె యెట్లు మాటాడుటకు సాహసింపఁగలదు?—కాని మానవతియగునామెకు మనసుకరఁగునట్లుగఁ బ్రాణేశ్వరునితో మాటలాడుటకంటె—మనవిచేయుటకంటె నిఁకఁ జేయవలసిన దేమున్నది? ఆవశ్యకమును బట్టి యాకస్మికముగ నామెకాభయము వదలిపోయినది. ఆహృదయదౌర్బల్యము వదలిపోయినది—

అప్పు డనసూయ ప్రణయసూచకదీనస్వరముతో "ప్రాణేశ్వరా! ఇఁక నాకాయోగము లేదా? ఇది మీకరుణార్ద్రహృదయమునకుఁ దగినమాటయేనా? మీప్రణయమధురరసనారంగము నుండి వెలువడఁదగినమాటయేనా? మీపాదదాసినగు నే నేమియపరాధము చేసితిని? మీయానందలీలాసాలభంజిక నగునన్ను మీప్రేమమయహృదయమునకు దూరముగఁ జేసివైచితిరి. మీప్రసన్నకటా

డుములకు దూరముగఁ జేసివైచితిరి. నే నేమి నేరము చేసితిని ? పూలదండ సంకెలయైపోయినదా ? పన్నీరు తప్తతైలమైపోయినదా ? అమృతవల్లిక గరళవల్లికయైపోయినదా ? నే నేమి పాపము చేసితిని ?" అనియెను.

వేంకటేశ్వరుఁడు కోపముతో "ఈగొడవ యంతయు నెందుకు ? శీఘ్రముగ నీయింటనుండి వెడలిపోవలయును" అనియెను.

అన — నాథా ! నే నెక్కడకుఁ బోవుదును ?

వేంక — నీయిష్టము వచ్చిన చోటికి —

అన — నాకీ ప్రపంచమున మీకంటెను మఱి యిష్టవస్తువే మున్నది ? నాసుఖముపై నాకిష్టము లేదు — నాశరీరముపై నాకిష్టము లేదు. నాప్రాణములపై నాకిష్టము లేదు. నాకీ యిహజీవితమునందును పరజీవితమునందును మీకంటె మఱి యెట్టిగతియును లేదు.

వేంక — ఇహలోకమున నింతయైనది చాలదా ? ఇంకఁ బరలోకమునఁ గూడ నన్ను వదలవు కాఁబోలును !

అన — ప్రాణేశ్వరా ! ఎట్లు వదలఁగలుగుదును ? నాలుక తోడుకొనిపోవుచున్నను మీనామమంత్రమును వదలఁగలుగుదునా ? ప్రాణములు వెడలిపోవుచున్నను మీపాదపద్మధ్యానమును విడువఁగలుగుదునా ?—

వేంక — చాలు ! అంతటితోఁ గటాక్షించి నన్ను వదలిపెట్టుము

అన — నాథా ! ఎంతమాట ? వదలిపెట్టుట మాటలలో నున్నదా ? ఏదియో యాకస్మికక్రోధముచే నట్లనుచుంటిరి గాని మీరుమాత్రము నన్ను వదలిపెట్టఁగలరా ?

వేంకటేశ్వరుఁడు కన్నులెఱ్ఱఁగఁ జేయుచుఁ గఠినస్వరముతో "ఏమి ? నీ వేమి చేయఁగలవు ? ఇప్పుడు నీపీఁకలు పిసికివేసెదనా లేదా ?" అని గద్దించి పలికెను.

అనసూయ ప్రార్థనాదీనకంపితస్వరముతో ''నాథా! నేన న్నఁడైన మీయానతి కనుగుదాఁటితినా? ఇంతతీవ్రముగ శాసించుటకు నేనేమియపరాధము చేసితిని? తప్పు దెలుపకుండ దండించుట వలనఁ బ్రయోజన మేమున్నది? పాపమునకుఁ బశ్చాత్తాపమునఁగాని నిష్కృతి లేదు కాదా?'' అనియెను.

వేంక—ఓహో! ఈపిశాచహృదయమునకుఁ బశ్చాత్తాపముకూడనా?

అన—ప్రాణేశ్వరా! ఈనిర్భాగ్యురాలు ఎప్పుడు నీప్రియురాలే కాదా? వెలయాలినిజూచినకన్నుల కీప్రియురాలు పిశాచమైపోయినదా? కాదు కాదు! కన్నులుమారినచోఁ గళలుమాఱిపోవు— ఊరుమారినచోఁ బేరు మారిపోదు!

వేంక— ఏమియీ శ్రీరంగనీతులు! పాపాత్మురాలా! నీముఖము చూచినఁ బాపమురాఁగలదు.

అన—నాథా! నేనేమిపాపము చేసితిని? ఏమియు నెఱుఁగనిపాపముకంటె నాకేమియును దెలియదు. నాహృదయమును ఛేదించి పరీక్షింపుము!—నిరంతరము నిన్ను ధ్యానించుటకంటె నీప్రేమైకమూర్తి నారాధించుటకంటె —నీచరణకమలములను సేవించుటకంటె నేనేమియు నెఱుఁగను. నీనిరంతరసేవాలాభమును వాంఛించుటకంటె నీయిహజీవితమునందు నాకేమియును గోరిక లేదు. మఱియెట్టికోరికయును లేని నే నేమిపాపముచేసితిని! ప్రాణేశ్వరా! నేనునీప్రాణేశ్వరిని—నేనేపాపము నెఱుంగనిదాన నని నీవెఱుంగవా? హృదయేశ్వరా! నేను నీహృదయేశ్వరిని—నాహృదయ మంతకర్కశమైనది కాదని నీకుఁ దెలియదా? నాకొక్కటే కోరిక యున్నది. అట్లు కోరుకొనుట పాపము కాదు. ఈలోకమునందు నీ

కంటె నాకు దిక్కెవ్వరున్నారు? నీకంటె నాకోరికఁ దీర్చువా రెవ్వరున్నారు? జీవితేశ్వరా! ఈకుమ్మనయనములతో నీసుధామధుర విగ్రహమును దిలకింపనిమ్ము! ఈకుమ్మకంఠములో నీశుభనామ మంత్రమును జపియింపనిమ్ము! ఈకుమ్మహస్తములతో నీసుందర చరణకమలములను సేవింపనిమ్ము! ఆత్మేశ్వరా! నీవే నాయాధారము! నీవే నానానందము! నీవే నాకులదైవము—నా సర్వస్వమును నీవే! నీకంటె నాకిఁక నేమున్నది! నేనేపాపము నెఱుంగను. నీ ప్రణయకటాక్షావలోకనములపై నాజీవిత మాధారపడి యున్నది. హృదయేశ్వరా! నన్ననుగ్రహింపుము.

అని యేడ్చుచు నగలిక యగునసూయ యాతనిపాదముల పైఁబడియెను. వేంకటేశ్వరుఁడు క్రోధవికృతస్వరముతో „దురాత్మురాలా! నీనక్కవినయము లిఁకఁ జాలును! నీవు పయోముఖ విషకుంభమవు— గోముఖవ్యాఘ్రమవు— భేకస్వరభీకరభుజంగమవు! పాపాత్మురాలా!నదువుము— ఇఁక నీవీయింట నుండఁదగవు- నావెంట నుండఁదగవు—ఇట్టినీవు నాయిల్లాల వని చెప్పుకొనుటకుఁ గూడ నాకు సిగ్గగుచున్నది కూరాత్మురాలా! ఈకపటదీనాలాపములచే—ఈకృత్రిమదుఃఖాభినయములచే- ఈమృషాభయప్రకంపనములచే—పాపకళంకము పరిమార్జితమైపోవు ననుకొంటివా? పద. పద " అనిగద్దించిపలుకుచు వేంకటేశ్వరుఁ డతిదారుణముగ నామెను దోసికొనిపోయి వీధిగుమ్మమునవ్వలకు గెంటివైచెను.

అంతఃపురవధూమణి యగునసూయ యప్పుడు నట్టనడివీధిలోఁ దూలిపడిపోయెను. మొట్టమొదటినుండియు నోట మాట రాక విభ్రాంతయై చూచుచున్న జోగమ్మ భయావేగముచే వేంకటేశ్వరుని నిందించుచు నడ్డగించుటకుఁ బ్రయత్నించినది కాని యది

యబలయగు నామెకు సాధ్యమగునా ? ఆమె గోలుగోలున నేడ్చుచుఁ బోయి యనసూయను లేవఁదీసి పట్టుకొనియెను. ఆగోలవిని యరుగుపైనున్నవా రందఱును వచ్చి మూఁగిరి గాని వేంకటేశ్వరుని భయముచే నెవ్వరు నేమియు ననఁజాలక హృదయము కరఁగిపోవుచుండఁ గన్నీరునించుచుఁ గాంచుచుండిరి. వేంకటేశ్వరుఁడు క్రుద్ధవ్యాఘ్రమువలె రోజుచు ద్వారప్రదేశమున రోషస్తంభితుండై కాలయమునివలె నిలువఁబడిపోయెను.

అనసూయ కిఁక నేమున్నది ? ఆప్రణయచంద్రిక యస్తమించిపోయినది— ఆప్రణయప్రాసాదము కూలిపోయినది—ఆప్రణయకల్పకము మూలచ్ఛిన్నమైపోయినది—ఆమె దుస్సహదుఃఖభారముచేఁ దూలిపోవుచుండెను— దురంతపరితాపాతిరేకముచే దీర్ఘశ్వాసములను విడుచుచుండెను. దారుణావమానశరాఘాతముచేఁ గుంగిపోవుచుండెను. ఆమెశరీరమునం దింకను బ్రాణము లున్నవిగాని హృదయమునం దాశలు వదలిపోయినవి—అప్పు డామెహృదయమునందు దుఃఖము లేదు. భయము లేదు. క్రోధము లేదు— మానవతియగునాసతీమణిహృదయాంతరాళమునం దప్పు డేదియో యనిర్వాచ్యమగు దివ్యశక్తి యుత్తేజిత మగుచుండెను. ఆమె కీప్రపంచమునం దేమియు నగపడుట లేదు. ఎట్టయెదుట భర్తమాత్రమే యగపడుచుండెను.

అప్పు డామె యభిమానోద్రిక్తగంభీరస్వరముతో ‘నాథా ! మీరు నిష్కరుణులై మీసహధర్మచారిణి యగునర్ధాంగిని దూరముగఁ ద్రోసివేయఁదలంచితిరి. కాని మీరుమాత్రము నాకెన్నఁటికిని దూరము కాఁజాలరు ! మీయమృతమోహనవిగ్రహము నాహృదయమందిరమునందే యున్నది. మీప్రణయమధురతేజము నా

గర్భగోళమునందే యున్నది. మీరెట్లు పరిత్యజించినను నేనుమాత్రము మీదాననే—సత్యముగఁ జెప్పుచున్నాను—శపథముచేసి చెప్పుచున్నాను—ధర్మమున్నచో—దైవమున్నచో—నెప్పటికిని మీరు నావారే—మీపవిత్రప్రణయచంద్రికపైఁ గాలమేఘము క్రమ్ముకొన్నది—ఆయంధకారములో మీరు విభ్రాంతులై పోయితిరి. అందుచేతనే మీరు చింతింపఁదగిన చింతామణిని గ్రహించి పూలదండను గాలకాకోదరముగ భావించుచున్నారు. అందుచేతనే మీకింతటి యసమసాహసము కలిగినది—కాని యింతమాత్రముచే నా యాశ యింకను సంపూర్ణముగ నంతరించిపోలేదు—ఆ యాశాలేశముచేతనే నేను జీవించి యుండెదను. కాలము చంచలమైనది—మీహృదయమునందలి యీ కాలమేఘము మాత్రము సుస్థిరమైనదా? ఎప్పటికైన మీహృదయాంతరాళమునఁ బశ్చాత్తాపప్రభంజనము వీవక మానదు—ఎప్పటికైన నాపాపపుమేఘము పటాపంచలై పోకమానదు—ఎప్పటికైన నా ప్రణయచంద్రిక మరల నెప్పటివలెఁ బ్రకాశింపక మానదు—ఎప్పటికైన నా శరచ్చంద్రికలలో మీరు నన్ను వెదకికొనక మానరు—నన్నుఁ గూర్చి యుచ్చైస్స్వనమున విలపింపక మానరు. ప్రణయామృతకలశమును బాదములతోఁ దన్నివైచుకొంటినే యని విచారింపక మానరు. భ్రాంతిమూలకమైన యీ దుష్కృత్యముం దలంచుకొని పరితాపపడక మానరు—ధర్మమే సత్యమైనచో—దైవమే సత్యమైనచో—ప్రేమయే సత్యమైనచో—నా మాట యసత్యము కాదు. సత్యము! సత్యము!! ముమ్మాటికిని సత్యము!!!" అని యామె యచ్చటినుండి గిరుక్కున మరలి రాజమార్గమునుబట్టి పోయెను. జోగమ్మకూడ నామె ననుసరించియే పోయెను. వేంకటేశ్వరుఁడు దత్తప్రతిభుఁడై యట్లే నిలువఁబడిపోయెను.

అప్పు డాకస్మికముగ నప్రయత్నముగ నాతనివదనమునుండి "పోవే! పిశాచీ!" అనుమాటలు వెలువడియెను.

"హా! పరమేశ్వరా! ఏమియీదారుణవైపరీత్యము!" అని యందఱు ననుకొనసాగిరి.—



శ్రీరామచంద్ర.

# మాతృమందిరము

## ద్వితీయభాగము.

### మొదటి ప్రకరణము.

కలితగంగాప్రవాహావ § గాహనమున
గాత్రము పవిత్రమై కాంతిఁ § గాంచినట్లు
అనుపమానప్రభావది § వ్యాంజనమున
నేత్రములు నిర్మలంబులై § నెగడినట్లు
కమ్రతరశాణయంత్రసం § ఘర్షణమున
జీవమణి దీప్తమై నిరా § జిల్లినట్లు
ఘటితరావలసంపుట § పాకకలనఁ
గనక ముత్తప్తమై వన్నెఁ § గన్నయట్లు
సరసకావ్యరసామృతా § స్వాదనమున
హృదయమీను పవిత్రమై, § సదమలమయి,
దివ్యమై, తీక్ష్ణమై సము § ద్దీప్త మగుచు
నిశ్చలానందపదవి నం § దించుచుండ
నీనరుఁడు కోరఁదగిన దిం § కేమి గలదు?

కావ్యగీతము — హారావళి.

గౌతమీపుణ్యతరంగిణీతీరమునందలి గోపాదక్షేత్రము సుప్రసిద్ధపుణ్యక్షేత్రములలో నొక్కటిగఁ బరిగణింపఁబడుచున్నది. ఆదివ్యక్షేత్రమునందలి యంతర్నిలయమునందే యతిలోకసుందర

మగు మాతృమందిర మున్నది— ఆపవిత్రమందిరమునందే సర్వజగద్ధారిణియు, సర్వసంతానసముద్ధారిణియు, సర్వపాపసంహారిణియు, సర్వలోకైకాధారిణియు నగుజగన్మాత సర్వమంగళాకారిణియై వేంచేసియుండి తనదివ్యమంగళకరుణామృతమధురకటాక్షములచే లోకమును బరిపాలించుచున్నది. పాపపుణ్యములఁ బరిశీలించుచున్నది. దుష్టశిక్షణశిష్టరక్షణమార్గములఁ బ్రదర్శించుచున్నది. ఆదివ్యమంగళకరుణాకటాక్షములచేతనే సర్వమును జరగిపోవుచుండెను. ఆపవిత్రస్థానమును భక్తిజ్ఞానసంపన్నులగు పెద్దలందఱు నైశ్వర్యకైలాసమనియు, నారోగ్యవైకుంఠమనియు, నానందబ్రహ్మనిలయ మనియు భావించుచుండిరి. ఆమాతృమందిరము ప్రబోధానందునియనుగ్రహములేక యప్పటికి నిప్పటికిని గూడ నగోచరమై యగమ్యమై యుండెను.

అది యొకదివ్యనగరమువలె నుండెను. మధ్యభాగమునందే మాతృదేవతామందిర మున్నది. ఆమాతృమందిరమునకు వామభాగమునఁ బ్రబోధమందిరమును, దానిననుసరించి శిక్షామందిరమునుండెను. దక్షిణభాగమునం దానందమందిరమును, దానితోఁగలసి విజ్ఞానమందిరము నున్నవి. ప్రబోధమందిరమునకెదురుగ సరస్వతీమందిరమున్నది. ఆనందమందిరమున కెదురుగ నన్నపూర్ణామందిరమున్నది. మాతృమందిరమునకు వెనుకభాగమున నెన్నియోసింగూఢమందిరము లున్నవి. వానినామములన్నియును దెలిసికొనుటకుఁగాని యందెవ్వరెవ్వరుందురో, నిరంతరము నచ్చట నేమేమికార్యములు జరగుచుండునో తెలిసికొనుటకుఁగాని ప్రస్తుతము మనకంతగా నావశ్యకము లేదు—అందలియొక్కొక్కమందిర మొక్కొక్కచిన్ననగరమే యని చెప్పవచ్చును. ఆయంతర్నగర మేకాలమున నేవిశ్వ

కర్మచే నిర్మింపఁబడెనో యెవ్వరికి దెలియదు. మాతృమందిరమున కెదురుగ విశాలరాజమార్గమున్నది. దానికిరువంకలను జల్లి ఫలవృక్షములును, బుష్పలతాకుంజములును వరుసగఁ బెరిగి హృదయ నయనానందకరంబులై యుండెను

దూరమునం దొకకళాశాలసుందరారామమును, నానడుమఁ జంద్రకాంత శిలాసోపానసమంచితమగు విశాలసరోవరమును గలవు. అదియే యమృతసరోవరము. గోదావరీ హృదయమునందలి యమృత సూత్రము నుండి గంగాజలము సుధారసముగఁ బరిణమించి పొంగి పొరలి ప్రవహించుచు నిరంతరము నాసరోవరము నమృతపరిపూర్ణముగఁ జేయుచుండును. ఆసరస్తీరమునందలి బిల్వవనమధ్యమునందే ప్రబోధానందస్వామియాశ్రమ మున్నది. ఆమహానుభావుఁ డేనాఁటివాఁడో యెవ్వరికిని దెలియదు. ఎందఱోమహానుభావు లాపుణ్యమూర్తిని సందర్శించి యాతనియనుగ్రహముచే నయ్యమృతసరోవరమునం దవగాహనముల నాచరించి మాతృసేవాదీక్షితులై జీవన్ముక్త భావమునఁ బుణ్యచరిత్రులైనట్లు తెలియవచ్చుచున్నది.

తొల్లి శ్రీరామచంద్రుఁ డీసరోవరమునఁ గ్రుంకులిడి సీతావియోగదుఃఖమును మఱచి కార్యదీక్షాతత్పరుఁ డయ్యెను. పాండవాగ్రజుఁ డాపవిత్రజలస్నానానంతరమునందే భారతవర్షమునకుఁ బట్టభద్రుఁ డయ్యెను; అశోకుఁ డశోకుఁ డయ్యెను; విక్రమార్కుఁడు సాహసాంకుఁ డయ్యెను; శాలివాహనుఁడు శకకర్త యయ్యెను. రాజరాజనరేంద్రుఁ డాయమృతస్నానమువలననే పంచమవేదమగు భారతేతిహాసమునకుఁ గృతిభర్త యయ్యెను. శ్రీకృష్ణదేవరాయలాపావనసరోవరావగాహనమాహాత్మ్యముచేతనే— ఆమాతృదేవతాప్రసన్నకటాక్షప్రభావముచేతనే— రాజచక్రవర్తియై, కవి

రాజచక్రవర్తియై లక్ష్మీసరస్వతులఁ దనయింటి లీలాసాలభంజికలుగాఁ జేసికొనఁగలిగెను.

ఆదికవిసార్వభౌముఁ డగువాల్మీకిమహర్షి యీయమృతసరోవరతీరమునందలి పావనతపస్సీమనమునందే శ్రీమద్రామాయణమహాకావ్యరచనాదీక్షితుఁ డయ్యెను. మహాత్ముఁ డగువేదవ్యాసుఁ డాప్రబోధానందానుగ్రహముచేతనే యమృతసరోవరమున సుస్నాతుఁడై మాతృదేవత నారాధించి యాగమవిభాగముం గావించి యష్టాదశపురాణములను వ్రాయఁగలిగెను. ఆనూలముననే మాతృదేవతానుగ్రహమును సంపాదించి కాళిదాసు మహాకవి యయ్యెను. ఆ పుణ్యజలస్పర్శనమైనతరువాతనే నన్నయభట్టారకుఁడు మహాభారతము నాంధ్రీకరింపఁదొడంగెను. కవిబ్రహ్మయగు తిక్కనసోమయాజి యీయమృతసరోవరమునందే యవభృథస్నానముం గావించి భారతామ్నాయమును సంపూర్ణముగ నాంధ్రీకరింపఁగలిగెను—వేయేల? మహాత్ములనియు, మహారాజులనియు, మహాకవులనియు, మహాపురుషులనియు మనచేఁ బేర్కొనఁబడుచు నారాధింపఁబడుచున్న మహనీయులగు పుణ్యపురుషులందఱునుగూడ నాయమృతసరోవరావగాహనములం గావించినవారే—ఆప్రబోధానందగురుకటాక్షములం గాంచినవారే—ఆమాతృదేవతాప్రసాదమును స్వీకరించినవారే—

మాతృమందిరము నిత్యకల్యాణమయమై నిత్యోత్సవములతో నిండియుండును. పూజాసమయసూచకంబగు ఘంటానాదము వినవచ్చినంతనే భక్తిభావహృదయులగు నచ్చటిపురుషులును స్త్రీలు నందఱును గలసి ప్రబోధానందు ననుసరించి యీమాతృమందిరమునకుఁబోయి మాతృదేవత నారాధించుచుందురు. అన్నపూర్ణామందిరమున నమృతాన్నపానములును, సరస్వతీమందిరమున సర్వవిద్యా

లును నిరంతరము లభియించుచుండుటచే నటనున్నవారి యానందజీ వనమున కెట్టికొలంతయును లేదు.

కాని యాస్వర్గఖండమునందుఁగూడ నరకనిలయము లేకపో లేదు. అదియే శిక్షామందిరము. ప్రబోధానందుఁడు పాపాత్ముల నందుంచి పశ్చాత్తాపము కలుగువఱకు ననుకూలదండనముం గావిం చి తుదకువారిని బ్రబోధమందిరమునం జేర్చి యుద్ధరించుచుండును. మన మొకప్పుడొక యంతర్గృహమునఁ బాపబాధాపీడితుఁ డగు నొ కపురుషుని జూచి యుంటిమి—— ఆగృహమీశిక్షామందిరమునందలి యొకభాగమే. ప్రబోధానందుఁ డట్టివారి నెందఱనో మాతృభక్తు లనుగాఁ జేసియున్నాఁడు! ఆశిక్షామందిరమునందలి పురుషుఁడప్పటికి సంపూర్ణముగఁ బశ్చాత్తప్తుఁ డైనాఁడు. సర్వజ్ఞుఁడగుస్వామి యా నంగతిని గ్రహించెను; ఆతని కీదినమున మాతృదేవతాసందర్శన లాభముం గల్పింపవలయు నని నిశ్చయించెను. ఆపురుషుని మాతృ సేవానీకితునిగఁ జేయఁ దలంచెను.

సాయంసమయపూజాసూచకం బగుఘంటాధ్వని వినవచ్చె ను. నిమిషములో నానందమందిరమునుండి భక్తశిఖామణులగు స్త్రీ పురుషు లందఱును బయలుదేరిరి. పురుషులందఱు నొక్క-టేమాది రిదుసులను ధరించి యుండిరి—— అట్లే స్త్రీలందఱును సమవసనభూ షణాలంకృతలై యుండిరి. ఇదివఱకేసూచితమైయున్నస్వామియాన తిననుసరించి స్త్రీలందఱు నొకపార్శ్వమునను బురుషులందఱు నొక పార్శ్వమునను నిలిచి క్రమముగఁ బ్రబోధమందిరాభిముఖులై నడ చుచుండిరి. ఆభక్తశిఖామణు లందఱును బరిమళసుమమాలికా లంకృతులై యుండిరి. అందఱకరకమలములును కింకిణీకంకణసంక లితములై యుండెను. అందఱవదనకమలములును బ్రేమానందవిక సితములై యుండెను. అందఱును మధురకంఠములతో మాతృగీత

ములను బాడుచు నడచుచుండిరి. ఆమధురగీతములలో నమృతము వర్షించుచుండెను; ఆనందము వెల్లివిరియుచుండెను— అట్లే నియమము చెడకుండఁ గ్రమముగ నందఱును బ్రహ్మబోధమందిరద్వారము నొద్దకుఁబోయిరి

---

## రెండవ ప్రకరణము.

తమఃపూరాచినయట్టి ◆ ధర్మసూత్రముల
సౌభాగ్యమయ రేఖ ◆ సంధింపఁబడియె;
మెఱుఁగుపెట్టినయట్టి ◆ విరమటబద్ధమున
నమృతసుందరమూర్తి ◆ ప్రతిష్ఠింపఁబడియె;
చిద్ది తీర్చినయట్టి ◆ దివ్యాకంబమున
విజ్ఞానదీపంబు ◆ వెలిఁగింపఁబడియె;
కొదలం తీర్చినయట్టి ◆ కోటగుమ్మమున
జయకేతనంబు సం ◆ స్థాపింపఁబడియె;—
విజ్ఞానసీమలో ◆ విహరింపకందె
యానందవీథిలో ◆ నాడుటకందెఁ
బరమధామంబులోఁ ◆ బాడుటకందె
నిపుడు కోరుటకు నీ ◆ కేమికానెకె!
మలయమారుతమ్మృదు ◆ మధు వీచికల
నమృతవల్లిక నాట్య ◆ మాడుచుండె
మలయమారుతమ్మృదు ◆ మధురరాగమునఁ
బాడవే కోకిలా! ◆ పాడవే పడుచు!—

ఏకాంతసేవ.

అంతలోఁ బ్రహ్మబోధానందస్వామి విషనిషమధీశితుఁడగు నా పురుషుని దనతో వెంటఁబెట్టుకొని వచ్చి యాభక్తమండలమధ్యమునఁ బ్రవేశించెను. తోడనే యందఱు నేకకంఠముతో:—

"గురుర్బ్రహ్మా గురుర్విష్ణుర్గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః"

అని స్తోత్రము చేయ నారంభించిరి. అప్పు డామాత్మపురుషుఁ డానందపరిస్మితుఁడై పోయెను. ఇంతకాలమునుండి నిత్యానందరమునం దున్న యాతని కింతవఱకు నితరప్రపంచమే తెలియదు. అప్పుడా తనికన్నుల కదియంతయు నానందస్వర్గధామమువలె నగపడు చుండెను. ఆతనికి మానవత్వము వదలి దేవత్వము లభియించిన ట్లనుభవ మగుచుండెను. ఏమిమాటాడిన నేమగునో, యేమిచేసిన మరల నెట్లు పతితుండ నైపోవుదునో యనుభయముచే నాతఁ డసి ధారావ్రతము నవలంబించి మౌనముతో స్వామి ననుసరించి నడచు చుండెను.

క్రమముగ నందఱును మాతృమందిరముఖద్వారము నొద్దకు వచ్చిరి. ఆమందిరద్వారము లన్నియును మణిదీప కళికాలంకృతము లైయుండెను. ప్రతిద్వారపార్శ్వములను భవ్యమణిభూషణాలంకృత లగు ద్వారపాలికలు వేత్రహస్తలై నిలిచియుండిరి. మందిరమంత యును మంగళసంగీతములతోఁ బ్రతిధ్వనించిపోవుచుండెను. అప్పు డాభక్తు లందఱును బ్రహ్మానందపూరస్సురులై కొలఁదిసేపటిలోఁ గక్ష్యాంతరములఁ గడచి గర్భాలయమునఁ బ్రవేశించిరి. ఎట్టయెదుట మధురమోహనకళావిలసితయు, మనోజ్ఞవేషాలంకృతయు నగు మాతృదేవతామూర్తి వరాభయకరకమలయై సుప్రసన్నమందహాస వదనముతోఁ దనభక్తసంతానముపై మధురామృతకటాక్షములను బ్రసరింపఁజేయుచు సాక్షాత్కరించి యున్నది!!

ఆ దేవీపాదపీఠమునకు వామభాగమునఁ ద్రిపురసుందరీమూర్తి వలె దివ్యభూషణవిభూషితయై తరుణీమణి యగు నొకరమణీమణి పరిమళపుష్పాంజలినిబద్ధయై పుష్పించినవసంతవల్లికవలెఁ గుసుమ

విలసితం బగునుత్తమాంగము నొక్కించుకవచ్చి నిలువఁబడి యుండెను. ఇప్పుడామెయే మాతృదేవతకుఁ బూజాపరిచారిక — ప్రబోధానందుని యాజ్ఞాపరిచారిక — ఆమె నందఱు నానందాదేవి యని పిలుచుచుందురు. ప్రబోధానందుఁ డంతర్మందిరమునఁ బ్రవేశించి యాదివ్యసుందరీమూర్తి కెదురుగ దేవీపాదపీఠమునకు దక్షిణభాగమున ధ్యానమగ్నుఁడై నిలువఁబడియెను. భక్తులందఱును స్త్రీపురుషులు వేర్వేఱుగ వరుసలుతీరి ముకుళితకరకమలులై తమ నిశ్చలదృష్టులను దేవీచరణకమలములయందుంచి ధ్యానమగ్నులై యుండిరి.

అప్పుడాజగన్మోహనసుందరీమూర్తి ప్రబోధానందునకుఁ గన్నులతోడనే నమస్కారములం గావించి భక్తసంతానమువంకఁ బ్రసన్నమధురదృష్టిప్రసారముం గావించుచు నమృతమధురకంఠస్వరముతో: —

"యాదేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః
యాదేవీసర్వభూతేషు పితృరూపేణసంస్థితా॥ నమః
యాదేవీసర్వభూతేషు భ్రాతృరూపేణసంస్థితా॥ నమః
యాదేవీసర్వభూతేషు బంధురూపేణ సంస్థితా॥ నమః
యాదేవీసర్వభూతేషు శాంతిరూపేణసంస్థితా॥ నమః
యాదేవీసర్వభూతేషు దయారూపేణసంస్థితా॥ నమః
యాదేవీసర్వభూతేషు ధర్మరూపేణసంస్థితా॥ నమః
యాదేవీసర్వభూతేషు కర్మరూపేణసంస్థితా॥ నమః
యాదేవీసర్వభూతేషు ఫలరూపేణసంస్థితా॥ నమః॥
శ్రీలోచనకృతోల్లాసఫలదాయైనమోనమః
శ్రీసుధాబ్ధిమణిద్వీపమధ్యగాయైనమోనమః

శ్రీపీఠభక్తవిజ్ఞాననిదానాయైనమోనమః
శ్రీనాథసోదరీభూతశోభితాయైనమోనమః
మాతృమండలసంయుక్తలలితాయైనమోనమః
మహాతాపౌఘపాపానాంవినాశిన్యైనమోనమః
సమస్తహృదయాంభోజనిలయాయైనమోనమః
సహస్రారసరోజాతవాసితాయైనమోనమః
భక్తరక్షణదాక్షిణ్యకటాక్షాయైనమోనమః
పద్మాకరవసుందరాలిన్యైనమోనమః
అమృతాదిమహాశక్తిసంవృతాయైనమోనమః
అనాద్యంతస్వయంభూతదివ్యమూర్త్యైనమోనమః.'

అని యామాతృదేవతామూర్తిని బ్రార్థింప నారంభించెను. భక్తు లందఱు నాదివ్యగీతముల ననువదించి పాడుచుండిరి. ఆప్రార్థ నానంతరమున నాత్రిపురసుందరి యగు నానందాదేవి దేవీపావనపాద పీఠముపైఁ బరిమళపుష్పాంజలివిడిచి పిమ్మట నానిర్మాల్యకుసుమము లను దేవీప్రసాదముగ భక్తులందఱకు నొక్కొక్కటిగఁ బ్రసా దించెను.

ఆనూతనపురుషుఁ డది యంతయు ననుభావించుచుండె చూచుచు నిశ్చేష్టుఁడై నిలువఁబడియుండెను. ఆనందాదేవి యాతనికిఁగూడ దేవీప్రసాదము నొసంగి తనకోమలకరపల్లవము నాతనియుత్తమాం గముపై నుంచి మృదుగంభీరస్వరముతో "తల్లిని దర్శించితివా?" అని హెచ్చరించెను.

పురుషుఁ డానందగద్గదస్వరముతో "తల్లీ! జగన్మాతను దర్శించి ధన్యుఁడ నైతిని. ఆకస్మికముగ నావిషబాధ యంతయు మంత్రించినట్లుగ నంతరించిపోయినది! నాపాపములు పటాపంచలై

పోయినవి. నాజన్మము తరించిపోయినది! తల్లీ! దయామయునగునీకుఁ బదివేలనమస్కారములు!'' అని యామెపాదములపైఁబడఁబోయెను.

ఆనందాదేవి యాతని వారించి పూజాకుసుమములతో నాతనికన్నులను దుడిచి "చూడుము! మహాశక్తి యగుమాతృదేవతను మఱియొకసారి సందర్శింపుము!'' అనియెను.

ఏమి యీయద్భుతప్రభావము! ఆకస్మికముగ నాతనికన్నుల కామాతృదేవతామూర్తి విశ్వదేవతామూర్తియై యగపడియెను. సహస్రశీర్షయు శతసహస్రబాహుసమన్వితయు, సహస్రసహస్రనేత్రవిరాజితయు నగునావిశ్వమూర్తిం జూచి యాతఁ డదరిపడియెను. సర్వశక్తులు నామెయందు మూర్తీభవించి యున్నవి. సర్వజీవులు నామూర్తి నాశ్రయించియుండిరి. సర్వము నావిశ్వరూపమునందే నిండియుండెను. అచ్చటనే స్వర్గసౌధ మున్నది? నరకక్షేత్రముకూడఁ నచ్చటనేయున్నది. పుణ్యాత్ము లాస్వర్గసౌధమునం దుచితసౌఖ్యముల ననుభవించుచుండిరి. పాపాత్ము లానరకక్షేత్రమునఁ బాపఫలముల ననుభవించుచుండిరి. తానప్పుడే యానరకప్రాకారమును దాఁటి స్వర్గసౌధప్రథమసోపానముకడ నిలిచియున్నట్లును—ఆనరకభటులు తన్ను సమీపింపఁజాలక దూరమునం దుండియే చేయెత్తి పిలుచుచున్నట్లును నాతనికి గోచరించెను. ఆదివ్యమూర్తియం దచ్చటఁ జూచిన నచ్చటనే పరబోధానందస్వామిసాక్షాత్కారము లభియించుచుండెను—ఆస్వామి వెనువెంటనే నృత్యముచేయుచు మెఱుపుదీఁగవలె నాత్రిపురసుందరి యగు నానందాదేవి యెల్లెడలఁ బ్రత్యక్షమగుచుండెను. ఆతఁడు తదేకధ్యానముతో నంతయుం జూచుచుఁ దన్మయుఁడైపోయెను.

అప్పు డానందాదేవి యుచ్చైస్స్వరముతో "జగన్మాతను సందర్శించితివా?'' అని ప్రశ్నించెను.

పురు—తల్లీ! తల్లిని దర్శించితిని. నాపాపపుంగన్నులు పవిత్రము లైనవి— నాదుష్కరహృదయము నిర్మల మైనది.

ఆనం—ఇంక నీవీజగన్మాతసన్నిధానమున నీసత్యచరిత్రము ను జెప్పి నీతప్పుల నొప్పుకొందువా?

పురు—తల్లియెదుటఁ దప్పులను నివేదించి క్షమాప్రార్థన ముం జేసికొందును.

ఆనం—నీపేరెవ్వరు?

పురు—భీముఁడు.

ఆనం—పాముకఱచిననాఁటిరాత్రి నీకుజ్ఞప్తియందున్నదా?

భీము—లేకేమి? ఒకనిమిషమునకిందటివఱకు నావిషబాధ ననుభవించుచునే యుంటినిగాదా?

ఆనం—ఆనాఁ డంతరాత్రివేళ నీవెక్కడకుఁబోవుచుంటివి?

భీము—నన్నాశ్రయించినదామోదరుఁడను నొకమిత్రునకు సాహాయ్యము చేయవలయు నని పోవుచుంటిని.

ఆనం—ఆతనికిఁ జేయవలసినసాహాయ్యమేమి?

భీము—పెద్దాపురమునం దాతఁడు చేపట్టినవేశ్య యొకతె యున్నది. ఆమెకుఁ గన్యయగు నొకసోదరి కలదు. ఆమెను బెండ్లియాడెద నని భ్రమపెట్టి చంచలరావనువిద్యాధికుఁ డొకఁ డామెను విజయవాడకుఁ దీసికొనివచ్చెను. ఆతనికిఁ దెలియకుండ మరల నామె నెత్తుకొనివచ్చి దామోదరున కొప్పగింపవలయు ననిగో నేనా నాఁడు ప్రయత్నించితిని.

ఆనం—అంతదూరము వచ్చి యంతటిసాహసకృత్యమును నెఱవేర్చుట యసాధ్యము కాదా?

భీము భీమున కసాధ్య మగుపనియొకటి యున్నదా? నాపే రువింటే నెల్లుఁగుండెదరు. కాని యింతవఱకు నన్నుఁ జూచినవా రొ

క్కరును లేరు. నాపరిచారకులుకూడ నించుమించుగ నాతోసమా నమైనవారే — ఇతరులకంటెఁ బడకుండఁ గార్యములను సాధింపఁ గలరు !

ఆనం — ఆనాఁడు నీవు పాముగఱచి పడిపోయితివిగదా ! పని జరిగినదా ?

భీము — ప్రాణములు పోవుచున్నను — ప్రళయము వచ్చుచున్నను — తలఁచినపని జరగితీరవలసినదే — మావాండ్రుపోయి యామెను మంచముతో నెత్తికొనివచ్చి యారాత్రియే దామోదరున కొప్పగించివైచిరి. ఎవ్వరో యొకబాలయోగి వారి నడ్డగి చెనఁట గాని లాభము లేకపోయినది. అప్పుడు మిత్రకార్యముమాత్రమే ప్రధానమైనదగుటచే మావాండ్రతనియింట నొకచిల్లిగవ్వయైన దొంగిలింపలేదు.

ఆనం — దొంగిలించుట కూడనా ?

భీము — నిజముగ దొంగిలించినచో నొకనల్లపూసయైన మిగులకుండ నాతనియిల్లంతయు గుల్లయై పోవలసినదే.

ఆనం — నీవు దొంగవా ?

భీము — దొంగభీముఁడనియే నాప్రసిద్ధి — నాతాత దొంగ — నాతండ్రి దొంగ — నాయన్న దొంగ — నేను దొంగను — నా పరిచారకులు దొంగలు — మాకులవృత్తియే యిది ! పూవు గందకుండఁ దేనెఁ దీసికొన్నట్లుగఁ దనువు నొవ్వకుండ ధనము దోఁచుకొనుచుందుము ఇన్నాళ్లనుండి దొంగతనము చేయుచుంటినిగాని యొక్కరిపైఁ జేయిచేసికొనలేదు. ఒక్కరిచేతికి లొంగలేదు ! ఒక్కరికంటెఁ బశలేదు — ఏమైననేమి ! తుదకు నేనొకమహాపాప కార్యమును గావించితిని — ఆపాపమునకుఁ బ్రాయశ్చిత్తము లేదు. తలఁచుకొనినచో నాపరితాపమునకవధిలేదు — దేవీసందర్శనానం

దముచే నెంతటి నిశ్చింతమై యున్నను నా హృదయము నాపాపపరిభ్రం జన మింక ను ప్రకంపితముగఁ జేయుచునేయున్నది.

ఆనం—భయ పడకుము! పాపమోచని యగుతల్లి యెదుటఁ బాపముం దెలిపి పాశ్రింపుము! ఏమి చేసితివి ?

భీము—మాతృసమాన యగుభ్రాతృదేవిని గంతమున కురి వేసి చెట్టునకుఁ గట్టివైచితిని! కోపము తీరినవెనుకఁ దోడనే పశ్చాత్తాపము కలుగుటచేఁ బరుగెత్తుకొనివచ్చి చూచితినిగాని మఱి యామె నాకగపడలేదు. ఆత్రాళ్లు తెగిపోయినవి. ఆమె చచ్చిపడి పోయినది— ఏకూరమృగములో యామృతకళేబరము నీడ్చుకొని పోయి యుండును. తల్లీ! జగన్మాత యెదుటసత్యము చెప్పుచున్నాను. నేను హంతకుఁడను—స్త్రీహంతకుఁడను—మాతృహంతకుఁడను— నాయీఘోరపాపమునకు నిష్కృతిలేదు.

ఆనం—అంతకోప మేల కలిగినది ? ఎందుకట్లు చేసితివి ?

భీము—ధనముకొఱకు—మాసంఘమునకు మాయన్న రాజుగా నుండెడివాఁడు—మావదినె రాణియై యుండెడిది. అందుచే సంపాదితద్రవ్య మంతయు వారియొద్దనే యుండెను. ఆరహస్యనిధి యాయిరువురకు మాత్రమే తెలియును. ఒకప్పుడొకగోడపైనుండి యుఱికి యాకస్మికముగ మాయన్న మరణించెను. పిమ్మట మా వారందఱు నన్ను నాయకునిగఁ జేసికొనిరి. ఆకారణముచే మాసంఘమునకుఁ జేరినమూలధనము నాకు స్వాధీనముకావలసి యుండెను. మావదినె నడిగితిని—ప్రార్థించితిని—ఆమె యొక్క టేమాట—'లే నెఱుఁగ'నని గో—ఆకారణముచే నాకుఁ గోపము కలిగినది—ఆ కోపముచేతనే యంతపని చేసితిని—తుచ్ఛధనలోభముచే దారుణ పాపకర్మమునకు లోఁబడిపోయితిని.

ఆనం—ఆమె యాచనము నీకెందు కిచ్చినది కాదు ? ఆ మెకు నీకంటెను బరమాప్తు లింకెవ్వ రున్నారు ?

భీము—ఆమె కప్పటికిఁ బదునాలుగేండ్లకుమారుఁ డొకఁ డున్నాఁడు—ఆతన మెట్టయిన నాతనికిఁ జెందింపవలయు నని యామె యుద్దేశము—

ఆనం—నీవాకుమారుని గూడఁ జంపితివా యేమి ?

భీము—లేదు—చచ్చినను నామెయుద్దేశము సఫలముకాఁ గూడదని యెంచి బలవంతముగ నాయన్నకుమారుని నావెంటనే తీసి కొనిపోయితిని.

ఆనం—అతఁ డిప్పుడు మీసంఘమునకు యువరాజుగ నున్నాఁడు కాఁబోలును !

భీమ—నిజముగ మాయన్నబిడ్డ యైనచో నట్లే యుండును. జ్ఞానము వచ్చినతరువాత నాతనికి దొంగతన మనిన నిష్టములేకుండఁ బోయినది—ఆసంగతి నాకుఁ దెలిసిన నేనేమందునోయనుభయ ముచే నాయెదుటఁ బడకుండ నెక్కడకో పాఱిపోయినాఁడు. నాఁటి నుండి నేఁటివఱకును వాఁడు నాకంటఁ బడనే లేదు.

ఆనం—ఆపిల్లవాని కున్నంతజ్ఞానము నీకు లేకుండఁ బోయి నదిగదా !

భీము—దొంగతనము మాకులవృత్తి యగుటచే నప్పటికి నా కిది యంతయధర్మముగ నగపడినది కాదు. కాని యీజీవితము నందు నేనెన్నఁడు నెఱుఁగని స్త్రీహత్యాపాతకమునకొడిగట్టుకొంటిని. ఆదారుణపాపతాపమే యిప్పటికి నాహృదయము నుడికించి వైచు చున్నది.

అప్పు డారమణీమూర్తి భక్తమండలమునందలి స్త్రీసంఘము వంకఁ దనదృష్టులను బ్రసరింపఁజేయుచు “జీవమణీ !” అని పిలి

చెను. తోడనే నలువదియేండ్లయీడుగల యోగినీమూర్తి యామెను సమీపించి వినయవినమితవదనయై నిలువఁబడియెను. ఆమెం జూచి భీముఁ డత్యానందపరవశుఁడై "తల్లీ! బ్రదికి యుంటివా? మరల నాకన్నులఁబడితివా? మాతృదేవతాసాన్నిధ్యమున నాయపరాధముల క్షమింపుము! క్షమింపుము! క్షమింపుము!" అనుచుఁ జటాలున నామెపాదములపైఁ బడియెను.

జీవమణి యాతని లేవనెత్తి "వత్సా! సర్వపాపసంహారిణి యగుజగన్మాత నీనర్వాపరాధములను క్షమియించును." అని చెప్పి యామె యెప్పటివలె యథాస్థానమునకుఁ బోయి నిలువఁబడియెను.

భీము—నిర్విణ్ణుఁడై యచ్చటనే నిలువఁబడిపోయెను—అప్పు డాజగన్మోహనమూర్తియగునాననందాదేవి యాతనిం జూచి "ఆమె యెవ్వరు?" అనియెను.

భీము— నాభ్రాతృభార్య—నాతల్లి—

ఆనం— ఆమె యెట్లు జీవించినదో తెలిసినదా?

భీము— ఇంకను దెలియదా? నావిషబాధ యేదేవతా కటాక్షముచే నుపశమించినదో యామాతృదేవతానుగ్రహముచేత నే యామె మరణబాధయు నుపశమితమైపోయినది.

ఆనం—నీవు హత్యచేయుటమాత్రమే యపరాధ మనుకొను చుంటివి. నీకులవృత్తియగుటచే దొంగతనము నీకుఁ బాపముగఁ దోఁచుటలేదు. అది కేవలము వినేకము. కులవృత్తియైనంతమాత్రమున దొంగతనము పాపము కాకపోదు—జీవులయెడల శారీరకమానసికంబులగుకష్టములఁగల్పించు నెట్టికార్యమైనను హింసయే—అహింసయే పాపము—అదియే యధర్మము—తెలిసినదా? ఇప్పుడే మందువు? దొంగతనము ధర్మమా? అధర్మమా?

ఆనం—ఆమె యౌవనము నీకొఱకు ఇచ్చినది కాదు ? ఆమెకు నీకంటెను బరమాప్తు లింకెవ్వరున్నారు ?

భీము—ఆమె కప్పటికిఁ బదునాలుగేండ్లకుమారుఁ డొకఁ డున్నాఁడు—ఆధన మెట్లయిన నాతనికిఁ జెందింపవలయు ననియామె యుద్దేశము—

ఆనం—నీవాకుమారునిఁ గూడఁ జంపితివా యేమి ?

భీము—లేదు—చచ్చినను నామెయుద్దేశము సఫలముకాఁ గూడదని యెంచి బలవంతముగ నాయన్నకుమారుని నావెంటనే తీసికొనిపోయితిని.

ఆనం—అతఁ డిప్పుడు మీసంఘమునకు యువరాజుగ నున్నాఁడు కాఁబోలును !

భీమ—నిజముగ మాయన్నబిడ్డ యైనచో నట్టే యుండును. జ్ఞానము వచ్చినతరువాత నాతనికి దొంగతన మనిన నిష్టములేకుండఁ బోయినది—ఆసంగతి నాకుఁ దెలిసిన నేనేమందునో యనుభయముచే నాయెదుటఁ బడకుండ నెక్కడకో పాఱిపోయినాఁడు. నాఁటి నుండి నేఁటివఱకును వాఁడు నాకంటఁ బడనే లేదు.

ఆనం—ఆపిల్లవాని కున్నంతజ్ఞానము నీకు లేకుండఁ బోయినదిగదా !

భీము—దొంగతనము మాకులవృత్తియగుటచే నప్పటికి నాకిది యంతయధర్మముగ నగపడినది కాదు. కాని యీజీవితమునందు నే నెన్నఁడు నెఱుఁగని స్త్రీహత్యాపాతకమునకొడిగట్టుకొంటిని. ఆదారుణపాపతాపమే యిప్పటికి నాహృదయము నుడికించి వైచుచున్నది.

అప్పు డారమణీమూర్తి భక్తమండలమునందలి స్త్రీసంఘము వంకఁ దనదృష్టులను బ్రసరింపఁజేయుచు "జీవమణీ!" అని పిలి

చెను. తోడనే నలువదియేండ్లయీడుగల యోగినీమూర్తి యామెను సమీపించి వినయవినమితవదనయై నిలువఁబడియెను. ఆమెం జూచి భీముఁ డమృతానందపరవశుఁడై “తల్లీ! బ్రదికి యుంటివా? మరల నాకన్నులఁబడితివా? మాతృదేవతాసాన్నిధ్యమున నాయపరాధముల క్షమింపుము! క్షమింపుము! క్షమింపుము!” అనుచుఁ జటాలున నామెపాదములపైఁ బడియెను.

జీవమణి యాతని లేవనెత్తి “వత్సా! సర్వపాపసంహారిణి యగు జగన్మాత నీసర్వాపరాధములను క్షమియించును.” అని చెప్పి యామె యెప్పటివలె యథాస్థానమునకుఁ బోయి నిలువఁబడియెను.

భీము—నిర్విణ్ణుఁడై యచ్చటనే నిలువఁబడిపోయెను—అప్పు డా జగన్మోహనమూర్తియగు నానందాదేవి యాతనిం జూచి “ఆమె యెవ్వరు?” అనియెను.

భీము—నాభ్రాతృభార్య—నాతల్లి—

ఆనం—ఆమె యెట్లు జీవించినదో తెలిసినదా?

భీము—ఇంకను దెలియదా? నావిషబాధ యేదేవతా కటాక్షముచే నుపశమించినదో యామాతృదేవతానుగ్రహముచేత నే యామె మరణబాధయు నుపశమితమైపోయినది.

ఆనం—నీవు హత్యచేయుటమాత్రమే యపరాధ మనుకొను చుంటివి. నీకులవృత్తియగుటచే దొంగతనము నీకుఁ బాపముగఁ దోఁచుటలేదు. అది కేవలము వివేకము. కులవృత్తియైనంతమాత్రమున దొంగతనము పాపము కాకపోదు—జీవులయెడల శారీరకమానసికంబులగు కష్టములంగల్పించు నెట్టికార్యమైనను హింసయే—ఆహింసయే పాపము—అదియే యధర్మము—తెలిసినదా? ఇప్పు డే మందువు? దొంగతనము ధర్మమా? అధర్మమా?

భీము—తనువు నొవ్వకున్నను ధనాపహరణముచే నితరుల హృదయములు పరితపించునుగావున దొంగతనము పాపమే యగును. తల్లీ! ఇఁకఁ దెలిసినది. జీవుల నేవిధముచే హింసించినను బాపమే యని బోధపడినది.

ఆనం—హింసయే యధర్మము—ఇఁక ధర్మమును వినుము! ఈ దేవీమూర్తి నీ కేమగును?

భీము—నాతల్లి.

ఆనం—నీతోడిజీవులందఱకు నేమగును?

భీము—ఈ జగన్మాత యందఱకును దల్లియే.

ఆనం—అయినచో జీవులందఱు నీ కేమగుదురు?

భీము—సోదరు లగుదురు.

ఆనం—అట్టిసోదరుల నందఱను నీవు సమానముగఁ బ్రేమింపఁగలిగినప్పుడే నీతల్లి నిన్నుఁ బ్రేమింపఁగలదు.

భీము—ఔనుతల్లీ! నీయనుగ్రహముచే ధర్మమంతయు నా కొక్కమాటలోఁ దెలిసిపోయినది.

ఆనం—పశ్చాత్తప్తహృదయుఁడ వగు నీవు మాతృదేవతా సమక్షమునం దీధర్మసూత్రమును గ్రహించెదవా? ఇంతటినుండి దొంగభీముఁ డనునామమును రోసి దేవీదాసుఁ డనుపేరితోఁ బరోపకారపరాయణుఁడవై చరించెదవా? సర్వసౌభ్రాతృత్వముంజూపుచు మాతృసేవాదీక్షితుఁడ వయ్యెదవా?

భీముఁడానందసంభ్రమముతోఁ బులకీకృతశరీరుఁడై నమస్కారపూర్వకంపితకంఠస్వరమున "తల్లీ! ఈదీనునిపైఁ గటాక్షింపుము! ఈదాసానుదాసుని గరుణింపుము! అనుగ్రహింపుము!" అని పలుకుచు దేవీమూర్తి కెదురుగఁ బడి సాష్టాంగదండప్రణామముం గావించెను.



ప్రిబోధానందస్వామి ♦ ♦ ♦ యాతనిదక్షిణకరమును దీక్షాకంకణాలం

ఇంతవఱకును మౌనముతో నున్న ప్రబోధానంద స్వామి యాతని లేవనెత్తి యాతని దక్షిణకరమును దీక్షాకంకణాలంకృతముగఁ జేసి యనుగ్రహించెను. ఆశుభ సమయమున మరల భక్తమండలము నందంతటను ప్రార్థనాగీతములు వెలువడి పరమేశ్వరీమందిరము నానందప్రతిధ్వనితముగఁ జేసెను —

॥సర్వమంగళమాంగళ్యే శివే సర్వార్థసాధకే
శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోస్తుతే
దేహి సౌభాగ్యమారోగ్యం దేహి మే పరమం సుఖం
దేహి మే దివికల్యాణం దేహి మే విపులాం శ్రియం
లక్ష్మీప్రదానసమయే నవవిద్రుమాభాం
విద్యాప్రదానసమయే శరదిందుశుభ్రాం
విద్వేషివర్గవిజయే తు తమాలనీలాం
దేవీం త్రిలోకజననీం శరణం ప్రపద్యే
ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః

## మూ డ వ ప్ర క ర ణ ము.

ఒకలు తెలియఁ జదివింపు § మన్న యవ్వ
డేమి యయ్యెనో నీగతి § యెఱుఁగవుగద!
యేమి యయ్యెనో నీజాతి § యెఱుఁగవుగద!
యేమి యయ్యెనో నీమత § మెఱుఁగవుగద!
తోడివారలతో నీవుఁ § గూడి మాడి
పాటుఁబాడుము లేచి యీ § పాటకైన!

జాతీయగీతము.

చండాలుఁడగునప్పుడు తనవెన్నుపై గుఱ్ఱపుఁజబుకుదెబ్బచేఁ జీల్చుకొనిపోయినగాయపుఁబచ్చి యింకను నారకుండఁగనే పరోపకారపరాయణుఁడగు రంగఁ డిచ్చినపదికాసులతోడను బిఠాపుర

మునఁ బ్రవేశించి మాంసవిక్రయవ్యాపారము నారంభించెను. ధనము దుష్కర్మముల కుపయోగపడినటుగా సత్కర్మముల కుపయోగింపదు. ఆతఁడు ప్రతిశ వారపుసంతయందును రహస్యముగఁ బశువులను గొని చంపి యామాంసమును విక్రయించి వచ్చినలాభముతోఁ గుటుంబపోషణము చేసికొనుచుండెను. అది తనకులవృత్తియే గదా యనుతాత్కాలికసంతుష్టి యాతనిహృదయమునఁ గలిగియుండుటచేఁ బశువిశసన మాతనికి బ్రహ్మయజ్ఞముకంటెను బవిత్రమైనదిగా నగపడుచుండెను. కాని యాపదకాసుంతోడను బదిపాడిపశువులనుగొని కష్టపడి మేపుకొన్నచో జీవహింసాదోషము నెత్తిపైఁ బడకుండుటయేకాక ఘృతక్షీరవిక్రయములచే నింతకంటెను విశేషలాభము వచ్చు నని బుద్ధిహీనుఁ డగునాతనికిఁ దోఁచినది కాదు —

శ్రీకల్యాణానందస్వామి ప్రతిపట్టణమునకును బ్రతిపల్లికిని బోయి మహోపన్యాసముల నిచ్చి యందందు విజ్ఞానపుస్తకభాండాగారములను, బ్రబోధానందమందిరములను నెలకొల్పుచునే యుండెను. భారతవర్షమునకుఁ బశుధన మెంతటియుపయోగకరమైనదో బోధించి యచ్చటచ్చట గోసంరక్షణశాలలను స్థాపింపఁజేయుచునే యుండెను. సర్వజనసులభంబు లగువిద్యామందిరములఁ గట్టించుచునేయుండెను. దయాళుఁడగు నొకమహీపతినుద్బోధించి యసంఖ్యద్రవ్యసాధ్యంబగు ననాథశిశుసంరక్షణాగారము నాతనిచే నాతని రాజధానియందు వెలయింపఁజేసెను. కాని ప్రపంచమునం దొక్కసారిగాఁ బాపమునకుఁ జోటు లేకుండఁజేయుట యనిన సామాన్యకార్యమా ? ఎంతకాలమునుండియో యధఃపతితమైపోవుచున్న భారతసౌభాగ్యము నొక్కసారిగా యథారూపమునఁ బునరుద్ధారణముం గావించుట యనిన సాధారణకృత్యమా ? అగుఁగాక ! ఇట్లని యెంచి యజ్ఞానులవలె మహాత్ములుమాత్రము తమప్రయత్నములను

విడువఁజాలరు. అట్టిమహాపురుషులింకను జన్మించుచుండుటచేతనే పాతాళమునఁ బడిపోవుచున్న భారతభూమి యిప్పటికినిబరమధామమునకే కన్నెత్తిచూడఁగలుగుచున్నది!

అప్పనికిఁ గ్రమముగాఁ జర్మవ్యాపారమును శిల్పవ్యాపారమును జేయుటకుఁ దగినయవకాశము లభియించెను. అతని కప్పటికి రంగఁడిచ్చిన పదికాసులును బాపము పెరిఁగినట్లుగఁ బదివందలకాసులయ్యెను. బాలికయగుముత్యాలు పశువిశసనమునకు భయపడుచుండుటచే నాతఁ డాపల్లెకు దూరమునందున్న పెరటిలోఁ బశుమాతృకర్మశాల నేర్పఱచుకొనియెను. ముత్యాలిప్పుడు నిమ్నజాతిబాలికాపాఠశాలలోఁ జదువుకొనుచున్నది. ఆపాఠశాల కల్యాణానందస్వామిచే స్థాపింపఁబడినదే. స్వామి యచ్చట నిమ్నజాతిసులభంబగురాత్రిపాఠశాలకూడ సంస్థాపించెను.

ఒకనాఁటిసంతలో నప్పడు చాలఁ బశువులను గొనియెను. అందొక యావు నాలుగైదుమాసముల చూలుగలదియై యుండెను. అది తొలుచూలుగుటచే నాపెయ మిగులనందముగను గోమలముగ నుండెను. ఈఁగవ్రాలినచో జాఱిపోవునట్లుగానుండెను. అమృతధవళవర్ణశోభిత యగునాగో వాదిలక్ష్మివలె నగపడుచుండెను. ఆలక్ష్మింజూచి యప్పనియిల్లాలిమనసు కరఁగిపోయెను. స్త్రీహృదయము మిగులఁ గనికరమైనది. అవును! స్త్రీలే లోకమునకుఁ గన్నతల్లులు! లోకమును ధరించుతల్లులు! తల్లికంటెను దయామయమూర్తి మఱియెక్కడనున్నదను? లోకమునం దీపరమార్థమును గ్రహియింపఁజాలనియజ్ఞానులాత్మద్రోహులైపోవుచుందురు.

ఆమె తనభర్తను బ్రార్థించి యెటో యంగీకరింపఁజేసి యాగర్భిణీధేనువును దనయింట నుంచుకొని మేపుచుఁ దనబిడ్డవలె నెంతే

యోగారాబమునఁ బెంచుకొనుచుండెను. విశ్రాంతిసమయముల యందు బాలిక యగు ముత్యాలుకూడ గోవునకు పిరునుమేఁతయుఁ బెట్టుచు నానందముతోఁ జూచుకొనుచుండెను. దానికొమ్ములకుఁ బూవులను జుట్టుచుండెను. దాని మెడలోఁ బుష్పహారములను వైచుచుండెను. బడినుండి వచ్చి మరల బడికిఁ బోవువఱకు నామూతంగ బాలిక యాగోదేవితోడనే యాడుకొనుచుండెను.

ఆనాఁడొకదొరగారికిఁ జాలాపుష్టమాంసము విందునకై కావలసివచ్చెను. ఆతఁడాసమాచారమప్పనికిఁ దెలియఁజేసెను. అప్పనికిఁ బశువధోద్యోగమునందేకాక శల్యచర్మవ్యాపారములయందుఁ గూడ నాదొరగారిసాహాయ్యము విశేషముగ లభించియుండెను, ఇప్పుడాతనిమాట యెట్లు త్రోసివేయఁగలఁడు; కాని యాకస్మికముగఁ జాలా పుష్టి యెక్కడ దొరకును? ఆకారణముచే నప్పడు తనయింటనున్న లేఁజాలిపెయ్య నుపయోగించి దొరగారికోరికం దీర్ప వలయు నని నిశ్చయించుకొనియెను. పాపమా గంగిగోవున కింకను గండము వదలిపోలేదు కాఁబోలును! తినఁగోరుదొరగారినిరోధము తీవ్రమైనప్పుడు— ఖండించుకటికవానికిఁ గనికారము లేకుడఁ బోయినప్పుడు— సాధుజంతు వగు గోవునకుఁ జావుకంటె గత్యంతర మేమున్నది? అప్పుడు తనభార్యకుఁ దెలియకుండఁగనే యాగోవును వధ్యశాలకుఁ దోలుకొనిపోయెను.

ముత్యాలు బడినుండి యింటికి వచ్చెను; పుస్తకముల నింట నుంచి తిన్నఁగఁ బశుశాలయొద్దకుఁ బోయెను. ఆమె కచ్చట నావగ పడలేదు. గుండెలుకొట్టుకొనుచుండ నాబాలిక తల్లియొద్దకుఁబోయి యావేమైనదని యడిగెను. పాపమామెకుమాత్ర మేమి తెలియును? పనితొందరలో నామె „ పొలములో లేదేమో ? " అనిప్రత్యుత్తర మిచ్చెను ముత్యాలున కంతమాత్రముచేఁ దృప్తికలుగలేదు.

ఆ బాలిక వెంటనే పశుఖండనశాలావైపునకుఁ బరుగెత్తుకొనిపోయెను. అప్పటి కప్పుడే నలుగురు మనుష్యు లాగోవుపాదములను బంధించి పడద్రోసి పట్టుకొనియుండిరి. అప్పడు కత్తి చేతఁ బట్టుకొని దాని గళబంధము నేలించి చంపుటకు సిద్ధముగ నుండెను.

పరుగెత్తుకొని వచ్చుచున్నముత్యాలు దూరమునుండియే యీదారుణప్రదర్శనము నవలోకించి కరుణాకంపితస్వరముతో "నాయనా! నాయావును జంపకుము! నాప్రాణపదమైన గంగిగోవును జంపకుము! చంపకుము! చంపకుము!" అని కేక వైచెను. అప్పడు వెనుదిరిగి చూచి "పొమ్మా! ఇంటికిఁ బొమ్మా! నీవిక్కడ కెందుకు వచ్చితివి?" అని గద్దించి పలికెను. ఆబాలిక నేసందులనుండి చూచినదో — ఆమెమధురస్వర మెంతలో విని తనను వాలు పట్టఁగలిగినదో గాని పాపము మృత్యుముఖమునఁబడిపోవుటకు సిద్ధముగ నున్న యాగోవు భయసూచకస్వరముతో "అంబా!" యని మొక్కయఱచెను. ఆయార్తస్వరశ్రవణమున గుండె చెదరి బాలిక యగుముత్యాలు పిడుగుపడినట్లై నిలిచినచోటనే కూలఁబడిపోయెను.

అప్ప డాసంగతిని గ్రహింపకుండఁగనే యతిత్వరితముగఁ దన కార్యమును నిర్వహించుటకు ద్యుక్తుఁడయ్యెను. అంతలో బలిష్ఠుఁడగు నొకయావనపురుషుఁడు పరుగెత్తికొనివచ్చి యాయుధసహితమగు నప్పనిచేతిని బట్టుకొనియెను. ఆతనిం జూచి భయపడి సహాయపరిచారకులు దూరముగఁ దొలఁగిపోయిరి. అప్పడు నిర్విణ్ణుఁడైపోయెను. ఇప్పు డాతనిచేయి పట్టుకొన్నవా రెవ్వరు? ఒకప్పు డాతనికి మహోపకారముఁ గావించిన రంగఁడే!

రంగఁ డతిశీఘ్రముగ నప్పనిచేతిలోనికత్తిని లాగికొని గోవును బంధించిన త్రాళ్ళనన్నిటిని నిమిషములోఁ గోసివైచెను. అప్పు

డేమియును మాటాడఁజాలకపోయెను. ఆవు చటాలున లేచిపరుగెత్తి పోవుచు దూరమునఁ బడియున్నబాలిక యగుముత్యాలుం జూచి యచ్చట నిలువఁబడిపోయెను. అప్పుడు రంగఁ డప్పనిఁజూచి ,,ఓరీ! కాసునకుగతిలేక కడుపుమంటచే దీనుఁడవై తిరుగుచున్న యీనాఁడు నీకుఁ దగిలినదెబ్బకు నీప్రాణము లెట్లు కొట్టుకొనిపోయినవో యని జాలిపడి నేను నీకుఁ జేసినయుపకారము నీవిధముగ నిష్కరుణుఁ డవై నోరెఱుంగని యెన్నియో ప్రాణములను దీయుటకై యుపయోగ పఱచుచుంటివా? సామాన్యపరిచయముగలపశువు ప్రాణములకు భయపడి పాఱిపోవుచున్నసమయమునఁగూడఁ బడిపోయిననీబిడ్డను జూచి కాలుగదపఁజాలక నిలువఁబడిపోయినది! చూడుము! బలవంతమగుప్రాణాపాయస్థితియం దున్నపశువును జూచి పెంచినప్రేమచే నీపసిబిడ్డకూడ గుండెచెదరి కూలఁబడిపోయినది! హరిహరీ! నీకా పశువునకున్నజ్ఞానము లేకపోయినది! ఆపసిబిడ్డ కున్నజ్ఞానము లేకపోయినది! ఎంతయపాత్రుఁడ వైపోయితివి!'' అని మూఁదలించి పలికెను.

తనయేకపుత్రిక పడిపోయిన దనుమాట విన్నతోడనే యప్పనిగుండె చెదరిపోయెను. శూలాఘాతములవంటి రంగనిమాట లాహృదయమును మఱింత కలఁచివైచెను. అందుచే నప్పు డాతఁ డున్మత్తునివలె రోఁజుచుఁ దనతనయ పడిపోయినదిక్కునకుఁ బరుగెత్త నారంభించెను. రంగఁ డాతని ననుసరించి పోయెను.

అప్పుడు పోయి చూచునప్పటి కాతనితనయ యొకమహాత్ముని యొడిలో నచేతనయై పడియుండెను. అప్పని కన్నులు చెదరిపోయెను. ఆతఁడు శోకగద్గదస్వరముతో ,,తండ్రీ! నాబిడ్డను బ్రదికింపుము!'' అని యాతనిపాదసాన్నిధ్యమునఁ బడిపోయెను. రంగఁడు విభ్రాంతుఁడైపోయెను! ఆమహాపురుషుఁడు కల్యాణానందస్వామి!

ఆస్వామియిప్పు డామాతంగకన్యకను దనయొడిలోఁ జేర్చుకొని చే తనోద్దీపకములగు నుపచారములఁ గావించుచుండెను!

కల్యాణానందస్వామి దుఃఖముచేఁ దల్లడిల్లిపోవుచున్న యప్ప నిం జూచి సాంత్వనస్వరముతో "భయములేదు! జీవహింసం జూచి సహింపఁజాలక యీపసిబిడ్డ కోమలహృదయము చెదరిపోయినది. మఱియేమియును భయములేదు. కొలఁదిసేపటిలో నీమె తేరుకొనఁ గలదు" అనియెను.

అప్పుడు రంగఁడు తత్తరముతో "స్వామీ! పీడ కలుగ కుండ, గాలిసోఁకకుండ, దృష్టితగులకుండ రక్షగా నీపదకమును మా యమ్మ నా మెడలో వైచినది. ఈపిల్ల యిప్పుడు జడిసికొని యుం డవచ్చును. ఈపదకమునుధరించినచో నట్టిబాధ నివారణముకాఁ గలదు" అని చెప్పుచుఁ దనకంఠమునందున్న పదకమునుదీసి యాబా లిక కంఠము నలంకరించెను.

స్వామి తనకమండలూదకముల నాబాలిక మోమునదమ్మిపైఁ జిలుకరించుచుండెను. కొంతసేపటి కాబాలికకుఁ దెలివి వచ్చినది. ఆమె కన్నులఁదెఱచి చూచి తాను స్వామియొడిలో నుంటి నని తెలిసికొని సిగ్గుచేఁ జటాలున లేచి తండ్రియొద్దకు వచ్చెను. అప్పుడు పరమానందముతో నామెను గౌఁగిలించుకొని "అమ్మా! భయము లేదు. నీప్రాణములను నిలిపినయామహాత్మునకు నమస్కరింపుము!" అనియెను.

ఆబాలిక స్వామికి నమస్కారముచేసి నిలువఁబడియెను. అప్పుడు రంగఁ డామెం జూచి "చిన్నారీ! భయము లేదు. నీమెడలోని యీపదకము నటె యుంచుకొనుము! ఎప్పుడును దీసివేయవలదు!" అనియెను. బాలిక తనమెడలోని బంగారుపదకముం జూచుకొని సిగ్గుచేఁ దలవంచుకొని తిర్యక్ప్రసారితంబు లగుమధురవీక్షణము

లతో రాఁగని దిలకించెను. ఆచూపులలోని భావమును రాఁగఁడు గ్రహించెనో లేదో కాని మహాత్ముఁడగు స్వామికిమాత్ర మంతయు ను దెలిసిపోయెను.

అప్పుడు చేతులు జోడించుకొని స్వామివద్దకుఁ దరిగి కృతజ్ఞతాసూచకముగ "స్వామీ! మీయనుగ్రహముచే నాబిడ్డ బ్రతికినది! నేను బ్రదికితిని! మీదాసానుదాసుఁడను! మీయుపకారమును నాజీవితమున్నంతవఱకు మఱవను. నేఁడు మీదర్శనము లభియించుటచేఁ గృతార్థుఁడ నైతిని!" అనియెను.

స్వామి — ఇదియొక కారణముగఁ బరమసాధువగు నొక యావు చావుతప్పిపోవుటచే మనమందఱము కృతార్థులమే. నీవీయావునే చంపివైచినచో నీబిడ్డగుండెపగిలి మరణించియుండును. పశ్చాత్తాపదుఃఖముచే నీవును మరణించియుందువు. ఈదారుణవార్తనాలకించి నీభార్యమాత్రము జీవింపఁగలదా? జీవహింసాదోషము తుదకు నీకుటుంబము నింతవఱకుఁ దెచ్చియుండును. కాని, యాదృష్టవశముచే నాపద తప్పిపోయినది.

అప్ప - ఔను తండ్రీ! నాపూర్వపుణ్యవశముచే నాబిడ్డ నాకు దక్కినది.

స్వామి—పుణ్యమున కంతశక్తియున్నదని తెలిసిన నీకుఁ బాపమునకు భయమేల కలిగినదికాదు?

అప్పని కాపాదమస్తకమును బ్రకంపించిపోయెను. తాను చేసినదంతయు మహాపాపమే యను యాకస్మికముగ నాతనియంతరాత్మకుద్బోధనము కలిగెను. అప్పారాఁడు భయవిహ్వలుఁడై "స్వామీ! దాసానుదాసుఁడను! నాసర్వాపరాధములను క్షమియించి నన్నుఁ బాపకూపమునం బడిపోకుండ నుద్ధరింపుము!" అని యాతని పాదములపైఁ బడియెను.

స్వామి యాతని లేవనెత్తి "వత్సా! నీవు దారుణవ్యాపారముచే ధనవంతుడవైతివి—ఇఁక నైనను దయావంతుఁడవై పశ్చాత్తప్త హృదయముతో ధర్మాచరణమునకుఁ గడంగనిచో నీపాపమునకు నిష్కృతి లేదు" అనియెను.

అప్ప - స్వామీ! నేను మహాపాపాత్ముఁడను! నాకెట్లైనఁ దరణోపాయమును బ్రసాదింపుఁడు!

అప్పడు రంగఁడప్పనిం జూచి "ఇంతటినుండి యెన్నఁడు నిట్టిపాపమును జేయనని నీస్వామిపాదములనుముట్టి ప్రతిజ్ఞచేయుము!" అనియెను.

అప్పడు భయసంభ్రమములతో మరల స్వామిపాదములపైఁ బడి "స్వామీ! నీపాదములసన్నిధి — పరమేశ్వరునిసన్నిధిని— పంచభూతములను సాక్షులుగా మనఃపూర్వకముగఁ బ్రతిజ్ఞచేయుచున్నాను. నేనిఁక నాజీవితమునం దెన్నఁడును జీవహింస చేయఁబోను! చేయఁబోను! ముమ్మాటికిని జేయను" అనియెను.

స్వామి యాతని లేవఁదీసి "వత్సా! పరమేశ్వరుఁడు నిన్నాశీర్వదించుఁగాక! నీవేస్థలమునఁ బశుమారణకర్మాగారమును స్థాపించితివో, యాస్థలమునందే గోసంరక్షణశాలను నెలకొల్పి జీవితము సార్థకముగఁ జేసికొనుము. అందుచే నీపాపము శాంతింపఁగలదు! నీవు కృతార్థుఁడవు కాఁగలవు!" అనియెను.

అప్ప—స్వామీ! మీపాదసాక్షిగ నింతటినుండి యటే చేసెదను. ఇదిమొదలు నాధనజీవితములను సాధుజంతుసంరక్షణమునందే వినియోగించెదను.

స్వామి— మంచిది! నీకు శుభమగుఁగాక! కరుణామయియగునీబిడ్డ నీబిడ్డయైపుట్టుటచేత నీవు ధన్యుఁడవైతివి.

ముత్యాలు సిగ్గుచేఁ దలవంచుకొనియెను. రంగఁడు పరమానందభరితుఁడయ్యెను. కరుణార్ద్రహృదయుఁడగు రంగనికెంతయో యానందము—నవనవోన్మేషయౌవనవిరాజితయుఁ గుసుమకోమలియు నగు నా బాలిక నిజముగ నానందస్వరూపిణియే యైయుండెను.

ముత్యాలు స్వామికిని రంగనికిని నమస్కరించి సెలవు గైకొని తనయావునొద్దకుఁ బోయెను. తనప్రాణపదమైయున్నయావు దయామయుఁడగు రంగనిమూలమునఁ దనకుఁ దక్కినదిగదా యని యామెసంతోషము! ఆమె తిరిగితిరిగి చూచుచు మెల్లమెల్లగ నాయావును దనయింటికిఁ దోలుకొనిపోయెను.

నిశితాయుధముకంటెను నిష్ఠురవచనమే హృదయమున బలవంతముగ నాఁటుకొనియెను. కఠినహృదయమును గూడ మృదులవచనము కరఁగించివైచినది. భవపర్వతములఁ బ్రకంపితములుగఁ జేయఁజాలినపాపప్రవాహమిప్పుడు ప్రబోధదూర్వాలేశమాత్రము చేతనే బంధింపఁబడిపోయెను.

కంటకమును గంటకముచేతనే వదలింపవలయు నని తలంచి కల్యాణానందుఁడు గావించినప్రయత్న మీవిధమున సఫలమయ్యెను!



## నాలుగవ ప్రకరణము.

అవనతోన్నతగతుల కా ♦ కాభిరతులె
కారణము; లవి పరాన ♦ కాలగండుఁ
గష్టసుఖదాయకము లవి ♦ కాంచి కాని
కొఁడు కొలఁదిబాటుఁ దెగఁగోయ ♦ నెంచఁగలఁడె!

సంవత్సరాది— హారావళి

భారతరావునకుఁ గ్రైస్తవపాఠశాలయం దుపాధ్యాయపదము లభించినది. అందుచే నాతఁ డిప్పుడు తనకుటుంబముతోఁ గాకినాడయందుఁ బ్రవేశించి యుండెను. సరస్వతి యిదివఱకే తారకాపురమును వదలిపోయినది. ఇప్పుడు సత్యవతి కూడ నచ్చట లేకుండఁబోయినది. అందుచేఁ దారకాపుర మిప్పుడు తననామమునకుఁ దగినట్లు కళాహీనమై యసురపురము వలెనే యుండెను. చంచలరావొక్కఁడే యగుటచే నాతఁడు కాకినాడలో భారతరావున్నయింటియందే కలసి యుండెను. నిరంతరపరిచయముచే నాతఁడు కొలఁదికాలములోనే యాకుటుంబములోనివాఁడుగఁ బరిగణించిపోయెను. సరళస్వభావయగు సత్యవతి తనయన్నతో మాటాడినట్లుగనే యాతని సంతోషము కొఱకుఁ జంచలరావుతోఁ గూడఁ జనువుగ సంభాషించుచుండెను. అప్పుడప్పుడు వారుమువ్వురును గలసి యనేకవిషయములఁ గూర్చి చర్చించుకొనుచుందురు. సత్యవతియును భారతరావును, బుద్ధిశక్తియం దొకరినొకరు మించినవారు. చంచలరావు తెలివికలవాఁడేగాని యాతఁడెల్లప్పుడును గూడ విషయ మెట్టిదైనను వాదప్రాబల్యమును బట్టియే వాదించుచుండును. అందుచే నాతఁ డొక్కప్పుడు భారతరావుపక్షమునను మఱియొక్కప్పుడు సత్య

పరిషత్తునను జేరుచుండును. ఆనగరమునం దప్పుడప్పుడు జరుగు చుండునుపన్యాససభలకుఁ దఱచుగ వారు మువ్వురును గలసియే పోవుచుందురు. ఆత్మకర్తవ్యమున కత్యాదరము కలుగనంతవఱకుఁ దనయన్న సంతోషముకొఱకే తనజీవితమును వినియోగింపవలయు నని సత్యవతి నిశ్చయించుకొనియెను. భారతరావు కూడ సత్యవతి మనసు నొవ్వకుండఁగనే సంచరించుచుండెను.

నేఁటిసాయంకాలమున భారతరావును సత్యవతియును నొక గదిలోఁ గూర్చుండి విద్యావిషయమున మాటలాడుకొనుచుండిరి. క్రమముగ రాత్రి యెనిమిదిగంటలైపోయెను. అంతలోఁ, జంచలరావు కూడ నచ్చటికి వచ్చెను. భారతరావాతనిం జూచి “ఇంత యాలస్యముగ వచ్చితివేమి ?” అని ప్రశ్నించెను.

చంచ—సనాతనధర్మమందిరమునఁ గల్యాణస్వామి యను నొకసన్యాసియుపన్యాసమిచ్చుచుండుటచే నేనాసభకుఁ బోయితిని. పూర్తియగువఱకును వదలి వచ్చుటకు బుద్ధిపుట్టినది కాదు.

సత్య—ఆస్వామియుపన్యాస మంతమనోహరముగనున్నదా?

చంచ—ఆ! వినితీరవలయును. ఆతఁడు సనాతనధర్మపద్ధతులంగూర్చి చెప్పుచున్నప్పుడు—అహింసాధర్మమును బోధించుచున్నప్పుడు—అఖిలసోదరత్వమును సిద్ధాంతీకరించుచున్నప్పుడు సభ్యులందఱును దన్మయులై చిత్రప్రతిమలవలె నైపోయిరి. అంతటిమహాత్ముని నేనిదివఱకుఁ జూడలేదు. ఆతని ప్రతివాక్యమును సర్వమతసమ్మతముగ నుండెను.

అని చంచలరావాయుపన్యాససారమంతయును వారికిఁ దెలియఁజేసెను.

అప్పుడు భారతరావాతనిం జూచి “సంఘసంస్కారమునుం గూర్చి యేమియును జెప్పలేదా ?” అని ప్రశ్నించెను.

చంచ — చెప్పకేమి ? అహింసాధర్మమునందును, సర్వసోదర త్వమునందును గావలసినసంస్కారముల నెన్నిటినో నిరూపించి యున్నాఁడు.

భార — అతిబాల్యవితంతువివాహసంస్కరణములం గూర్చి చెప్పలేదా ?

చంచ — వివాహధర్మము లన్నియు సమగ్రముగఁ దెలిపి యున్నాఁడు — కాని ప్రత్యేకసంస్కరణములంగూర్చి వేఱుగ నేమి యును జెప్పలేదు.

సత్య — ఇంకేమి చెప్పవలయును ? ఉపన్యాససారమంత యును వినియే యుంటిమిగాదా ? భారతవర్షమును స్వర్గధామముగఁ జేయుటకుఁ గావలసినసంస్కరణము లన్నియు నందిమిడియేయున్నవి. ఇంకను జెప్పవలసిన దేమున్నది ?

భార — సంఘాభివృద్ధికి మూలకారణమగువితంతువివాహ సంస్కరణమే వక్తవ్యాంశము కాకపోయినచో నాయుపన్యాసము వలన నింకేమిప్రయోజన మున్నది ?

చంచ — ఔను ! యోచించిచూడఁగా నాలోపమున్నట్లగ పడుచున్నది. విమర్శనీయాంశమగువితంతువివాహముంగూర్చి చెప్ప వలసినదే —

సత్య — సనాతనధర్మమునకును వితంతూద్వాహమునకును సంబంధ మేమున్నది ?

భార — లేకేమి ? అదియును సంఘశ్రేయమునకు సాధనమే కాదా ?

చంచ — అదియే ముఖ్యసాధనము.

సత్య — కావచ్చును ! కాని త్రికాలాబాధ్యములై సర్వశ్రే యోదాయకంబు లగుధర్మములు సనాతనధర్మములు. ఇఁకఁదాత్కా లికముగఁ బ్రత్యేకసంఘశ్రేయోదాయకంబులుగ నగపడుచున్నవి

మాత్రి మైచ్ఛికధర్మములు. సనాతనధర్మములు శాసనములవలె సర్వజనులును బ్రితిపాలింపఁదగినవిధాయకధర్మములు—ఐచ్ఛిక ధర్మములో— అవివారివారియిష్టానుసారముగ నాచరింపఁదగిన యను కూలధర్మములు! అవశ్యానుష్ఠేయంబు లగువిధాయకధర్మము లను నిరూపించుట పెద్దలధర్మము గాని—యథేచ్ఛాపరిగ్రహణీయం బు లగునను కూలధర్మములను శాసించుట వారిపని గాదు.

భార—ఊఁ! అటైనచో ననుకూలధర్మము లనర్థకము లని మా నీయభిప్రాయము?

సత్య—ధర్మమైనప్పుడు నిరర్థక మెట్లగును? భౌతికసుఖ లోభముచే సామయికముగ నాచరించుచున్న యీవితంతూద్వాహ ధర్మమిహపరసాధక మగుసనాతనవివాహధర్మమువంటి దెట్లగును?

భార—అట్లయినచో నతిబాల్యవివాహము సనాతనధర్మమే కాఁబోలు!

సత్య—అట్లని స్వామి చెప్పినట్లు లేదే!

భార—చెప్పకపోయిన నేమి? చేయుచునేయున్నారు కాదా? అందుచేతనే వితంతూద్వాహములు కావలసివచ్చినవి. ఆ వశ్యకధర్మము నేర్పఱచుకొనవలసి వచ్చినది!

సత్య—అన్నా! ఎంతమాట! లోకము తప్పు చేయుచున్న దని చెప్పి ధర్మమునుసంస్కరించుట ధర్మమా? లోకమును సంస్క రింపవలయును!

భార—అనంత మగులోకమును సంస్కరించుట యచిరకాల ములో సాధ్యమగునా? అంతవఱకును దురాచారదుఃఖపీడిత లగు ననాథలగతి యేమికావలసినది?

సత్య — కర్మఫలము ననుభవింపవలయును. లోకమునం దెన్నికష్టములు లేవు — వానినన్నిటి నెవ్వఁడు తీర్పఁగలఁడు ? లోకమున శోకమనుమాటయే లేకుండ నెవ్వఁడు చేయఁగలఁడు ?

భార — తల్లిదండ్రులు చేసినతప్పుచేఁ జిన్నతనమునందే విగతభర్తృక లగుననాథ బాలిక లట్టే యామరణదుఃఖితలై యుండవలసినదా ?

సత్య — అట్టితల్లిదండ్రులతప్పుచేతనే చిరకాలభాగ్యవతులై సుఖించుచున్నసతీమణులమాట యేమిచెప్పెదవు ?

భార — సుఖము ననుభవింపవచ్చునుగాని కష్టము ననుభవించుట దుస్సహముకాదా ?

సత్య — వితంతుబాలిక స్వయముగనే వివాహము చేసికొనుననుకొందము ! ఆభర్త తప్పక చిరజీవియై యుండు ననునిశ్చయ మెక్కడ నున్నది ? మరణము సహజమైనప్పు డట్టిదుఃఖములను దప్పించుకొనుట కవకాశ మెంతమాత్రమును లేనేలేదు.

భార — ఎప్పుడో కష్టము వచ్చుననియెంచి సుఖేచ్ఛను వదలుకొనవలసినదేనా ? పురుషులు పునర్వివాహము చేసికొనుట లేదా ?

సత్య — పురుషులైననేమి, స్త్రీలైననేమి ? కష్టముల ననుభవించుటకు సిద్ధపడినవారే కాల్పనికసుఖంబుల నభిలషించుచుందురు.

భార — సుఖము నభిలషించుట జీవధర్మము కాదా ?

సత్య — పరమధర్మమునకును భౌతికసుఖమునకును సంబంధ మెంతమాత్రమును లేదు. పరస్పరభిన్నప్రకృతు లగునారెండు నెన్నఁడు నొక్కచోఁ గలసియుండఁజాలవు ? అట్టిసుఖమునకే యాశపడినవా రాధర్మమును వదలుకొనుచుందురు — ఆపరమధర్మమునే యవలంబించువా రట్టిసుఖమును ద్యజించుటయే సత్యసుఖముగ భావించుకొనుచుందురు — అన్నా ! ధర్మము ననుసరించి మనమున శప

లయినగాఁ ధర్మ మెన్నటికిని మనయిష్టము ననుసరించి మెలంగునది కాదు— సుఖభ్రాంతిచే స్వేచ్ఛానుకూలముగ నాచరించుచున్న కృత్యము లన్నియును ధర్మములేయగునా? అట ధర్మతత్త్వజ్ఞులగు ప్రాజ్ఞు లెవ్వరంగీకరింతురు? ఈ యిచ్ఛాకృతధర్మములు సనాతనధర్మముగఁ బరిగణింపఁబడదు. స్వామిహితదక్షు లెట్లట కర్తవ్యబద్ధు లగుమన మెంతవారము.

భారతరావు మఱి మాటాడఁజాలకపోయెను. ఆతఁడు తనలో "ఈ మెప్పివర్తనములయందుఁగాని కృత్యములయందుఁగాని హృదయమునందుఁగాని మానవసాధారణస్వభావ మెంతమాత్రమైన నున్నట్లగపడుట లేదు." అని భావించుకొనియెను. ఈ సంభాషణము నాలకించుచున్న చంచలరావు క్రమముగ హృదయము కలఁగిపోవుటచేఁ బరిక్లాంతుఁడై పడకకుర్చీపైఁ జేరగిలఁబడిపోయెను. ఆతఁడు యాశామార్గమునకుఁ బురోభాగము దుస్సహకంటకగుల్మావృతమై యభేద్యపర్వతపంక్తులచే నాక్రమింపఁబడిపోయినట్లాతనికిఁ దోఁచెను. ఆయధైర్యముచే నాతఁడు దస్సుస్సుఁడై దీర్ఘశ్వాసములను విడువ నారంభించెను.

భారతరావాతని వంకఁ జూచి "అదియేమి యట్లున్నావు?" అనియెను.

చంచ — కొంచెము అస్వస్థతగా నున్నది. జ్వరమువచ్చినట్లున్నది. తలనొప్పిగాఁగూడ నున్నది.

భార — నేఁటియెండ మిగులఁ దీవ్రముగ నున్నది. నాకుఁ గూడ నించుక యస్వస్థతగ నుండుటచేతనే యింటికిఁ బెందలకడ వచ్చివేసితిని. ఇప్పుడు తొమ్మిదిగంటలైనది నీకు వేడిచేసియుండును. భోజనము చేయుదము లెమ్ము.

చంచ—ఆఁకలి యగుట లేదు. తినవలె ననుపించ్చ యేమి యును లేదు. నన్నీరాత్రి కిట్లే పుండనిమ్మా ?

అప్పుడు కరుణార్ద్రహృదయయగుసత్యవతి తత్తరముతోఁ జంచలరావుకు సమీపించి యాతని చెక్కిలిపైఁ జేయుంచి చూచెను. ఆమెకోమలకరపల్లవమునకు నగ్నిస్పర్శమైన ట్లయ్యెను!!

## అయిదవ ప్రకరణము.

అలలు జనియించి నీటిలో కలిసిపోయె
పల్లవులు గూడ జిగిరించి వాడిపోయె
చంచలాలత లప్పుడె వర్తించిపోయె
నెక్కడనొ గానబడకుండె జుక్కగుంపు
తారలన్నియు నంతలో నంతరించె.

ఆశ—నిరాశ.

చంచలరావునకు జ్వరము వదలుట లేదు. రెండుదినము లయ్యెను. మూఁడుదినము లయ్యెను. పదిదినము లయ్యెను. ఇంకను జ్వర మట్లే యుండెను. పాపము భారతరావాతనికొఱకు కెన్నియో పాటులఁ బడుచుండెను. ఎందఱనో వైద్యులను దీసికొనివచ్చి మందు లిప్పించుచుండెను. శారీరకగుణవైపరీత్యముచేఁ గలిగినస్వాభావిక వ్యాధియైనచో మందులకు శాంతింపవలసినదే. కాని చంచలరావు వ్యాధి యట్టిది కాదు. అది మానసికస్వభావవైరుధ్యముచే జనియించినది. మనోవ్యాధికి మందెచ్చట నుండును?

చంచలరావు సత్యవతి నెట్లయినఁ బెండ్లియాడవలయు నని యాశపెట్టుకొని యుండెను. భారతరావుకూడఁ దన చెల్లెలి నెటులైన నాతనికిచ్చి పెండ్లి చేయవలయు ననియే యెన్నియోవిధములఁ బ్రయత్నించుచుండెను. సత్యవతిహృదయ మేమాత్రము నొచ్చినను భారతరావు సహింపలేఁడు. మంచిమాటలచేతనే యామె నామార్గమునకుఁ ద్రిప్పవలయు నని యాతనియుద్దేశము. ఏసమయమునం దెట్లు పరిశీలించినను సత్యవతిహృదయ మాతని కందుటయే లేదు. అన్యాపదేశముచే నెంతప్రబోధించినను నామెకు నచ్చుట లేదు. ఆపద్ధతియే యామెకు సమ్మతముగ లేనట్లగపడుచున్నప్పుడు భారతరావామెతో నామాట యెటు చెప్పఁగలఁడు? ఎంతచనవుగ నున్నను జంచలరావుమాత్ర మామెతోఁ దనయభీష్టముంగూర్చి యెట్లు మాటలాడఁగలఁడు. సమయము ననుసరించి యామెహృదయమును మరలించి ప్రబోధింపవలయు నని యిరువురును గూడ నిరీక్షించుచుండిరి.

మొన్నటిసంభాషణముఁ బట్టి సత్యవతి దృఢాభిప్రాయము విస్పష్టముగఁ దెలిసిపోయెను—భర్తృవియోగదుఃఖమునుమాత్రమే సత్యవతి యెఱుంగును. పాపమామెకు భర్తృసంయోగసౌఖ్యముంగూర్చి యెంతమాత్రమును దెలియనేతెలియదు—మఱియు నామెకు సుఖదుఃఖములు దైవాధీనము లనియు, దైవదత్తము లగు సుఖదుఃఖము లనుభవించి తీరవలసినవియే యనియు దృఢవిశ్వాస మున్నది. ఇంతేకాక సుఖవాంఛయే దుఃఖ మనియు, దుఃఖనిరసనమే సుఖమనియు నామె యనుభవముచే బాగుగ గ్రహియింపఁగలిగెను. అందుచేతనే యామె యంతటిదృఢనిశ్చయురాలై యుండెను.

ఇంక నామెహృదయమును మరలించుట దుస్సాధ్యమని భారతరావు నిరుత్సాహపడిపోయెను. చంచలరావునకుఁగూడ నుత్సాహభంగ మయ్యెను. అతని యాశ కవకాశము లేకుండఁబోయినది. అదియే యాతని మనసునకు బాధ—అదియే యాతనికింతటిప్రాణసంకటమునకుఁ గారణ మైనది. ఆతని కప్పుడు తనపూర్వవృత్తాంత మంతయును దలఁపునకు వచ్చుచుండెను. అనంగతు లాతనికిఁ దలఁచుకొనుటకుఁగూడ దుస్సహము లై యుండెను. ఆతనిభవిష్యజ్జీవిత మంతయు నంధకారబంధుర మైపోయిన ట్లగపడుచుండెను. తనజీవితము నిష్ప్రయోజన మైపోయినదని యాతని హృదయము పరితపించుచుండెను. ఏదేనొకసంస్కరణము గావించి యామూలమున దృష్టాంతపూర్వకముగ లోకమునకు దారిచూపవలయు నని యాతని యుద్దేశము. అందువలనఁ బేరుసంపాదింపవలయు నని యాతని కోరిక. ఇన్నిటికి మూలమైనసత్యవతి నెట్లయినను బెండ్లియాడవలయు నని యాతని యాశ. ఆయాశ ఫలించుట కవకాశము లేకుండఁబోవుచున్నది. అయినను నాతఁడు దానిని ద్రెంపుకొనఁజాలకుండెను. అందుచేతనే యాతని కామనోవ్యాధి! ఆమనోవ్యాధిచే నాతఁడు కృశించి పోవుచుండెను.

చంచలరావునకుఁ దీవ్రజ్వరము వదలుట లేదు. అప్పుడప్పుడాతఁడు జ్వరాతిరేకముచేఁ బరాకుమాటలాడుచుండెను. "అది మూఁగది ! అదిగో ! మూఁగది ! మూఁగది" అని యాతఁడు మంచముపైఁ దూలిపోవుచుండెను. "దొంగలు ! దొంగలు !" అని కేకలు వైచుచుండెను. "స్వామి సత్యమే చెప్పినాఁడు !" అని లోలోపల గొణుగుకొనుచుండెను. "రాజరత్నము ! రాజరత్నము!" అని యస్పష్టముగఁ బలుకుచుఁ గన్నులఁ దేలవైచుచుండెను. ఆ యసంబద్ధప్రలాపములం జూచి సన్నిపాతలక్షణము లేమో యని

సమీపమునందుండి యుపచారములఁ జేయుచున్న సత్యవతి మిగుల భయపడియెను. భారతరావుకూడ నట్టే దిగులుపడుచుండెను. ఆజ్వర మొకప్పుడు శాంతముగ నుండును—మఱియొకప్పుడు తీక్ష్ణముగ నుండును. అందుచేఁ జంచలరావునకుఁ దెలివియును మఱపుగ నుండెను.

పిఠాపురములో భూలోకధన్వంతరియగు నొకసన్యాసి యుండెననియు నాతనిమూలమున నెందఱో వ్యాధిబాధితులకు నిష్కృతి లభియించుచున్నదనియును భారతరావునకుఁ దెలియవచ్చెను. అందుచేఁ జంచలరావు నచ్చటకుఁ బంపి యౌషధము నిప్పింపవలయు ననియాతఁడు నిశ్చయించుకొనియెను. ఆతఁడు చంచలరావునొద్దఁ గూర్చుండి మెల్లగా “ మిత్రమా ! ఇచ్చటి యాంగ్లేయవైద్యము నీకేమియును బని చేసినది కాదు. పిఠాపురమున నాయుర్వేదఘన వైద్యుఁ డొకఁ డున్నాఁడఁట ! పరమహంసక్రియచే నాతఁడు మహారోగములను నిమిషములో నెట్టివ్యాధినైనను కుదుర్పఁగలఁడు. నీవక్కడకుఁ బోయి మందు తీసికొన్నచో బాగుగ నుండును. స్థానమును వైద్యమునుగూడ మార్చుటవలన నీకు స్వస్థత కలుగవచ్చును ” అనియెను.

చంచలరావు హీనస్వరముతో “ అంతశ్రమ యెందుకు ? క్రమముగా నదియే యుపశమించును ” అనియెను.

భార—అట్లుకాదు. ఎన్నిమందు లిచ్చినను జ్వరము వదలుట లేదు. దినదినమునకుఁ గృశియించిపోవుచున్నావు. ఇట్లే యూఱక చూచుచున్నచోఁ బ్రమాదము కదా ?

చంచ—అక్కడకుఁ బోయినచో నాకెవ్వరున్నారు ? పాపమిచ్చట సత్యవతి యెట్టికష్టమును లేకుండ నాకెల్లవిధముల నుపచారములు చేయుచున్నది. అక్కడ దిక్కేమున్నది ?

సత్యవతి జాలితో, 'మాయన్నయొకటియు నీవొకటియునా? నీకారోగ్యముకలుగుటయే నాకానందము. నేనుగూడ నీతోవచ్చి సేవించుచు యారోగ్యము కలుగువఱకును నీయొద్దనే యుండెదను' అనెను.

చంచలరావున కించుక జీవితాశ కలిగినది. భారతరావున కొకింతయూఱట కలిగినది. అప్పుడాతఁడు చంచలరావుతో, 'మిత్రమా! నీ కష్టముకలుగదు. సత్యవతి నీకుపచారములు చేయుచుండును. సెలవుదినములలో నేనుగూడవచ్చి నీయొద్దనేయుండెదను' అని సమాధానపఱిచెను.

భారతరావు తల్లిదండ్రులు చంచలరావును దమబిడ్డవలెనే చూచుకొనుచుండుటచే వారుగూడ నాతనికి ధైర్యము చెప్పి యా ప్రయాణమునకు సమ్మతింపఁజేసిరి. చంచలరావు మాఱుమాట చెప్పలేదు.



## ఆ ఱ వ ప్ర క ర ణ ము

ఏరాత్రి యామమ్ము ♦ లిటు పుట్టినారము
నారాత్రిఁ జనిగిట్టు ♦ నంచును దెలిసి
ఏకొండ కొమ్మపు ♦ లిటు పిడవారము
నాకొండకే వాఁడు ♦ నంచును దెలిసి
ఏగాలి నీమబ్బు ♦ లిటు కూడినారము
నాగాలిచే నీరు ♦ నంచును దెలిసి
నాసహవాసత భవ్యం ♦ బుసు మించి
క్షణభంగురం బైన ♦ స్వసుఖంబు నమ్మి
యత్మ యగుఖంబు ♦ లనుభవించుటకు
కోరకొంటివిధియేటి ♦ దుర్బుద్ధి నీకు!

[illegible]

పిఠాపురమునందే కాక యానగరమునకుఁ జుట్టుపట్టుల నున్న పట్టణములయందేమి, పల్లెలయందేమి యావైద్యశిరోమణి యగు సన్యాసి నెఱుంగనివా రెవ్వరును లేరు. కాని, యాతఁ డెవ్వఁడో యెచ్చటివాఁడో యాసంగతులుమాత్రము స్పష్టముగ నెవ్వరికిని దెలియవు. ఆతఁడు సంసారమును ద్యజించివచ్చినసన్యాసి యని కొందఱును, సన్యాసాశ్రమమునఁ జరియించుచున్న సంసారియని మఱికొందఱు నాతనింగూర్చి యనేకు లనేకవిధములుగఁ జెప్పుకొనుచుందురు. మంచిగనైనను జెడ్డగనైనను సత్యము నెఱుంగనివారే చెప్పుకొనుచుండుటచే మనకు వారియేమాటలను విశ్వసించుటకైనను నవకాశము లేదు. ఏమైననేమి — వ్యాధిపీడితులగువార నేకు లెచ్చటెచ్చటనుండియో వచ్చి యాతని నాశ్రయించి మందులను దీసికొనుచుందురు.

ఆమహాత్ముఁడు సామాన్యముగ ధర్మవైద్యమునే చేయుచుండును. అనేకధర్మకార్యములనుగూడఁ జేయించుచుండును. తగినవారైనయెడల విలువగలమందులను వారిచేఁగొనిపించి యౌషధముల మున వారిరోగములను గుదుర్చుచుండును. అట్టివెలగల మందులకై రోగులు విశేషశ్రమపడి ప్రయత్నింపనక్కఱలేకుండ నవి దొరకుచోటు సన్న్యాసియే వారికిఁ జెప్పుచుండును. అతనిశాంతవచనములు హృదయాకర్షణముం గావించుచుండును. అతనిసౌమ్యరూపము మనోరంజకమై యుండును. జబ్బు కుదురనివారి కాతఁడు మీకింకను గర్మపరిపక్వము కాలేదని చెప్పి వారిని మెల్లగఁ బంపివేయుచుండును. రోగము కుదిరినవా రాతని బూజించి వీడ్కొని యానందముతో నిండ్లకుఁ బోవుచుందురు. అందుచే నాతనిభేషజప్రతిభ సుప్రసిద్ధమై యుండెను.

భారతరావు పిఠాపురమునందలిపేటలో నొకప్రత్యేకగృహము నద్దెకుఁ దీసికొని చంచలరావు నందుంచెను. చంచలరావు సన్న్యాసియొద్ద మందుఁ దీసికొనుచుండెను. సత్యవతి యాతని కుపచారములు చేయుచు నచ్చటనే యుండెను. భారతరావు శుక్రవారమురాత్రికివచ్చి సోమవారమునాఁటికి మరలఁ గాకినాడకుఁ బోవుచుండెను. సన్న్యాసి మందులచేతనో సత్యవతి నిత్యసన్నిహితయై యుపచారములుచేయుటచేతనో క్రమక్రమముగఁ జంచలరావునకు స్వస్థత కలుగుచుండెను. అచ్చటినీరునుగాలియు నాతని కారోగ్యకరములుగా నున్నవని యెంచి భారతరావాతనిచే మఱియొకనెలదినములు సెలవుపెట్టించి సంపూర్ణారోగ్యము కలుగువఱకుఁ జంచలరావచ్చటనేయుండుట కేర్పాటు గావించెను.

చంచలరావున కారోగ్యము కలుగుచున్నది. అతనిప్రాణము లేమూర్తిపై నాధారపడి యున్నవో యాతనిహృదయమునకుమూర్తి

యనుగ్రహము నభిలషించి నిరంతర మీమూర్తిని ధ్యానించుచుండెనో యా ప్రేమికమూర్తి సత్యవతి నిత్యము నాతనికన్నులయెదుటనే మెలంగుచున్నది! ఆకరుణామూర్తి యాతని దనప్రాణములకంటెను బ్రియముగ నెంచి యుపచారములు గావించుచున్నది. ఆతని కది పరమానందముగ నుండెను. ఆయానందముచేతనే యాతని మనోవ్యాధి యుపశమించినది. కాని, చంచలరాఘవమను కీ ప్రేమ మతి యొకవ్యాధి తటస్థించినది. ఆవ్యాధిచే నాతనిహృదయము నిరంతరమును జలించిపోవుచుండెను. ఆవేగమును సహించుట యాతని కతిదుర్భరముగ నుండెను. ఆతని బాహ్యశరీరమునం దారోగ్యమగపడుచున్నను నంతరంగమునం దనిర్వాచ్యమగు నాందోళన మగుచునే యుండెను.

చిరకాలమునుండి తనహృదయమును వేధించుచున్న తనమనోరథమునంతను స్పష్టముగఁ గరుణార్ద్రహృదయ యగు సత్యవతికి విన్నవింపవలయునని యాతఁ డావేగపడుచుండెను. అనాలోచితముగ నొక్కసారిగాఁ దనయుద్దేశమును దెలిపినచో సుకుమారహృదయయగు సత్యవతి యెంతనొచ్చుకొనునో యని యాతఁడు శంకించుకొనుచుండెను — తనసుఖముకొఱకామె యెంతటికష్టమునైన సహించినది. తనప్రాణముకొఱకామె నిజప్రాణములను వినియోగించినది. అట్టిప్రేమికమూర్తియు, నిరంతరపరోపకారపరాయణయు నగు సత్యవతి కోమలహృదయము నొచ్చునటు మెలంగ సాహసించుట యెంతటికష్టము! ఈసంగతి తలంచుకొన్నప్పు డాతని మతి చలించిపోవుచుండెను. ఆచంచలహృదయమును గుదురుపఱచుకొనుట యాతని కతిదుస్సహముగా నుండెను.

వికలహృదయుఁ డగునాతనివదనమునుండి యవ్యక్తముగ నప్పు డప్పుడసంబద్ధములగువాక్యములు వెలువడుచునే యుండెను.

అవి యాతనిచంచలహృదయమునందలి చంచలోద్దేశముల నస్పష్టముగఁ బ్రకటించుచునే యుండెను. కాని, నిర్మలహృదయ యగు సత్యవతి వాని నంతగాఁ బాటించుటలేదు. ఆమెమౌనమువలన నాతఁ కాశవర్ధిల్లుచునే యుండెను.

రాత్రి తొమ్మిదిగంటలైనది. వేసవికాలమగుటచేఁ జంచలరా వింటిముంగిటఁ జల్లగాలికై యొకపడకకుర్చీపైఁ గూర్చుండియుండెను. సత్యవతియును భోజనముచేసి వచ్చి యాతని సమీపమున నరఁగుపైఁ గూర్చుండి కొంచెవ్వవ తిరిపు వెలుఁగున శ్రీమద్రామాయణమును జదువుకొనవలయు నని యనుకొనుచుండెను.

అప్పుడు చంచలరా వామెం జూచి కృతజ్ఞతాసూచకస్వరముతో ''సత్యవతీ! నీవు దినము తయు నాకొఱకు శ్రమపడుచునే యుంటివి. అయినను జాలరాత్రివఱకును రామాయణము చదువుకొనుచుందువు. అధికపరిశ్రమచే నీకెక్కడ జబ్బుచేయునో యని నాకు భయముగనున్నది'' అనియెను.

సత్యవతి మధురస్వరముతో ''శ్రీమద్రామాయణము సర్వజీవ శ్రమనివారణౌషధముకాదా?'' అనియెను.

చంచ—దయామయి వగునీవు నిజముగ నాపాలిటికి శ్రీమద్రామాయణమ వైతివి.

సత్య—ఎంత టి!

చంచ—అట్లనవలదు! నీసహాయమువలననే నేనుజీవింపఁగలిగితిని.

సత్య—ఇందు నేఁజేసిన దేమున్నది? ఇంచుకసాహాయ్యమే కాదా? పరమేశ్వరుఁడు నన్నను గ్రహించినాఁడు.

చంచ—పరమేశ్వరానుగ్రహామును నేనభిలషింపలేదు. నీకొఱకు—నీ త్యసందర్శనముకొఱకు—నీ రంతరసహవాసముకొఱకు నేను జీవించియుంటిని!

సత్య—నీహృదయము నేనెఱుఁగుదును. నీకు నాయందట్టి యవ్యాజప్రేమ యున్నది.

చంచ—కాని, నీహృదయముమాత్రము నాహృదయము వంటిదికాదు.

సత్య—నీవు నావంటివాఁడవయినచో నాహృదయము నీ హృదయమువంటిది కావచ్చును.

చంచ—మనయిరువురిహృదయములు నొక్కటియై యుండ వలయునని నాకోరిక—

సత్య—భావములొక్కటియైనచో నట్లే కావచ్చును.

చంచ—నీవు నన్నేభావముతోఁ బ్రేమించుచుంటివో నాకు బోధపడుటలేదు.

సత్య—మన మిరువురము పరమేశ్వరుని సంతానములమే యనియును, ప్రేమైకస్వభావముగల జీవసముదాయములో వారమే యనియు నిన్నుఁ బ్రేమించుచున్నాను.

చంచ—అట్లయినచో నేను నిన్నుఁ బ్రేమించునట్లు నీవు నన్నుఁ బ్రేమించుట లేదనుకొనియెదను.

సత్య—ఎందుచేత?

చంచ—నాకున్నకోరిక నీకు లేదు కావున—

సత్య—నాకుఁ గోరఁదగిన దేమున్నది?

చంచ—నేనును నీవంటిజీవినే గావున నీవు నాప్రాణములను నిలుపుటకుఁ గోరనక్కఱ లేదా?

సత్య—ఆవిషయమునందు నాలోప మేమున్నది?

చంచ—నీకు నాప్రాణములను నిలుపవలయు ననుకోరిక యున్నచో నీవు నీయుద్దేశమును మార్చుకొనవలయును. నాప్రాణ రక్షణముకొఱకు నీవు నన్నుఁ బెండ్లియాడవలయును. మన యిరువురి

హృదయములు నావిధముగ నేకముతై మనయిరువురి జీవితములు నట్లే కములైనప్పుడుగాని నాకీలోకమున జీవించుట కాధార మేమియును లేదు. ఆకోరికచేతనే నేను నిన్నుఁ బ్రేమించుచుంటిని! ఆయాశ చేతనే నేనింకను జీవించియుంటిని.

చంచలరావింతటియవివేకియై నిర్భయముగఁ దనయెదుట నిట్లుమాటలాడునని సత్యవతి యనుకొనలేదు. నీచాభిలాషియగు నాతనివాక్యములామె కనహ్యములుగఁ దోఁచెను. అప్పు డామె తీవ్రస్వరముతో "నీనడవడికిఁ దగినట్లు నీవు మాటలాడుటలేదు. కాని నీహృదయము నీపేరునకుఁ దగినట్లే యున్నది. నీనీచమోహ వికారము నిర్మలప్రేమ యని భావించి నేనే పొరపాటుపడితిని. నా పాతివ్రత్యస్వభావము నెఱిఁగియుండియు నీవు నీచాతినీచునికంటెను నికృష్టముగ సంభాషించుచుంటివి. నీవేమో విద్యాధికుఁడ వనియు నా సోదరునకు మిత్రుఁడ వనియు, సోదరసమానుఁడవనియు భావించితిని గాని యింతటి యధమాధముఁడ వని నేననుకొనలేదు." అని గద్దించి పలికెను.

చంచలరావు మొగమింత చేసికొని హీనకంపితస్వరముతో "సత్యవతీ! నన్ను నిందింపకుము! నీదయాపాత్రుఁడ నగు నాపైఁ గోపింపకుము! నీచమోహమో, నిగాఢప్రేమమో తెలియదుగాని నాకు నీయెడల నేదియో యనిర్వాచ్యమగునిచ్ఛయొకటి యున్నమాటమాత్రము సత్యము. అదియే నిమిషనిమిషమునకును నాకోరికల వర్ధిల్లఁజేయుచున్నది! నాయాశల నంతములేకుండఁజేయుచున్నది. ఆపరితాపముచేతనే నాహృదయము వేగిపోవుచున్నది. నాసర్వాంగకములును దహించుకొనిపోవుచున్నవి! ఈప్రాణములు నీయాశలముననే నిలిచినవి. ఆకారణముచే నివి నీయధీనములైయున్నవి. నీచేతితో నిలిపిన యీప్రాణములను మరల నీచేతులతోనే తీసివేయుఁ

దలంచినచో నేనేమి చేయఁగలను? ప్రేమామృతహృదయవగు నిన్నుఁ బ్రేమార్ద్రహృదయముతోఁ బ్రార్థించుచున్నాను! ఈ నీనున్నిబరి గ్రహించినను బరిత్యజించినను నీవే యధీశ్వరివి! నిగ్రహానుగ్రహములు నీచేతిలోనున్నవి. ఏమనుకొన్నను నీవే నాహృదయేశ్వరివి— నాజీవితేశ్వరివి—నీపవిత్రమైకవదనమునుండి కూడ నట్టియమృతమధుర వచనము నొక్కసారి యాలకించి నీపాదసన్నిధానమునఁ బ్రాణములు విడిచిపెచినను నాకుఁ బరమానందమే—' అని వేఁడుకొనుచుఁ జంచలరావు తత్తరముతోఁబోయి ప్రకంపితహస్తములతో సత్యవతి చేతులను బట్టుకొనియెను. సత్యవతి యాతనిచేతులను ద్రోసివైచి చటాలునలేచి నిలువఁబడి ధీరగంభీరస్వరముతో "పాపాత్మా! నీ కింతటిదుర్బుద్ధి యున్నదని నేననుకొనలేదు. నీకు నేఁజేసినయుపకారము పామునకుఁ బాలువోసినటుగ నైనది! నేనొంటిగ నుంటినని యా నీకింతటిసాహసము! ధర్మములేదా? దైవములేదా? దురాత్మా! దూరముగ నుండుము.'' అని ధిక్కరించి పలికెను.

చంచలరావున కాటంక మధికమైనకొలఁదిని మోహముంచుకొనిపోవుచుండెను. ఆతఁ డప్పుడు తనసంగతి తెలియుట లేదు. ఎదుటిసంగతియును దెలియుట లేదు. ఆతఁడీప్రపంచమునే మఱచిపోయెను. చంచలరావు దీనస్వరముతో "సత్యవతీ! నాప్రాణములు తల్లడిల్లిపోవుచున్నవి. ఈ దాసానుదాసుని నీపాదసేవకునిగనను గ్రహింపుము.'' అని ప్రార్థించుచు నున్మత్తునివలెఁ జంచలుఁ డామెను బలవంతముగఁ గౌఁగిలించుకొనఁబోయెను. ఆ త్రిక యగు సత్యవతి కెవ్వునఁ గేకవైచి యవశయై పడిపోయెను.

అంతలోఁ బ్రాకారద్వారము బలవంతముగఁ దఱచిన చప్పుడయ్యెను. ఆ నిమిషములోనే యరఁటిచెట్లపొదులనుండి యతిలోకమోహనశృంగారమూర్తి యగునొకరమణీమణి యాకస్మిక

ముగ నాతనియెదుటకువచ్చి నిలువంబడియెను. ఆమెం జూచినతో డనే చంచలరా పులికిపడి మతిభ్రష్టు వలె నొక్క పరుగునం బోయి దొడ్డితలుపు తెఱచుకొని ఆగాఢాంధకారములో నెండిపోయిన యేటికాలువంబడి పాఱిపోయెను. ఆసుందరీమూర్తికూడ నామె పోయినమార్గమునే యనుసరించిపోవుచు నాయంధకారములో నదృ

ఆసుందరీమూర్తి విలాసభవనమునందలి మధుమతి మరిడమ్మ గుడిలోని పూవులమ్మ. ఆమె యిచ్చటి కెట్లు వచ్చినది? నిర్భయముగనొకయువతీమణిని బలవంతముచేయుటకు సాహసించియున్న చంచలరా వారమణీమణిం జూచినంతమాత్రముననే భయపడి పాఱిపోవుటకుం గారణమేమి? ఏమైననేమి మధుమతి మానవతీశిరోమణి యగుసత్యవతిపాలిటి కాపన్నివారణమంత్రాధిష్ఠాన దేవత వలె నాకస్మికముగ సాక్షాత్కరించినది. ఆకారణముచేతనే సత్యవతికిప్పుడు తటస్థించినమహావిపత్తు తప్పిపోయినది. సాధుస్వభావులను సర్వేశ్వరుం డీవిధముగనే సంరక్షించుచుండును.

సత్యవతి దారుణభయావేశముచే మూర్ఛితయై పడియుండెను. ఇంకను నామెకుం దెలివి కలుగలేదు. ఇంతలో మఱియొక రమణీమూర్తి యాయింటం బ్రవేశించెను. ఆమెకూడ నిరువురుపురుషు లుండిరి. వారు మెల్లమెల్లగ సత్యవతి నెత్తికొనిపోయి వెలుపలనున్నబండిపై నెక్కించి యెచ్చటికో తీసికొనిపోయిరి. ఈస్త్రీమూర్తి మధుమతి ననుసరించి వచ్చినదా? సత్యవతి నెత్తికొనిపోవుటకై వచ్చినదా? ఈరమణీమూర్తి యెవ్వరు?

☘

# ఏడవ ప్రకరణము.

[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]

సంవత్సరాది— పారాశరి

దేవగురుఁడు సింహరాశియందుఁ బ్రవేశించెను. గోదావరీపుష్కరము వచ్చినది. ఆపుణ్యకాలమునఁ బావనగౌతమీసలిలావగాహనంబులచేఁ బాపకళంకనిర్మూలనముం గావింపవలయుననుసదుద్దేశముతో దేశదేశములనుండి యనేకప్రజలు రాజమహేంద్రవరనగరమునఁ బ్రవేశించి యుండిరి. ఆనగర మప్పుడు ప్రత్యేకప్రపంచమువలె నుండెను. ధర్మదేవత యచ్చట నివసించియుండెను. అధర్మదేవత యచ్చటఁ దాండవమాడుచుండెను. ఆనగరమునం దప్పుడు సుభిక్షదుర్భిక్షముల కన్యోన్యజయాపజయంబు లగుచుండెను. పాపపుణ్యములకుఁ బరస్పరసంఘర్షణము లగుచుండెను. రోగారోగ్యములకు నిరంతరసంకులసమరము జరగుచుండెను. సుఖదుఃఖములు రెండు నొండొరుల నాక్రమింపవలయునని ప్రయత్నించుచుండెను. ఆపుణ్యసమయమునం దాపుణ్యక్షేత్రమునకుఁ బుణ్యాకాంక్షితులై పుణ్యాత్ములును బాపాత్ములునుగూడ వచ్చియుండిరి. దేవతలును రాక్షసులునుగూడ మానవాకారముల దాల్చి విచ్చేసియుండిరి.

ఇట్లు రాజమహేంద్రవరమునకు నూతనత్వ మేమియు నగపడుట లేదు. అప్పటికి నిప్పటికి నొక్కరీతిగనే పాపపుణ్యాసమ్మిశ్రితమై యుండెను. గోదావరీనదియందలి యమృతజల మెంతపవిత్రమైనదియో విలాసభవనమునందలి మదిరారస మంతటి యపవిత్రమైనది. ఆపుణ్యనదీగర్భమునందలి మృదుతరంగనినాదము లెంతటిసుధామధురము లైనవో యాపాపగృహాంతర్భవనములయందలి రహస్యాలాపనిస్వనములంతటివిషతిక్తము లైనవి. ఆదివ్యనదిక నెందఱు సేవింతురో యానీచమందిరము నంతకంటె నధికులే యాశ్రయించుచుందురు. అట్లయ్యును, సర్వకలికలుషసంహారిణి యగుగౌతమీమాత నాశ్రయించి యుండుటచేతనే నవనాగరికాలమునాటికి రాజమహేంద్రవరనగరము తనపురాతనౌన్నత్యమును నామమాత్రముచేనైనను నిలుపుకొనఁగలిగి యుండెను.

గోదావరీతీరమంతయు నిసుకవేసినరాలకు ననంతటిజనసంఘముచేఁ గిక్కిరిసి యుండెను. కొందఱు ఫలపుష్పములను గోదావరీమాత కర్పించుచుండిరి. కొందఱు భక్తికొలఁదిని, శక్తికొలఁదిని రాగినాణెములను బంగారునాణెములనుగూడ సమర్పించుచుండిరి. కొందఱు కుంకుమ, పసుపు పండ్లు మొదలగునవి పంచిపెట్టుచుండిరి. కొందఱు దంపతీస్నానములు చేయుచుండిరి. కొందఱు తీర్థవిధులఁ దీర్చుకొనుచుండిరి. దానములును, బూజలును లెక్కలేకుండఁ జరగిపోవుచుండెను. ఆజనసమ్మర్దమువలన స్నానముచేసినవారు వెలుపలకు రాఁజాలకుండిరి. స్నానార్థులకుఁ జోటు దొరకుట లేదు. భూకలుషసంహారిణు లగుపుణ్యతరంగిణు లన్నియు నీపుష్కరపుణ్యకాలమునం దాత్మపాపవిమోచనమునకై వచ్చి గౌతమీనిర్మలసలిలావగాహనములం గావించి పోవుచుందు రని పురాణప్రసిద్ధ

ము. అట్టిమహాపాపభయవినాశిని యగుగోదావరిని సేవించుటకై భరతఖండమునందలి యచ్చటచ్చటి ప్రజలో వచ్చియుండిరి.

కాలు నిలుపుట కచ్చటను జోటులేదు. పురపాలకులు ప్రజాసౌఖ్యమునకు వలయు ప్రయత్నములను జేయుచుండిరి. అందందుఁ బాకలను బందిళ్ళను వేయించి తీర్థప్రజకు నిలువనీడలఁ గల్పించు చుండిరి. వచ్చువారు వచ్చుచుండిరి. పోవువారు పోవుచుండిరి. రేయుంబవ లొక్క-టేజనసమ్మర్దముగనుండెను.

ఒకనాఁటిరాత్రి తొమ్మిదిగంటలవేళఁ బేదరాలగునొకయువతి పసిబిడ్డను జంకఁబెట్టుకొని విలాసభవనమునకు సమీపమందున్నయొకపెద్ద యింటియొద్దకుఁ బోయి ద్వారమునొద్ద సంకుచితభావముతో నిలువఁబడి దీనస్వరముతో, ' అమ్మా! ఈపసిబిడ్డకుఁ గొంచె మన్నము పెట్టెదరా ? ' అని యడిగెను. తోడనే లోపలినుండి యొకస్త్రీకంఠస్వరముతో, ' భోజనము లైపోయినవి. అన్నము లేదుపో ! ' అనువాక్యములు వినఁబడియెను. పాప మాపేదరాలు ఖిన్నురాలైపోయెను. పొద్దుటినుండియుఁ బసిబిడ్డ యన్నము లేక యేడ్చుచుండెను. కన్నకడుపు చుమ్మలు చుట్టుకొనిపోవుచుండెను. అన్నము లేకుండఁ దాను జచ్చుటకైన సహింపఁగలదుగాని యాఁకలిచే నేడ్చుచున్నపసిబిడ్డను జూచుచుఁ దల్లి యెట్లోర్చియుండఁగలదు ? ఇంకొకసారి యడిగినచో నాగృహిణి హృదయము కరఁగునేమో యనుచుమాయాశ యామెను బ్రేరేపించెను. అప్పు డామె మరల, ' అమ్మా ? నేనాఁకలికైట్టయిన సహించుకొని యుండఁగలను. ఈపసిబిడ్డకుఁ బొద్దుటినుండియు నన్నముదొరకినదికాదు. ఎంతయున్న నంతియే చాలును. తల్లీ ! దయయుంచియీబిడ్డను బ్రదికింపవా ? ' అని బ్రతిమాలి యడిగెను.

అప్పు డాగృహిణి కోపముతో "ఒకసారి చెప్పినఁ దెలియదా? పోపొమ్మా!" అని కసరుచు జటాలునఁ దలుపులు మూసికొనియెను.

అప్పు డాయరఁగుపైఁ గూర్చుండియున్న యొకపురుషుఁ డాదీనాలాపములు నాలకించి కనికరముతో నాపేదరాలిం జూచి "తల్లీ! ఈయింట నన్నము లేనిమాట నిజమే. కొంచె మన్న ముండఁగా నేనిప్పుడే తింటివైచితిని. అయ్యోతల్లీ! నీవించుక ముందుగ వచ్చినచో నీబిడ్డ కాయన్నములోనిదైనఁ గొంచెము పెట్టఁగలిగియుందునే!" అని నొచ్చుకొనియెను.

అప్పుడాపేదరాలు శోకగద్గదస్వరముతో "అయ్యా! నేనెన్నఁడు నెవ్వరి నడిగినదాననుగాను. బిడ్డయేడుపు వినలేక పట్టెఁడన్నమునకై యిట్లడిగికొనవలసివచ్చినది." అనియెను.

ఆదీనాలాపముల కాపురుషునిహృదయము నీరైపోయెను. ఆతఁడప్పుడు తనలో "పాపము! బ్రతికిచెడినయిల్లాలు—పసిపాపకుఁ బట్టెఁడన్నమైన దొరకినది గాదు" అని కటకటపడుచు గుబాలున నరఁగుపైనుండి యురికి శీఘ్రగమనముతో విలాసభవనముపైపునకు వెడలిపోయెను.

ఆపుష్కరదినములలోఁ బుణ్యస్రవంతిని యగుగోదావరీదేవి యెట్లుసముత్సాహతరంగితయైపోవుచుండెనో యట్లే విలాసమందిరముఁ గూడ విలాసతరంగితమైపోవుచుండెను. పురుషుఁడు నిస్సంశయముగ నామందిరమునఁ బ్రవేశించి సోపానములనధిరోహించి మేడమీఁదికిఁ బోయెను. ఆతని నెవ్వరు నడ్డగింపలేదు. మేడపైఁ బట్టపగలుగ దీపములు వెలుఁగుచుండెను. అందొకగదిలో రత్నకంబళముపైఁ గూర్చుండి వేంకటేశ్వరుఁడు వారసుందరీచతుష్టయసహితుఁడై పేకయాట నాడుచుండెను. ఆతనిపార్శ్వమునందున్నమదిరాకల

శము లానీపకాంతులలో మెఱసిపోవుచుండెను. అందఱయొద్దను మధురభక్ష్యభాజనములు దొంతులుగ నమర్పబడి యుండెను. ఆ యాట పట్టిదికాదు! కాసులతోఁ బందెము! వేంకటేశ్వరుఁడు తాగుచుఁ దినుచు నాసుందరీమణులతోఁ గలసియాడుచు నోడుచున్నకొలఁదిని నుత్సాహముతోడనే కాలక్షేపము చేయుచుండెను. ఆవిలాసరంగమునందాతనికి రెండవప్రపంచ మగపడుట లేదు.

ఆసమయమునకు సరిగ నాపురుషుఁ డామందిరమునఁ బ్రవేశించెను. వేంకటేశ్వరుఁ డాతనిం జూచి యులికిపడియెను. ఆతఁడు రంగఁడు! అందుచేతనే వేంకటేశ్వరుఁ డదరిపడియెను. అప్పుడు రంగఁడు తీవ్రస్వరముతో, "నాకిప్పు డేమైనఁ గొన్నిభక్ష్యములను బెట్టవలయును. నేనతిశీఘ్రముగ నొకచోటికిఁ బోవలయును!" అనియెను.

వేంకటేశ్వరుఁడు కోపఘూర్ణితవదనముతో "రంగా! సమయాసమయములఁ దెలిసికొననక్కఱలేదా? ఎప్పుడు నొక్కటే మాదిరియా? ఇప్పుడు గాదు పొమ్ము!" అని కసరిపలికెను.

రంగఁడు వికటస్వరముతో "చచ్చిపోవుచున్నప్పుడు సమయాసమయపరీక్షణములా! చాలుఁ జాలు! పడఁతులయొద్ద నుంటినని యా భయములేనట్లు పలుకుచున్నావు?" అని గద్దించుచు బలవంతముగ నచ్చటనున్న భక్ష్యపుబళ్ళెరములలోఁ జేతికి దొరకినవన్నిటిని దీసికొని యతిత్వరితముగ నాతఁడు వచ్చినత్రోవనే బయలుదేరి పోయెను.

వేంకటేశ్వరుఁ డప్పు తీసికొనవలయునని యచ్చటకు వచ్చి యుండెను. నాఁటిరాత్రి సానులతోడి యాటలోఁ జేతిలోని కాసులు చెల్లిపోవుట యాతనికంత విచారముగ లేదు కాని యాఁడువాండ్ర యెదుటఁ దనమరియాద పోయినదని యాతఁడు చాలవిచారించెను.

ఏమి చేయఁగలఁడు? అంతటికి సిద్ధమైయున్న ప్రబలమూర్ఖుఁ డగు రంగని నెవ్వ రడ్డుకొనఁగలరు?

రంగఁడతివేగముగఁ దన కాపురా లగపడిన యింటియొద్దకుఁ బోయి చూచెను. ఆమె యచట లేదు. ఆతఁడు నిరుత్సాహముతో నిట్టూర్పులు విడుచు "అయ్యో! చెప్పనైనఁ జెప్పినది గాదు. దొరకునో దొరకవో ముందుగ నేమియుఁ జెప్పదు అని యనుకొంటిని. పాప మామె మహాతురాలై యెచటికో పోయియుండును. కాని యామె యింక మఱియొకయింటికిఁ బోయి యున్నదనుటఁ జాలదు. ఈరాత్రి తిండి లేకున్నఁ బాపమాబిడ్డ యేమైపోవునో కదా!" అని చింతించుచు నాతఁడా గోదావరియొడ్డున నాజనసంఘమునందామెను వెదకికొనుచుఁ బోవుచుండెను.

## ఎనిమిదవ ప్రకరణము.

పావకీవపవిత్రి సం ॥ దర్శనమునఁ
పావకీవ తేజోమయ ॥ దర్శనమునఁ
పావకీవ స్వాస్థ్యప్రద ॥ దర్శనమునఁ
పావకీ వానుబోధని ॥ దర్శనమున
మాత! పాపసంఘంబు ॥ మాయమయ్యె
జనని! నాయంధకారంబు ॥ సమసిపోయె.

మాతృగీతము —

గోదావరియొడ్డున నొక చెట్టుక్రిందఁ బరుండి యొకవృద్ధురాలు శూలనొప్పిచే బాధపడుచుండెను. ఆమెసమీపమున దీనవదనయై యొకయువతి కూర్చుండి యుండెను. ఆమెనడుమనున్న పసిబిడ్డ

విడువకుండఁ బోరుపెట్టుచుండెను. ఆయువతి యాబిడ్డ నూరడింపఁ జాలక కన్నీరుపెట్టుకొనుచుండెను. అప్పుడావృద్ధురాలు మూలుగు మానివైచి 'తల్లీ! చంటిబిడ్డకు గుప్పెడన్నము దొరకినది కాదా? పాపపురోగముచేఁ బడిపోవుటచే నీవంటిదానిచే నన్న మడిగింపవలసివచ్చినది. ఆగర్భశ్రీమంతుఁడగు నీబిడ్డ యాకలిచే నేడువవలసినదా? అమ్మా! ఎటువంటిదానికి కట్టికష్టములు వచ్చినవి!' అని యుమ్మలింపఁదొడంగెను.

యువతీమణి శోకవిహ్వలయై 'అత్తా! ఏజన్మమునం దెట్టి పాపము చేసితినో యీజన్మమునం దనుభవింపలేననిఁ దప్పునా? పూటకు గతిలేని యీనిర్భాగ్యురాలికి బిడ్డకూడ నెందుకు?' అనియెను.

వృద్ధు—తల్లీ! ఆఁకలిచేఁ దూలిపోయిననీయొద్ద గుక్కెఁడు పాలైనను లేవు. ఏడ్పుటచే బిడ్డకు నోరెండుకొనిపోవుచున్నది! ఎట్లో మెల్లగ నేనైనను బోయి గుప్పెడన్న మెవ్వరినైన నడిగి తెచ్చెదను.

యువ—నీవు పెద్దదాన వైతివనియు నిన్నుఁ బూవులలోఁ బెట్టి పూజింపవలయు ననియు నేనాశపడితిని. కాని నాకాయదృష్టము పట్టినది కాదు. కూర్చుండి తినలేనిముసలితనమునందుఁగూడ నీకు నాకొఱకే కష్టపడవలసివచ్చినది. ఇంత బాధపడుచున్నప్పుడుకూడ నీకు నాకష్టముతప్పుట లేదు. ఈస్థితిలో నీ వెక్కడకుఁ బోఁగలవు?

వృద్ధు—అక్కఱలేదు. మెల్లఁగఁ బోయి వచ్చెదను. వెన్నెల వచ్చుచున్నది. ఈసమీపమునం దెవ్వరినైన నడిగి కొంచెమన్నము తీసికొనిరాఁగలను. ఇది యూరుగాని యడవి కాదుగదా! అందఱును రాక్షసులే యుండరు. చంటిబిడ్డపేరుచెప్పినచో నెవ్వరికైనను గడుపుగరఁగకపోదు.

అని యావృద్ధురాలటనుండి మెల్లగ లేచి సమీపమునందలి తీర్థవాసులు నివసించియున్న పందిళ్ళవైపునకుఁ బోయెను. క్రమముగా వెన్నెల వచ్చుచుండెను. ఆయవ్వయొడిలో నిబిడ్డ యేడ్చియేడ్చి సొమ్మసిలిపోయెను. పాపము తల్లి దీనవదనముతో నాబిడ్డపైఁ గన్ను పెట్టుకొని యుండెను. ఆయువతీమణి యెవ్వరు? ఆనవాలు పట్టుటకవకాశమైన లేకుండ నెంతలో నెట్లుమారిపోయినది! ఆమె పాపము మనయనసూయయే. అన్నమును దేఁబోయినవృద్ధురాలు వంటలక్కయగు జోగమ్మ. అవస్థ మారిపోవుటచే నాకారముకూడ మారిపోయినది.

వేంకటేశ్వరుం డవివేకియై బలవంతముగఁ బరిత్యజించినతరువాత నగతికయగు ననసూయకుఁ బాపము జోగమ్మయే తల్లియయ్యెను; దక్కయ్యెను. జోగమ్మకు మఱి యెట్టిస్వాస్థ్యమును లేదుగాని జేగురుపాడునందొక యిల్లుమాత్రమున్నది. ఆమె యనసూయ నచ్చటకుఁ దీసికొనిపోయి కన్నబిడ్డవలెఁ బోషించుచుండెను. జోగమ్మ యనిన నాయూరివారందఱకును మిగులగౌరవమున్నది. అదియే యామెకున్న ధనము. అంతమాత్రముచే దినములు గడచుట యెట్లు? ఆమె యారోగ్యమున కనుకూలమగు రీతిని బోషించుటకు ధనము కావలసియుండెను. పాపము జోగమ్మయొద్దమాత్ర మేమున్నది? ఆమెయొద్దనున్న కొలఁదిద్రవ్యము వారిపోషణముక్రింద నాలుగైదు నెలలలో వ్యయమైపోయెను. తరువాత నిఁక నేమున్నది? తుదకనసూయయొద్దనున్న యలంకారములే గతియయ్యెను.

అనసూయ యచ్చటనే ప్రసవించి యీచిన్నిబిడ్డను గనెను. ఆకుమారున కిప్పుడు రెండవయేఁడు వచ్చినది. ఎప్పటికైనను వేంకటేశ్వరునకు దయకలుగునేమోయని యనసూయయును జోగమ్మయును నిరీక్షించుచునే యుండిరి. అందుకుఁ దగినప్రయత్నములను జేయు

చుచేయుండిరి. కుమారుడు కలిగెనని సమాచారమంపినప్పుడు కూడ నానిర్భాగ్యుడు వినిపించుకొనలేదు. నిరాశాదుఃఖిత యగు ననసూయ నాచిన్నికుమారుని మీదనే ప్రాణములు పెట్టుకొని శల్యావశిష్టయై జీవించియుండెను.

జోగమ్మవృద్ధురాలగుటచేతను గోదావరీపుష్కరము వచ్చుటచేతను, మఱియొకపుష్కరమేమో తానేమో యని యెంచి పుణ్యలుబ్ధయగుజోగమ్మ గోదావరీస్నానమునకుఁ బోవలయు నను తనయుద్దేశము ననసూయకుఁ దెలియఁజేసెను. అనసూయయామెను బోయిరమ్మని చెప్పినదిగాని జోగమ్మ యామెనొంటిగ నింటనుంచి పోవుటకు సమ్మతింపలేదు. జోగమ్మ యామెనెట్లు విడిచియుండఁగల దు? అందుచే నావృద్ధురాలికోరికఁ దీర్చుటకై యనసూయకూడనామెతో బయలుదేరవలసివచ్చెను. ఆమె వచ్చునప్పుడు నాలుగు రూపాయలు కూడఁ దెచ్చుకొనియెను. దానధర్మముల కాటనము చాలకపోయిన మానెఁగాని చిన్నబిడ్డచేతిలో నొక్కచిలుకనైనను గొనిపెట్టుట కవకాశము లేకుండఁ బైబిూఁదిబట్ట పట్టి యెత్తుకొని పోయినటు కొంగునఁగట్టుకొన్న యానాలుగురూపాయలును గోదావరిలో జారిపడిపోయెను. అందుచేతనే యీయవస్థ తటస్థించినది!

అనసూయతనయదృష్టముంగూర్చి తలపోసికొనుచునొంటిగఁ గూర్చుండి యుండెను. అంతలోఁబసిబిడ్డ మేల్కని మరల నేడువ నారంభించెను కడుపులో నాఁకలి యగుచుండఁగాఁ గంటికి నిద్ర యెట్లువచ్చును? అనసూయ యాబిడ్డ నెత్తుకొని లేచి వెన్నెలలోఁ దిరుగుచుఁ జందమామం జూపి యాడించుచుండఁగా నానవాలు పట్టి భక్ష్యభాజనములతో రంగఁడు వగర్చుకొనుచు నామెను సమీపించి "అమ్మా! అన్నము దొరకినదికాదు. ఈభక్ష్యములతో నీవును నీబిడ్డయు నీరాత్రి కెట్లో యాఁకలిఁ దీర్చుకొనుఁడు" అని యాపత్కాలములదొంతి యామెనమీపమునందుంచెను.

అనసూయ యాశ్చర్యముతో "నాయనా! నీవు పుణ్యాత్మునివలె నగపడుచున్నావు ఇంత రాత్రివేళ నిపియన్నియు నీకెచ్చట లభియించినవి ?" అనియెను.

రంగ—నీబిడ్డ యేడుపుం జూచి సహింపంజాలక విలాసభవనమునకుం బరుగెత్తుకొనిపోయి యచ్చట మదోన్మత్తుండగు నొక విలాసప్రియునియొద్దనుండి బలవంతముగ నూంకొఱికికొని వీనిని దీసికొనవచ్చితిని. నేనువచ్చునప్పటికి నీవాయింటియొద్ద లేవు—నిన్ను వెదకికొనుచు నిక్కడకు వచ్చునప్పటి కాలస్యమైనది. ఎంతయాంకలిగనున్నదో! ఈభక్ష్యములలోం గొన్ని నిబిడ్డకుం బెట్టి కొన్ని నీవు తినికొనుమమ్మా!

అన—అయ్యో నాయనా! ఎంతపని చేసితివి! బలవంతముగి నితరులసొమ్ము లాగికొనుట పాపముకాదా ?

రంగ—కడుపుమండినవా రేడ్చుచుండంగాం గన్నులు మూసికొనిపోయినవారు కరుణించి పెట్టుదురా తల్లీ? అట్టివారి కిట్టి శాస్తి చేయవలయును. ఇందుం బాప మేమున్నది ?

అన—ఇతరులహృదయమునకుం గష్టము కలిగించుట యధర్మము కాదా ?

రంగ—ఇతరులకష్టమును జూచుచు నూరకుండుటమాత్రము ధరమామ్మా ?

అన—కాదు.

రంగ—అందుచేతనే నిర్ధనుండనైనను లోకధర్మమును నిర్వహించుటకై యీపని చేయవలసివచ్చినది. ఆంకలి తీరకున్నచో నీరాత్రి నీవును నీబిడ్డయును జీవించుటకష్టము. ఇది లేకపోయినంత మాత్రమున నాతండు మరణించునా యేమి?

అన — అంతమాత్రముచేత నీవుచేసినపని ధర్మము కానేరదు. మమ్ము బ్రదికించుపుణ్యమునకై నీవు మఱియొకనిహృదయమును నొప్పించుపాపము జేసితివి. నాయనా! అమృతమును విషకుంభముతో నెత్తుకొన్నందువలన లాభ మేమున్నది? తండ్రీ! ఆఁకలి బాధచే నల్లాడుచున్న మా బాధం జూచి నీకు దయకలిగినది. అట్టిబాధను నివారించుట నీకు ధర్మముగాఁ దోఁచినది. ఇంతటి దయార్ద్రహృదయుఁడ వగు నీ కితరులను బాధించుట యధర్మమని యేలతోఁచినది కాదు? బాధను జూడఁజాలనిస్వభావముగలనీవు బాధను గల్పించుట కెట్లోపఁగలిగితివి?

ఆప్రబోధవాక్యామృతకిరణములచే రంగనిసర్వజీవాణువులు నొక్కసారిగఁ బ్రసంచలితము లైపోయెను. ఆతనియంతరంగమునందలివిజ్ఞాననయనకమల మాకస్మికముగ వికసించెను. అప్పుడాతఁడు తనపూర్వచరిత్రమునంతను సమాలోచితముం గావించుకొనియెను. అంతయును విషామృతసంకలితమైయున్నట్లాతనికి విస్పష్టముగఁ బోధపడియెను. సర్వమయ మగుజ్ఞానశక్తి యీవిధముగ మూర్తీభవించి తనయెట్టయెదుట సాక్షాత్కరించిన దనియుఁ దన్నుద్ధరించుటకే యీవిధముగఁ బ్రబోధించిన దనియు భావించుకొనియెను. అప్పుడు రంగఁడు నిర్వేదకంపితస్వరముతో "తల్లీ! నేను పాపాత్ముఁడను! కనికారమునకు వశుఁడనైపోయి నాజీవితమునందు నేనెట్టికార్యముల నెన్నిటినో చేసియుంటిని. జాలిచేఁ దాత్కాలికధర్మనిర్వహణలాలసుఁడనై యధర్మతత్త్వమును గ్రహియింపఁజాలకపోయితిని! ఇప్పుడు నీప్రబోధచంద్రికలచే నాయజ్ఞానాంధకారము విరిసిపోయినది! నీవీనమానవు నుద్ధరింప నేతెంచినదివ్యశక్తివి కాని సామాన్యమానవరమణీమణివి కావు తల్లీ! నేనింతటినుండి యట్టిపాపకార్యము

లు చేయనని నీపాదములసన్నిధిని శపథము చేయుచున్నాను. ఈభక్ష్యముల నాఁకలిచేఁ దపించిపోవుచున్న నీచిన్నిబిడ్డకైన నించుక పెట్టి నాకడుపుమంటను జల్లార్చుము!" అని ప్రార్థించెను.

అన—వలదు! నాఁకళంకితంబు లగునీభక్ష్యములను బసిపాపకుమాత్ర ముపయోగింపవచ్చునా? ఈయర్భకుఁడు గొప్పదరిద్రుఁడైనను నాభిజాత్యసంపన్నుఁడు!

ఆప్రశాంతవాక్యము విద్యుచ్ఛక్తివలె నతితీవ్రముగా శ్రవణమార్గమున నాతని హృదయాంతరాళమున వ్యాపించెను. అప్పు డాతనిహృదయమునం దనిర్వాచ్యమగు వేదన యుదయించెను. ఆతఁడాదారుణపరితాపముచే దీర్ఘశ్వాసములు విడుచుచు శిలావిగ్రహమువలె నచటే నిలువఁబడిపోయెను.

అప్పు డనసూయ మృదులస్వరముతో "నాయనా! ఇవి మిగులవిలువగలవస్తువులవలె నగపడుచున్నవి. ఇవి యెవ్వరివో వారికే యిచ్చివేయుము! నీయౌదార్యభావమునకు నే నానందించితిని. మాప్రాణముల నిలిపినపుణ్యము నీకు లభియించుఁగాక! నీకృతజ్ఞతను నాజీవితమున్నంతవఱకు మఱచ దానఁగాను" అనియెను.

రంగఁడు మాటాడలేదు. ఆతఁడు నిర్విణ్ణుఁడై యట్లే చూచుచుండెను. అంతలో జోగమ్మ తామరాకులలోనుంచి యన్నమును వ్యంజనములను దీసికొని వచ్చి "అమ్మా! వారెవ్వరో పుణ్యాత్ములు! పేరూరుద్రావిడబ్రాహ్మణులఁట! ఆయిల్లాలెంతయో యాదరించి యీయన్నము పెట్టినది. ఇది నీకును నీబిడ్డకునుగూడ సరిపోవును! తినుమమ్మా!" అనియెను.

అనసూయ యెంతయో యాప్యాయనముతో నాయన్నమును గలిపి బిడ్డకుఁ దినిపించి తానును దినియెను. రంగఁ డంతయుభ

జూచుచు నసూయభోజన మగువలకు నట్లే నిలువఁబడి యుండి యనంతరము తనలో “ధనమదాంధుల సుఖరంగములలో నెంత యధర్మమున్నదో దరిద్రాభిభూతులదుఃఖతరంగములలో నంతధర్మ మున్నది.” అని యనుకొనుచు నొక్కదీర్ఘశ్వాసమును విడిచి “తల్లీ! దయయుంచుము! పోయివచ్చెదను” అని చెప్పి యాభక్ష్యభాజనముల గౌతమీగర్భమునఁ బారవైచి యటనుండి మెల్లమెల్లఁగ దిరిగి తిరిగి చూచుచు వెడలిపోయెను.

---

## తొమ్మిదవ ప్రకరణము

జలధరంబులయందు ♦ జలము లే గాక
పిడుగు లేమిటికిఁ గ ♦ ల్పింపఁగాఁబడెనో ?
ఫణిఫణంబున నిష్ప ♦ పటలకే గాక
మాణిక్య మేటికి ♦ మర్పఁగాఁబడెనో ?
అంబుధిలోఁ బడ ♦ బాగ్ని యేమిటికో ?
కర్దమంబున నేల ♦ గలువ యుండుటకో !
తత్త్వమార్గంబుఁ ♦ దలపోయ లేక
ద్వంద్వభావసమాశ్రి ♦ తంబైనయట్టి
ప్రకృతిశంకకు నేల ♦ భావంబె కోరి
చింతాలహరిలోనఁ ♦ జిక్కఁ దనేల !

విచారలహరి.

కఠినశిక్షణముకంటె మృదుప్రబోధనమే యవివేకమునకు మంచిమందు. ఎన్నిసారు లెంతెంతటి శిక్షల ననుభవించినను రంగనికిఁ దనతప్పు దెలిసికొనుట కవకాశము లభియించినది కాదు.

ఆతని కిష్ట దనసూచకపరిశాంతమధురవచనపరిబోధముచే నాకస్మికముగ నాత్మాపరాధ మద్దములోఁ బ్రతిబింబమువలెఁ దేటతెల్లమై పోయినది. పశ్చాత్తాపదుఃఖముచే నాతఁడు తల్లడిల్లిపోవుచు నావెన్నెలలో గోదావరీతీరముం బట్టి యున్మత్తునివలె నడచిపోవుచుండెను. ఎక్కడకుఁ బోవుచుండెనో యాతనికిఁ దెలియుట లేదు. ఎక్కడకుఁ బోవలయునో యాతఁ డూహించుకొనుట లేదు. ఎక్కడకుఁ బోయినను హృదయతాప మాతని ననుసరించియే వచ్చుచుండెను. ఆతఁడట్టె పోవుచుఁ బోవుచు నాయాసముచే నొకచింతచెట్టుక్రిందఁ గూలఁబడియెను.

ఆ యర్ధరాత్రమునం దచ్చట జనసంచార మేమియును లేదు. పుచ్చపువ్వువలె వెన్నెల యంతట నలముకొని యుండెను. ఆ చల్లని వెన్నెలయుఁ గూడ నాతని సంతాపము వర్ధిల్లుచునే యుండెను. ఆతఁడు నిర్వేదవిహ్వలహృదయుఁడై "దరిద్రుఁడ నైన నాహృదయమున కీ దయ యేల కలుగవలయును? కఠినవర్తనుఁడ నైన నా కింతటి కనికర మేల యుండవలయును? ఆ యెండకు నీ వెన్నెలకును సంఘటన మెట్లు కలిగినది? ఈ విరూపసంఘటనముచేతనే నేను ధర్మమార్గమునం బోయి యధఃపతితుఁడనై పోయితిని. ఏమి? నేను దయచేత నిర్దయుఁడనై పోయితినా? కనికరముచేతఁ గఠినవర్తనుఁడనై పోయితినా? కాదు కాదు! చంచలహృదయుఁడ నగు నేను—సనాతనధర్మానభిజ్ఞుఁడ నగు నేను—ఆకస్మికోద్దీపితంబగు భావము ననుసరించి పోయితిని. నా కామావేశముచే నాలోచనము లేకుండఁబోయినది—అందుచేతనే నేను—పుణ్యమునకుఁ దెఱచిన కన్నులతోఁ బాపమును గనఁబట్టఁజాలకపోయితిని. జాలికిఁ గొట్టుకొనుచున్న హృదయముతో బాధను గ్రహింపఁజాలకపోయితిని. ఈవిధముగఁ బాపపుణ్య ప్రవాహముల నడుమఁ గొట్టుకొనుచు నాజీవితము నిరర్థకమైపోయినది! ఎట్టి

గియు నెఱుఁగనియవస్థలోఁ బుణ్యము లాచరించి యెన్నో పాపకా ర్యములను గావించితి. ధర్మలోభముచే నధర్మమార్గము నవలంబించితిని! ఆయమ్మ చెప్పినమాటసత్యమే! అమృతమును విషకుంభముతో నత్తుకొనుటవలన నేమిలాభము? ఔను. ఆయవివేకముచే నావిధాయకధర్మము నాధర్మకళంకితమై పోయినది. ఆదివ్యరమణీమూర్తి యుద్బోధించినట్లుగా నధర్మకళంకము నేయాభిజాత్యసంపన్నుఁడు సహింపఁగలఁడు? నేనజ్ఞానమూఢుఁడ నగుటచే నధర్మమునఁ బడిపోయితిని. ఏమిచేయుదును? నేను నిరుపేదలకష్టములను జూచి సహింపఁజాలను. అధర్మహృదయు లగునర్థలుబ్ధులమూలముననే వారికట్టికష్టములు కలుగుచున్నవి. ఆకష్టములను నివారించుట కుపాయాంతర మేమున్నది? లేదు. ఈయసమర్థున కింక నుపాయము లేదు. సర్వభూతదయాపరుఁడగు సర్వేశ్వరుఁడే యీసాధుసంతాపమును నివారింపవలయును. ఆదయామయుని యనుగ్రహముకంటె నింక నుపాయము లేదు. హా పరమేశ్వరా! దీనబంధూ! దీనచింతామణీ! దీనజనసముద్ధరణమునకు నీకంటె దిక్కెవ్వరును లేరు. జగన్నాథా! జనార్దనా! జగజ్జనకుఁడవగు నీవు నీసాధుసంతానముపైఁ గటాక్షింపుము! రక్షింపుము! రక్షింపుము! రక్షింపుము!" అని ప్రార్థించుచుఁ బశ్చాత్తాపదుఃఖావేశపరవశుఁడై పడిపోయెను.

ఒక్కింతసేపటిలో నెవ్వరో వచ్చి యాతని వెన్ను దువ్వినట్లయ్యెను. రంగఁడులికిపడి కన్నులు విచ్చి చూచునప్పటి కాతని యెదుటఁ బ్రబోధానందస్వామి సాక్షాత్కరించియుండెను. రంగఁడు భయభక్తివినయసంభ్రమములతో స్వామిపాదములపైఁబడి "మహాత్మా! ఈపాపాత్ము నుద్ధరింపుము!" అని ప్రార్థించెను.

స్వామి యాతని లేవఁదీసి "వత్సా! నీ వెట్టిపాపము చేసితివి?" అనియెను.

రంగ—స్వామీ! పరులకష్టములను జూడఁజాలక పాపము చేసితిని.

ప్రభో—అట్టివాఁడవు పాప మెట్లు చేయఁగలిగితివి?

రంగ—అందుచేతనే పాపము నొనరింపఁగలిగితిని.

ప్రభో—ఏమి చేసితివి?

రంగ—దరిద్రుని కడుపుమంట చల్లార్చుటకై ధనాఢ్యులను బాధించితిని.

ప్రభో—ఎంత వెట్టివాఁడవు? ఎడమకాలు జబ్బుచే సన్నమైపోవుచున్నదని జాలిచేఁ గుడికాలిరక్తముం దీసి దానిఁ బూరింప వచ్చునా? ఇందువలన రెంటికిని మోస మగుట లేదా?

రంగ—స్వామీ! అదియెట్లు సరిపడును?

ప్రభో—నీవు ధనవంతునిఁగొట్టి దరిద్రునకుఁ బెట్టితి నంటివి. అందుచే దరిద్రుఁడు ధనవంతుఁడై దుష్టుఁడు కావచ్చును. ధనవంతుఁడు దరిద్రుఁడై కష్టములపాలు గావచ్చును గాదా?

రంగ—మహాత్మా! నేను పేదలకష్టములను జూచి సహింపఁ జాలను. ఏమి చేయుదును?

ప్రభో—నీకు జాలియున్నచోఁ గష్టములను దీర్పుము! కాని యందఱకుఁ గష్టములను గల్పింపకుము!

రంగ—కానునకు గతిలేనివాఁడను పేదలకష్టముల నెట్లు వారింపఁగలుగుదును?

ప్రభో—నీకుఁ జేతనైనంత చేయుము! చేతకానిదానికై చింతింపకుము!

రంగ—స్వామీ! చేయలేనివాఁడను చింతింపకుండుట యెట్లు?

ప్రభో—లోకమునఁ గష్ట మనుమాటయే లేకుండఁ జేయుట యెవ్వరితరము?

రంగ—మహాత్మా! దీనులగువారికష్టములనూరకచూచుచు నీలోకమున జీవింపఁజాలను. మనోధైర్యమునకైనను, మరణమునకైనను మార్గముంబ్రసాదించి యీదుఃఖసముద్రమునుండి నన్నుద్ధరింపరా?

ప్రబో—బిడ్డా! పరమార్థమును జెప్పుచుంటిని విను. నీవు దుఃఖించుచున్న నీసోదరులతోఁ గలసి దుఃఖింపుము; సుఖియించుచున్న నీతోడివారితోఁ గలసిసుఖియింపుము. అప్పుడు నీకును వారికిని గూడసుఖము కలుగును. అప్పుడు నీకుసుఖదుఃఖములు సమానము లగును అప్పు డీలోకమున నీకు దుఃఖానుభవ మనుమాటయే లేకుండఁబోవును.

రంగ—తండ్రీ! నీయమృతమయప్రబోధవాక్యములు నా యల్పహృదయమునకుఁ బట్టుటలేదు. పశ్చాత్తాపదుఃఖితుఁడ నగు నన్ను నీపాదసేవకుఁగ ననుగ్రహించి పాపపంకమునం బడిబోవకుండ నుద్ధరింపుము.

ప్రబో—వత్సా! ఏతల్లినూలమున నీకును జీవలోకమునకు ననుబంధము కలిగినదో, యేజననినీకును నీతోడిజీవులకును బ్రియజనయో, యేదేవినూలమున నీసర్వలోకములు నుద్భవించుచున్నవో మాజగన్మాతను సందర్శించెదవుగాని రమ్ము! అప్పుడా దేవియనుగ్రహమున నీసకలసంశయములును దూరీభూతములై పోవును.

రంగఁడు భక్త్యావేశముచే స్వామిపాదములపై సాష్టాంగపడి "స్వామీ! నేను దాసానుదాసుఁడను. నన్ననుగ్రహింపుము." అని ప్రార్థించెను.

ప్రబోధానందుఁడు "వత్సా! నాతోఁగూడరమ్ము!" అని యాతనిదనతోఁగూడఁ దీసికొనిపోయెను.

## పదియవ ప్రకరణము.



దీనజనములకును గాపు నీ గేహమైన
[illegible]దబులకును గల్యాణమైన
పూర్ణసంపత్తి[illegible] ప్రపూర్ణమైన
పూర్ణసౌభాగ్యగౌరవ పూర్ణమైన
యిట్టినీగృహమందు నీ కేమికొదవ?
అలరించుచుంటివా యీ [illegible]పుత్రి!

జాతీయగీతము — -

కోటిలింగక్షేత్రమునందలి దేవాలయమునకు సమీపమునం దొక పెద్దమఠముండెను. ఆపవిత్రమఠమిప్పుడు రేయుంబవలు నిశ్శేష జనానందకోలాహలితమై విలసిల్లుచుండెను. ఆపుష్కరసమయమునకు వచ్చినవారిలో — ఆకోటిలింగస్వామిని సేవింపవచ్చినవారిలో — ఆమఠమునకుం బోయిచూచి యానందతన్మయులైపోనివారొక్కరును లేరు. మాతృమందిరమునందలిమాతృదేవతమూర్తి యిప్పుడాత్మీయాఖిలభారతపుత్రిసందర్శనార్థమై యాదవ మఠమున వేంచేసి యున్నది సమాదరశీతలంబు లగుపవిత్రకటాక్షములచే నాత్మపుత్రుల ననుగ్రహింపవలయు నని యచ్చట వెలసి యుండెను. అరవిందసువర్ణపీఠకమలనివాసిని యగుజగన్మాతృకామూర్తిని నానందముతో సేవింపవలయు నని తండోపతండములై నిరంతరము ననేకప్రజలు వచ్చుచుం బోవుచుండిరి. ఆదివ్యమాతృకామూర్తి యెవ్వరుదర్శించిన వారికే తనతల్లివలెం బ్రత్యక్షమగుచుండెను. చిన్నలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు, సాధువులు, మహానులు, వీరు వారననేల యందఱును భయభక్తివినయవిశ్వాసము

లతో జగన్మాతను సందర్శించి కృతార్థు లగుచుండిరి. చూచిన వారు చూడనివారికిఁ జూపించుచుండిరి. తెలియనివారు తెలిసినవా రికిఁ దెలుపుచుండిరి. ఎక్కడఁజూచినను మాతృసదర్శనార్థులే— ఎక్కడ విన్నను మాతృప్రార్థనములే. ఆజగజ్జననియమృతమయ కటాక్షములచే నప్పుడు రాజమహేంద్రవరనగరమునం దంతటను సర్వసోదరత్వము నెలకొనియెను.

ఆమాతృపీఠమున కర్చకురాలైయున్నయానందాదేవి తల్లిని దర్శింపవచ్చియున్నమాతృభక్తులగువారినందఱ నమృతమధురవచ నములతో నాదరించుచుండెను. భక్తులందఱు నామెను బ్రత్యక్ష దేవతామూర్తిగ భావించి సేవించుచు నారమణీమూర్తివదనకమల మునుండి వెలువడు నమృతవచనములను వేదవాక్యములవలె శిరసా వహించుచుండిరి. ఆనందాదేవి మాతృధ్యానపరాయణులగుబిడ్డల కందఱకును దేటతెల్లముగ నహింస, పరోపకారము, సర్వసౌభ్రా తృత్వముమొదలగువిషయములంగూర్చి మనసు కరఁగునట్లుగ, మన సు నిలుచునట్లుగ, మనసు కలియునట్లుగ నుపన్యసించి యందఱి నానందసముద్రమున నోలలాడించుచుండెను. అప్పు డాదేవీమూ ర్తిం జూచి భక్తు లందఱును జగన్మాతయే యిట్లు ప్రత్యక్షమూర్తియై యీమాతృపుత్రుల నిట్లు ప్రబోధించుచున్నదను విశ్వాసముతో నాక ర్ణించుచుండిరి. ఆదివ్యప్రబోధములచే నాస్తికు లాస్తికు లగుచుండిరి. క్రూరులు శాంతులగుచుండిరి. అజ్ఞానులు విజ్ఞానులగుచుండిరి. దు రాచారులు సదాచారసంపన్ను లగుచుండిరి— సదమలగౌతమీ పావనసలిలావగాహనము, సమీపహితకోటిలింగక్షేత్రసన్నివాససౌ భాగ్యము, సర్వజగన్మాతృకాస్వర్ణస్వరూపసాక్షాత్కారము, సనా తనధర్మమార్గప్రబోధనము—ఇన్నియు నొక్కచో లభియించినప్పు

డే భారతీయునిహృదయమానందతన్మయము గాకయుండును ? ఏ భారతీయున కాత్మజ్ఞానము కలుగకుండును ?

ఆమాతృపీఠమున కక్షయమైనద్రవ్యమున్నది. అనేకులగుపరిచారకులునుబరిచారికలునున్నారు. మాతృసేవాపరాయణులగువారందఱునచ్చటిమహాసత్రశాలయందు నిరతాన్నప్రదానమును గావించుచుండిరి. అసంఖ్యవస్త్రదానములను గావించుచుండిరి. అప్పు డామాతృస్థానము పేదలకుఁ బెన్నిధానమువలె నుండెను. ప్రేమైకస్వరూపిణి యగుతల్లికరుణించుచున్నప్పుడు బిడ్డలకుఁ గొదవయేముండును ?

ఆనందాదేవి యధ్యక్షురాలుమాత్రమే కాదు. ఆమాతృపీఠమున కధీశ్వరి. మాతృమందిరమునకే మహారాజ్ఞీమణి. ఆదివ్యమూర్తిం దర్శించినవారందఱు నామెను మాతృదేవతాప్రతిమూర్తిగనే భావించుచుండిరి. ఆనందాదేవి దేవీపీఠమున సాయంకాలపూజలను గావించుచుండెను. మఠమంతయును దీపమాలికాలంకృతమైయుండెను. భక్త్యావేశముచేననేకు లామఠమునం బ్రవేశించి యుపవిష్టులై మహానందముతో మాతృపూజను నిశ్చలనయనులై తిలకించుచుండిరి. అందఱు నానందముద్రితులై నిశ్శబ్దముగఁ గూర్చుండి యుండిరి. ఆనందాదేవి పూజానంతరమున దేవీపార్శ్వమునందు నిలువఁబడి భక్తులవంకఁ దిలకించి మృదుమధురస్వరముతో నీవిధముగ నుపన్యసించెను. " బిడ్డలారా ! క్రమముగా మీరు మీతల్లియొడిలో నిదురించుటకే యలవాటుపడిపోయితిరి. ఆనిద్రలో దుస్స్వప్నములం గాంచి కలవరించుచుంటిరి. అభయప్రదాయిని యగు నమ్మమీకుఁ బ్రసాదించినరత్నాయంత్రముల నజ్ఞానముచేఁ బారవైచుకొంటిరి. అందుచే మీకు జాగ్రత్స్వప్నములయందుఁగూడ దుస్స్వప్నములే యగపడుచున్నవి. ఆదుస్స్వప్నములచే మీరమ్మమాటయే మఱచిపోయితిరి. కాంతాకనకములకై యొండొరులుకలహా

ములం బెట్టుకొనుచుంటిరి. జాతిరీతులకై యన్యోన్యవైరములం గల్పించుకొనుచుంటిరి. జగన్మాత సకలార్థములను మీకు సంపాదించి యొసంగుచున్నను హాయిగ ననుభవింపఁజాలకున్నారు. కుటుంబకలహములచే మీయర్థము పరాధీనమైపోయినది. అందుచే మీరు హింసాచౌర్యములకు లోఁబడిపోయితిరి. మీయార్యధర్మమంతరించిపోయినది. దుర్వ్యసనములపాలైపోయితిరి. ఆకారణముచే మీసర్వశక్తులును నశించిపోయినవి. మిక్కిలి మీరేనాఁటి యజ్ఞానముచే నన్యత్వమును నాపాదించుకొని మాతృద్రోహులై దుఃఖించుచున్నారు. బిడ్డలగు మీకష్టములం జూడఁజాలక లోకమునకంతకును దల్లియగు మీకన్నతల్లి విలపించుచు గుడ్లనుకుంగుంచెడునీళ్లను గ్రుమ్మరించుచున్నది. కుమారులారా! కుమారీమణులారా! మీరించుక కన్నువిచ్చి మీతల్లిని దర్శింపుఁడు; మీరెవ్వరో యించుక పరిశీలించి తెలిసికొనుఁడు. మీయమ్మ కన్నీటితో — గద్గదస్వరముతో నిట్లు చెప్పుచున్నది. బిడ్డలారా! మీరందఱును నాకన్నబిడ్డలు. మీరందఱును దోడఁబుట్టువులైనప్పుడింక నెవ్వరిని హింసించినను మీకేదుఃఖము కాదా? ఎవ్వరికపకారముచేసినను మీకే నష్టము కాదా? అజ్ఞానముచే సంతఃకలహములం గల్పించుకొని సర్వసంపత్సమృద్ధంబగు మీశాంతిమందిరమును సర్వశూన్యంబగు దుఃఖావాసముగ నేలచేసికొనఁదలంచెదరు? నామాట వినుఁడు! అహింసయే మీయనాదిపరమధర్మము — పరోపకారమే మీపరంపరాగతపరమార్థము — సర్వసమత్వమే మీసనాతనధర్మసూత్రము. కన్నులం దెఱచి తత్త్వమును గ్రహించి మీ కీమాటలను మనసునందుంచికొని సోదరులగు మీరందఱు నన్యోన్యసహాయులై మీపెద్దలమార్గము ననుసరించి మెలంగఁగలిగినచో మీకు సర్వసుఖములును గరతలామలకము లగును! సర్వ

శక్తులును స్వాధీనము లగును. సర్వాభీష్టములును సఫలము లగును. తల్లియే దైవమని తలంచునార్యులవంశమున జన్మించిన మీరు మాతృవాక్యపరిపాలకులై సుఖింపుడు. బిడ్డలారా! మీ సుఖమే నాసుఖము. మీ యానందమే నాయానందము. మీధర్మమును, మీధనమును, మీగౌరవమును, మీసుఖమును, మీసర్వమును గాపాడుకొనుశక్తి మీలోననేయున్నది. ఒక్కసారి కన్నులారగ మీతల్లి నగునన్నుదిలకింపుడు. బిడ్డలారా! మీకు శుభ మగుగాక! — ఓంశాంతిశ్శాంతిశ్శాంతిః ''

అప్పుడా ప్రజాసంఘమునుండి జయ! ఆంధ్రమాతకుజయ! జయ! భారతమాతకు జయ! జయ జగన్మాతకుజయ! '' అను నానందజయధ్వనులు చెలరేగెను. మాతృభక్తిపరాయణులగు వారలకందఱకును నానందాదేవిముఖమున మాతృదేవతాప్రసాదము లభియించెను.

అప్పుడ దొకవృద్ధబ్రాహ్మణుడు భక్తిపూర్వకముగ నానందాదేవిని సమీపించి " తల్లీ; ఈదేవతార్చనపేటిక యీమాతృదేవతాపీఠమునం దుండదగినది. ఇందు సర్వార్థచింతామణీమూర్తి యున్నది. దీనిసీపీఠమున భక్తిపూర్వకముగ నమర్పించుకొనుట కనుజ్ఞదయచేయవలయునని ప్రార్థించుచున్నాను. '' అని యాపేటికను దేవీపీఠసాన్నిధ్యమునందుంచెను.

ఆనందాదేవి మందహాసవదనముతో " బిడ్డలెట్టు పూజించినను మాతృదేవత కానందమే — ఈజగన్మాత మీపూజల నంగీకరించినది. '' అనియెను.

ఆవృద్ధబ్రాహ్మణునకు సశరీరస్వర్గము లభియించిన ట్లయ్యెను. ఆతడానందముతో " అన్యథాశరణంనాస్తి త్వమేవశరణం మమ '' అని స్మరించుకొనుచు దేవీప్రసాదమునందుకొని వెడలిపోయెను.



## పదునొకండవ ప్రకరణము.

భయమొ, బాంధవమో, మఱి ప్రచయంబో
కారణంబుగఁ గలిగిన కలయికలకు
సమయమంబట్టి కార్యములు జరుగుచుండుఁ
గాని మిత్రత్వ మట్టిది కాదు కాదు! ”

ఆత్మసఖుఁడు — హారావళి.

విలాసభవనమునకు గోపాలకృష్ణరావనునాతఁ డధికారియై యుండెను. ఆతఁ డొక్కప్పు డొకపెద్దయుద్యోగస్థునియొద్ద వంటబ్రాహ్మణుఁడైయుండెను. ఆయుద్యోగస్థుఁడే యాతనియందలి ప్రేమచే గోపాలరావునకు వివాహముఁ జేయించెను. ఆతని నింకను నభివృద్ధికిఁ దేవలయు నని నిశ్చయించుకొనియుండెను. ఇట్లుండఁగ నానీచుఁడు ధనాశచే విలువగలయాయుద్యోగస్థుని వ్రేలియుంగరమును దొంగిలించెను. ఆస్వామిద్రోహమునకై యాతని కాఱుమాసములు శిక్ష యయ్యెను. శిక్షానంతరమున నాతఁ డింటికి వచ్చునప్పటి కాతని భార్య కాపురమునకు సిద్ధమయ్యెను. కుటుంబపోషణమున కాతనికి సామర్థ్యమెక్కడిది? అట్టిదుస్స్వభావముగలయాతని నిఁక నెవ్వరు తమయింట వంటబ్రాహ్మణునిగా నుంచుకొందురు? అందుచేనాతనికి గత్యంతరము లేకపోయెను. తుదకాతఁడు తానును భార్యయును రాజమహేంద్రవరము చేరి పూటకూళ్లు పెట్టుకొనుచుఁ గాలక్షేపము చేయుచుండెను.

క్రమముగా నాతఁడు ద్యూతకారులకుఁ బెట్టుబడులు పెట్టియుఁ, దాగుబోతులకు ధనసాహాయ్యము చేసియు, వ్యభిచారులకు వసతివాడలఁ గల్పించియు నిట్టి నీచవృత్తుల నవలంబించి ధనము

నార్జించుచుండెను. ధనాభివృద్ధి యైనకొలఁదియు నాతని కామసంబం ధములగు వ్యాపారములన్నియు వర్ధిల్లుచునే యుండెను. తుట్టతుదకా తని పూటకూటియిల్లు విలాసభవనముగ మారినది. అతనికిఁ బ్రత్యే కముగ నంతకంటెను విలువగలనివాసభవనము కూడ నున్నది. ఆ యింటియందే యారాత్రియనసూయ పసిబిడ్డకుఁ బట్టెడన్నము దొరకి నది కాదు.

గోపాలరావు విలాసభవనవ్యాపారమువలనఁ గ్రమముగ లక్షాధికారి యయ్యెను. అతనికి సంతానము లేదు. అనుభవించుట కాతఁడు నాతని భార్యయే—అయినను నాతనికి ధర్మబుద్ధి లేదు. ఇల్లాలు కూడ నాతనిసహధర్మిణియే—ఆశ్రయమే దొరకక యల్లా డిన యూతఁడిప్పుడనేకుల కాశ్రయుఁడయ్యెను. మరియాద చెడిపో కుండ మద్యపానము చేయఁగోరు మహనీయులును, మడిచెడిపోకుండ మాంసాహారము చేయఁగోరు మహానుభావులును, పేరు చెడిపోకుండ వ్యభిచారము చేయఁగోరు పెద్దపెద్దలును నాతని కాప్తమిత్రులై య ర్థసంబంధులై యాశ్రితులై మెలఁగుచుండిరి. అందుచే నాతని సత్య స్వరూపము తెలియనియధికారులు కూడ నాతని గౌరవించుచుండిరి. జూదరులు, జారులు, చోరులు మొదలగు దుర్వ్యసనపరాయణులగు వారందఱును కూడ నాతని యాశ్రయము నభిలషించి తిరుగుచుండిరి.

కోటిలింగక్షేత్రమున మాతృదేవతాపీఠము వెలసినది మొ దలు, మాతృప్రతిమూర్తియగు నానందాదేవిమధురప్రబోధచంద్రి కలు వ్యాపించుచున్నకొలఁదిని క్రమక్రమముగ విలాసభవనము ని స్తేజమై పోవుచుండెను. ఆ వెన్నెల వెలుఁగులోఁ గన్నులఁ దెఱచిన యాంధ్రపుత్రులకు స్వస్వరూపజ్ఞానోదయ మగుచుండెను. ఆ స్వ ప్నచంద్రికాప్రకాశములలో మాతృప్రబోధితులగు సేవకులకు మరలఁ దమతమరక్షాయంత్రములు లభియించుచుండెను. వారిదుస్స్వప్నము

లు వదలిపోవుచుండెను. అందుచేఁ గ్రమక్రమముగ దుర్వ్యసనము లు దూరీభూతములై పోవుచుండెను. ఇంతయును జేరి తుదకేమైనది! విలాసభవనమునకు రాఁబడి లేకుండఁబోయినది! గోపాలరావునకు వృత్తిచ్ఛేదమైపోవునట్లగపడియెను.

గోపాలరావున కీనడుమఁ గొలఁదికాలమునుండి దామోదరునితో సఖ్యముకలిగినది; ఆతనిమూలమున విశేషధనలాభముకూడఁ గలిగినది. ఆతనినిగూఢచరిత్రమంతయును గోపాలరావునకుఁ దెలియును. రాత్రిపదిగంటలయినతరువాత గోపాలరావు దామోదరుని గోదావరియొడ్డునకుఁ దీసికొనిపోయెను. ఇరువురు నొక విజనస్థలమునఁ గూర్చుండి రహస్యముగ సంభాషించుకొనుచుండిరి.

గోపా—దామోదరా! ఈదిక్కుమాలిన దేవీపీఠము మనకుఁ బ్రక్కలోనిబల్లెమువలె దాపురించినది! అజ్ఞానులందఱు మాయానందమాయలలోఁ బడిపోవుచున్నారు.

దామో—ఔను! మనోమోహనమూర్తి యగునాత్రిపురసుందరి మధురకంఠస్వరమెత్తిమాటాడుచున్నప్పుడ జ్ఞానులన నేమి?—ఎంతటివిజ్ఞానులైన నామెకు దాసానుదాసులైపోవుట కాశ్చర్య మేమున్నది?

గోపా—అదియే మనకోపముంచుచున్నది. పుష్కరముతో వదలిపోవు ననుకొంటినిగాని యేఁడాదివఱకును వదలునట్లు లేదు—ఇంతలో మనపని మట్టమే యైపోవును.

దామో—ఇందుకుఁ బ్రతీకార మేమైన నాలోచించితివా?

గోపా—ఆలోచన కేమున్నది? ఆపీఠమీనగరమునం దెక్కడ నగపడకుండఁ జేయవలయును.

దామో—అదియెట్లు?

గోపా—నీచేతిక్రింద బలవంతులెందఱోయున్నారు. నేనెఱుఁగినవారుకూడఁ జాలమందియున్నారు. వారినివీరిని కూడఁగట్టుకొని నీవుప్రయత్నించినచో దేవీపీఠము పేరులేకుండఁ జేయుట యెంతసేపు? త్రిలోకసుందరిమూర్తి యగు నానందను నీ వెట్లైనఁ దక్కించుకొనఁగలిగినచో విలాసభవనము నీకువిలాసభవనమగును! నీవు మధుమత్తకై దేవులాడు చుంటివిగాని యది యానందకాలిగోటికైన ను సరిపోలునా? నీ వెఱుఁగవుగాని మధుమతి మూఁగది!

దామో—అలాగా? పైమెఱుఁగుచూచి భ్రమపడిపోయినాను! నీ కెంతశక్తియున్నదిరా ? మూఁగదానిచే మూడులోకముల నేలించితివే !

గోపా—తెలియకుండ సంచరించుచుంటివి గాని నీవు మాత్రము సామాన్యుఁడవా? నీవు తలఁచుకొన్నచో నిమిషములో నానందను వశపఱచుకొనఁగలవు.

దామోదరుఁ డించుకసే పాలోచించి ఇట్లనెను. నాకును మనుపటివలె నుండవలెనని లేదు. పెండ్లి చేసికొనియొకయింటివాఁడను గావలయు ననియున్నది. ఆనందలభియించినచో నానందసామ్రాజ్యము లభియించినట్లే. కాని, దేవీపీఠమునకు బలవంతులగు వేయికొలఁది పరిచారకు లున్నట్లగపడుచున్నదే. సాహసించి పోయినచోఁ జచ్చుటయేగాని మఱి లాభ మేమున్నది?" అనియెను.

గోపా—మనలాభముకొఱకు మనప్రాణములనైన సర్పించుటకు సాహసించి పని చేసికొనవలయునుగాదా? నీకునిత్యమును త్రాగుటకని జూదమునకని దానికని చీఁకసధనము కావలయును. నాకును గావలయును. ధనములేకున్నచో తిన మెట్లు గడచును? కావున ధనము కొఱకు మన మెట్టిపనినైనను జేసికొనవలయును.

అందుచేనాతఁడు కడసారి యామెను జూడకుండఁగనే పిఠాపురము ను వదలిపోవలయునని నిశ్చయించుకొనియెను. కొన్నిదినములనుండి దామోదరుఁ డాతని కగపడుటయే లేదు. అగపడినమాత్రమున నేమిలాభము ? తనకిన్ని యనర్థములును దామోదరునిమూలమున నే తటస్థించిన వని యాతఁడు తెలిసికొనియెను. కట్టుబట్టలుకంటె నాతనియొద్ద నొకకాసైనను లేదు. అతఁ డట్లే బయలుదేరెను. అఱకాలి కెన్నఁడు నవనీపరాగమైన సోఁకి యెఱుంగని యీసుకు మారమూర్తి కఱకుకంకరమార్గమునఁ గాలినడకను బోవుచుం డెను. కుసుమకోమలమగు ననసూయాహృదయమును నొప్పించినపాప మునకుఁ బ్రతిఫల మనుభవింపవలదా ? క్రూరహృదయుఁడై యబల యగు ననసూయ కెట్టికష్టముం గల్పించెనో నిర్భాగ్యుఁడై యాతఁ డిప్పుడట్టికష్టమునకుఁ బాలైపోయెను.

అతని కీలోకమునం దిఁక నేమున్నది ? ఇల్లులేదు; వాఁకిలి లేదు; మడిలేదు; మాన్యములేదు; ఏపతివ్రతాశిరోమణి యాతని కటాక్షవీక్షణముల కెదురుచూచుచున్నదో, యేప్రేమైకమూర్తి యాతనినే తనప్రాణముగ నెంచి ప్రేమించుచున్నదో, యేసాధ్వీ రత్నమాతనినే దైవముగఁ దనహృదయకమలమున నిలిపి పూజిం చుచున్నదో యట్టిభూలోకదేవీమూర్తి యగు ననసూయకంటె నాత నికాత్మీయమగుపదార్థ మీలోకమునం దేదియును లేదు. నిర్భా గ్యుఁ డగువేంకటేశ్వరున కంతయు ననుభవమునకు వచ్చినది. వార కాంతపొందు వలదని చెప్పినవారందఱు నాతని కష్టులైపోయిరి. ఆత్మేశ్వరియగు ననసూయను మరలఁ బరిగ్రహింపుమని బోధించిన మిత్రులందఱు నాతనికి శత్రులైపోయిరి. ఆమోహాంధకారములో నాతని కనుకూలమార్గ మేదియో ప్రతికూలమార్గ మేదియో యు

గపడినది కాదు. మధురఫల మేదియో విషఫలమేదియో తెలిసినది కాదు. అతని కన్నులు మూసికొనిపోయినవి; బుద్ధి చెదరిపోయినది; దొరకినత్రోవయే మంచిదని యెంచి తోచినరీతిని సంచరించెను. ఆ కారణముచేతనే యాతఁడమృతసరోవరమును వదలి తుట్టతుదకు దుఃఖాంధకూపమునఁ బడిపోయెను.

ఇప్పటికాతఁడు కన్నులను దెఱచి చూచుకొనియెను. ఒక్కసారిగ నాతనికిఁ బూర్వస్మృతి కలిగినది. ఆదినమున— బలవంతముగఁ దనచేఁ బరిత్యజింపఁబడిన యాదినమున—అవమాన దుఃఖమును సహింపఁజాలక యాగతికయై కొయ్యబొమ్మవలె నిలువఁబడిపోయినయనసూయదీనవదన మాతని కన్నులఁ గట్టినట్లుండెను. అప్పుడాపవిత్రప్రేమామృతమయదివ్యమూర్తి వదనకమలము నుండి వెలువడిన యమృతమధురంబులును, బ్రాణయనిశితంబులును, శోకకంపితంబులు నగుప్రబోధవాక్యము లిప్పుడాతని శ్రవణకుహరములఁ బ్రతిధ్వనించుచున్నట్లుండెను. ఆతనిహృదయముపగిలిపోవుచుండెను. పశ్చాత్తాపదుఃఖముచే నాతని సర్వాంగకములును బ్రకంపితములై పోవుచుండెను; ప్రతప్తములైపోవుచుండెను.

ప్రాణేశ్వరి యగు ననసూయ నెట్టులైన మరల దర్శింపఁగోరుట యాతనికి లజ్జాకరముగఁ దోఁచుటలేదు. అర్ధాంగి యగుననసూయ పాదములపైఁ బడి యపరాధములను క్షమియింపఁగోరుట యాతని కవమానకరముగఁ దోఁచుట లేదు. ఆమె ప్రేమమయి యని యు శాంతిమయి యనియు నాతఁడెఱుఁగనివాఁడా? ప్రేమమయ దంపతుల ప్రేమమయహృదయముల నెసుఖలేశము పరస్పర సన్నిబద్ధములుగఁ జేయఁజాలినదో యట్టిసుకుమారపుత్రీగాత్రపరిష్వంగసౌఖ్యము నాతఁడు నిర్లక్ష్యముగ నవివేకియై త్యజించివైచెను.

ఆదుఃఖ మాతని హృదయాంతరాళమునం దప్పుడప్పుడు పొంగిపొరలు చునేయుండెను. ఇప్పు డా దుఃఖము నొక్కసారిగ నాక్రమించుకొని యాతని జీవితమును [illegible] జేసివైచెను. ఆదారుణదుఃఖతాపముచే నాతని గుండె పగిలిపోవలసినదే. అతని ప్రాణము లెగిరిపోవలసినదే. కాని యాతని కింకను నాశ వదలిపోలేదు.

ఆయాశచేతనే యాతఁడు ప్రాణములతో నిలువఁబడియుండెను. ఆయాశచేతనే యాతఁడు పతికష్టముతో జేగురుపాడునకు బయలుదేరెను. పుత్రోత్సంగవతియైయున్న కామేశ్వరి యగునసూయను దర్శింపవలయు నని యాశ! ఆయాశచే నాతనికి మార్గాయాస మగపడుట లేదు. అడుగుక్రిందఁబెట్టని వేంకటేశ్వరుఁ డిప్పుడామడ కొలఁదిదూరము నడచుచున్నాఁడు. స్వయంకృతాపచారముచే నాతని కిప్పు డిట్టియవస్థాంతరము కలిగినది. దూరాలోచనము చేయక మనసుపోయినరీతిని పోవునందున వివేకుల కెప్పటికైన నిట్టి పశ్చాత్తాపదుఃఖమునకుఁ బాల్పడుట తప్పదు.

అట్లాతఁడు పోవుచుండఁగా మార్గమధ్యమునం దొకవృద్ధబ్రాహ్మణుఁ డాతనిం జూచి విచారాశ్చర్యసూచకస్వరముతో ' వేంకటేశ్వరరావుగారా ? ' అని పలుకరించెను. అట్టియవస్థలో నాతని కాబ్రాహ్మణసందర్శనము దుస్సహముగ నుండెను. అందుచే వేంకటేశ్వరుఁడు తలవంచుకొని నిలువఁబడిపోయెను. అప్పు డాబ్రాహ్మణుఁడు ' నాయనా ! ఇట్లుంటి రేమి ? కాలినడకను బయలుదేరితి రేమి ? ' అనియెను. వేంకటేశ్వరుఁడు దుఃఖముతోఁ దన జీవితచరిత్రమంతయు నాతనికిఁ దెలియఁజేసెను. బ్రాహ్మణుఁడు విచారముతో ' నాయనా ! ఆనాఁ డేనూఱురూపాయలదక్షిణతో మీరు నాకుదానముచేసిన దేవతార్చనపేటికతో నేనన్నిపుణ్యక్షేత్రములను

దర్శించితిని. అందరిసర్వార్థచింతామణిమూర్తి నావంటివానిచే వేలకొలందిపుణ్యకార్యములను జేయించి ది. ఆమూర్తియనుగ్రహముచేఁ గాను చేత లే. వాఁడను గనకవర్షము గురియింపఁగలిగితిని. తుదకు రాజమహేంద్రవరమున నిరతాన్నవస్త్రదానముం గావించుచు దీనజనోద్ధారణముం గావించుచున్న దేవీపీఠమున కాదివ్యమూర్తిని సమర్పించివైచితిని. ఆమూర్తి మెఁ న్నేరములనుండి పూయించుట నున్నదో! పాప మది లేకపోవుటచేతనే మీయింటి కిట్టిగతివచ్చినదేమోకదా! నాయనా! నీవాదేవీపీఠమును సందర్శింపుము. అందుచే నీదుఃఖములు తొలఁగిపోఁగలవు. పరమేశ్వరుఁడు నిన్ననుగ్రహించుఁగాక' అని చెప్పి యాతనియొద్ద సెలవుగైకొని వెడలిపోయెను.

వేంకటేశ్వరుఁ డట్లో జేగురుపాడునఁ బ్రవేశించునప్పటికి రాత్రియొనిమిదిగంట లయ్యెను. అతఁ డెన్నఁడు నాయూరు వచ్చినవాఁడుకాఁడు. ఎవ్వరి నెఱింగినవాఁడు కాఁడు. అతఁడు గ్రామదేవతగుడియొద్దకుఁ బోవునప్పటికి సుబ్రహ్మణ్యశాస్త్రి యనునొకసద్బ్రాహ్మణుఁ డాతని కగపడియెను. వేంకటేశ్వరుఁడు మార్గాయాసముచే నిట్టూర్పులు విడుచుచు నాతనిం జూచి 'అయ్యా! జోగమ్మనెఱుఁగుదురా?' అని యడిగెను.

సుబ్ర—ఎఱుఁగకేమి? ఈయూరిలో నామెఁ నెఱుఁగనివారెవ్వరున్నారు?

వేంక—ఆమెయిల్లెక్కడ?

సుబ్ర—ఈప్రక్కసందులోనే యున్నది. ఎందుకు? ఆమెయిచ్చట లేదు. పుష్కరస్నానమునకై రాజమహేంద్రవరముపోయినది. చాలదినములైనది. ఇంకను రాలేదు.

వేంకటేశ్వరుఁ డపరిమితభుఁడై 'అయ్యా! ఆయింటిలో—!'

అర్ధోక్తియందే సుబ్రహ్మణ్యశాస్త్రి, ఆయిల్లాలు కూడఁ బసిబిడ్డనెత్తుకొని యామెతోడనే పోయినది — భూలోకమాతయగు నామహాపతివ్రత నిర్భాగ్యుఁడగు భర్తచేఁ బరిత్యజింపఁబడుటచే శ్రీమంతురాలగు నామెకు జోగమ్మతోఁగూడఁ బోవలసివచ్చినది.' అనియెను.

వేంకటేశ్వరుఁడు హతాశుఁడై నిలువునఁ గూలఁబడిపోయి యూఁడుదానివలె నేడువనారంభించెను. దుఃఖము — ఆయాసము — ఆఁకలి యొక్కసారిగ నాతని ముంచివేయుటచే నాతఁడు స్మృతితప్పి పడిపోయెను. సుబ్రహ్మణ్యశాస్త్రి యాతని సేదదేర్చి మెల్లగఁ దన యింటికిఁ గొనిపోయెను.

## పదుమూఁడవ ప్రకరణము.

పడిపడిగఁబోవుశాస్త్ర ♦ వాదమందు
బాహువు గుడిగింపెను లంగోనఁ ♦ బడిబడంగి
పాంచభౌతికవస్తుప్ర ♦ పంచమెన్ని
యెన్నిమార్పుల నందలే ♦ దింకెదనక ?

కావ్యగీతము — హారావళి.

కల్యాణానందస్వామి ప్రబోధోపన్యాసములచే దేశమునఁ జాలవఱకు సాధుజంతువులబలిప్రదానములు ప్రచారమున లేకుండఁ బోయినవి. కటికవాండ్రనిరంతరజీవహింసాకర్మములు నిర్మూలములై పోయినవి. అందందు విజ్ఞానప్రబోధకసమాజములు వెలసినవి.

నిమ్నజాత్యుద్ధరణవిద్యాశాలలు నెలకొల్పఁబడినవి. గోసంరక్షణశాలలు స్థాపింపఁబడినవి. ప్రజలలో నజ్ఞానము వదలి యైకమత్యము వర్ధిల్లుచుండెను. వృత్తులనుబట్టి యేర్పడినజాతిభేదముల ననుసరించిన యన్యోన్యవైషమ్యము లంతరించిపోవుచుండెను. సర్వసమత్వ మంతటను వ్యాపించుచుండెను. అహింసయుఁ బరోపకారము నావశ్యకధర్మములుగఁ బరిగణింపఁబడుచుండెను. దుర్వ్యసనములు క్రమముగఁ దొలఁగిపోవుచుండెను. అందఱును గన్నులఁ దెఱచి మాతృదేవతను దర్శింపఁగలుగుచుండిరి. ఆంధ్రదేశమంతయు మాతృమందిరమే యని భావింపఁగలుగుచుండిరి. అందుచే సర్వసౌభ్రాతృత్వ మందఱకు ననుభవమునకు వచ్చుచుండెను. ఆత్మాభివృద్ధికి — ఆత్మసోదరాభివృద్ధికి — ఆత్మదేశాభివృద్ధికి - అదియే ముఖ్యసాధనమని యందఱకును బోధపడుచుండెను. కల్యాణానందస్వామి నందఱును, గలిపురుషుండున్న కలియుగమునఁ గృతయుగధర్మముల నెలకొల్పినపరీక్షిన్నరేంద్రునివలె భావించుచుండిరి. ప్రజలవిశాలహృదయరాజ్యములయందుఁ గల్యాణానందస్వామియే యానందచక్రవర్తియైయుండెను.

మాతృమందిరమున మాతృసేవాదీక్షితుఁడై వచ్చిన దేశీదాసునిమూలమునఁ గల్యాణానందస్వామి ధర్మగిరిప్రాంతారణ్యమునంగల చోరకుటుంబముల నన్నిటిని గృషికకుటుంబములుగాఁ జేసివైచెను. వారందఱును జౌర్యమునేకాక మద్యపానమునుగూడ మానివైచి జగద్ధాత్రియగుభూదేవి నాశ్రయించి జీవింప నారంభించిరి. స్వామియనుగ్రహముచే నాకృషికకుటుంబములకును గోసంరక్షణశాలలకును నిత్యసంబంధ మేర్పడియెను. అందుచే ధర్మగిరిప్రాంతమునందలిమహారణ్యమంతయును సస్యక్షేత్రమైపోయెను. మద్యపానహింసాచౌర్యదీక్షితులగువారందఱు నిప్పుడు మాతృసేవాదీక్షితులైపోయిరి. వారిపరివర్తనముం గాంచి యానందించి స్వామి నేఁటి

దినమున వారల కందఱకును మాతృదీక్షాకంకణములఁ బ్రసాదించు చుండెను. మాతృదేవతాప్రసాదము నొసంగుచుండెను.

జనులుగుంపులుగుంపులై వచ్చి స్వామియనుగ్రహముచే గిరి పాలికాదేవ్యాలయమున దీక్షాకంకణమును ధరియించుచుండిరి. ఆ యాలయమునందిప్పుడు చిదానందాదేవి సాక్షాత్కరించుట లేదు. ఆజగన్మాత బిడ్డలగు తమ్ముఁదఱను గటాక్షించి యుద్ధరించి మరల మాతృమందిరమునఁ బ్రవేశించిన దని యందఱును భావించుకొను చుండిరి. స్వామి యానాఁడు వారలకందఱకును యథేచ్ఛముగ మృష్టాన్నవస్త్రదానములను గావించుచుండెను. నాఁడు ధర్మగిరియం దంతటను నన్నసంతర్పణములే. ధర్మగిరియంతయు నన్నగిరి యైపో యెను. అందఱును మాతృదేవతాప్రసాదముచేఁ బరితృప్తులై పరి శుద్ధాంతఃకరణములతో వచ్చిస్వామిని బరివేష్టించి కొలిచి యుండిరి. స్వామి సమున్నతశిలాఫలకముపైఁ గూర్చుండి యందఱకును మాతృ మహిమంగూర్చి బోధించుచుండెను. అందఱు నత్యుత్సాహముతో నాలకించుచుండిరి.

అప్పుడాసాయంసమయశీతలవాయుతరంగములనుండి విశ్రు తస్వరముతో నీక్రిందిగీతము వినవచ్చుచుండెను—

అమృతములోపలనే విషమున్నది
యదియొకచిత్రము కాదా?
హిమకరుచెంగటనే నిప్పున్నది
యదియొకచిత్రము కాదా—అ॥
పూవులతోఁటలనే ముండ్లున్నవి
బోధపడినదా లేదా?
తావులలోపలనే పొగరున్నది

తల కెక్కినదా లేదా ? —అ॥

స్నేహములోనే ద్రోహం బున్నది

జీవుల కేమిఁక దారి ?

దేహములోనే తేలున్నప్పుడు

దిక్కేమున్నది రోకి ? —అ॥

అందఱు నాశ్చర్యములో నాలకించుచుండిరి. అంతలోఁ దరుణసుందరమూర్తి యగునొక సుస్మితవ్యక్తి సూపర్వతమునధిష్ఠించి వారివంకకే వచ్చునట్లుగపడిమెను. ఆతఁడు వేగముగనాపర్వతము నెక్కివచ్చి సూజసమూహముఁగాంచి యున్మాదోద్రేకముచే వికృతనటనములంగావించుచు—

తెలిసి దయ్యా ! తెలిసిందీ మది

కలిసి దయ్యా ! కలిసిందీ ॥

జిలజిలఁదేనెలఁజిలుకునుచున్నను

బలికినవన్నియుఁబలుకులుగావని ॥ తెలి॥

తోఁచినదయ్యా ! తోఁచిందీ తల

యూఁచినదయ్యా ! యూఁచినదీ

చూచుటకందముతోఁచినయంతనె

పూచినవన్నియుఁబువ్వులుగావని॥ తోఁచి॥

నచ్చినదయ్యా ! నచ్చినదీ ! బుద్ధి

వచ్చినదయ్యా వచ్చినదీ

అచ్చికబుచ్చికలాడినమాత్రనె

బచ్చెనలందఱుభ్రాతలుగారని॥ నచ్చి॥

అనిపాడుచు నభినయింప నారంభించెను. పాపమాతఁడు మనభారతరావే ? భారతరావు పిఠాపురము వచ్చి చూచునప్పటికిఁ

జంచలరావును సత్యవతియు నాతని కగపడకుండఁబోయిరి. చంచల రావు బలవంతముగ సత్యవతి నెత్తికొనిపోయెనని యాతఁడనుకొని యెను. సత్యవతినెట్లయిన నంగీకరింపఁజేసి చంచలరావునకుఁ బెండ్లి చేయవలయునని యాతనియుద్దేశము. ప్రాణసమానయగు నామెమనసు నొప్పించుటయాతని కిష్టము లేదు. చంచలరావునకు నామెకు నెట్టి దైన నన్యోన్యానురాగము కల్పింపవలయునని యామె నాతనితోఁ బిఠాపురమునకుఁ బంపియుండెను. ఆమె యంగీకరించినచో నానంద కరముగ వారిరువురకును వివాహమే యయ్యుండును. అగపడకుండఁ బోవుటకుఁ గారణ మేమి? కారణాంతర మేమైన నున్నచో నొక్క రైన నగపడకుండ నుందురా? తప్పకుండఁ జంచలరావే సత్యవతిని బలవంతముగ నెత్తుకొనిపోయెనని యాతఁడు నిశ్చయించుకొనియెను. భారతరావునకుఁ బ్రాణమునకుఁ బ్రాణమైనసోదరి ప్రాణమిత్రుఁ డనుకొనుచున్న చంచలరావుచే బలవంతముగ నపహరింపఁబడిపోయి నది. ఆవిచారముచేతనే—ఆపరితాపముచేతనే—ఆనిరంతరధ్యాన సమాలోచనములచేతనే పాప మాతనిమతి చెదరిపోయినది! తానొ కటితలంచిన దైవ మొకటి తలంచిన ట్లయ్యెను. దేశకాలపాత్ర ములఁ బాటింపక కేవలము పట్టుదలయే ప్రధానముగఁ గార్యదీక్షి తులగువారి కందఱకును దుదకిట్టిప్రతిఫలమే లభియించుచుండును. భారతరావున కట్టిప్రతికూలఫలమే లభియించినది.

కల్యాణానందస్వామి యాతని దనయొద్దకుఁ దీసికొని రమ్మని దేవీదాసున కాజ్ఞాపించెను. దేవీదాసుఁ డాతని కెదురుగఁబోయి చేయి పట్టుకొనియెను. భారతరావు వెఱ్ఱిచూపులు చూచుచు "నీవు దొంగవా?" అనియెను.

దేవీ—భయములేదు. నాతో రమ్ము!

భార—నీవు పిచ్చివానివలె నున్నావు. నేనునీతో రాను.

ఆ యాతఁడు పెనగులాడ నారంభించెను. దేవీదాసు మును పటిభీముఁడే యైయున్న యెడలఁ గావడిపెట్టివలె నాతని నెత్తి గమ్యస్థానమునకుఁ జేర్చియుండును. కాని యిప్పుడాతఁ డట్లు లేఁడు. అందుచే దేవీదాసు భారతరావును మంచిమాటలతోఁ దీసికొనిపోయి స్వామిసన్నిధిని నిలువఁబెట్టెను.

స్వామి యాతనిం జూచి కరుణాపూరితస్వరముతో "అది యేమి యట్లున్నావు?" అనియెను.

భారతరావు చేతులు త్రిప్పుచు "ఎట్లున్నాను? నీవెట్లుంటివో నేనట్లుంటిని—నాకు మతి లేదు—నీకు గతి లేదు. నేనాత్మద్రోహిని—నీవు ధర్మద్రోహివి! బంధుద్రోహివి!" అని గంతులువైచుచుఁ జప్పటలు చఱచుచు-

పోయినదయ్యా! పోయినదీ చెడి
పోయినదయ్యా! పోయినదీ
మాయయు మోసమహిలో రాజ్యము
చేయుచునున్నవి జీవులసౌఖ్యము ॥పోయి॥
మారినదయ్యా! మారినదీ గతి
మారినదయ్యా! మారినదీ,
దూరంబాయెఁ గనిదుర్బుద్ధులధి
కారముపాలయి కాలము శీలము ॥మారి॥

అనిపాడుచు వికటహాసము చేయుచు వికృతనృత్య మాడ నారంభించెను. కల్యాణానందస్వామి నిర్విణ్ణుఁడై యేమియు మాటాడఁ జాలకపోయెను. భారతరావు మఱియును వికృతతాండవములం గావించుచు గుణతరోన్మాదావేగముచేఁ గుప్పిగంతులు త్రిప్పకుండ—

సన్న్యాసంబే నెఱతనమా? బల
విన్యాసంబే దొరతనమా?

అన్యాయముగా నన్నలఁ దమ్ముల
నాలిని బంధుల నడఁచిన వారికి ॥సన్యా॥
నెఱతనమా? నేర్పరితనమా? ట
క్కరితనమా? సిగ్గరితనమా? తుం
టరితనమా? దూబఱితనమా? క
ల్లరితనమా? యల్లరితనమా మఱి
సన్యాసంబే నెఱతనమా? బల
విన్యాసంబే దొరతనమా? —

అని కరతాళములతోఁ గోలాహలధ్వనులు చేయుచు నొక్కపరుగున నటనుండి వెడలిపోయెను. అందఱు నాశ్చర్యవిభ్రాంతులైపోయిరి. శ్రీకల్యాణానందస్వామియును జిచ్చువడిపోయెను.

---

## పదునాలుగవ ప్రకరణము.



దేవదేవ! మహాత్మ! త్వ ♦ దీయదివ్య
భావబోధకకావ్యశ్రీ ♦ బంధమంత
నెచట శ్రీరాముఁ బుట్టెనో? ♦ యెచటఁ జిత్త
గించవలె నని వ్రాసి ము ♦ గించినావు!
మొదలు తుది లేనినీగ్రంథ ♦ మునుసతంబు
నెంతచదివిన గాంక్షయూ ♦ హించుకొన్న
నెవ్వ రీకావ్యమును రచి ♦ యింపు మఱిరో!
రూరి కీర్తి నొసఁగితో ♦ రూఱుఁగరాదు.

ప్రకృతిప్రబంధకర్త — హారావళి.

కల్యాణానందస్వామి వికలహృదయుఁ డైపోయెను. ఏదియో మహాపరాధముం గావించినట్లాతఁడు భావించుకొనఁ దొడంగెను.

విధాయకకర్మమునకును విధాయకకర్మమునకునుగలవిభేదతారతమ్యములంగూర్చి మాతఁడు తనలోనే పూర్వపక్షసిద్ధాంతములను జేసికొనుచుండెను. ఆతనికి ధైర్యము చెదరిపోయినది; తత్త్వము తెలియకుండఁ బోయినది. ఆతఁడు పాపపుణ్యములను భావనామయతులాయంత్రమునందుంచి తూపవలయు నని ప్రయత్నించుచుండెను. భావము చెదరిపోవుచుండుటచే నాతని ప్రయత్నము దుస్సాధ్యమై పోవుచుండె. ఆతనిహృదయాంతరాళము గ్రీష్మప్రతప్తమైపోయెను. వాత్యాప్రకంపితమైపోయెను. ఆపరితాపముచే నాతనసర్వాంగకములును జ్వలించిపోవుచుండెను—ఆసుడిగాలిచే నాతని ప్రాణవల్లికలు తల్లడిల్లి పోవుచుండెను.

ప్రబోధానందప్రియశిష్యుఁడగుకల్యాణానందస్వామియంతటివాఁడు భ్రిమోన్మాదగ్రస్తుఁడగుభారతరావుపిచ్చిమాటలచే నంత భీరుఁడైపోవుట యేమిటికి? మదగజము మశకము నిరసించినట్లు మనశ్చలనముగలభారతరావు మనోనిగ్రహముగలమహనీయుఁడగు స్వామిని దిరస్కరించినాఁడు! భారతరావు కేవలమును బిచ్చివాఁడు, అట్టియవస్థలోఁ బ్రపంచమునే లక్ష్యముచేయనిమాతఁడు పరమహంసయగుస్వామిని బహుమానింపలేదనుటలో వింత యేమున్నది? స్వామి యేమో కాని యంతవఱకాలోచించుకొనలేదు.

మనోనిగ్రహము లేనివాఁడని ప్రబోధానందుఁ డాతని దివఱకే తూలనాడియున్నాఁడు; అందుచేతనే మాతని కిప్పటివఱకును మాతృమందిరసందర్శనభాగ్యము లభియింపఁజేయుట లేదు. కల్యాణానందస్వామి యిప్పుడుగూడ నట్లే యగడపడుచున్నాఁడేమి? దారుణకర్ములకుఁగూడ నతిసులభముగ లభియించుచున్నమాతృసందర్శనము తపోధనుఁడగునాతని కేల దుర్లభమైపోయినది? ప్రబోధానందునకుఁ బాపాత్ములపై నున్నంతజాలి ప్రియశిష్యుఁడగునీత

నిపై నేల లేకుండఁబోయినది? కల్యాణానందస్వామియిట్లు తర్కవితర్కములను జేసికొనుచు నొంటిగ నాగిరిగర్భాలయమున సత్యదేవునకెదుర దీర్ఘశ్వాసములను విడుచుచుఁ గూర్చుండి యుండెను.

ఆ యాలోచనాపరంపరలలో నాతని హృదయ మవశమైపోయినది—ఆతని కన్నులు మూఁతలుపడిపోయినవి. అప్పుడు సంపూర్ణయౌవనకళాసమంచిత యగు జగన్మోహన దేవీమూర్తి యమృతశుభ్రవసనావకుంఠనవతియై యంతరంగమునం దల్లనల్లన విహరించుచున్నట్లాతనికి గోచరించెను. ప్రబోధానందస్వామి యామూర్తినే దేవీమూర్తిగ భావించుచుండు మని యాతని కుపదేశించి యున్నాఁడు. ఆతఁ డాప్రబోధమున ననుసరించి తదేకదృష్టితో ధ్యానముచేయుచునే యుండెను గాని యప్పు డప్పు డాకస్మికముగ నాతని లక్ష్యము చెదరిపోవుచుండెను. కళ్యాణానందస్వామికిఁ గార్యనిర్వాహణమునం దెంతటి సంపూర్ణసామర్థ్యమున్నదో మనోనిగ్రహమునం దంతటి సంపూర్ణశక్తి లేదు. ఆతఁ డింద్రియవిజితుఁడు కాఁడు గాని సంపూర్ణముగ నతీంద్రియుఁడు కాఁజాలకపోయెను. సంపూర్ణచంద్రునియందుఁ గళంకమువలె నాతనికున్న లోప మదియొక్కటియే. కరుణించి యాయొక్కలోపమును మన్నింపవలయునని యాతఁ డనేకపర్యాయములు ప్రబోధానందునిం గూర్చి క్షమాప్రార్థనములం గావించుకొనియే యున్నాఁడు. తనప్రియశిష్యుని నిష్కళంకునిగఁ జేయవలయు నని ప్రబోధానందుని పరమోద్దేశము.

కల్యాణానందునకుఁ గూడ నట్టికోరికయే యున్నది. కాని, యాతనికి ధ్యానభంగ మగుచుండెను. ప్రేమైకనయనములతోఁ దన్ను వీక్షించుచున్నట్లున్న యాదేవీమూర్తి నాతఁడు నిశ్చలనయనములతోఁ జూడఁజాలకుండెను. అవనతవదనయై తన్నుఁ బ్రార్థించునట్లున్న యామెను బ్రార్థింపవలయు ననిన నాతనికి వాక్స్తంభనమై

పోవుచుండెను. ఆదివ్యమూర్తి మందహాసవదనారవిందసందర్శనమున నాతని సర్వేంద్రియములు సమ్మోదరసాపగావగాహనసుఖము ననుభవించుచునే యున్నవిగాని యాకస్మికముగ నాసుఖామృతసముద్రమున మునింగిపోవుచున్నవి. మఱియు నాసుఖామృతసముద్రము నిస్తరంగగంభీరమై యుండుటలేదు; భవతరంగకల్లోలితమై యుండెను. ఆకల్లోలతరంగములం బడి యాతనిసర్వేంద్రియములును జెదరి కొట్టుకొనిపోవుచుండెను. అతికష్టముతో నాతఁ డాత్మసంశయమనము చేసికొనుచునే యుండెను. కాని యాతని శక్తి నిలుచుటలేదు.

కల్యాణానందునకు నిరుత్సాహములేదు గాని యుత్సాహము కలుగుటలేదు. ఆతనికి నిరాశలేదుగాని యాశకవకాశము కలుగుటలేదు. ఆసందిగ్ధావస్థలో నాతఁడు కొట్టుకొనిపోవుచుండెను. ఎందఱనో దీనుల నుద్ధరింపఁజాలిన యామహాత్ముఁ డిప్పు డాత్మసముద్ధరణముకొఱ కార్తుఁడై ప్రబోధానందానుగ్రహమున కెదురుచూచుచుండెను. కరుణాళుఁడగు ప్రబోధానందుఁ డాతని కట్టికష్టోపాసనము నేలపరీక్షించెనో? కల్యాణానందున కది యిష్టమగుకష్టమే యగు స్వామియుద్దేశమైయుండవచ్చును. కాని శిష్యుఁడగు కల్యాణానందున కట్లుతోఁచుటలేదు. ఆతఁ డాదేవీమూర్తిని దర్శింపఁజాలకుండెను. ఆతని ప్రాణములు చలించిపోవుచుండుటచేఁ గన్నులు చెదరిపోవుచుండెను. అంతలో నాదేవీమూర్తి యంతర్ధానమైపోయెను. అప్పుడాతఁడు శోకగద్గదస్వరముతో "హా దేవీ! ఎంత పాపాత్ముఁడను!" అని పలుకుచు దుఃఖవివశుఁడై పడిపోయెను.

కల్యాణానందునకుఁ దెలివి వచ్చునప్పటికిఁ దాను ప్రబోధానందస్వామియొడిలోఁ బడియున్నట్లు తెలియవచ్చెను. తడసీ యాతఁడతిసంభ్రమముతో లేచి "స్వామీ! అపరాధిని! క్షమింపుము! క్షమియింపుము!" అని పలుకుచు స్వామిపాదములపైఁ బడియెను.

స్వామి మాతనిలేవనెత్తి సాంత్వనస్వరముతో "వత్సా! ఏమియీవి భ్రాంతి?" అని హెచ్చరించెను.

కల్యా—స్వామీ! నేను విభ్రాంతిలోఁబడిపోవుచున్నాను. నన్నుద్ధరింపుము!

ప్రభో—కుమారా! అనుతాపపడకుము! నీవు స్వధర్మమును నిర్వహించి జగన్మాతకుఁ బ్రియపుత్రుఁడవైతివి.

కల్యా—స్వామీ! మాతృసందర్శనము లేకుండఁ బోవుటకు నేనేమియపరాధము చేసితిని?

ప్రభో—బిడ్డా! నీయపరాధము నీయనుతాపముచే క్షీణించి పోయినది. ఇఁక నది మాతృదేవతానుగ్రహముచే సంపూర్ణముగఁ బరిమార్జితమైపోవఁగలదు.

కల్యా—ఎప్పటికిఁ దండ్రీ!

ప్రభో—వత్సా! నిరాశ చెందకుము! ఆజగన్మాత గోదావరీ తీరమునఁ గోటిలింగక్షేత్రమునఁ గొలువుచేసి తనబిడ్డవగు నీవు నీసోదరులనందఱ నెట్లుద్ధరించితివో కన్నులారఁగాంచుచుఁ బరమానందమునందుచున్నది. నిన్నుఁ జూచుటకై తనవేయికన్నులను దెఱచుకొని వేగిరపడుచున్నది. కుమారా! అధైర్యపడకుము! రాఁగలవసంతరాత్రులలో వసంతోత్సవనర్తకియగు జగన్మాతృకామూర్తిదివ్యసందర్శనము నీకు లభింపఁగలదు!

అని ప్రబోధించి ప్రబోధానందస్వామి యంతర్హితుఁడై పోయెను.



## పదునేనవ ప్రకరణము.

నీవు పోయెడుతోవలో ♦ నీ యదృష్ట
దేవత యభీష్టఫలము లం ♦ దించుచుండ
బాఁగ నేవేగముగఁ బోవ ♦ వంగి నావంగ
నెపుడు కోరెదవీవు? శే ♦ షేంద్రుఁడయ్య!

శేషు—హారావళి.

వేంకటేశ్వరుఁడు కష్టపడి యెట్లో రాజమహేంద్రవరమునకు వచ్చెను. ఆతఁ డానగరమునం దనసూయకొఱకు దినమునకొకవీథిగఁ దిరిగితిరిగి చూచుచుండెను. ఆతఁడు జేగురుపాడునుండి బయలుదేరు నప్పుడు ధర్మబుద్ధియగు నొకవైష్ణవబ్రాహ్మణుఁ డాతనిం జూచి జాలిపడి పదిరూపాయల నాతనికి దారిబత్తెముగ నొసంగెను. ఆసొమ్మంతయు నిచ్చటవ్యయమైపోయినదిగాని యనసూయవృత్తాంత మేమియు నాతనికిఁ దెలియ లేదు. ఇఁక నానగరమున దినముగడపుటకుపాయ మేమున్నది? ఆతఁ డన్నమునకై యెవ్వరి నాశ్రయింపఁగలఁడు? ఆతఁ డానగరమునం దొక్కవిలాసభవనమునుమాత్రమే యెఱుంగును. అందలివిలాసము లిప్పుడు కట్టువడిపోయినవి. ఆగోపాలరా విప్పు డగపడుటలేదు. అగపడినను వేలకొలఁది ద్రవ్యమును విచ్చలవిడిగ వెచ్చించిన చేతులతోఁ గడుపుఁగూటికై వేంకటేశ్వరుఁడే మొగముపెట్టుకొని యాతనియొద్దకుఁ బోయి యాచింపఁగలఁడు? అన్నముకొఱ కితరులను దేవిరించుటకంటె నాత్మత్యాగమే యుత్తమముగ నాతనికగపడుచుండెను. లక్షాధికారియై జీవించినలోకమున భిక్షాపాత్రముతో జీవించుటకంటెను దుర్మరణము మఱియు కటియున్నదా?

కాని, వేంకటేశ్వరరావున కనసూయను దర్శింపవలయు ననునాశ బలవంతముగ నడ్డగించుచుండుటచే నాతనిప్రాణములు శరీరమునుండి వదలిపోఁజాలకుండెను. దేవీసత్రమున నిత్యసంతర్పణములు జరుగుచుండె ననుసంగతి నాతఁ డిదివఱకే వృద్ధబ్రాహ్మణునివలన వినియుండెను. ఆమాట యాకస్మికముగ జ్ఞప్తికి వచ్చుటచే నాధార మేర్పడినదని సంతోషించి మెల్లగఁ గోటిలింగక్షేత్రమునకుఁ బోయెను. ఆదేవీసత్రమున నన్నవస్త్రములు లభియించినవి. అప్పుడచ్చట భుజియించుచు దినమంతయు నల్లాడి యనసూయను వెదకుకొనుచుండెను. ప్రతిదినము మూఁడువేళలను దేవీపీఠమును సందర్శించి జగన్మాతను బ్రార్థించుచుండెను.

దినములు గడచిపోవుచున్నవి. ప్రాణసమాన యగు ననసూయ యగపడుట లేదు. ఆమెజాడయైనఁ దెలుపువా రెవ్వరునగపడకుండిరి. ఆదుఃఖముచే నాతనిప్రాణములు తల్లడిల్లిపోవుచుండెను. ఆపరితాపముచే నాతనికిఁ బ్రాణములను నిలిపికొనియుండుట మిగుల దుర్భరముగా నుండెను. మహారాజువలె జీవించుట కాతనికన్నవస్త్రములు లభియించుచున్నవి. మహామాత దుర్లభదివ్యసందర్శన మాతనికి నిరంతరమును సులభముగ లభియించుచున్నది. మహాపాపతాపసంహారిణి యగుపావనగౌతమీతరంగిణి సర్వకాలములయందు నాతనికి స్వాగత మొసంగుచున్నది. అయినను లోకమంతయు నాతని కంధకారముగనే యుండెను. ప్రేమామృతదివ్యజ్యోతి యగు ననసూయ యాతనికన్నులకు దూరమైపోయినది!!

సాయంకాలపూజాసమయమున దేవీపీఠపార్శ్వమునందు సరిగ నానందాదేవి యెప్పుడును నిలిచియుండుతావున ననసూయ చిన్నిబిడ్డ నెత్తుకొని మాతృదేవతాప్రతిమూర్తింబోలి నిలిచియున్న ట్లాతని

యాతని నయనములకుఁ బొడకట్టెను. ఆనందోద్రేకముచే నాతఁడామెను సమీపించుటకు లేవఁబోయెఁ గాని యాకస్మికముగ నపచారభయ మాతని నడ్డగించివైచినది. స్వప్నభ్రాంతియేమో యనియెంచి యాతఁడు కన్నులను దుడిచికొని మఱియొకసారి పరీక్షించెను. అప్పు డచ్చట వేంకటేశ్వరుని కాత్మేశ్వరియగు ననసూయ యగపడలేదు! ఆనందమూర్తి యగునాపసిబాలుఁ డిప్పు డామెయొడిలో నాడుకొనుటలేదు. ఆదేవీపరిచారిక యగునానందాదేవియే యిప్పు డచ్చటనిలిచి భువనమాతను బూజించుచున్నది. ఆతనివిభ్రాంతనయనముల కానందయే యనసూయ యైనది! ఆవిభ్రాంతిచేతనే యాతని కీయఖిలప్రపంచము ననసూయామయంబుగ నగపడుచుండెను.

వేంకటేశ్వరుఁడుకూడఁ దాని కట్లే భావించుకొని తత్త్వమును నిశ్చయించుకొనియెను. ఆతని కారాత్రి యాహారమసహ్యమైపోయినది. ఆతని కన్నులకు నిద్ర దూరమైపోయినది. ఆదేవీపీఠసాన్నిధ్యమున నాతనివిభ్రాంతనయనముల కగపడిన యమృతమోహన సుకుమారపులకితవక్షోభాగయగు ననసూయాదేవీమూర్తి యాతని హృదయకమలము నధిరోహించి యుండెను! ఆతఁ డాదేవీధ్యానము నందే నిమగ్నుఁడైపోయెను. ఆధ్యానోన్మాదముచే నాతఁడు నిలిచిన చోట నిలువఁజాలకుండెను.

తదేకధ్యానముతో వేంకటేశ్వరుఁడాపండువెన్నెలలోఁ బడి గోదావరీతీరమున నున్మత్తునివలె సంచరించుచుండెను. ఆవెన్నెలలో నాతని దృష్టి కగపడినప్రతివస్తువు ననసూయవలెనే తోఁచుచుండెను. అనసూయయొడిలోనున్న చిన్నిబిడ్డ యవ్యక్తమధురస్వరముతో “నాన్న—నాన్న” యని యస్పష్టముగ నుచ్చరించుచున్నట్లును, నిట్టూర్పులువిడుచుచు ననసూయ శోకగద్గదస్వరముతో “నాయనా! వచ్చియు రానినీముద్దుమాటల నానందముతో నీజనకుఁడాలకించి

నిన్నానందింపఁజేయు భాగ్యము నీకుఁగలిగియు లేకపోయినది! తండ్రీ! భర్తృవంచితురాల నగునాగర్భమునం బుట్టుటచే నీవెంతటి నిర్భాగ్యుఁడ వైపోయితివి!'' అని విలపించుచున్నట్లు నాతనికి గోచరించెను. కరుణరసోద్దీపకంబు లగునావాక్యము లాతని హృదయగోళమున వజ్రాఘాతము వలెనుండెను.

ఆతఁడట్లే యున్మత్తుఁడై తిరుగుచుండెను. ఉద్భ్రాంతుఁడై ప్రేమాద్రిక్తంబగు శోకగద్గదస్వరంబున ''హా! ప్రణయినీ! ప్రాణేశ్వరీ! అనసూయా! ఈపాపాత్ముని పాపపంకమును నీపవిత్రప్రేమామృతరసలేశముచేఁ బరిమార్జితముగఁ జేసి త్వదేకశరణ్యుఁ డగు నీదీనునుద్ధరించుకొనుము. ఎల్లెడలనగపడుచుండియు నాశ్రయమొసంగి యాదరింపకుండ నన్నేల యీరూ నప్పెట్టెదవు? ప్రాణప్రియా! నీవు దయార్ద్రహృదయవు— నేను క్రూరచిత్తుఁడను. నీవు పావనప్రేమమూర్తివి! నేను పాపకలుషవిగ్రహుఁడను! అయినను నేను నీవాఁడను! దుర్భరావమానదుఃఖవికలసమయమునఁ గూడ నీవు నీయమృతమధురవచనములతో ''నీవెప్పటికైన నావాఁడవే!'' అని నన్ను వచియించితివి! సాధ్వీమణి వగునీవు నీసత్యవ్రతమును నిలుపుకొనఁగలవు. హృదయేశ్వరీ! నేను నీవాఁడను! నీవు నాదానవు!—అజ్ఞానముచే—ఆగ్రహావేశముచే నేనీపరమార్థమును గ్రహింపఁజాలకపోయితిని! ఆత్మేశ్వరీ! అజ్ఞానకృతం బగునాయపరాధమును క్షమియింపుము! నీకంటె నాకీలోకమున దిక్కేమియును లేదు. నిరంతరమును నీపవిత్రస్వరూపధ్యానముచే నాపాపచింతనము లన్నియును నిర్మూలములై పోనవి. పశ్చాత్తాపజ్వాలలచే నాసర్వాంగకములును దహించికొనిపోవుచున్నవి. ప్రాణప్రియవగు నీవు నీప్రేమామృతకటాక్షప్రసారముచే నీయగ్నిజ్వాలనుండి నన్నుద్ధరింపుము! నీవే నాప్రాణమవు—నీవే నాప్రాణాధారమవు—నీవే నా

గతివి - నీవే నాగతివి — సతీశిరోమణీ ! ఈదుఃఖమునుండి నన్నుద్ధ రింపుము ! ఈపరితాపమునుండినన్ను రక్షింపుము ! '' అని యుచ్చై స్స్వరంబున విలపింప నారంభించెను.

ఆసమయమునం దనసూయయుఁ దనవలెనే క్షమాప్రార్థన ములం గావించుచుఁ దన్ను వెదకుకొనుచున్నట్లు స్త్రీకంఠస్వరమున వెలువడుచున్నయార్తాలాపము లాకస్మికముగ నాతని చెవులఁబడి యెను. ఆతఁడు తదేకధ్యానముతో నాలకించుచుండఁగా ననసూయ యాకస్మికముగఁ బ్రత్యక్షమైనట్లగపడియెను. తోడనే యాతఁడు శోక విస్మయానందపరవశుఁడై యొక్కపరుగునఁబోయి ''సతీమణీ! నాన ర్థాపరాధములను క్షమియింపుము ; '' అనిపలుకుచు నారమణీ మూర్తిపాదములపైఁ బడిపోయెను. తోడనే యారమణీమూర్తి యును దుఃఖపరికంపితస్వరముతో ''ప్రాణేశ్వరా! నేనుమహాపా పాత్మురాలను. నీవుక్షమియించినచో నాపాపములు పరిమార్జితము లు కాఁగలవు. క్షమియింపుము ! '' అనివిలపించుచు నిలువునఁగూలఁ బడిపోయెను.

వేంకటేశ్వరుఁడు కన్నులవిచ్చిచూచెను. ఆతనిసర్వాంగకము లొక్కసారిగఁ బరికంపితములైపోయెను. అగ్నిజ్వాలనుండి యవ్వలఁ బడినట్లాతఁడచ్చటినుండి చటాలునలేచి దూరమునఁదూలిపడిపోయె ను. ఆరమణీమూర్తి యెవ్వరు ? ఆతనికంటికిఁ గాలభుజంగిశినియైన రాజరత్నము !!

ఇదియేమి ? వేంకటేశ్వరుఁడు సంజీవనీమంత్రమును జపియిం చుచుండఁగా మృత్యుదేవతసాక్షాత్కరించినదేమి ? ఆతఁడమృత ఫలము నారగించుచుండఁగా విషకీటము వెలువడినదేమి ? ఆతఁడు నిత్యానందమయస్వర్గధామమును గోరుచుండఁగా నిరయాంధకూప

ము లభియించిన దేమి? ఆతఁడు కలువపూవులదండకొఱకు వెదకుకొనుచుండఁగాఁ గాలభుజంగిని యగపడిన దేమి?

వేంకటేశ్వరుని హృదయమునందలి భావము లన్నియు నొక్కసారిగ మెఱసిపోయెను. ఆతఁడు భయభ్రాంతుఁడై భయంకరమృత్యుముఖమునఁ గాంచిన ప్రాణిలుబ్ధునివలె నూర్ధ్వశ్వాసములతోన టనుండి యొక్కఁటేపరుగున వెడలిపోయెను. రాజరత్నము నిశ్చేష్టురాలై పోయెను. కొంతసేపటి కా నిశ్శబ్దమగు వెన్నెలవెలుఁగున దూరమునుండి గంభీరస్వరముతో "వలదు! సాహసము చేయవలదు! కుమారా! ఆత్మహత్యమహాపాతకము!" అను శబ్దములు శీతలవాయుతరంగములనుండి రాజరత్నమునకు శ్రవణగోచరము లయ్యెను.

రాజరత్నము భయసంభ్రమములతో గుభాలున లేచి వేంకటేశ్వరుఁడు పరుగెత్తుకొనిపోయినమార్గము ననుసరించి యతివేగముగఁ బోయెను. ఎంతదూరమట్లుపోయి పరీక్షించినను, వేంకటేశ్వరుఁడిక నామె కగపడలేదు. గౌతమీపావనజలతరంగకలకలస్వనములు తక్కమఱియెట్టిశబ్దము నామెకు వినఁబడను లేదు. ఆమె యట్లే తిరిగి తిరిగి యాయాసముచే నొక్కచోఁ బడిపోయెను.



## పదునాఱవ ప్రకరణము.



గురుభక్తి కళారత్న
కరతరణము శిష్యజీవి • కావరణంబుల్
గురుభక్తి గలుగువారల
కరుడే సకలార్థసిద్ధి • యగుట ధరిత్రిన్

గురుభక్తి—హారావళి

పరిబోధానందుని యవ్యాజవాత్సల్యముచే రంగని యజ్ఞాన లేశము వదలిపోయినది. ఆతఁడు మాతృమందిరమునందలిసరస్వతీ మందిరమున విద్యావంతుఁడయ్యెను; మాతృదేవతారాధ్యము నందాతఁడు మాతృసేవాదీక్షితుఁడుకూడ నయ్యెను. మాతృదేవతారకాకంకణ మాతనికి లభియించినది. శిష్యవత్సలుఁడగుపరిబోధానందస్వామి యాతనికి రంగదాసుఁడనునామమును బ్రసాదించెను. రంగదాసునిహృదయ మిప్పుడు తీక్ష్ణభావమును వదలి శాంతరస పరిపూర్ణమైయుండెను. ఆఫలమునందలిపులుపు విరియఁబారిపోయెను. ఆజలమునందలియుడుకు దిగజారిపోయెను. ఆకాంతియందలి వేఁడి చల్లారిపోయెను. కాఁగిచల్లారినపాలవలె నాతఁడిప్పుడు శాంతమూర్తియై యుండెను.

ధర్మప్రతిష్ఠాపనమునకుధర్మమే యాధారమైనదని రంగదాసుఁడిప్పటికి సంపూర్ణముగ గ్రహియింపఁగలిగెను. ఆతఁడిప్పుడు ప్రబోధానందస్వామి యనుమతింగైకొని మాతృదేశమంతటనుసంచారముచేయుచు మాతృభక్తి, సర్వసోదరత్వము, భూతదయ యను విషయములంగూర్చి యుపన్యసింప నారంభించెను. మాతృభక్తి

ఖామణి తంబుర చేఁబూని పాడుచు నావేశనృత్యములం గావించుచు వీథులవెంట నుపన్యసించుకొనుచుఁ బోవుచుండెను. ఆతని ధర్మోపన్యాసముల నాలకించినవారు—ఆతనియావేశతాండవములం గాంచినవారు పరక్షణమునందే భక్త్యావేశపరవశులైపోవుచుండిరి. మాతృసేవాపరాయణు లగుచుండిరి.

ఆతనికి దొంగరంగఁడనునపఖ్యాతి దూరమైపోయినది. ఆతనిజూచుటకుఁగూడ భయపడువారందఱు నిప్పు డాతనితత్త్వముం దెలిసికొనుటకుఁ బ్రయత్నించుచుండిరి. ఆతఁ డేకులమువాఁడో యింతవఱ కెవ్వరికిని దెలియదు. కాని యార్యధర్మనిరతుఁ డగు నాతని నాంధ్రులందఱు నాత్మీయునిగనే భావించుచుండిరి. మాతృసేవాపరాయణుఁ డగునాతఁడుకూడ నందఱ నాత్మీయులుగనే తలంచుకొనుచుండెను. ఆతని నెఱింగినవారందఱు నింతలో నింతవాఁ డెట్లయ్యెనని యాశ్చర్యపడుచుండిరి. ఆశ్చర్యము కాదా? పాదములతోఁ దన్నిపాఱవైచినపాషాణము పద్మరాగమణియైనది! చేతులతోఁ దుడిచివైచినయశ్లీలశబ్దము చింతామణీమంత్రమైనది!

ఆతనియుపన్యాసములు సర్వజనసమ్మతములైయుండెను. సర్వధర్మసంకలితములై యుండెను. ఆప్రబోధకుక్కుటారావములు త్రయీసమ్మతములై త్రికాలావబోధకములై యాంధ్రసోదరుల నందఱ నానందోత్థితులం గావించుచుండెను. అందఱు నాప్రబోధవాక్యముల నాలకించి యావిధముగ నాచరించి యాత్మధర్మపరిపాలకులై మాతృసేవానిరతు లగుచుండిరి. అందఱును మాతృమంత్రమును జపియించుచుండిరి. అందఱును దమతమయంతరంగములయందే మాతృదేవతామందిరమును సందర్శించుచుండిరి. ఆమాతృమంత్రధ్యానముచే నాంధ్రులయంతరంగములయందు సర్వసోదర

# మాతృమందిరము

సద్భావము జాగరిత మగుచుండెను; పరస్పరభిన్న భావములు పంచలై పోవుచుండెను. అజ్ఞానాంధకారము విరిసిపోవుచుండెను. అందుచే మాతృమందిర మనిన మాతృదేశమే యనియు, మాతృసేవ యనిన మానవసేవయే యనియు మాతృధర్మదీక్ష యనిన నాత్మోద్ధరణదీక్షయే యనియు విస్పష్టముగ నందఱకును దెలిసిపోవుచుండెను.

రంగదాసుఁడు మునుపును సుప్రసిద్ధుఁడే. ఇప్పుడును సుప్రసిద్ధుఁడే యయ్యెను. కాని యిప్పుడీతఁడాతఁడు కాఁడు. భయంకరమగు నీయిహ జీవనమునందే యీతనికి భావనజన్మాంతరము కలిగినది.

రంగదాసుఁడు పట్టణములయందును బల్లెలయందును దిరిగి తిరిగి యుపన్యాసములనిచ్చుచుఁ గ్రమముగాఁ బిఠాపురమునఁ బ్రవేశించెను. ఆతని యుపన్యాసములకుఁ బీఠము లక్కఱలేదు. పెద్దలక్కఱలేదు. ప్రణామము లక్కఱలేదు. ప్రత్యుత్థానము లక్కఱలేదు. ఆతఁడు మాధవపుష్కరిణికి సమీపమున మసీదునొద్దరథములు నిలుచు బయటియందలి రాజమార్గమున నిలువఁబడి పరమానందముతోఁ దంబురమీటుచుఁ బ్రేమసూచకస్వరమున నీక్రిందివిధముగ గానము చేయ నారంభించెను.

"అందఱకు నొక్కతె మె తల్లి • యన్నలార !
అందఱకు నొక్కఁడే తండ్రి • యన్నలార !
అందఱకు నొక్కటే గతి • యన్నలార !
అన్నలము తమ్ములము మన • మాంధ్రులార !—
దారధనపుత్రవాంఛల • బారిఁబడి
తెలివి యుండుటచేఁ బశు • వులను మించి

విశ్వసోదర భావంబు ♦ విస్మరించి
తల్లడిల్లుచు నుంటిమో ♦ తమ్ములార !—
తాను దనపండుఁ దినఁబోదు ♦ తేనెఁటురఁటి;
తాను దనపాలఁ గ్రోలదు ♦ ధన్యసురభి;
తాను దన తావిఁగ్రోలదు ♦ తమ్మిపూవు
జగతిలో నరుఁ డొక్కఁడే ♦ స్వార్థపరుఁడు !—
ధారుణీదేవి ధరియించు ♦ తల్లి మనకు
ధాత్రిదేవత పోషించు ♦ తల్లి మనకు
అఖిలజీవులఁ దనకడు ♦ పారఁగన్న
తల్లి, భూదేవి యొక్కరి ♦ ధనము గాదు!—
ఒకని మట్టుట దోష మొం ♦ డొకని చెంత
నోలసియుండుట దోష మిం ♦ కొకఁతోడ
మాటలాడుటే దోష మి ♦ దేటిమాట ?
మాఁదిమాకీ ! యేకగర్భజు ♦ లైనమనకు ?—
పేదలగుసోదరులనోట ♦ బెడ్డఁగొట్టి
యనుభవంబునకంటె న ♦ త్యధికవృత్తి
ధనము ధాన్య మార్జించి పె ♦ త్తనముసేఁత
వసుపతిత్వమె ? తస్కర ♦ త్వంబుగాక—
పొట్టకును బట్టకును లేక ♦ పొక్కి పొక్కి
తోడిబిడ్డలు మలమల ♦ మాడుచుండఁ
గోటలును పేటలును గల్గి ♦ కులుకుచుంట
ముష్కరత్వంబు కాక పి ♦ భుత్వ మగునె ?—
కలిమిగలవారు లేనివా ♦ రలకు మిగులు
లేనివారలు కలవారి ♦ లెంక లనుచుఁ

దలఁచి వర్తించుచున్నంత ♦ దనుక మనకుఁ
శాపనిష్కృతి లేదయ్య ! ♦ భ్రాతలార !—
సకలజీవసంతతులకుఁ ♦ జాలినంత
యన్నమును గూర్చుచున్నది ♦ కన్నతల్లి
కడుపుగా లెక్కితమ్ముల ♦ కన్ను మూసి
మారగింప నోరాడునే ♦ యన్నలార !—
కలిమిలేముల భేదముల్ ♦ కొలఁదిగొప్ప
భేదములు జాతిభేదవి ♦ వాదములును
దలఁపవలదయ్య ! సర్వసా ♦ దర్యదృష్టి
సతులం గూర్పఁడయ్య ! మా ♦ యన్నలార !—
ఏకఫలభోగకాంక్షచే ♦ నెట్లు పక్షు
లేకవృక్షాశ్రయంబున ♦ నెసఁగు నట్లె,
యేకఫలకాంక్షచే మన ♦ మేకదేశ
మాతఁ గొలువంగవలెనయ్య ♦ భ్రాతలార !—
సీ॥ మనమహారాజులా ♦ తమ శ్రీ స్వభోగార్థ
మే కల్గలేదని ♦ యెంచుదాఁక
మనభూమినాథులా ♦ తమకుటుంబభుక్తికే
తమకల్మి కాదని ♦ తలఁచుదాఁక
మనవణిగ్వర్యులా ♦ తమప్రవృత్తి ధనాభి
వృద్ధికే యనుబుద్ధి ♦ విడుచుదాఁక
మనలోన మనమొక్క ♦ జననిగర్భము నుండి
యరుగుదెంచితి మని ♦ యెఱయుదాఁక
శాత్రవోపద్రవంబు ద ♦ స్కరభయంబు
భీమదుర్భిక్షపీడ వి ♦ భేదబాధ

తొలఁగిపోదయ్యా! యిఁక శాంతి నిలువదయ్యా
యాత్మసంరక్ష లేదయ్యా! • యాంధ్రులార!"

నిమిషములో వేలకొలఁది జనులా ప్రదేశమందు తటను నిండి పోయిరి. ఆతనిగంభీరస్వరమందఱకును విస్పష్టముగ వినవచ్చుచుండెను. ఆప్రబోధవాక్యములచేనందఱు నానందమగ్నులగుచుండిరి. వచ్చినవారు కదలుటలేదు. చిన్నలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు, మూఢులు, జ్ఞానులు, వీరువారననేల? అందఱకు నతని వాక్యములమృతమయములుగా నేయుండెను. ఆతనిలో నేమున్నది? ఆప్రబోధానందుని మహిమలోనున్నది. ఆమాతృదేవతకటాక్షములోనున్నది. మునుపటి యారంగఁడు కాఁడా యీరంగదాసుఁడు?

---

## పదునేడవ ప్రకరణము.

పొలుపు దక్కిన పాప • పూర్ణిమారజని
వరశరచ్చంద్రికా • వసనంబుఁ దొడిగె;
అవశయై సొక్కిన • యాషాఢసరసి
ప్రావృడ్ఘనాతప • త్రచ్ఛాయ నిలిచె;
చెలువెదియున్నదై • శిరలతాతన్వి
లలితవసంతవి • లాసంబుఁ గాంచె.

### ఏకాంతసేవ.

అప్పుడు శ్రీకల్యాణానందస్వామిపాదసాన్నిధ్యమునం గావించినదృఢప్రతిజ్ఞ నిప్పటికిని సక్రమముగఁ బరిపాలించుచు నేయుండెను. ఆతఁడు పాడిపంటలతోడను ధనధాన్యములతోడను దులతూఁగుచుం

డెను. అతనిగోరక్షణశాల యాంధ్రదేశమున సుప్రసిద్ధ మయ్యెను. అతఁడంత్యకులజుఁడుగా నుండియు మద్యపానాదిదుర్వ్యసనదూషితులగు నగ్రవర్ణములవారికంటెను నత్యుత్తమగుణసంపన్నుఁడై యుండెను. అతనిప్రేమైకపుత్రిక యగుముత్యాలిప్పుడు పదునాలుగేండ్లవయసు కలదయ్యెను. ఆమెకుఁ బెండ్లియీడు వచ్చినది. కాని, యభినవయౌవనవతి యగునావిద్యావతి కన్నివిధములఁ దగువరుఁడాతనికులమునం దగపడుట లేదు. అప్పని కది యొక్కటియే విచారముగనుండెను.

కులము వాఁ డనునుద్దేశముతో బంగరుబొమ్మవంటి యాబాలిక నొకపశుప్రాయునకుఁ గట్టిపెట్టుట యాతని కిష్టము లేక యుండెను. అందుచే ముత్యాలున కింకను బెండ్లి కాలేదు. క్రైస్తవమతము నవలంబించినశూద్రుఁ డొకఁ డాబాలికరూపయౌవనగుణసంపత్తిం జూచి యానందించి యొకనాఁ డప్పనియొద్దకుఁ బోయి తనకాబాలిక నిచ్చి పెండ్లిచేయవలయునని యప్పనిం గోరెను. అప్పనికాసంబంధము బాగుగనే యున్నట్లగపడియెను. వరుఁడు విద్యావంతుఁడే కాక ధనవంతుఁడు. రూపవంతుఁడు. మతముచే నెట్లయినను గులముచేఁ దమకంటె గొప్పవాఁడు. అందుచే నాతనికాసంబంధము చేయఁదగినదని తోఁచెను. ఆతఁడు తనయుద్దేశమును దనభార్యకుఁ దెలిపెను. ఆమె భర్తమాట కెదురాడలేదు. ముత్యాలున కానంగతి తెలిసి తండ్రియొద్దకుఁ బోయి “తండ్రీ! నాకాతని బెండ్లియాడుట కిష్టము లేదు. పెండ్లియాడఁ దలఁచినచో నేనే నామనసువచ్చినవరుని గోరుకొందును! అంతవఱకును నీవు నాపెండ్లికై బెంగపెట్టుకొనవలదు!” అని చెప్పెను.

అప్పుడు తనప్రియపుత్రిక యగు ముత్యాలును గన్నుల కద్దుకొని పెంచుకొనుచున్నాఁడు. ఆమె మనసున కెట్టికష్టమును గలుగకుండఁ జూచుకొనుచున్నాఁడు. ఆమెగుణవతి యనియు, వివేకవతి యనియు నాతనికి సంపూర్ణవిశ్వాసమున్నది. అందుచేనప్పుడు తనప్రియపుత్రికమాట కడ్డుచెప్పఁజాలకపోయెను. బిడ్డకు నచ్చిన వరున కిచ్చిపెండ్లిచేయుటయే సర్వోత్తమవివాహమని యాతఁడు నిశ్చయించుకొనియెను.

ఏఁడాదినుండి ముత్యాలునకు రంగదాసుఁ దగపడుట లేదు. ఆబాలికపవిత్రప్రేమమయప్రథమదృష్టులు ప్రథమమునం దాతని ప్రేమమయమూర్తియందే ప్రసరించెను. పరిచయవశంబున నాప్రేమాంకురము క్రమక్రమముగఁ బ్రేమవల్లరి యగుచుండెను. ఇరువురహృదయములయందును నజ్ఞాతముగ నంకురించిపల్లవించుచున్న ప్రణయలతాతత్త్వ మిరువురకు నగ్రాహ్యమే యైయుండెను. కాని తెలియకుండఁగనే యాయిరువురును బరస్పరప్రేమబద్ధులై యుండిరి. అన్యోన్యసందర్శనములేని వారిశిశిరకాలమునం దాప్రణయవల్లరి యాకురాల్చినది! వాడిపోవుటకుఁ గాదు! వసంతోదయమున మరలఁ బూర్వాధికరమణీయముగఁ బల్లవించుటకే—పుష్పించుటకే—ప్రణయామృతఫలసిద్ధిం గాంచుటకే!!

తొంటికంటెను బరమపావనమూర్తియై వచ్చి యుపన్యాసమిచ్చుచున్న రంగదాసునిఁ బరమానందవికసితనయనములతో ముత్యాలు చూచినది. ఆతనికవితోపన్యాససారమును గ్రహించినది. అప్పుడామెహృదయాంతరాళమున మినుకుమినుకుమనుచున్న ప్రేమజ్యోతి యొక్కసారిగ నుజ్జ్వలితమైన ట్లయ్యెను. ఆమెదూరమునందుండి యట్లే చూచుచు నానందపరవశయై నిలువఁబడిపోయెను.

ఉపన్యాసానంతర మున రంగదాసునకుఁ బ్రేమైకమూర్తి యగు ముత్యాలు నొకసారి చూచిపోవలయు నని కోరిక కలిగెను. పితాపురమువచ్చి ప్రణయసుందరి యగునామెను జూడకుండ నాతఁడెట్లు పోఁగలఁడు?

ఆతఁడు మాలపల్లెకుఁ బోవుచుండఁగా నాకస్మికముగ ముత్యా లాతనికంటఁ బడియెను. ఆసందర్శనమాత్రముచేతనే యాతఁడా ందపులకితుఁడైపోయెను. సంవత్సరమునకుఁ దరువాత మరల సందర్శనము! ముత్యా లిప్పు డమృతమోహనమూర్తి యైయుండెను. అప్పుడు ముత్యాలు లజ్జామధురమందస్మితవదనయై రంగదాసునకు నమస్కరించి మృదులస్వరంబున "అనుగ్రహమున్నదా? ఈచరణసేవకురాలుజ్ఞాపకముగ నున్నదా?" అనియెను.

ఆప్రశాంతమధురస్వభావ మెవ్వరిహృదయము నాకర్షింపదు? రంగదాసునకు సర్వేంద్రియములు నమృతావగాహనం బాచరించిన ట్లయ్యెను. ఆతఁడానందకంపితస్వరముతో "లేకేమి? ఈ ముత్యాలపేరు నిరంతరము నాకన్నులఁ గట్టినట్టే యున్నది." అనియెను.

ముత్యా—అదియే నాకోరిక. నేనిప్పుడు ధన్యురాల నైతిని.

రంగ—నీవు సుఖముగఁ జదువుకొనుచుంటివా?

ముత్యా—మీదయచే నాకెట్టికష్టమును లేదు.

రంగ—మీతల్లిదండ్రులు క్షేమముగనున్నారా?

ముత్యా—సుఖముగ నున్నారు.

రంగ—నీయూ పీనిఁదా?

ముత్యా—మీయనుగ్రహముచే నది బ్రదికినది. కోడెదూడను బెట్టినది.

రంగ—చూతనః ; పద—

ఇరువురును సంతోషముతో మాలపల్లెం బ్రవేశించిరి. అప్పుఁడానందముతో రంగదాసు నెదురుకొని యింటికిఁ దీసికొనిపోయెను; పరస్పరకుశలసంభాషణములచే వారికొకకొంత సేపానందముగఁ గడచిపోయెను. రంగదాసుఁడు వారిని విడువలేకవిడువలేక తుద కెట్లో యందఱను వీడుకొని వెడలిపోయెను.

## పదునెనిమిదవ ప్రకరణము.

ఈయుగ్రశక్తితో ♦ నీకేణుఁగాను
ఈమహత్త్వత్త్వముం ♦ దవసించదాఁక
ఈప్రేమరసముతో ♦ నీయుల్పడిచి
యీసుధార్ణవమునం ♦ దవసివదాఁక
ఈస్నేహరసముతో ♦ నీదీపకళిక
యీదివ్యతేజమం ♦ దనసినదాఁక
ప్రాణేశ ! నీదివ్య ♦ పాదపద్మముల
ధ్యానించి సేవించి ♦ భక్తిఁ బూజింతు

ఏకాంతసేవ.

ముత్యాలునకు గుండె గుఃభిల్లుమనిపోయెను. ఆతని దన యింట నుండుమని చెప్పుట కామె కధికార మెచ్చట నున్నది? ఆ రాణీముత్యము నిలిదారమునఁ గూర్పఁబడి యుండెను. ఆబంగరు చిలుక యినుపపంజరమునం జేర్పఁబడి యుండెను. ఆసుందరమందిరము పల్లెగూడెమునఁ గట్టఁబడియుండెను. అందుచేతనే యామె

కంతటిసన్మానభాగ్యము లేకుండఁబోయినది. ఎంతటిరూపగుణసంప న్నురాలైననేమి ? ఆమె కడజాతియందు జన్మించినది. అదియే యామెకుఁ గలగొప్పయవరోధము.

ముత్యాలునకేమియును దోఁచుట లేదు. ఆమెమనసు పరి పరివిధములఁబరుగులెత్తుచుండెను. తమకుటుంబమునకు రంగఁడు మఱవఁదగనిమహోపకారమును గావించి యుండెను; హీనజాతి యనియైనఁ దలంపక తన్నుఁ బ్రాణముకంటె నెక్కుడుగఁ బ్రేమిం చుచుండెను. ఆతనిఋణమును దీర్చుకొనుటకుపాయ మేమున్నది ? ఆప్రేమమయున కాత్మసమర్పణముం గావించి కృతకృత్యతం గాంచవలయు నని ముత్యాలు వేడుకపడుచుండెను.

నేనాతని ప్రేమించుచుంటిని. నన్నాతఁడు ప్రేమించుచుండెను. ఇట్టిచో మేమిరువురము నేల కలసియుండఁగూడదు ? అయ్యో ! ఎంతప్రేమించుచున్నను నేనుజండాలకన్యకను గాదా ? ఆతఁడు నన్నెట్లుకలుపుకొనుట కంగీకరించును ? ఎంతవిలువగలదైనను బాద రక్షలకుఁ బర్యంకసౌభాగ్యము లభియించునా ? ఎంతటియవివేకము కులమును దలంపక తలకుఁ దగనికోర్కె కోరుకొనుచున్నాను. బొమ్మ జాతినై పుట్టి పూజాపాత్రమను గావలయు ననుకొనుచున్నాను— ఏమి ? సిద్ధించుట కవకాశము లేకపోవచ్చునుగాని కోరుకొనుట కభ్యంతర మేమున్నది ? హీనకులమున జన్మించినంతమాత్రముచే జీవితము నిరర్థకమైపోవలసినదేనా ? పంకమునం జనియించినపద్మిని పరిమళించుట లేదా ? దయామయుఁ డగునాతని నర్థించి చూచె దను. ఆతఁడంగీకరించినను నంగీకరింపకున్నను నాహృదయమున నాతఁడే యధీశ్వరుఁడు ! నాకన్నుల కాతఁడే యానందము—నాజీ వితమున కాతఁడే నాథుఁడు ! నాకాతఁడే దైవము ! అపరిణయుస్వ

రూపునిపాదములఁ బట్టుకొని ప్రార్థించెదను. పాదదాసిగ నంగీకరించువఱకుఁ బ్రాణములనైనవిడిచెదనుగాని పాదములను విడువను.''

అని యనేకవిధముల భావించుకొనుచు నాబాలిక యర్ధరాత్రివేళఁ దల్లిదండ్రులకుఁ దెలుపకుండఁగనే యిల్లువిడిచి బయలుదేఱెను. అప్పుడే చంద్రోదయ మగుచుండెను. ఆయస్పష్టచంద్రాలోకమునందామె యేకాకినియై నిర్భయముగ శ్రీరాజరాజేశ్వరీసత్రమునొద్దకు వచ్చెను. చాలరాత్రి యగుటచే నాసత్రిద్వారములన్నియును మూయఁబడి యుండెను. రాజమార్గము జనసంచారశూన్యమైయుండెను. అస్పష్ట మగునాపాఁడుపువెన్నెలలో నక్షత్రవృక్షాంతరాళమునం దామెయొక్కతెయే నిలుపఁబడి యాలోచించుకొనుచుండెను.

రంగదాసుఁ డాసత్రమునవిడిసియుండె నని యామె యెఱుంగును. కాని యాతని పేరుపెట్టిపిలుచుట కామెకు సిగ్గుగఁ దోఁచెను. తానువచ్చిన ట్లాతని కెట్లు తెలియును? ఆమె యించుకసే పాలోచించెను. ఆతఁడు దయార్ద్రహృదయుఁడు. ఎంతనిద్దురలో నైననార్తనాదము నాతఁ డాలకింపఁగలఁడు; ఆయర్ధరాత్రివేళ నాతనిసందర్శనమున కంతకంటె నుపాయాంతర మేమియు నామె కగపడలేదు అప్పుడామె ద్వారమును సమీపించి శోకగద్గదస్వరముతో ,, అయ్యో! దొంగలు! దొంగలు! రక్షింపుఁడు! రక్షింపుఁడు! '' అని కేకలువైచెను.

గాఢనిద్రలోనున్న రంగదాసునకర్ణయుగళమునం దాయార్తనాద మెట్లు ప్రవేశించెనోగాని యాతఁడు దులికిపడి లేచి ,, భయములేదు. వచ్చుచున్నాను. భయములేదు '' అని కేకలువైచుచుఁ దత్తరముతోఁ దలుపుతీసికొనివచ్చి యొక్కఁ పరుగునఁ బోయి యా



ముత్యాలు లజ్జావనతవదనయై "దొంగ లెవ్వరును లేరు. నేనే దొంగనై వచ్చితిని." అనియెను. పుట. 287.

కును సమీపించెను. అప్పుడు ముత్యాలు దీనగద్గదస్వరముతో ,, రక్షింపుము. రక్షింపుము. '' అని ప్రార్థించుచు నాతనిపాదము లను బట్టుకొనెను.

రంగదాసు కంఠస్వరమునుబట్టియే ముత్యాలు నానవాలు పట్టెను. ఆవెన్నెలలో నొంటిగ వచ్చి తనపాదములపైఁ బడియున్న యామెం జూచి విస్మితుండై ,, ఏమి ? ఏమైనది ? భయములేదు. నీవొంటిగనిచ్చటి కింతరాత్రివేళ నెందుకు వచ్చితివి ? దొంగ లెవ్వరు ? '' అని తత్తరముతోఁ బ్రశ్నించుచు నామెను లేవనెత్తెను.

ముత్యాలు లజ్జావనతవదనయై మృదులస్వరముతో ,, దొంగ లెవ్వరును లేరు. నేనే దొంగనై వచ్చితిని '' అనియెను.

రంగ—నీతో నెవ్వరు వచ్చిరి ?

ముత్యా—నే నెవ్వరికిని దెలియకుండఁగనే వచ్చితిని.

రంగ— ఏమి ?

ముత్యా—మీదర్శనము చేయుటకు—

రంగ—సాయంకాలమునఁ జూచితివి కాదా ? మరల నుదయమున రమ్మనినగాదా? ఇంతరాత్రివేళ నొంటిగ వచ్చుటెందుకు?

ముత్యా—ఏకాంతముగ మిమ్ము దర్శించుటకే—ఏకాంతముగ నాప్రాణములను దహింపఁజేయుచున్న నామనోరథము నేకాంతముగ మీకు విశదపఱచుకొనుటకే—మిమ్ముఁ బ్రార్థించుటకే వచ్చియుంటిని.

రంగ—నీకంతటికష్టమే మికలిగినది ?

ముత్యా—నాకోరిక దుర్లభమగుటచేతనే నాప్రాణములు తల్లడిల్లిపోవుచున్నవి.

రంగ—నీకోరికయేమో తెల్పుము.

ముత్యా—తీర్చెద నని యభయప్రదానముం గావించినచోఁ దెలిపెదను.

రంగదాసు నిర్విణ్ణుండై పోయెను ఆ బాలికకోమలహృదయమునం దట్టియభిలాషయున్నదియో యాతనికిఁ దెలిసిపోయెను. ఆ గాలియే తనహృదయకమలమునుగూడఁ జలియింపఁ జేయుచున్నదని యాతనికి బోధపడియెను. ఆ బాలికపరిణయమృదులహృదయ మెంతతల్లడిల్లిపోవుచున్నదో యనుభవమునుబట్టి యాతఁడు తెలిసికొనియెను. ఏమిచెప్పుటకు నాతనికి నోరాడుట లేదు. ఏమిచేయుటకు నాతఁ డస్వతంత్రుఁడై యుండెను. అతఁడు మరల నదేమాటగ "నీకోరిక యేమో తెలుపుము!" అనియెను.

ముత్యాలులజ్జావినయవినమితవదనయై చేతులు దోయిలించి దీనగద్గదస్వరముతో "దయామయా! ఆభయప్రదానముం గావింపుము. కరుణాళుఁడ వగునీవీమంగళగళసూత్రమును నాకంఠమునం దలంకరించి నన్ను బ్రదికించితివి. నేను నీప్రేమపాత్రురాలను నీప్రేమార్ద్రహృదయమునకు నేనాత్మసమర్పణముం గావించుకొనుచున్నాను. కృపామతివై యభయప్రదానముం గావింపుము" అని వేఁడుకొనియెను.

రంగదాసునిప్రేమార్ద్రహృదయము కరఁగినీరైపోయెను. అతఁడించుక సేపాలోచించి నిట్టూర్పువిడిచి "బాలికామణీ! అకస్మికముగ నేనిప్పుడేమియును జెప్పఁజాలను!—నీవునాతోఁగూడ రాఁ గలిగినచో—"

అర్ధోక్తియందే ముత్యాలు "మీ రెచ్చటకు రమ్మనిన నచ్చటికి వచ్చెదను. మీ రేమిచేయుమన్నను జేసెదను. మీయడుగులో నడుగువైచి వచ్చుటకంటె నాకీలోకమునఁ గోరఁదగిన దేమున్నది?

నీచేతిలోఁ జేయిగలిపి పనిచేయునినాఁడు నాకీజీవితముతోఁ బని యేమున్నది? నీవే నాలోకము—నీవే నాయానందము—నీవే నాస్వర్గము. నీకంటెనాకీలోకమున శరణ్య మేమున్నది ? " అని యాతని పాదములపైఁ బడియెను.

అప్పుడు రంగదాసునికర్ణరంధ్రములయందు "స్త్రీరత్నం దుష్కులాదపి" అనునార్యోక్తి ప్రతిధ్వనించుచుండెను. అతని పవిత్రహృదయమున నాదర్శసతీమణియగు నరుంధతీదేవి జ్యోతిర్మూర్తియై యగపడుచుండెను; ఆదిశక్తి యగుమాతంగినీమాత శాంతశృంగారమూర్తియై సాక్షాత్కరించుచుండెను. అతఁడు ప్రేమానందపరవశుఁడై యామెనులేవనెత్తి సాంత్వనస్వరములో "నీజనకుఁడంగీకరించునా" అని ప్రశ్నించెను.

ముత్యాలు సంతోషముతో "అనాయాసముగ నమృతము లభియించుచుండ నక్కఱలేదనునవివేకి యుండునా ? " అనియెను.

రంగ—అట్లయినచో నీతండ్రియొద్దకు రమ్ము!

ఇరువురు నప్పుడే యచ్చటినుండి బయలుదేరి పోయిరి.



## పందొమ్మిదవ ప్రకరణము.

అతిపిపాసాశాంతి ♦ కమృతంబు దొరకె;
అతులశోకనివృత్తి ♦ కౌషధం బొదవె;
తన కొల్లఁ బులకించెఁ ♦ దన్మయత్వమున;
అంతరంగము పొంగె ♦ నానందగరిమ;
కదియుంటి నవశక్తి ♦ భవదంతికమున
నన్నుద్ధరింపవే!—

ఏకాంతసేవ.

అనసూయకుఁ గష్టదశ వదలిపోయినది. ఆమెకిప్పుడు పూర్వముకంటె నధికముగ శుభసౌభాగ్యముల ననుభవించు సుఖకాలము వచ్చినది. అతిదుర్లభంబు లగుమాతృదేవతాప్రేమమయకటాక్షవీక్షణము లామెపైఁ బ్రసరించుచున్నవి. పుణ్యచరిత్ర యగు ననసూయ పుంజీభవించిన శక్తిస్వరూపము; మూర్తీభవించిన శాంతిస్వరూపము— ఏకీభవించిన ధర్మస్వరూపము— అనసూయ యిప్పుడు తన చిన్నబిడ్డ నెత్తుకొని మాతృదేవీపీఠపార్శ్వమున రెండవమాతృదేవతవలె నిలువఁబడియుండెను. ఆనందాదేవి పరమానందముతో సర్వార్థచింతామణీమూర్తిని రక్షాసూత్రమునఁ గూర్చి యాబాలకు కంఠము నలంకరించి యాశీర్వదించుచున్నది. జోగమ్మ యానందముతోఁ జూచుచుండెను. అనసూయ యానందమునకు మేరలేకుండెను. తమకుటుంబము నెన్నితరాతరములనుండి భోగభాగ్యములచేఁ దులదూఁగించుచున్న యాదివ్యమూర్తి యనాయాసముగఁ దనబిడ్డకు మరల లభియించినది. తన కిఁక భర్తృసందర్శనసౌభాగ్యము సమీపమునందే లభియింపఁగలదని యనసూయకిప్పుడు ధైర్యము కలిగినది.

ఆ సంతోషముచే ననసూయ యానందపులకితశరీరయై భక్తిరసావేశహృదయముతో నాదిశక్తి యగునాజగన్మాతయెదుట వినయవినమితవదనయై నిలువఁబడి ప్రార్థించుచుండెను. మాతృసందర్శనార్థులైవచ్చిన మాతృభక్తులందఱు నానందముదితులై యాలోకించుచుండిరి. అంతలో నాకస్మికముగ నెవ్వరో యొకరమణీమూర్తి యామఠమునఁ బ్రవేశించి యాభక్తమండలము నొత్తిగించుకొనుచుఁ బోయి యార్తస్వరముతో, ‘తల్లీ! ఈతల్లిసన్నిధిని నాతప్పులను క్షమియించి నన్నుద్ధరింపుము.’ అని పలుకుచు దేవీప్రార్థనము చేసికొనుచున్న యనసూయపాదములపైఁ బడియెను.

అనసూయకు ధ్యానభంగ మయ్యెను. ఆమె సంభ్రమముతోఁ బాదములపైఁ బడినయాయువతిని లేవనెత్తి విభ్రాంతనయనములతో నామెను దిలకింప నారంభించెను. అప్పు డాయువతి శోకగద్గదస్వరముతో, “తల్లీ! నీవు నన్నెఱుఁగకపోయినను నిన్ను నేనెఱుంగుదును. నేను నీసుఖమార్గమునకు సునిశితకంటకమును—నీయానందచంద్రికల కకాలమేఘమును—నీజీవనసర్వస్వమును బలవంతముగ నేనే యపహరించితిని—కరుణామయీ! దయామయియగుజగన్మాతయెదుట నాతప్పులను క్షమియించి దాసురాలిగ ననుగ్రహింపుము. నీకృపాలేశముకంటె నాఘోరపాపమునకు నిష్కృతి లేదు. నీశీతలకటాక్షములకంటె నాహృదయపరితాపమునకు శాంతి లేదు. నీమధురవచనములకంటె నామానసికవ్యాధికి మందు లేదు. తల్లీ! కరుణింపుము!” అని ప్రార్థింప నారంభించెను.

అనసూయ ఱిచ్చపడి చూచుచు నిలువఁబడిపోయెను. ఆమె యెవ్వరైయుండునని యాలోచించుకొనియెను. అంతలోనామె కానాఁటిచిత్రపటము కనులఁ గట్టినట్లగపడియెను. తోడనే యామెకు

రాజరత్నముమాట జ్ఞప్తికివచ్చెను. ఆరమణీమూర్తి రాజరత్నమే. చిత్రప్రతిమవలె నామె నిశ్చేష్ట యైపోయెను. జోగమ్మయా మెను లోనికిఁ దీసికొనిపోయెను.

అప్పు డానందాదేవి గంభీరస్వరముతో "నీకుఁ బశ్చాత్తాపము కలిగినచో నీజగన్మాత నీసర్వాపరాధములను క్షమియింపఁ గలదు" అనియెను.

రాజ—తల్లీ! పశ్చాత్తాపదుఃఖమునుసహింపఁజాలక బలవన్మరణమునకు సాహసించితినిగాని పాపాత్మురాల నగుటచే దారుణ నరకభయంబునఁ జావలేపోయితిని. నాచరిత్రము పాపకళంకిత మైపోయినది.

ఆనం—కొంతవఱకు నీచరిత్రము నేనెఱుంగుదును. నీవిచ్చటి కెట్లు వచ్చితివి ?

రాజ—తల్లీ! నాయక్క యగునాగమణిమాటలకు లోఁబడి నేనామెయిచ్చవచ్చినట్లుగ మెలంగితిని. అట్టినామూలమున వేంకటేశ్వరుని యమృతమయజీవనము విషమయమైపోయినది. నాయక్కయును కృతఘ్నుఁడగుదామోదరునివలలోఁ బడి కేవలధనలోభముచే నన్నధోలోకమునకుఁ ద్రోసివైచినది. దామోదరుని మూలమున వేంకటేశ్వరు సర్వస్వమును నాశనమైపోయినది. నిరాధారుఁడగు వేంకటేశ్వరుని నాయక్క నాకుఁ దెలియకుండ నాయింటికి రానీయకుండఁ దరిమివైచినది. నాకాసంగతి తెలిసినతోడనే నాకు నాయిల్లసహ్యమైపోయినది—నాయక్కతోడిసాహచర్యము నసహ్యమైపోయినది. నాజీవితమే యసహ్యమైపోయినది. నేనప్పుడే నాయిల్లువదలి నామూలముననధఃపతితుఁడైన వేంకటేశ్వరుఁ వెదకికొనుచు నీనగరమునకు వచ్చి యర్ధరాత్రివేళ నాతని దర్శించి క్షమాప్రార్థనముంగావించితిని. నన్నుఁజూచి మృత్యుదేవతంజూచినట్లుగభయ

పడి యాతఁడు పాఱిపోయినాఁడు. నేనీజగన్మాతనుదర్శించి పాపవిమోచనమునకై తల్లిపావపీఠమునఁ బ్రాణాచారముపడఁదలఁచి వచ్చియుండఁగా దేవీమూర్తియనుననసూయదర్శనము లభియించినది. తల్లీ! ఈపాపాత్మురాలియెడఁ గరుణించి పాపవిమోచనమునకుపాయముంజూపి రక్షింపవా?

ఆనం—తల్లీ! ఆర్యసంఘమున మీరు దేవీపరిచారికలై పుణ్యయువతీమణులుగఁ బరిగణింపఁబడుచుంటిరి. శుభకార్యముల యందు శోభనదేవతలుగ భావింపఁబడుచుంటిరి. అట్టినిత్యసువాసినులగు మీరు క్రమక్రమముగ నజ్ఞానవశంబున నీచవృత్తుల నాశ్రయించి పూర్వౌన్నత్యమును బోఁగొట్టుకొంటిరి. ఆకారణముచేతనే దేవతామూర్తులైయున్నమీరు తుట్టతుదకు రాక్షసీమూర్తులైపోయితిరి. మీపుణ్యచరిత్రములు పాపభూయిష్ఠములైపోయినవి. మీరు సంఘకల్పమునకు వేరుపురుగులైపోయితిరి. ధనలోభముచే ధర్మమునువిడిచితిరి. కులవృత్తినివిడిచితిరి. గుణమును విడిచితిరి. గౌరవమును విడిచితిరి. అన్నియును విడిచి యాత్మద్రోహమునకుఁ బాలై పోయితిరి. తుదకు మీకు మిగిలిన దేమున్నది?

రాజ—ఏమున్నది? దుఃఖముమిగిలినది. పాపము మిగిలినది. పరితాపముమిగిలినది!

ఆనం—ఇప్పటికి బోధపడినదా?

రాజ—తల్లీ! అనుభవమైనది. వ్యభిచారమే కులవృత్తియనుకొని సంచరించుట జ్ఞానముగలమానవస్వభావము కాదని యనుభవమైనది! ఆపరితాపజ్వాలలచే నాసర్వాంగకములును దహించుకొని పోవుచున్నవి. తల్లీ! నన్నుద్ధరింపుము.

ఆనం—ఇట్టిపాపము నేన్నఁడుఁ జేయనని తల్లిపాదములతోడుటఁ బ్రమాణము చేయుదువా?

రాజ — తల్లీ! ఆపాపవృత్తిం దలంచుకొనిన భయ మగుచున్నది. శత్రువులకైన నిట్టినీచజన్మమును బరమేశ్వరుఁడు ప్రసాదింపకుండుఁగాక! ఈమహామాత పాదములసన్నిధిని నేనెన్నఁడు నట్టిపాపమును గలలోనైనఁ దలంప నని త్రికరణశుద్ధిగాఁ బ్రమాణము చేయుచున్నాను.

ఆనం — ఇంతటినుండి మాతృసేవాపరాయణవై నీవలెనే పాపపంకమున మునిఁగిపోవుచున్న సోదరీమణుల నుద్ధరించుటకై నీజీవితమంతయు నుపయోగింతు నని నీకన్నతల్లియెదుట శపథముచేసి స్వధర్మమును నిర్వహింపఁగలిగినచో నీసర్వాపరాధములను జగన్మాత క్షమియింపఁగలదు.

రాజ — తల్లీ! మహామాత యనుగ్రహముచే నాజన్మము సార్థకమగునట్లుగా నట్టిసదుద్యమమునందే నాజీవితశేషమును గడపెదను. తల్లీ! నన్నుఁ గటాక్షింపుము! నరకయాతనల ననుభవింపకుండ నన్నుద్ధరింపుము.

ఆనం — అట్లయినచో మహామాత నిన్ను క్షమియించుచున్నది. నీపాపములను క్షమించుచున్నది

రాజరత్నమప్పుడు భక్తిభావముతో మాతృదేవతకు సాష్టాంగనమస్కారము గావించెను. ఆనందాదేవి యామెకు దేవీనిర్మాల్యకుసుమమును బ్రసాదించెను.



## ఇ రు వ ది య వ ప్ర క ర ణ ము.

చీఁకటులఁ బంపు చేసిన ♦ చేతితోడ
వెన్నెలల సృజియించిన ♦ విభుఁడెవండొ
అట్టి కర్మఫలప్రదాత్రి ♦ యగుచుఁ గొలుతు
అట్టి కర్మవినాశుని ♦ యందఁ గొలుతు
విజ్ఞులై యిప్పుడైనను ♦ వెదకికొనుఁడు!

భవాబ్ధి—

శిక్షామందిరమునఁ బ్రబోధస్వామి యెదుట భయభక్తివినయవినమితవదనులై చేతులు జోడించుకొని గోపాలకృష్ణరావును, దామోదరరావును, అచలరావును నిలువఁబడియుండిరి. అప్పుడు స్వామి ప్రశాంతగంభీరస్వరముతో, 'కుమారులారా! మీహృదయములు సంపూర్ణముగఁ బశ్చాత్తప్తము లైనవా?' అని ప్రశ్నించెను.

అందఱు నేకగ్రీవముగ, 'మహాత్మా! పశ్చాత్తప్తుల మైతిమి. మాపాపములను క్షమియించి మాకు గతిఁగల్పింపుము. మాతృదేవతాసందర్శనమున కర్హత్వమును బ్రసాదింపుము.' అని ప్రార్థించిరి.

అప్పుడు స్వామి దామోదరునిం జూచి 'దామోదరా! నీవు మిత్రద్రోహము చేసితివి' అనియెను.

దామోదరుఁడు భయకంపితస్వరముతో, 'ఔను తండ్రీ! అవివేకముచేఁ దాత్కాలికసుఖలుబ్ధుఁడనై యమాయకుఁ డగు వేంకటేశ్వరు సర్వస్వమును నాశనముచేసివైచితిని. ఆపుణ్యచరిత్రుని

పాపభూయిష్ఠునిగఁ జేసి వైచితిని. అబలాశిరోమణియగు ననసూయ పడరానికష్టములపా లగుటకు నేనే కారణమైతిని. కేవలవిలాసప్రియత్వముచే ధనాశకు లోనై మానవుఁడనైయుండియు రాక్షసునివలె సంచరించితిని. మహాత్మా! నాసర్వాపరాధములను క్షమియించి నన్నుద్ధరింపుము ' అని దీనవదనుఁడై నిట్టూర్పులు విడుచుచు నిలువఁబడిపోయెను.

అప్పుడు గోపాలరావు పశ్చాత్తాపదుఃఖములో ' స్వామీ! నేనీదామోదరునికంటెను మహాపాపాత్ముఁడను. ధనాశాపీడితుఁడనై యతిదారుణకృత్యముల నవలీలగఁ జేసివైచితిఁ. నాతోడిసోదరుల నెందఱినో త్రాగఁబోతులుగఁ జేసివైచితిని. ఎందఱినో యధర్మమార్గప్రవర్తకులుగఁ జేసివైచితిని. ఎందఱినో పాపకూపమునఁ బడఁద్రోసి వైచితిని. కుపుత్రుఁడనగు నేను దుర్బుద్ధిచేఁ గన్నుఁగానక కన్నతల్లియగుమాతృదేవతహృదయమును నొప్పించితిఁ. ఆత్మసోదరుల దుర్వ్యసనపరాయణులం గావించి యాంధ్రదేశగౌరవములు బరిభ్రష్టములుగఁ జేసివైచితిని. మహాత్మా! నాకుఁ గతియేమైననున్నదా? నాఘోరపాపములకు నిష్కృతి యేమైననున్నదా? స్వామీ! మీదివ్యమంగళపాదకమలములే నాకుశరణ్యములు. మీపవిత్రపాదపరాగలేశమే నాపాపతాపవిమోచనపరమౌషధము. తండ్రీ! పాపకూపమునుండి నన్నుద్ధరింపుము. ' అని యనేకవిధములఁ బ్రార్థింప నారంభించెను.

స్వామి యాతనిపైఁ గరుణాకటాక్షప్రసారముం గావించుచుఁ దన చెంతనున్నయొకపుస్తకముం దీసి యాతనికిఁ జూపుచు ' గోపాలా! నీవీగ్రంథము నెన్నఁడైనఁ జూచితివా? ' అనిప్రశ్నించెను.

గోపాలుఁడు దదరిపడి ' స్వామీ! చూడ కేమి? ఈగ్రంథము పరమపతివ్రతాశిరోమణి యగునొకరమణీమణిజీవితచరిత్రము. ఆమెయే తనచరిత్రము నిందు వ్రాసికొన్నది ' అనియెను.

ప్రశ్నా—నీవుదీనిని జదివితివా ?

గోపా—లేదుస్వామీ !

ప్రశ్నా—ఆమెయెవ్వరో నీ వెఱుంగుదువా ?

గోపా—అకల్మషదివ్యచరిత్ర యగునాయువతీమణిని దుర్బుద్ధినై నేనే నావిలాసభవనమునం దానవవిక్రయకార్యమునకు నియోగించితిని.

ప్రశ్నా—ఆమె నీయొద్ద కెట్లు వచ్చినది ?

గోపా—నేనొకప్పుడు తిరుపతిదేవుని దర్శించి వచ్చుచుండఁగా మార్గమధ్యమున నీమె క్షుద్బాధాపీడితయై పడియుండి నాకంటఁబడినది. త్రిలోకమోహనమూర్తి యగునామెంజూచి నాకు జాలి కలుగుటచే నామె కంచుక నీదదేర్చి జలంబులును ఫలంబులు నొసంగితిని. ఆమె యెవ్వరో తెలిసికొనవలయు ననుకుతూహలముతోఁ బ్రశ్నించితినిగాని యామె మాటాడఁజాలక తన్నుఁ దనభర్త పరిత్యజించి వెడలిపోయెననియు, నాతనివెదకికొనుచుఁ దిరుగుచు నాఁకటిబాధచే శోషిల్లియిచ్చటఁబడిపోయితి ననియు నామె యిసుకలో వ్రాసి చూపినది. ఆమె మూఁగది యని గ్రహించి యామెనువశపఱచుకొనుటకై యప్పుడు నే 'నీభర్తయొద్దకు నిన్నుఁ జేర్చెదను. నీవునాతోడ వచ్చెదవా ?' అని వ్రాసి చూపితిని. తనకుపకారముచేసిన నేను ధర్మాత్ముఁడనే యనుకొని యమాయికయగు నామె నావెంటనే వచ్చినది. అప్పుడు నేను విలాసభవనమున కామెను జేర్చి యానవపానపరాయణులకు సుందరి యాకర్షణయంత్రముగ నుండునని యెంచి యామెను మద్యవిక్రయమునకు నియోగించితిని—

ప్రశ్నా—అందు కామె యంగీకరించినదా ?

గోపా—మొదట నామె యంగీకరింపలేదు. అప్పుడు నేను నీభర్తనువెదకించుటకై విశేషధనము కావలయు ననియు, నీవీపని

కంగీకరించనిచో ధనము లభియింపదనియు, నింతమాత్రముచే నీ మరియాదకు భంగము లేదనియు, నట్టిప్రమాదము కలుగకుండ నేను గాపాడుచుందుననియు వ్రాసిచూపి యామెకు ధైర్యముచెప్పుటచే నతికష్టముగఁ దుదకంగీకరించినది. అట్లే యామె పనిచేయుచు నిప్పటికిని భర్తృదర్శనము లభియింపకుండుటచే నాదురుద్దేశమును గ్రహించినది కాఁబోలును! అర్ధరాత్రివేళ నాతోఁ జెప్పకుండ వెడలిపోయినది. అప్పటికి నిప్పటికి నేనామెను జూడనే లేదు. తండ్రీ! ఆమహాపతివ్రతను మహాపాతుకుండనగు నేనీవిధముగఁ గష్టముల పాలు చేసితిని. పాపమామె తుదకేమైనదో గదా!

అని యాతఁడు ఖిన్నుఁడై నిలువఁబడిపోయెను. అప్పుడు దామోదరుఁడు «స్వామీ! త్రిలోకసుందరియగు నాపరమపతివ్రతను నేనొకనాఁటి రాత్రి పెద్దాపురమున మరిడమ్మగుడిలోఁ జూచితిని. ఆమె నన్నుఁ జూచినతోడనే నన్ననుసరించి వచ్చినది. నేనా సతీమణి యుద్దేశముం గ్రహింపఁజాలక దుర్బుద్ధినై ప్రవర్తించితి. నా దుర్బుద్ధిని గ్రహించినంతనే యామె నన్నుఁ బరిత్యజించినది. తోడనే యాపాపఫలము నాకనుభవమునకు వచ్చినది. ఆయర్ధరాత్రమున బలవంతులగుదొంగలు నాపైఁ బడి బలవంతముగ నన్నుఁ బ్రహరించి యామె నెత్తికొనిపోయిరి. ఆరమణీమూర్తి దేవీమూర్తియో యని నాకిప్పటికి బోధ యగుచున్నది. మహాత్మా! చపలచిత్తుఁడనై యాదేవియెడల మహాపరాధముంగావించితిని" అనియెను.

పరిబో—ఆమె యంతరాత్రివేళ నిన్ననుసరించి యెందుకు వచ్చినదో నీకుఁ దెలియునా?

దామో—నాకేమియును దెలియదు.

పరిబోధానందుఁ డించుకసేపాలోచించి చేతిలోనిపుస్తకమును దిరుగవైచుచు «దామోదరా! నీవీచంచలరావు నెఱుఁగుదువా?» అనియెను.

దామో—స్వామీ ! ఈతఁడు నాపినతండ్రికుమారుఁడు. ఈతనికిని నాకును జాలకాలమునుండి చూపులు లేవు. బళ్లారినుండి వచ్చినప్పటినుండియు నీతని జూచుచున్నాను.

ప్రభో—ఆమెను జూచినచో మీ రానవాలుపట్టఁగలరా ?

అప్పుడు గోపాలుఁడును దామోదరుఁడును "స్వామీ ! ఆన వాలుపట్టలేకేమి ?" అనిరి.

స్వామి కటాక్షప్రసారమాత్రముననే వెనుకనున్న దేవీదాసటనుండి వెడలిపోయి నిమిషములో మధుమతి నానందమందిరమునుండి యిచ్చటకుఁ దీసికొనివచ్చెను. మధుమతి తత్తరముతోఁ బోయి చంచలరావుపాదములపైఁ బడియెను. చంచలుఁడు విస్మయానందపరవశుఁడై యామెను లేవనెత్తి సప్రేమముగఁ గౌఁగిలించుకొని స్వామిం జూచి "మహాత్మా ! ఈసుశీల నాసహధర్మిణి. ఈపరమపతివ్రత పాపాత్ముఁడ నగునాకు సహధర్మిణియై యెన్నియోకష్టముల ననుభవించినది. ఈమెతండ్రి ధనవంతుఁడు. నేను బళ్లారిలో నీరియింటనే యుండి చదువుకొంటిని. ఈమెజనకుఁడే నాకు విద్యాదానము గావించెను. ఆమోమోటముచేతను, ధనాశచేతను మూఁగదియైనను నేనీమెను బెండ్లియాడుట కంగీకరించితిని. ఏకపుత్రిక యగునీమెను దనసర్వస్వముతో నాకిచ్చి పెండ్లిచేసి కొలఁదికాలమునకే యాపుణ్యాత్ముఁడు స్వర్గస్థుఁడయ్యెను. డబ్బంతయు నాచేతికిఁ జిక్కినది. ఈమూఁగదానికి మగఁడనిపించుకొనుట కప్పుడు నాకభిమానముగఁ దోఁచినది. అందుచే నేనీమెను యాత్రకని తీసికొనిపోయి మార్గమధ్యమున నిర్దయుఁడనై విడిచివైచి ధనముతోఁ గూడ నన్నెవ్వరు నెఱుంగనియీగోదావరిమండలమునకు వచ్చి సంస్కరణపరాయణుఁడనై పేరుతెచ్చుకొనవలయు నను నుద్దేశముతోఁ

పెద్దాపురమునందలి యొకవేశ్యకన్యకను పెండ్లియాడెద నని నమ్మించి యామెను వెంటఁబెట్టుకొని విజయవాడకుఁ బోయితిని. ఆ ప్రయత్నము నిరర్థక మైపోయినది. తరువాత సత్యవతి నెట్టులైనఁ బెండ్లియాడి విధవావివాహ సంస్కర్త యనియైనఁ బేరుతెచ్చుకొనవలయు నని పాటుపడితిని. చంచలహృదయుఁడనగు నాకుఁ దుదకదియును సాగినది కాదు. సాధ్వీమణియగు సత్యవతి నెట్టులైన బలవంతముగ వశపఱచుకొనవలయు నని ప్రయత్నించుచుండఁగా నాకస్మికముగఁ జిరకాలమునుండి నాకై పరితపించుచున్న యీసుశీల నన్ను వెదకికొనుచు నచ్చటికి వచ్చినది. ఈమెమూలమున నాచరిత్ర మెచ్చట బయటఁబడునో యను భయముతోఁ జటాలున నటనుండి పారిపోయితిని. పతిప్రాణయగు నీరమణీమణి యప్పటికిని నన్ననుసరించియే వచ్చుచుండెను. ఈమెహృదయ మెంతటి పవిత్రప్రేమమయమైనదియో నాకప్పుడు బోధపడినది కాదు. మోహాంధుఁడనగు నేను క్రూరుఁడనై నన్ననుసరించివచ్చుచున్న యీనాకులవధువును నిర్దయుఁడనై తన్నిగెంటివైచితిని. అప్పుడీయబల మూర్ఛాపరవశయై పోయినది. తోడనే యీ దేవీదాసు బలవంతముగ నన్నాక్రమించి యీశిథిలమందిరమున నరకకూపములోఁ ద్రోసివైచినాఁడు. మహాత్మా! నాకు బుద్ధి వచ్చినది. దీనదయాపరులగు మీయనుగ్రహముచేఁ బ్రేమైకమూర్తి యగునాసహధర్మిణి నాకు లభియించినది. స్వామీ! నాయపరాధములను క్షమించి మాజీవితమున కిఁకనైన శాంతిసుఖము లభియించున ట్లాశీర్వదింపుము." అని వేఁడుకొనియెను.

దామోదరుఁడును గోపాలుఁడును సుశీలాచంచలులు దంపతులగుటం దెలిసికొని విస్మయాక్రాంతహృదయులై పోయిరి. సుశీల తనపేరు తెలుపకుండుటచే గోపాలుఁ డామెకు మధుమతి

యని పేరుపెట్టెను. సుశీలమూఁగదియైనను దనపవిత్రనామము దుష్టహృదయులచే నుచ్చరింపఁబడకుండునంతటి గౌరవముతోఁ గాలక్షేపము చేసినది. చంచలుఁడు విద్యావిహీనుఁడయ్యును దననామశ్రవణమాత్రముననే తనదుశ్చరిత్రము వెల్లడియైపోవునంతటినీతిబాహ్యుఁడై పరివర్తించెను. ధనాశచేఁ గొట్టుకొనిపోయినదామోదరగోపాలురు తుదకు ధనమూలముననే తమతమప్రాణములను వదలుకొనుటకు సిద్ధమైరి. ఇప్పుడు వారికందఱకును బశ్చాత్తాపదుఃఖముచే నాత్మజ్ఞానము కలిగినది. స్వామి వారికందఱకును మాతృదేవీమందిరమున దీక్ష నొసంగుట కనుగ్రహించెను.

---

## ఇరువదియొకటవ ప్రకరణము.

కరుణామృతమునిధి ♦ కమ్మని మిసిమి
కరుణామధువులోని ♦ కలకండపలుకు
కరుణారసములోని ♦ కల్యాణవీచి
కరుణావనములోని ♦ ఘనకల్పశాఖి
కన్నులు చల్లఁగాఁ ♦ గనుఁగొనఁగంటి.

ఏకాంతసేవ—

నేఁడు మాతృసేవాదీక్షితులగువారి యభ్యుదయాభివృద్ధికై మాతృమందిరమునందలి భక్తులందఱును నానందమందిరమునం జేరి మాతృప్రార్థనములఁ గావించుచుండిరి. స్త్రీపురుషులు వేలువేలుగఁ గూర్చుండి పరమానందముతో నానందగీతములను బాడుచుండిరి.

నేఁ డానందాదేవికిబదులుగ సంకోశ దేవీమూర్తి యగాసనము నధిష్ఠించియుండెను. సాయంసమయమున నానందమందిరమంతయు నానంద ధ్వనులతో నానందరసపూరితమైయుండెను

నూతనదీక్షితులగు దామోదరగోపాలురను, సుశీలాచంచలులను వెంటఁబెట్టుకొని దేవీదాసుఁ డానందమందిరమునఁ బ్రవేశించెను. వారందఱును పరమానందముతో నానందమందిరమునఁ బ్రవేశించిరి. అప్పు డాకస్మికముగ సుశీల చంచలరావునొద్దనుండి యొక్కపరుగునఁ బోయి యగాసనమునలంకరించియున్న రమణీమణిసామీప్యమునఁ గూర్చుండెను. చంచలరావు విస్మయముతో నావంకఁదిలకించి సంభ్రమాశ్చర్యములతోఁ బోయి యాదేవీమూర్తి పాదములపైఁ బడి ‹‹ హాతల్లీ! సత్యవతీ! నీవు సతీమూర్తిం దాల్చినజగన్మాతవు—ధర్మమూర్తివి. దయామూర్తివి. శాంతమూర్తివి. సత్యమూర్తివి. జ్ఞానమూర్తివి. అజ్ఞానముచే నాత్మద్రోహినై నేను నీకు మహాపకారము గావించితిని. నీయెడల మహాపచారముం గావించితిని. మహాపరాధముం గావించితిని. తల్లీ! నీప్రియసోదరుని సర్వాపరాధములను క్షమియింపుము ›› అని వేఁడుకొనియెను.

అప్పుడు ప్రబోధానందస్వామి ‹‹ కుమారా! మాతృదేవత నిన్ననుగ్రహించినది. నీవు భక్తమండలమునఁ గలసి మాతృప్రార్థనముం గావింపుము ' అనియెను. చంచలుఁడు భక్తమండలమునఁ బ్రవేశించెను. అప్పుడొకవృద్ధబ్రాహ్మణుఁడు లేచి సత్యవతిని సమీపించి ‹‹ అమ్మా! నిన్నుఁజూచినప్పటినుండియు ననుమానముగనే యున్నది. నీవు నిజముగ సత్యవతివే నాతల్లీ! నిన్నుఁజూచిన సరస్వతిని జూచినట్లేయున్నది. పుత్రికాదుఃఖముచేఁ దిరిగితిరిగి గోదావరీప్రవాహమునకు వచ్చి బ్రిదుకుపై నాశలేక బలవంతముగఁ జావదలఁ

చు చుండఁగా నెవ్వరో నన్నిచ్చటికిఁ దీసికొనివచ్చినందుకు నీవైనను గంటఁబడితివి తల్లీ! నాతల్లీ! పుత్రికాదుఃఖపీడితుఁడ నగు నన్నొకసారి కౌఁగిలించుకొని నాదుఃఖమును జల్లార్చుముతల్లీ! అట్లు చూచెదవేమి? నేను గౌరీపతిశాస్త్రిని!' అని విలపింపఁదొడంగెను.

అప్పుడు పరిబోధానందస్వామి గంబీరస్వరముతో "నాయనా! ఆనందమందిరమున దుఃఖములేదు. దుఃఖమును మఱచి మాతృధ్యానముచేసికొనుచుండుము.' అనియెను. గౌరీపతిశాస్త్రి భక్తమండలమున గలసి మాతృప్రార్థనముం గావించుచుండెను. భక్తులందఱు నుచ్చైస్స్వరమున మాతృగీతములం బాడుచు మైమఱచియుండిరి.

అంతలో నాకస్మికముగ రంగదాసుఁడు ముత్యాలును వెంటఁ బెట్టుకొని యానందమందిరముఁ బ్రవేశించి పరిబోధానందునకు సాష్టాంగనమస్కారములం గావించెను. ముత్యాలుకూడ నదేరీతిగ వందనముల నాచరించెను.

అప్పుడు స్వామి ప్రేమనయనములతోఁ దిలకించుచు "కుమారా! ఏమి యాకస్మికముగ నిట్లు వచ్చితివి? ఈబాలిక యెవ్వరు?' అనియెను.

రంగదాసుఁ డవనతవదనుఁడై యేమియును మాటాడఁజాలక పోయెను. అప్పుడు ముత్యాలు స్వామింజూచి భయముతో "స్వామీ! నేను చండాలబాలికను' అనియెను.

పరిబో—అయిననేమి? మాతృదేవియనుగ్రహమున కందఱును బాత్రులే.

ముత్యా—మహాత్మా! నాకట్టి యదృష్టము లభియించున ట్లనుగ్రహింపవలయును.

ప్రభో!—నీయభీష్టమేమియో తెలుపుము. భగవన్మాత నీమనో రథము నీడేర్పఁగలదు.

అప్పుడు బాలికామణి యగుముత్యాలు రంగదాసునిం జూపుచు స్వామినుద్దేశించి ప్రశాంతమధురస్వరముతో, 'స్వామీ! ఈ దయాళుఁడు మాకుటుంబమునుద్ధరించినాఁడు. ఈపుణ్యాత్ముఁడు మాజనకుని నరకకూపమునుండి యుద్ధరించినాఁడు. నన్ను మృత్యుముఖమునుండి రక్షించినాఁడు. ఈపరోపకారపారీణుని యవ్యాజప్రేమకు నేనప్పుడే వశపడిపోయితిని. నేనే నాహృదయమునం దీప్రేమస్వరూపున కాత్మసమర్పణము గావించుకొంటిని.' అనిపలుకుచుఁ దనమెడలోని బంగరుపదకముం దీసి స్వామికిఁ జూపుచు, 'తండ్రీ! ఏశుభముహూర్తమున నీప్రేమైకమూర్తి తనకంఠమునందలి యీయమూల్యాభరణముం దీసి నాకంఠము నలంకరించెనో యామహూర్తమునందే నేనీతని ప్రేమసూత్రమునకుఁ గట్టువడిపోయితిని. స్వామీ! ఈమాతృమందిరమున మాతృదేవతసాక్షిగ ఈమాతృభక్తమండలము సాక్షిగ-మహాత్ములగు మీపాదముల సాక్షిగ సత్యము చెప్పుచున్నాను. త్రికరణశుద్ధిగ సత్యము చెప్పుచున్నాను. ఆకారణముచేతనే నాకీతఁడు భర్త. నేనీతనిపాదదాసిని. నాకు మంగళసూత్రమైనను గళబంధమైనను నాప్రాణేశ్వరుఁడు ప్రేమైకహృదయముతో నాకొసంగిన యీ బంగారుపదకమే యగుఁగాక! మహాత్మా! మహామాత యెదుట మాయిరువురిహృదయములును, నిరువురిప్రాణములును, నిరువురిజీవితములు నైక్యముచేసి యనుగ్రహింపుము! ఆశీర్వదింపుము!" అని వేఁడుకొనఁ దొడంగెను.

అప్పుడు స్త్రీమండలమునుండి సంభ్రమముతో జీవమణి లేచి ముత్యాలుచేతిలోని పదకముం దీసికొని రంగదాసుని గౌఁగిలించు

కొని "స్వామీ ! ఈకుమారుఁడు నాకుమారుఁడు ! నాభర్త యీ చిన్నబిడ్డనెత్తికొని వచ్చినప్పటినుండియు నీపదక మీతని మెడలోనే యున్నది. ఇది రక్షామణిగ నెంచి యెన్నఁడు నీతని మెడనుండి తీయకుండఁ గాపాడుచుండెడిదానను" అని చెప్పుచుండఁగనే రంగదాసుఁ డానందములో నామెపాదములకు నమస్కరించెను.

అప్పుడు జీవమణి వాత్సల్యముతో నాతని లేవఁదీసి "నాయనా ! ఎన్నాళ్లకుఁ గన్నులఁ బడితివి ! జగన్మాతయనుగ్రహ మిన్నాళ్లకు సిద్ధించినది." అనుచుండఁగనే దేవీదాసుఁడానందప్రఫుల్లనయనములతో వచ్చి రంగదాసును గౌఁగిలించుకొనియెను. రంగదాసుఁ డాతనికి నమస్కరించెను.

అప్పుడు వృద్ధుఁ డగుగౌరీపతిశాస్త్రి భక్తమండలము నుండి చటాలున లేచి స్వామియెదుటఁ జేతులు జోడించుకొని నిలువఁబడి దైన్యగద్గదస్వరముతో "స్వామీ ! ఆనందమందిర మానందమందిరమువలెనే యగపడుచున్నది. తండ్రీ ! ఒక్కసారి నన్నాపదకమును జూడనిచ్చెదరా ? " అని ప్రార్థించెను.

ప్రబోధానందస్వామి యాబాలికవంకఁ దిలకించెను. బాలికామణి యగుముత్యాలాపదకమును స్వామికందించెను. స్వామి దాని నందుకొని చూచి గౌరీపతిశాస్త్రి కొసంగెను. శాస్త్రి దాని నందుకొనుటయేతడవుగ నేమి చూచెనోగాని యంతలో నాతని సర్వాంగకములు నొక్కసారిగఁ బ్రకంపితము లైపోయెను. ఆతని హృదయాంతరాళమునం దనిర్వాచ్యానుభవమయ్యెను. ఆభావావేగముచే నాతఁడు నిలువునఁగూలఁబడిపోయెను. అందఱును విభ్రాంతులై యాతనిం జూచుచుండిరి. అప్పుడు స్వామి యాతని సమీపించి యాతనివీఁపుపైఁ జేయివైచి తట్టెను. అంతలో గౌరీపతిశాస్త్రి యించుక తెలివి తెచ్చుకొని స్వామిం జూచి "మహాత్మా ! ఈపత

కము నాకుమారునిది. ఈతఁడు నాకుమారుఁడు. ఈచిరంజీవినామ కరణోత్సవసమయమునందు శ్రీపీఠికాపురాధీశ్వరుఁ డీపదకమును నాకుమారునకుఁ గట్నముగా నొసంగి యున్నాఁడు. ఆకాలమున నే నాయధీశ్వరునియొద్ద నాస్థానపండితుఁడ నైయుంటిని. ఈపదకమునం దామహారాజుపేరును చిరంజీవి యగునీగణపతిశర్మపేరుఁగూడ నున్నవి. ఈబిడ్డకు మూఁడేండ్లయిననిండకుండఁగనే యీపదకమున కాసించి దొంగలెత్తుకొనిపోయిరి. ఆదుఃఖముచేతనే నేనాస్థానమును వదలి నాజన్మస్థాన మగుతారకాపురమునకుఁ బోయితిని. తండ్రీ! ఈచిరంజీవినాకుమారుఁడు. పుత్రికామరణదుఃఖమునఁ గ్రుంగిపోవుచున్ననాకు నష్టపుత్రసందర్శనభాగ్యము లభియించినది. దైవలీల లెంతటియద్భుతము లైనవి! మానవజీవితము లెంతటివిచిత్రము లైనవి! తండ్రీ! చూడుము! ఈపదకముపై నీచిరంజీవినామ మున్నది." అని స్వామి కాపదకము నిచ్చి యాతఁడు చటాలునఁ బోయి కుమారుని గౌఁగిలించుకొనియెను. ఆహా! రంగదాసుగణపతిశర్మ యయ్యెను. అప్పుడు గణపతిశర్మతండ్రియొడిలోఁ జిత్రప్రతిమ యైపోయెను. జీవమణిదేవీదాసు లాయిరువురను దదేకదృష్టితోఁ జూచుచుండిరి. ఎంతమాత్రమును భేద మగపడుట లేదు. ఆతఁడచ్చముగ నాతండ్రిబిడ్డవలెనే యుండెను. ఆనందమందిరములోనివారందఱు నాశ్చర్యపడిపోయిరి. సత్యవతి యచ్చెరువడిపోయెను.

ముత్యాలలక్ష్మి కొంతసేపటివఱకును నచ్చెరువడిపోయెను. పిమ్మట నామెయుత్సాహగంభీరస్వరముతో "స్వామీ! నన్నుఁ బ్రేమించిన నాప్రియుఁడు—నేను ప్రేమించిననాప్రియుఁడు- సామాన్యుఁడు కాక సద్వంశసంభూతుఁడే యని తెలిసికొనఁగలిగినందుకు—ఆనందము పట్టజాలకున్నదానను. నాజన్మము తరించినది. ఈదృష్టిదీపము దేవళోమందిరమునఁ బ్రకాశింపఁగలుగుచున్నది. ఈమాలకాకి మణిపం

జరమున విహరింపఁగలుగుచున్నది ! చాలును! నాకిదియే చాలును! ఆతఁడు నన్నుప్రేమించుచున్నాఁడు! నేనాతనిఁ బ్రేమించుచున్నాను. మేములు నేత్రేననుమాయిరువురిహృదయములు నైక్యము లైనవి. ఆధిభౌతికసుఖమున కాసించి యార్యధర్మమునకుఁ గళంకితముగఁ జేయఁజాలను. ఆధ్యాత్మికానందము సంపూర్ణముగ లభియించిన నాకు భౌతికసుఖముతో నిమిత్తము లేదు. పరిణయబంధము లేనంతమాత్రమున మాపరస్పరసంబంధమున కెన్నటికిని విచ్ఛేదము కలుగఁబోదు. ఎప్పుడు నేనాతనిదాననే—ఆతఁ డెప్పుడును నావాఁడే.--చాలును మహాత్మా! నాజీవితము చరితార్థమైనది. " అనియెను.

దేవీమూర్తివలె నుపన్యసించుచున్నయాబాలికామణిం జూచి యందఱు నాశ్చర్యనిమగ్నులై పోయిరి.

అప్పుడు గణపతిశర్మ యానందవికసితవదనుఁడై ,, బాలికామణీ ! భారతపుత్రికలలో నీవే ధన్యురాలవు. నేనెప్పటికిని నీవాఁడనే. నీవెప్పటికిని నాదానవే. మనయన్యోన్యప్రేమానుబంధమున కీయాధిభౌతికసంబంధములేవియు నంతరాయములు కాఁజాలవు. మనయిరువురిజీవితములు నీప్రేమసూత్రము ననుసరించియే పరమార్థమును గరతలామలకముగఁ జేసికొనుఁగాక ! " అనియెను.

ప్రబోధానందుఁడు నిట్టూర్పువిడిచి ,, కుమారా ! గణపతి! నీకింకను నహంభావము వదలినదికాదు. ఈబాలిక చండాలకన్యక కాదు. జగన్మాతృకామూర్తి ! " అనియెను.

గణపతి మఱి మాటాడఁజాలకపోయెను. అందఱు నద్భుతానందరసనిమగ్నహృదయు లైపోయిరి.



## ఇరువదిరెండవప్రకరణము.

---

కల్యాణగిరిలోఁ ♦ గలుగుంటిచొక్క-
కన్యాయగానంబులో ♦ భ్రమరికచిక్క-
ఆనందవర్ధినీ ♦ నవశక్తిస్ఫూంటెఁ
గరుణింతువే యింకఁ ♦ గల్యాణమూర్తి.

ఏకాంతసేవ —

వసంతయామిని రమణీయచంద్రికావసనసమంచితయై మనోమోహనమూర్తిం దాల్చియుండెను. ఆపండువెన్నెలవెలుంగులలోఁ బావనగోదావరీజలతరంగములు ప్రసన్నతేజోవిలసితములై యుండెను. ఆగౌతమీగర్భమును మెఱపుఁదీఁగలచేఁ గూర్పఁబడిన వెన్నెలపలకలచే నిర్మింపఁబడిన రెండువిలాసనౌకలు రాజహంసలంబోలి తరంగచాలనమునఁ దూఁగుచు మందగమనములతోఁ బ్రయాణము చేయుచుండెను. ఆనౌకాద్వయమునందును సురభిళకుసుమమాలికలు చుక్కలపేరులంబోలి విరాజిల్లుచుండెను. దివ్యచంద్రికలును, దివ్యసౌదామనులును, దివ్యనక్షత్రములును, దివ్యపరిమళములు నొక్కచోఁ జేరినట్లుండెను. ఆదివ్యతేజస్సౌందర్యమునకును, దివ్యసంగీతమాధుర్యమునకును నైక్యానుసంధాన మగుచుండెను. ఆదివ్యమాతృకాగీతామృతమునకును వసంతప్రేమామృతమునకును సమ్మేళన మగుచుండెను. అందుచే మధురచంద్రికావిలాసినియగు నామధుమానసయామిని మధురామృతరసప్రవాహినియై ప్రసన్నమధురమోహనపరిదర్శనంబునఁ బ్రకృతినంతను బరబ్రహ్మానందమయంబుగఁ జేసివైచుచుండెను.

అప్పు డాసుధామధురచంద్రాలోకితంబగుకోటిలింగక్షేత్రముసందలిగోదావరీతీరమున ప్రబోధానందస్వామియు నానందాదేవియును గూర్చుండి సంభాషించుకొనుచుండిరి. ఆనందాదేవి వినయవినమితవదనయై చేతులు దోయిలించి మృదులస్వరముతో స్వామి నుద్దేశించి, మహాత్మా! నేనెంతటిదానను. మీపావనపాదకమలపరాగలేశమే నన్నింతటిదానిగాఁ జేయఁగలిగినది. కాకున్నచో నబలనగునే నెంతటిదానను'' అనియెను.

ప్రబో—తల్లీ! నీవబలవు గావు. దేవీదుర్లభమగుదివ్యశక్తి నీయం దున్నది. నీవు పవిత్రప్రేమామృతమయదివ్యమూర్తివి. నీపావనచరణకమలస్పర్శముచేతనే భూలోకము సర్వసంపన్నిలయమైనది. నీపవిత్రావతారముచేతనే స్త్రీలోకము కీర్తనీయమైనది. నీప్రబోధవాగమృతరసప్రసారముచేఁ బతితలోకము పరమపావనమైనది. తల్లీ! నీవే ధన్యురాలవు. నీనిరంతరసందర్శనానందముచే నానయనేంద్రియములు ధన్యతమములైనవి. అమ్మా! నీవానందమూర్తివి. పరబ్రహ్మానందమూర్తివి.

ఆనం—స్వామీ! మీకృపాలేశముచే నన్నింతటిదానిగాఁ జేయ ననుగ్రహించితిరి—కాని—

ప్రబో—కానియేమితల్లీ!

ఆనం—అమృతము నరచేతియందుంచియు నారగించుట కభ్యంతరమును గల్పించుచున్నారు. తండ్రీ! ఇంకను నిల్లాంతకాల మోర్చియుండవలయును?

ప్రబో—అక్కఱలేదుతల్లీ! మీకష్టకాలము వదలిపోయినది.

ఆనం—స్వామీ! మీదయామహిమచే నెంతటికష్టమునైన సుఖముగ ననుభవింపఁగలసామర్థ్యము నాకు లభియించినది—

కాని—ప్రాణాంతరాంతరముల నిరంతరమును వేధించుచున్నయీ యనిర్వాచ్యమగు వేదనమాత్రము—

ప్రబో—బిడ్డా! మాతృదేవత నీనిశ్చలహృదయమును బరీక్షించినది. నీశమాస్వభావముం బరికించినది. నీదివ్యశక్తిం దిలకించినది. అందుచేతనే నన్నమృతగర్భమునుండి యుద్ధరించినది.

ఆనం—మహాత్మా! ప్రేమైకమూర్తి యగునాలోకమాత నాకష్టము నేల గ్రహించినదికాదు?

ప్రబో—గ్రహించినది తల్లీ! నిఖిలదుఃఖనివారిణి యగు జగన్మాత కాలదోషము శమింపవలయును నీజీవితమును గాఢాంతరములకు మరలించినది. మారకదోషమునుండి తప్పించి మహారాజ్ఞీమణిం జేయునంతటిసామర్థ్యము మహామాతకుం దక్క మఱియెవ్వరి కున్నది?

ఆనం—మహాత్మా! సర్వశక్తిస్వరూపిణియగు జగజ్జననికూడ సమయమును నిరీక్షించుట యెందుకు?

ప్రబో—కాలము బ్రహ్మాదులకుంగూడ నజేయమైనదికాదా?

ఆనం—తండ్రీ! ఇంకను నెంతకాలమిట్లు సహించి యుండవలయును?

ప్రబో—తల్లీ! నిశ్చలభక్తిభావముచే నిరంతరమాతృసేవాపరాయణవై నీవాయుఃకాలకష్టసాగరమును నిత్యానందసౌకావశంబున నిరంతరాయముగ నుత్తరింపఁగలిగితివి. బిడ్డా! శుభముహూర్తము సమీపించుచున్నది. ఆనందసౌకాధిరోహణముం గావించి యానందమందిరమునఁ బ్రవేశింపుము.

అనునంతలో గౌతమీగర్భమునం దూఁగుచున్న జ్యోతిర్నౌకయొకటి పారిజాతకుసుమపరిమళముల వెదచల్లుచు వారిసమీపమునకు వచ్చి నిలిచెను. ప్రబోధానందుఁ డయ్యనుష్ఠుం జేకొని యానం

డాదేవి యానందోత్ఫుల్లహృదయముతో నాదివ్యనౌక నధిరో హించెను. స్వామి యాకస్మికముగ నంతర్హితుఁడై పోయెను. అంతలో దివ్యదుందుభులు మొరసినట్లయ్యెను. దివినుండి పుష్పవర్షము గురిసిన ట్లయ్యెను. జ్యోతిర్మూర్తి యగునావిలాసనౌక—అపరిమళ పుష్పనౌక—అయమృతప్రవాహమునం దానందతరంగోత్థితమై యల్లనల్లనఁ బ్రయాణము చేయుచుండెను.

ఆయమృతచంద్రికాంత రాళమున నాగోదావరీతరంగిణియందలి యాజ్యోతిర్నౌకాద్వయ మొకదాని వెనుక నొకటిగ బయలుదేరిపోవుచుండెను. అప్పుడాగౌతమీమాత దివ్యజ్యోతిర్మూర్తి యగుచుండెను. దివ్యపుష్పమాలికాలంకృత యగుచుండెను. దివ్యగంధవిలసిత యగుచుండెను. దివ్యగానామృతరసతరంగిత యగుచుండెను.

అప్పుడా యానందచంద్రికాంత రాళమున నానందతరంగసంచలితం బగునానందనౌకామధ్యమునందుండి యొకయానందరమణీమూర్తి యానందోద్రిక్తకంఠస్వరముతోఁ బాడుచున్న యానందసంగీత మీజగమ తయు నానందబ్రహ్మమయంబుగఁ జేయుచుండెను.

"పూలరథం బెక్కి ♦ పోయెడి వేళఁ
బ్రణయగీతములనేఁ ♦ బాడెడు వేళ
విభువేణునాదంబు ♦ వినిపించు వేళఁ
జిత్తమా! చిత్తమా! ♦ చెదరఁబోకమ్మ!—
ప్రణయసౌఖ్యంబులోఁ ♦ బతి యుండు వేళఁ
బ్రేమలో మనసిచ్చి ♦ కిలిచెడి వేళ
నానందమూర్తియై ♦ యాడెడి వేళఁ
జిత్తమా! చిత్తమా! ♦ చెదరఁబోకమ్మ!—

ప్రేమాలయంబులోఁ ♦ బ్రియుఁ డాడువేళఁ
ప్రేమడోలికలలోఁ ♦ బ్రియుఁ డూఁగువేళఁ
ప్రేమామృతాబ్ధిలోఁ ♦ బ్రియుఁడీఁదువేళఁ
చిత్రమా ! చిత్రమా ! ♦ చెదరఁబోకమ్మ !—
కల్యాణదుర్గంబుఁ ♦ గైకొనువేళ
నానందసామ్రాజ్య ♦ మందెడివేళ
విజయాభ్యుదయభేరి ♦ వేయించువేళఁ
చిత్రమా ! చిత్రమా ! ♦ చెదరఁబోకమ్మ !—
సమయసూచకముగా ♦ సకినాలకుంచె
పయనంపువీథిలోఁ ♦ బైనుండితిరిగె;
ఫలసూచకంబుగాఁ ♦ బలుకులబరణి
మొలమావిగుంపులో ♦ నెదురేగుదెంచె;
నియతిసూచకముగా ♦ నీలాలమురళి
తలిరాకుఁదోఁటలోఁ ♦ దనయంత మ్రోగె;
క్షేమసూచకముఁగాఁ ♦ జేమంతిబంతి
తోరణాంతరమునఁ ♦ ద్రుళ్లింతవిడియె;
సంతోష మొనఁగూర్చు ♦ శకునంబు లయ్యె;
సౌభాగ్యముఫలించు ♦ సమయ మేతెంచె;
ఉన్నతాసనముపై ♦ నుండి నావిభుఁడు
పేరెత్తి చేయెత్తి ♦ పిలుచుచున్నాఁడు
ప్రేమలో మనసిచ్చి ♦ పిలుచుచున్నాఁడు
సెలవిచ్చి పంపరే ♦ చెలులార నన్ను !—
చిగురుజెండాపట్టి ♦ చెలి కలకంఠి
చెలువంబు దీపింప ♦ శిఖరాన నిలిచెఁ

తామరగొడుగెత్తి ♦ తరుణి మరాళి
చేవేగ తేరెక్కి ♦ వెనువెన్క నిలిచె;
ఫలగుచ్ఛములఁ బూని ♦ పడఁతి రాచిల్క.
పలుకుదోడై వచ్చి ♦ పజ్జఁ గూర్చుండె;
స్వామి నర్పించుపూ ♦ జాద్రవ్యసమితి
నందందుఁ జేర్చి నే ♦ నాయత్త నైతి;
జగమెల్ల నవసుధా ♦ సారంబుగాఁగ
భువనమంతయు గంధ ♦ పూరంబుగాఁగ
మెఱపుఁదీఁగలకనుల్ ♦ మిఱుమిట్లుగొలుపఁ
దోలవే తుమ్మెదా ♦ తోలవేరథము !—
ప్రణయపురంబులోఁ ♦ బ్రాసాదవీథి
వేణుగానరవంబు ♦ వినవచ్చుచుండెఁ,
గల్యాణనగరిలోఁ ♦ గమలాలయమున
వీణాస్వనంబులు ♦ వినవచ్చుచుండె,
నుదయరాగంబులో ♦ నుదయాద్రిశిఖరి
విశ్వగీతరవంబు ♦ వినవచ్చుచుండెఁ,
బరమధామంబులోఁ ♦ బ్రాంగణసీమ
వేదసాధురవంబు ♦ వినవచ్చుచుండె,
నిఖిలేశు నర్చించు ♦ నిమిషమేతెంచెఁ
బదిలంబు పదిలంబు ♦ పాణిద్వయంబ !
సర్వసాక్షిని జూచు సమయ మేతెంచె
నెమ్మదినెమ్మది ♦ నేత్రద్వయంబ !
ఆదిదేవుఁ గ్రహించు ♦ నవసరంబయ్యె
నవధానమవధాన ♦ మంతరంగంబ!
వేదాంతమయుఁ జేరు ♦ వేళ యేతెంచె
భద్రంబు భద్రంబు ♦ ప్రాణరత్నంబ !—’’

ఆ యానందసంగీతప్రతిస్వనము లామాతృగీతస్వనంబులతో నేకీభవించి యాయానందచంద్రికామయప్రపంచమునందంతటను బ్రతిధ్వనించుచుండెను. అంతలో నానందరసతరంగితమై పోవుచున్నయయ్యానందనౌకాద్వయము నాకస్మికముగ నాగోదావరీగర్భమునందు తదూరమున నదృశ్యమైపోయెను. ఆసమయమునందే యానందచంద్రిక లానందప్రభాతకాంతులలో నైక్యములైపోయెను. ఆప్రేమానందసంధిసమయమునఁ బ్రేమానందాదృశ్యరసనా రంగమునుండి " అనుకూలగతి లభియించినచో నైహికసంసారమే యానందమయమైనది — బ్రహ్మానందమయమైనది! — పరబ్రహ్మానందమయమైనది! —" అనుప్రబోధవాక్యములు వెలువడి యా యానందసంగీతప్రతిస్వనములలో విలీనములైపోయెను!

## పరిశిష్టము.

ఈశైలవాహిని ♦ యింకిపోకుండ
సత్పుత్రార్ణవముఁ జేర ♦ నంతియేచాలు;
ఈవాల్లెఁరదండ ♦ యెండిపోకుండ
సత్పుత్రమూర్తి వహించె ♦ నంతియేచాలు.

ఏకాంతసేవ.

ఇంకఁ జెప్పవలసిన దేమున్నది? ఆనందాకల్యాణానందు లెవ్వరు? ఈసంగతి తెలిసినవారికిఁ జెప్పనక్కఱలేదు గాని తెలియనివారికి మాత్రము వారే సరస్వతీపరబ్రహ్మము లని చెప్పుచున్నాము. ! విరాగియైయున్న భర్తం జూచి నిరాశం జెంది యాత్మత్యాగముం జేసికొనఁదలంచినసరస్వతి యానాఁడు కృష్ణవేణీగర్భ

మునుండి ప్రబోధానందునిచే నుద్ధరింపఁబడినది. ఆసరస్వతియే యా నందా దేవి. ఆయానందా దేవియే యానాఁటియర్ధరాత్రమునఁ దన ప్రాణసఖియగు సత్యవతి నుద్ధరించి సత్యప్రతిజ్ఞను నిర్వహించుకొన్నది. సరస్వతి ప్రబోధానందానుగ్రహముచే మాతృసేవాపరాయణయై నిశ్చలహృదయముతో స్వధర్మమును నిర్వహింపఁగలిగినది.

ప్రేమైకమూర్తి యగునాసరస్వతిసందర్శించియామెయనుజ్ఞం గైకొనఁ రావలయుననియే ప్రబోధానందుఁడు పరబ్రహ్మమున కాజ్ఞాపించి యుండెను. ఆస్వామియాజ్ఞ నాతఁడు నిర్వహింపఁజాలకపోయెను. అంతటి మనోదార్ఢ్యము లేకుండుటయే యాతనిపరిపూర్ణత్వమునకుం గలస్వల్పలోపము. పరబ్రహ్మము మాతృసేవానిర్వహణమునకై సరస్వతీసమాగమమును త్యజించివైచెను. కాని యాప్రేమసూత్రము నాత్మధర్మసూత్రముతోఁ గలిపి పురిపెట్టుట కాతఁడు సమర్థుఁడు కాఁజాలకపోయెను. అదియే యాతనిలోపము. ఆలోపముచేతనే యాతనికిఁ జాలదినములవఱకును మాతృమందిరసందర్శనము లభియించినది కాదు. ఇప్పుడు ప్రబోధానందానుగ్రహముచే సరస్వతీపరబ్రహ్మముల కానందమందిరమునఁ జిరకాలమునకుఁ బునస్సమాగమము లభియించినది. మాతృదేవత యాదంపతుల నాశీర్వదించినది. వారిజీవితములు మాతృదేవతాకటాక్షముచేఁ జరితార్థములైనవి. సరస్వతికి భర్తృసేవాభాగ్యముతోఁగూడఁ బితృసేవాభాగ్యము మరల లభియించినది. తల్లియనుగ్రహముచే నామెకు నష్టసోదరలాభముఁ గూడఁ గలిగినది.

పశ్చాత్తప్తుఁడగు వేంకటేశ్వరునకు స్వామిదయచే మాతృమందిరమునఁ బత్నీపుత్రిసమాగమము లభియించినది. అప్పుడాదంపతులుతమకష్టములన్నిటిని మఱచియానందసాగరమున నోలలాడిరి. గోపాలుఁడు వేంకటేశ్వరునిసర్వస్వమును మరల నాతనికిచ్చివైచెను. మాతృసేవాదీక్షితులగు ననసూయావేంకటేశ్వరు లిప్పుడు యథాపూర్వముగఁ గుమారనగరమునఁ బ్రవేశించి సుఖముగఁగాల

క్షేపము చేయుచుండెను. వేంకటేశ్వరుఁడు తనచిన్నికుమారునకుఁ జింతామణియని పేరుపెట్టెను. అనసూయ వృద్ధురాలగు జోగమ్మను దనకన్నతల్లివలెఁ జూచికొనుచుండెను.

గోపాలునినీలాసభవన మిచ్చి దన్ననత్రి మయ్యెను. అతఁడు తనసర్వస్వమును పేదలకొఱకు వినియోగించుచుండెను. దామోదరుఁడు మాతృభక్తుఁడై మాతృసేవాధర్మమును నిర్వహించుచుండెను. చంచలరావు నిశ్చలహృదయముతో మధుమతి యగుసుశీలను— పూవులమ్మ యగుసుశీలను — గిరిపాలిక యగుసుశీలను— చిదానందయగు సుశీలను బరమానందమునఁ బరిగ్రహించి స్వకర్మనిరతుఁడై సుఖియించుచుండెను.

గణపతిశర్మ మాతృమందిరమునందే యుపతుఁడై బ్రహ్మచర్యవ్రతదీక్షితుఁడయ్యెను. రమణీమణి యగుముత్యాలం ప్రేమైకమూర్తిని దనహృదయకమలమున నిలిపి నిరంతరము ధ్యానించుచు సాధ్వీశిరోమణులలో సంస్తవనీయచరిత్ర యయ్యెను. పాపము పిచ్చి భారతరావునకుఁ దెలిసినదో తెలియలేదో గాని సతీశిరోమణి యగుసత్యవతి సత్యానందాదేవి యనునామముతో మాతృపూజాపరిచారికయై చిరకాలమువఱకును మాతృమందిరమునందేయుండెను.

ప్రబోధానందస్వామియనుగ్రహముచేఁ బ్రజలందఱును మాతృసేవాదీక్షితులైరి— దేశమంతయును మాతృమందిర మయ్యెను.

స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తాస్సుఖినో భవంతు.

ఓం తత్సత్.



# జాతకము-ప్రశ్న

కావలసినవారు వారిజాతకచక్రముయొక్క నకలుగాని సరియైన జననకాలఘడియలుగాని వ్రాసి పంపినయెడల జాతకునియొక్క రూపము, స్వభావము, శరీరదార్ఢ్యము, ధనవృద్ధి, సోదరసోదరీవృద్ధి, మాతృసౌఖ్యము, భూలాభము, భూవ్యయము, విద్యాభివృద్ధి, వాహనసౌఖ్యము, వివరముగా పుత్రపుత్రికా సంతానవృద్ధి, శత్రువృద్ధి, రోగము, ఋణము, కళత్రము కళత్రముయొక్క ఆయుర్దాయము, ద్వికళత్రయోగము, జాతకునియొక్క ఆయుర్దాయము, భాగ్యము, పితృసౌఖ్యము, ఉద్యోగము, జీవనము, లాభము, వ్యయము మొదలగుయావత్తుసంగతులు ఇంకను ఇదివరకు జరిగిన విశేషాంశములును వ్రాసి వి.పి ఖర్చులుసహా రు 1-2-0లకు వి. పి.గా పంపబడును. ఈవ్రాసిన సంగతులుసరిగానున్నయెడల జాతకునియొక్క ఆయుర్దాయము ఆఖరువరకు జరుగు ప్రతిసంవత్సరఫలము అనగామహాదశాంతర్దశలుగలపూర్ణ జాతకము శాస్త్రసమ్మతముగా తయారుచేసి పంపించబడును. పూర్ణజాతకమునకు రు 5లు చార్జిచేయబడును. పూర్ణజాతకము వ్రాయించుకొనదలచువారు రు 2లు అడ్వాన్సు ముందుగా పంపవలెను. అట్లు పంపగానే జాతకము పూర్తిగా తయారుచేసి తక్కిన రు 3 లకు వి.పి. గా పంపెదము.

జన్మనక్షత్రము మాత్రము పంపించినయెడల ఎవరికేయేబాపతుప్రశ్న కావలెనో దానికి సరిగా ఫలితము వ్రాసి పంపించబడును. అందుకుగాను రూపాయిచార్జీ చేయబడును. ముందు జరుగబోవు 1 సం॥ ఫలములువ్రాయుటకు వి. పి. ఖర్చులుసహా రు 1-2-0 అగును.

ఆకెళ్ళ వేంకటశాస్త్రి, దైవజ్ఞుడు,
గోపాలపురం, కొత్తపేటపోష్టు, గోదావరిజిల్లా.

| | | | | |
|---|---|---|---|---|
| 18 మరకతమంజూష | 1 | 0 | 1 | 5 |
| 19 శ్రీ | 1 | 0 | 1 | 8 |
| 20 శరమరదాస్యము | 1 | 0 | 1 | [illegible] |

# మా వద్ద వెలకు దొరకు గ్రంథములు.

## నాటకములు.

| | | |
|---|---|---|
| ప్రహ్లాద | 1 | 0 |
| ప్రచండచాణక్యం | 1 | 0 |
| అభిజ్ఞానశాకుంతల | 1 | 0 |
| రుక్మిణీపరిణయం | 0 | 12 |
| చిత్రమాధవం | 0 | 12 |
| Commody of errorsShakespeare | | |
| చండకౌశిక (హరిశ్చంద్ర) | 0 | 10 |
| రంగరాయపట్టాభిషేకం | 0 | 10 |
| పాండవాజ్ఞాతవాసము | 0 | 8 |
| అంకాదపానము | 0 | 8 |
| విక్రమోర్వశీయము | 0 | 8 |
| చతురచంద్రహాస | 0 | 8 |
| రామదాసు నాటకము | 6 | 8 |
| హేమలత | 0 | 8 |
| ప్రియదర్శిక | 0 | 8 |

## పద్యములు.

| | | |
|---|---|---|
| భక్తచింతామణి | 0 | 5 |
| చంద్రసేనవిజయము | 0 | 2 |

## నవలలు

| | | |
|---|---|---|
| అగ్గిరాముడు | 0 | 10 |
| సౌందర్యతిలక చి॥ ల॥ న॥ | 1 | 0 |
| అహల్యాభాయి | 0 | 12 |
| హేమలత | 0 | 12 |
| రామచంద్రవిజయము | 0 | 10 |
| రఘుకులచరిత్ర | 0 | 10 |
| స్వయంప్రభ (పానిపట్టుయుద్ధము) | 0 | 8 |
| విజయధ్వజం | 0 | 8 |

## ఇతరపుస్తకములు.

| | | |
|---|---|---|
| హాస్యపుపాటలు | 0 | 4 |
| జపానుచరిత్ర | 0 | 8 |
| రాజమహేంద్రచరిత్ర | 0 | 8 |
| ఆంధ్రవీరులు | 1 | 0 |
| పొద్దుపొడుపు చెప్పులు 3 భాగములు. భాగము 1కి | 0 | 12 |
| పేకాట ఫార్సు | 0 | 4 |
| నిరుద్యోగుల ఫార్సు | 0 | 4 |

గోదావరి బుక్ డిపో:—రాజమండ్రి.



# ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము.

## రాజమహేంద్రవరము.



దేశభాషాభివృద్ధి గావించుటకుఁగాను ఈనిలయము 1911 సం॥లో స్థాపింపఁబడినది. ఇందు విశేషముగ మనోహరకథాకల్పితంబులును, భావపూరితంబులును, నవరసభరితంబులునగు నవలలు రెండుమాసముల కొక్కటిచొప్పున వెలువడుచుండును. ప్రతినవలయు డెమ్మీసైజున 250 పుటలకు దక్కువకాకుండ నుండును. ఇందు శాశ్వతపుఁ జందాదారులుగాఁ జేరువారలకు పోస్టేజీ మేమే భరించి రు 1—0—0కు గ్రంథమునంపుచుందుము. ఇందు జందాదారులుగాఁజేరువారు ప్రవేశరుసుముక్రింద 0-2-0 ముందుగ నీయవలయును. ఇందీవఱకు 24 పెద్దనవలలును 40 అనుబంధగ్రంథములును వెలువడియున్నవి. ఇప్పుడు చందాదారులుగాఁజేరువారలు వెనుకటిగ్రంథములన్నియు పుచ్చుకొనవలయునను నియమము లేదు వారికిఁ గావలసినవే గ్రహింపవచ్చును. కాని ముందువెలువడు క్రొత్తనవలలను దప్పక పుచ్చుకొనుచుండవలయును.

ఈవఱకు వెలువడిన వానిలో విక్రయమునకు సిద్ధముగనున్న గ్రంథములు.

| నెం | చందాదారులకు | | ఇతరులకు | |
|---|---|---|---|---|
| 2 వసుమతీవసంతము | 1 | 0 | 1 | 8 |
| 5 సీతారామ | 1 | 0 | 1 | 8 |
| 6 నూర్జహాను | 1 | 0 | 1 | 8 |
| 7 రాజసింహ | 1 | 0 | 1 | 8 |
| 14 వంగవిజేత | 1 | 0 | 1 | 5 |
| 16 నవాబునందిని | 1 | 0 | 1 | 8 |
| 17 దృఢప్రతిజ్ఞ | 1 | 0 | 1 | 8 |
| 18 మరకతమంజూష | 1 | 0 | 1 | 5 |
| 19 శ్రీ | 1 | 0 | 1 | 8 |
| 20 శరమరహస్యము | 1 | 0 | 1 | [illegible] |

| | | అ | ప | అ | ప |
|---|---|---|---|---|---|
| 21 | శ్రీకృష్ణచరిత్రము | 1 | 0 | 1 | 8 |
| 22 | ప్రతిజ్ఞాపాలనము (చిత్రపటములతో) | 1 | 0 | 1 | 8 |
| 23 | శ్యామల (డిటో) | 1 | 0 | 1 | 8 |
| 24 | మాతృమందిరము (డిటో) | 1 | 0 | 1 | 8 |
| 25 | నీలాంబరి (డిటెక్టివునవల — ముద్రణములోనున్నది) | | | | |
| | అనుబంధగ్రంథములు | అ | ప | అ | ప |
| 2 | యుగళాంగుళీయకము | 3 | 0 | 3 | 0 |
| 3 | రాజభక్తి | 2 | 0 | 3 | 0 |
| 4 | లీల | 3 | 0 | 4 | 0 |
| 6 | ఇందిర | 3 | 0 | 4 | 0 |
| 8 | మాలతి | 1 | 6 | 2 | 0 |
| 9 | కమలాకాంతుడు | 1 | 6 | 2 | 0 |
| 13 | సీతావనవాసము | 5 | 0 | 7 | 0 |
| 14 | ఉన్మాదిని | 3 | 0 | 4 | 0 |
| 18 | కృష్ణకాంతుని మరణశాసనము | 12 | 6 | 1 0 | 0 |
| 19 | చంద్రసేనుడు | 4 | 0 | 5 | 0 |
| 20 | వ్యాఘ్రాచార్య బృహల్లాంగూలము | 2 | 0 | 2 | 6 |
| 21 | ఉన్మత్త | 2 | 0 | 2 | 6 |
| 23 | రాణీతారాబాయి | 1 | 0 | 1 | 0 |
| 24 | రాబూలాలుసాహెబు | 1 | 0 | 1 | 0 |
| 25 | భారతమహిళ | 5 | 0 | 7 | 0 |
| 26 | భారతీయుల యుపనివేశములు | 2 | 0 | 2 | 6 |
| 27 | హారావళి (ప్రథమభాగము) | 3 | 0 | 4 | 0 |
| 28 | హారావళి (ద్వితీయభాగము) | 3 | 0 | 4 | 0 |
| 29 | విషవాహిని | 2 | 0 | 3 | 0 |
| 30 | మాధవసేనుడు | 6 | 0 | 8 | 0 |
| 31 | హైమవతి | 2 | 0 | 3 | 0 |
| 32 | సమస్య | 2 | 0 | 3 | 0 |
| 33 | అనాథప్రేతము | 1 | 0 | 1 | 0 |

